# మహోదయము

(చరిత్ర విషయకమైన నవలల పోటీలో 1964 వ సంవత్సరము రచనలలో
బహుమానము పొందిన గ్రంథము)



డాక్టర్ బొడ్డుపల్లి పురుషోత్తం, యమ్. ఏ., పిహెచ్.డి.




ఆంధ్ర విశ్వకళాపరిషత్తువారిచేఁ బ్రకటితము

1968

వెల : రు. 3—00

ప్రథమ ముద్రణము (1968) : 20,000 ప్రతులు



పది శతాబ్దములు మహా తపమ్ము నేసి
ఒక మహోదయ శుభసుముహూర్తమందు
ఆసకల మోదదాయిని యగుచు నాంధ్రి
భవ్య భారత కావ్య రూపమ్ము దాల్చె॥

★

కొన్ని చరిత్ర విషయకములయిన నవలలను, శాస్త్ర గ్రంథములను, యాత్రాగ్రంథములను రచయితలు వ్రాయునట్లు ప్రోత్సహించి, అట్లు వ్రాయఁబడిన వానిలో నుత్తమమైనదానికి 2,000 రూపాయలు బహుమానము నీయవలసిన దను విశ్వకళా పరిషత్తువారి యాదేశము ననుసరించి 1966 వ సంవత్సరములోని రచనలలో నుత్తమ మని పరీక్షకులచే నంగీకరింపఁబడినది.

బ్రహ్మశ్రీ వేదమూర్తులు

# తెన్నేటి విశ్వనాథము

మహోదయులకు

## కృతి సమర్పణము

మిన్నేటి కాంతి పుంజముల
మించిన దెవ్వని దేహకాంతి; సం
పన్నము, సర్వవేద సుమ
భావిత మే మహనీయు నాత్మ; వి
శ్వోన్నయ చాకచక్య పరి
పాలన కౌశల సుప్రకాశ మా
తెన్నేటి విశ్వనాథము
మదీయ కృతిన్ వరియించు గావుతన్॥౧॥

పితలె లోకధర్మ పరి
పోషితమూర్తులు; దేశభక్తికిన్
తావలమైన త్యాగులు;
ఉదాత్త మహోజ్వల లక్ష్య సాధనా
ధీ విభవాభి రాములు
ప్రతిష్ఠ లనేకులు తెల్గు సీమకున్
కావలె నాయకోత్తములు
కాన చిరాయువు మీకుఁ గల్గుతన్॥ ౨॥

ఎప్పుడు రాజ్యతంత్రములకే
తమ జీవిత సర్వ లక్ష్యముల్
చెప్పుడఁ జేసి, యాత్మ పరి
శుద్ధిని సత్యము కోలుపుచ్చి తా
మెప్పటి కప్పుడెట్లొ విజ
యమ్మును గొందఱు గాంచవచ్చు; నీ
కొప్పునె? సత్యసుందర
శివోజ్వల వృత్తముగాక యన్యముల్॥౩॥

కారణ జన్ముఁడై నయ
　　వికాసముఁ గూర్పఁ దెనుంగు జాతికిన్
భారత వేద కావ్య రచనన్
　　తగ నాంధ్రము దేవభాషగాఁ
దీరిచె నట్టి నన్నయ
　　సుధీమణి గాథ "మహోదయమ్ము"గా
నా రచనన్ ప్రపంచిత
　　మొనర్చితి, గైకొను మంకితమ్ముగాన్ ॥౪॥

మిము తొలిసారి గాంచిన
　　నిమేషమె — మీ సరసత్వ సత్య శీ
లమునకు, సాహితీ విభవ
　　లాలస బుద్ధికి ఆత్మపొంగి కా
వ్యము తగ సంకితం బొసఁగు
　　వాంఛ జనించెను; నేఁడు నద్ది సి
ద్ధము సమకూరె నాంధ్ర విబు
　　దాధిప! విశ్రుత దేశనాయకా ॥౫॥

తొల్లిటి యార్య మానవు
　　లితోధిక ధీ హృద యానుభూతులన్
అల్లిన వేదమంత్ర మహి
　　తార్థ గవేష నిమగ్న దీక్ష ను
త్ఫుల్లతఁ గాంచె నీ హృదయ
　　పుష్కర మర్వదియాఱు తేకులన్;
తెల్లని నూఱు పత్రముల
　　తేజము సౌరభ మిట్లె పర్వుతన్ ॥౬॥

పురి　　　　　　　　　　[illegible]

# మహోదయము

౧

అది మాఘ బహుళ చతుర్దశి. మహాశివరాత్రి. అఖండమగు పర్వదినము. ఆనాఁడు దక్షిణకాశీపురమని ప్రఖ్యాతిగాంచి, పరమపావనమయిన దక్షారామ భీమేశ్వరాలయమున సహస్రబ్రాహ్మణము ముక్తకంఠముతో "ఓం నమశ్శివాయచ, రుద్రాయచ" అని మహాన్యాస పూర్వక రుద్రాభిషేకము గావించుచున్నది. ఆ వేదఘోషకు తన్మయురాలై వేంగీమండలాధిపతి విమలాదిత్యుని పట్టమహిషి కుందవాంబాదేవి యైమపడిచేసి యొక పవిత్రాసనమున నుపవిష్టయైయున్నది. సూర్యోదయముతో ప్రారంభమైన మహాన్యాసము సూర్యాస్తమయముతో ముగిసినది. బ్రాహ్మణపుంగవుల శరీరములు ముచ్చెమటలతో మునుఁగులెత్తెను. మహారాణి అచంచలమగు శివదీక్ష అందఱను ఆశ్చర్యచకితులను గావించినది. సహస్రనారికేళజలములతోడను, సమస్తనదీనదతోయములతోడను శివలింగమునకు అభిషేకము జరిగెను. అభిషేకజలమును మహారాణికి అర్చకుఁడొసఁగినాఁడు. ఆ సమయముననే విమలాదిత్యుఁడెచటినుండియో యేతెంచెను. తీర్థప్రసాదముల స్వీకరించెను. అతఁడప్పుడు తనదేవిని తిలకించెను. ఒక చిఱునగవుతఱగ యాతనిపెదవిపై నర్తించి యదృశ్యమైనది.

ఒక్కొక్క భూదేవుఁడు దేవిని సమీపించెను. ఆమె సాదరముగా సత్కారము లొనరించినది. నన్నయభట్టు, వజ్జియప్రెగ్గడ సదక్షిణతాంబూలముల సిద్ధముచేయగా రాణి గౌరవపురస్సరముగ వారికిచ్చి పంపెను. అందు కొందఱకు వారివారి యధ్యయనార్హతలనుబట్టి కపిలగోదానములు జరిగినవి. ప్రతి విప్రుఁడును వినయముతో "మీ ప్రసాదమున మాకర్తవ్యమును నిర్వహించుకొనుచు క్షేమమ్ముగానున్నారమ"ని బహుబహుపల్కి, రాణిని "పార్వతీపతి పాదపద్మధ్యాన పూజాపరాయణుఁడగు పుత్రరత్నమును బడయుమ"ట్లాశీర్వదించి యేగెను. ఇట్టి విద్వజ్జనమును గౌరవించుటయందు రాణికి ప్రత్యేకమగు శ్రద్ధ. ఇదియంతయు స్వజనము. తన వివాహసమయమున పరమ వైదికమూర్తియగు రాజరాజదేవుఁడు వీరందఱ నరణముగా తనవెంట బంపినాఁడు. వీరు సప్తగోదావరీ పరిసరాగ్రహారభూములలో నిరతాగ్నిహోత్రతత్పరులై, వివిధ యజ్ఞయాగక్రతు నిర్వహణదక్షులై ఆర్యమత సంరక్షణ దీక్షబూనియున్నారు.

ఆశీర్వాదకలాప మగునప్పటి కొంకింత ప్రొద్దు వోయినది. ఇదే సమయమున, విమలాదిత్యప్రభువు దక్షారామమునకు వేంచేసిన వార్త విని జానపదనాయకులు, తదితర గ్రామప్రభువులు సమావేశమైరి. రాజేంద్రుఁడు, వారికి దర్శనమొసఁగెను. అనంతరము కొందఱు జైనులు ప్రభువును సమీపించిరి. ఆర్యమతమునం దాతని కభిమానమే. కాని యా మతమున వాస్తవిక దృష్టి సన్నగిలినదను భావమాతనికి ప్రబలమైనది. సంకుచితమగు నావరణములతో నార్యమతము స్వకీయతంతు సమూహమున జిక్కిన లూత వలె ఆత్మనాశమున కొడిగట్టుచున్నదని చాళుక్య రాజేంద్రుని శంక. జైన బౌద్ధమత ప్రచారకులు తమతమ మత ప్రాముఖ్యములను విశదపఱచిరి. జైన మతము క్రమక్రమముగ ఆంధ్రప్రజల కాదర పాత్రమగుచున్నదని, సామాన్య ప్రజకు వైదిక మతము నందభిమానము సన్నగిలుచున్నదనియు రాజు గ్రహించెను.

సమావేశము పూర్తియైనది. విమలాదిత్యుఁడొకింత విశ్రాంతి గైకొనెను. అంతలో కుందవాంబ స్వయముగ ఫలాహారముల సిద్ధముచేసెను. చాళుక్యపతి ఫలములను స్వీకరించుచు తదేకముగ కుందవాంబను క్రీఁగంటితో పరిశీలించెను. ఆమెముఖారవిందము కొంచెము మ్లానమయ్యు, దివ్యదీధితుల విరజిమ్ముచున్నది. మందహాసముతో, భూపతి "కుందవాంబాదేవి మోమొకింతవాడియు, శివ దీక్షాసంజనిత కాంతిపుంజముచే కళకళలాడుచునే యున్నది" అనెను.

కుందవాంబ : ప్రభువుల ప్రేమాతిశయమట్టిది.

విమ : అట్లనుటకన్న దేవి సామర్థ్యమట్టిదనుట మేలు. ఎన్నడులేని వవాంఛరేఖ ముఖబింబమున ద్యోతమాన మగుచున్నది. చిరకాలవాంఛితమగు రాణివారి యభీప్సితము సిద్ధించు చిహ్నమేయది".

హఠాత్తుగా ఒకచేత జపమాల ద్రిప్పుచు ప్రవేశించు నన్నయ్యభట్టు: తథాస్తు : అందులకు సందేహములేదు. వినోదకాలక్షేపములన్నియు సిద్ధమైన వఁట. మనరాకకై నిరీక్షించుకొని యున్నారఁట.

రాజదంపతులు వివిధ కార్యక్రమ దిదృక్షులైరి. ముందొక భటుడు దారిచూపగా కుందవాంబా విమలాదిత్యులు మందగమనముతో నడువసాగిరి. చాళుక్య కులబ్రాహ్మణుఁడగు నన్నయభట్టారకుఁడు, కుందవాంబకు వామ భాగమున నడచెను. మార్గమధ్యమున మంత్రిపుంగవుఁడు వజ్జియప్రెగ్గడ వీరిని కలిసికొని ఆసన సమీపములకు గొనిపోయెను. సమస్త ప్రజానీకము జయజయ వినాదములతో గౌరవ పురస్సరముగ లేచి నిలువబడినది. మహీపతి యాసీను డగుడు పైవారందఱును నిశ్శబ్దముగ కూరుచుండిరి.

వీథిభాగవతులు ప్రభువునకు, వజ్జియప్రెగ్గడకు, నన్నపార్యునకు నమస్కరించిరి. ప్రదర్శనమున కుపక్రమించిరి. కథ తిన్ననిచరిత్ర.

అనాగరికుఁడయ్యు తిన్నని పాత్ర నటించిన భాగవతుడు చూపిన సహజ కళా కౌశలము ప్రజల హృదయముల నుఱ్ఱూతలూపినది. అచేతనమగు శివలింగము నా చెంచు వనాగరకుఁడు గనుకనే యట్లు ప్రశ్నింపగలిగినాఁడు. మంత్రములకు గూడ నతీతమగు ప్రాణప్రతిష్ఠఁజేయగలిగినాఁడు. "పులులు, సింగములు, తిరుగాడే యీ నట్టడవిలో నొంటరిగా ఎట్లుండగలవయ్యా! నీకాకలి అయితే కూడెవరెడతారు సామీ! మా పల్లెకు రా! నీకు పాయసం, నిప్పరిపాలు, వెదురు పాలు, నపరమేకల పాలు అన్నిపోస్తాను. పుట్టతేనె, పెరతేనె, తొఱ్ఱతేనె, పుట్టజున్ను ఆరగించుదువుగాని!! నీకు కావలసినన్ని పండ్లు తెస్తాను. మా చెంచెతలు తెచ్చే పండ్లు ఇంకా మంచివి. గొమ్మిపండ్లు, ఈఁతపండ్లు, గొంజిపండ్లు, మేడిపండ్లు. మా వాండ్లు నీకు ఏవికావాలంటే అవి తెచ్చెడతారు. ఇల్లు వాకిలి లేకుండ ఇట్లా ఎంతకాలమని ఉంటావు. మా కందఱు ఉన్నారు. వాళ్ళందరు నీసేవ సేస్తారు. నా మాటవిని వస్తే రా! లేదా నేనుమాత్రం నిన్నువదలి పోను. నా కన్నీ నీవే." అని తిన్నడు ఒక్కొక్క వాక్యము కడుపు తఱుగునట్లు మాట్లాడినాఁడు. ఇంతలో చెంచులదండు వచ్చి తిన్న నింటికి తీసికొనిపోవుటకు ప్రయత్నించి విఫలమై మరలిపోయినది. తిన్నడు శివుని కాహారము తెచ్చుటకు అడవుల కరిగెను. అతఁడొక యడవిపందిని వేటాడి చంపి దాని మాంసమును ఖండఖండములుగాఁ జీల్చెను. ఆ ఖండము లను వ్రేల్చి, దొప్పలలోనుంచి వానిని రెండు చేతులఁ బట్టుకొని ఒక చంకను విల్లు, వీఁపున నంపపొది నమర్చుకొని, తిన్నడు శివలింగమును సమీపించెను. పుక్కిటపట్టిన నీటితో దానిని స్నానమాడించి, తాను కష్టించి సంపాదించిన నంజుళ్లు భగవంతునకు సమర్పించెను. శివుడెంతతడవునకు మాంస ఖండములు భుజింపలేదు. శబరుడంత మఱింత యార్తుఁడై "సామీ! నా బత్తి మీకు సాల లేదా! నన్ను పరీచ్చ సేస్తున్నావా? నన్నట్టా కలవరపెట్టడం దమ్మమా? వేకువతో ఈ కాస్త ఆహారం తీసుకో! లేదా నాపాణాలే బలిసేత్తా" అని శరముతో పల్కెను. అంత శివుఁడు తిన్నని భక్తికి మెచ్చి ఆ పదార్థముల భుజించుట కిచ్చగించెను. చెంచు, మిన్నంది, విపరీతమగు నాప్యాయతతో, ఒక్కొక్క ఖండము నా దేవుని కందించి పరమానందభరితమానసుఁడాయెను.

కుందవాంబ యీ దృశ్యమును తిలకించుచు భక్తసులభుఁడగు పరమేశ్వరుని లోలోన సంస్మరించెను. నన్నపార్యుఁడు ఆంధ్రప్రజలకు తమ భాష యందును, తమ కథలయందును, వేషభాషలయందును గల రసప్రవృత్తికి కాశ్చర్యపడెను. ఇంతలో తరువాతి దృశ్యము వచ్చినది. అది మిక్కిలి పరాకోటి కెక్కినది. తిన్నని భక్తిని పరీక్షించుటకై శివుడు కంట నీరు కార్చును. అది చూచి బాధపడి యా యమాయికుఁడైన ఆటవికుఁ డడవులలో లభించు పసరులను శివుని నేత్రములఁ బిండును. అయిన నేమియు స్వస్థత చిక్కలేదు. ఆ భక్తుని

మానసము మిక్కిలి పరిదేవించినది. తటాలున నాతనికొక యాలోచన తట్టినది. కంటికి కన్నె మందని భావించెను. వెంటనే సాహసించి తన నిశిత తూణీరముతో నొక కన్ను పెకలించి దానిని స్వామినేత్రమున కతికించెను. ఇందులకెంతయో సంతసించిన దేవదేవుఁడు మఱింతగా తన భక్తుని పరీక్షింపనెంచెను. వెంటనే తన రెండవ నేత్రమునుండి నీరు కార్చెను. అంతనా పుళిందుఁడు సామికిది కల్గిన యాపదకు ఖిన్నుఁడై, సర్వేంద్రియములలో నత్యుత్తమమగు తన రెండవ కంటిని పెకిలించుటకు నిశ్చయించుకొనెను. తన చెప్పుకాలితో నిటలాక్షుని కన్గొనను దన్నిపట్టి, నిశితనారాచమున తన రెండవ కంటిగ్రుడ్డును బెరలింపగా నుమాపతి ప్రత్యక్షమై యాతనికి దృష్టిని ప్రసాదించి తన కరుణకుఁ బాత్రుని గావించెను.

ఈ దృశ్యము జరుగుచున్నంత మేరకు విమలాదిత్యుని మానసము కొంత కుందవాంబయందును, కొంత ఆర్యమతమునుగూర్చిన యాలోచనలలోను నిమగ్నమాయెను. ఆర్యమతము సామాన్యప్రజ కందుబాటులోలేక నానాటి కడుగంటి జైన బౌద్ధ మతములు తలయెత్తుటకు తావిచ్చినదని రాజేంద్రుని యభిప్రాయము. మఱి చెంచునకే సంస్కార మున్నది? మానవ జీవితము నున్నతస్థితికి గొంపోవునది ఉత్తమ హృదయము. దానికి ఆర్ద్రత ప్రధానము. అట్టి హృదయముగల మానవుఁ డే కులమత వర్గములకుఁ జెందినవాఁడైనను తరించఁగలఁడు. మానవుఁడేకాదు, గజేంద్రుఁడు నిట్టి ఉత్కంఠవలననే సంరక్షింపబడినాఁడు. ద్రౌపది యిట్టి స్నిగ్ధహృదయముతోడనే నిండుసభలో మాన సంరక్షితయైనది. ఇట్లు విమలాదిత్యుఁ డాలోచనా నిమగ్నుఁడై, యెడనెడ తన యభిప్రాయములను నన్నపార్యునకుఁ దెల్పెను. నన్నపారు డందుకొని "ఆర్ద్రత జీవితమునకు ప్రధాన మనుట నిస్సందేహము. ఈ యార్ద్రత యెప్పుడో యాపదలలోకాక నిత్యజీవితమున నడుగడుగున ననలెత్తవలెను. పరుల కష్టసుఖములను తనవిగా భావించి ఏ మానవుఁడు సానుభూతినందునో వాఁడుత్తమ సంస్కారి. ఎంత చదివినను అట్టి హృదయ సంపదలేనిచో దానికై యాతఁడు మఱికొన్ని జన్మలెత్తక తప్పదు. దీనినే సత్త్వ స్ఫురణమని యాలంకారికు లందురు. ఇట్టి సత్త్వ స్ఫురణచే ఆత్మ పరిపాక మందిన వ్యక్తి ధన్యాతిధన్యుఁడు. సమస్త కళలు నిట్టి యాత్మ పరిపాకమును గల్గించుటే బరమ లక్ష్యముగాగలవి. ఆంధ్రులకిట్టి సత్త్వ స్ఫురణము జన్మచేతనే విశేషముగ నున్నది. ఇంక నా భాష సాహిత్యస్థాయి నందుకొన్నచో ఆంధ్రుల హృదయ క్షేత్రములు దివ్యకేదారములు కాగలవు,"

విమలా : ఆ మహోద్యమము తమవంటివారివలననే కలుగవలయును.

నన్నయ : అది యొక వ్యక్తిచే నిర్వహింపబడునంతటి తేలికవిషయము కాదు. అది మీరన్నట్లుగా మహోద్యమము. బహువిషయ సంబంధి. తమ

రాశించిన యీ మహోదయ మచిరకాలముననే వేంగీమండలికి ప్రాప్తించక తప్పదు. జాతి చైతన్యమే దానికి దారితీయును.

ప్రదర్శనానంతర మాటపిక స్త్రీలు కుందవాంబాదేవిని సమీపించి నమస్కరించి గౌరీ వివాహమును పదములుగా పాడిరి.

మఱి యిరువురు స్త్రీలు చనుదెంచి "గంగా గౌరీ సంవాదము"ను మిక్కిలి చమత్కారముగా పాడిరి. గౌరీదేవికి తాను గంగకన్న అధికురాలనని దురహంకారము. ఒకనాడు గౌరమ్మ తానలంకరించుకొనఁగా మిగిలిన పూలను గంగమ్మ దంపినది. అప్పుడు గౌరి

"వాఁడిన పూఁబంపిన వనిత యెవరమ్మా?
వదలిన పూఁబంపిన వనిత యెవరమ్మా?
చాలకుంటే తన్ను సరికొల్లలాడు" నని నిష్ఠురమాడినది.

"సరికొల్లలాడను సరిదానవటవే?" యని యీసడించినది గౌరి.

"సరిదాన్నికాకుంటె శివుదేల తెచ్చు? శివుదేల తెచ్చును జగమేల మెచ్చు? శివునకు చిన్నారిని నీకు చెల్లెలను" అని గంగ మారు పల్కినది.

అంమిలకు గౌరి సహింపలేక "తన్నెను తన సవతి గుండెల్లు పగుల" పరాభవ ఖిన్నమానసయై గంగమ్మ తన మేడకు జనెను. తరువాతి పరిస్థితి నిట్లు వారు పాడిరి :

"అంతట గౌరమ్మకు చెంగుతామాసె
ఉదకాల జాడలు కానరావాయె
తన కొడుకు వీరన్నను గ్రక్కున బిలిచి
రావోయి వీరన్న! రాజశేఖరుడా
ఉదకాల జాడలు చూచిరా కొడకా ॥
అటువోయి వీరన్న ఆ కొలను జూచె
ఆ కొలను ఉదకాలు దాచింది గంగ
చిలక సంద్రముజూడ చిన్నమెత్తులేదు
పాల సంద్రముజూడ పాతికెత్తు లేదు —
ఎచ్చటకు తిరిగినా ఉదకంబులేదు".

వీరన్న దశని మేడలు వెతకినాఁడు. ప్రయోజనము లేదాయెను. గౌరి నీటికి బముబుగా "పట్టించు పదివేల పాలకావిళ్ళు: కట్టించు పదివేల నేతికావిళ్ళు"— "పాల కావిళ్ళొచ్చి పందిళ్ళఁ దిగెను — నేతి కావిళ్ళొచ్చి మేడల్ల దిగెను — పాలతోనే గౌరి స్నానంబు చేసె — నేతితోనే గౌరి శివపూజ చేసె — చీమలు దోమలు చెదకుట్టసాగె — గండుచీమలు మేను చెండుతునుండె."

గౌరి పరిస్థితి విషమించినది. గత్యంతరము లేకపోయినది. గంగను శరణుగోర వెళ్ళినది. ఎట్లు? "ముందరను వీరన్న వెనుకను గణపన్న"

"గవరప్ప రాకాలు గంగప్ప" చూచినది. పంచనచేయఁ దలచినది. "పచ్చి ప్రావలు దెచ్చి పంపిళ్ళు వేసినది. పండుటాకులు దెచ్చి తోరణాలు గుచ్చినది. కప్పు చచ్చిననీళ్ళు కల్లాపి చల్లినది. చేప జచ్చిననీళ్ళు చెయ్యితా గడిగినది. ఎన్నడు నామేడ యెరుగవు అప్ప—ఏమిపని కొచ్చితివి నీవు గవరప్ప" అని సర్మముగఁ బ్రశ్నించినది. తన దీనస్థితి 'హరురాణి' వివరించినది. కొడుకు వీరన్నను, కోడలు భద్రగిరిని, చీరెలు, రవికలు, సొమ్ములు సమస్తము గౌరి గంగకు సమర్పింతు నన్నది. గంగ ఒప్పుకొనలేము. కట్టకడకు గౌరి "నా యొక్క శివుని నీకిస్తుగాని — ఉదకజాడలు చెప్పవే గంగ" అని ప్రార్థించినది. ఈ మాటపై "గుప్పుగుప్పున గంగ ఉప్పొంగుచూను — ఏరులన్ని వాన లోకమయి నిండి" నది. గంగ శివుని జటాజూటము నలంకరించినది.

అవ్యక్తమధురముగా గానము చేయబడిన ఈ సంవాదము నమితశ్రద్ధతో కుందవాంబ యాలించినది. స్త్రీ ప్రకృతిలోని యల్పత్వ మామెకెప్పుడును సిగ్గు గల్గించును. నన్నయభట్టారకుఁడిది గుర్తించుచునే యున్నాడు. స్త్రీ ప్రకృతి అట్లే యుండవలయునని యతని తలంపు. "స్త్రీ పుంసయోగోద్భవ" మైన దీ ప్రకృతి. ప్రకృతి సహకారములేని పురుషుఁడు నీరసుఁడు. నిస్తబ్ధుఁడు. స్త్రీ ప్రకృతుల నిట్లు సహజమనోజ్ఞముగ నున్మీలన మొనర్చిన యీ సంవాదము నందలి తెనుఁగుదనము నన్నపార్యుని మఱింత యాలోచనామగ్నుని జేసినది. అంతలో కోడికూసినది.

శివరాత్రి జాగరణము పూర్తిఅయినది. ప్రముదిత మానసములతో రాజ దంపతులు విడిదికేగిరి. మిగిలిన రాత్రి యంతయు నన్నపార్యునకు కునుకు పట్టలేదు. అనిర్వచనీయమగు నాలోచనములేవియో అతనిని వేధించినవి. ఒక వంక శ్రుతిమనోహరమగు ద్విజసంతానముల కలకంఠ విన్యాసమాధుర్యము. వేఱొకవంక హృదయములను గదిలించిన జానపద సాహిత్యశక్తి నన్నయ భట్టారకునిలో నేకోన్ముఖమై, ఏదోయొక నూత్న సృష్టికిఁ బ్రేరేచినట్లయినది.

౨

విమలాదిత్యుని రెండవభార్య 'మేడాంబ'. ఈమె తెనుఁగు చోడవంశ సంజాతురాలు. ఆచంట పురాధీశ్వరుఁడైన మండలిక సూరపరాజు సుపుత్రి. కుందవాంబ తమిళ చోళ వంశ సంభూతురాలు. ఈ రెండు కుటుంబములును నొక్క కుదురునుండి పుట్టి వేఱువేఱుగా నభివృద్ధి జెందినవి.

కుందవాంబ నిండుకుండ. ఆమె నడకలో హుందాతన మడుగడుగున గోచరించును. ఆమె వాలకము పవిత్ర సనాతన సంప్రదాయములను ప్రతిబింబించును. మేడాంబలో నంతటి నిండుదనముకాని హుందాతనముగాని కానరావు.

ఆమె ఎంతవఱకును విమలాదిత్యుని మనఃప్రవృత్తి ననుసరించి నడచును. రాజు తన్నధికముగ ప్రేమించుచున్నాఁడా? లేదా? యని యడుగడుగునఁ బరీక్షించు చుండును. ఏ కారణముచేతనైన రాజొక విధముగనున్న, తత్కారణమారసి, దానికేదో పరిచర్య సలుపుటకు మేడాంబ తహతహలాడును. కుందవాంబ కట్టి తహతహలు లేవు. ఆమె నిరంతర శివపూజా తత్పరశీల. తనయీ శీలమే రాజేంద్రున కఖండ శుభముల నొనగూర్చునని యామెప్రత్యయము. ఆఱు మూఁడైన మూఁడాఱైనగాని తన వ్రతములకు, తన దైనందిన పూజావిధానములకు కొఱఁతరానీయని సుస్థిరచిత్త కుందవాంబ. నిత్యము శివసహస్రనామావళి స్వయముగా గావించును. ఆమె జీవితమొక యసిధారావ్రతము. ఆవ్రతశీలను తిలకించినపుడు రాజేంద్రుని హృదయము 'ఝల్లు' మనును. ఆమెకు తాను భర్తగావున నమస్కరించకూడదుకాని లేనిచో నమస్కరించువాఁడే!! కుందవాంబ నైష్ఠిక సౌందర్యమనేక జన్మల తపఃఫలము. మేడాంబ భౌతిక సౌందర్యము తజ్జన్మసిద్ధము.

శివరాత్రి వ్రతదీక్షాసంజనిత ద్విగుణీకృత సౌందర్యరాశియగు కుందవాంబ సందర్శనము మేడమాంబ కసూయాజనకమైనది. కాకుండునెట్లు?

దక్షారామ పుణ్యక్షేత్రమునుండి తిరిగివచ్చిన పిమ్మట విమలాదిత్యుఁడు మేడమాంబను జూచినాడు. ఎన్నాళ్ళనాఁడో చూచినదానివలె ఆమె రాజును తన యక్కున జేర్చుకొన్నది. దక్షారామ విశేషములను బ్రశ్నించినది. క్లుప్తముగ నివేదించినాడు తేఁడు. ఇష్టము లేనప్పుడట్లేచేయుట సహజము. ఆ రాత్రి యంతయు నృపాలుఁడు చిన్నరాణి మందిరముననే గడిపినాఁడు. దానితోనామె సంతృప్తి చెందినది. ఎట్లు ప్రవర్తించినను రాజు తనవాఁడే యని మేడాంబ నమ్మకము.

సూర్యభగవానుఁడు రాత్రియంతయు పశ్చిమదిక్కాంతను వనియించి, గోదావరీ తోయములను ముఖసమ్మార్జనార్థ మేతెంచెను. రాజాంతఃపురమున వైతాళికులు మధురగీతాలాపనముచే రాజేంద్రుని మేల్కొలిపిరి. విమలాదిత్యుఁడు మేల్కాంచి కాలోచితకృత్యములు దీర్చెను. ఇంతలో పట్టియప్రెగ్గడ రాజ్యాంగసభ కాహ్వానించుటకు వచ్చెను. రాజ్యాంగసభ వారమున కొకమాఱు సమావేశమగును. అం దయిదుగురు సభ్యులు. వారే రాజు, మంత్రి, పురోహితుఁడు, సేనాపతి, యువరాజులు.

విమలాదిత్యుఁడు సాలంకృతుడై సభకేతెంచెనోలేదో దౌవారికుఁడొక విదేశవార్తాహరు డేతెంచినవార్త నెఱిఁగించెను. స్వామి కనుసన్నఁ గనిపెట్టి యాదౌవారికుఁడు వానిని లోనికి ప్రవేశపెట్టెను. వాఁడు రాజునకు నమస్కరించెను. అంతట సేనాని వానిచేతిలోని వార్తాపత్రికగొని పట్టియప్రెగ్గడ కందించెను. పట్టియప్రెగ్గడ దానినిట్లు చదివెను:

"సర్వలోకాశ్రయ శ్రీ విష్ణువర్ధన మహారాజాధిరాజ రాజపరమేశ్వర! వీరమకరధ్వజ! విరుదాంకభీమ! రాజమార్తాండ! భీమ మహేంద్రాద్యనేక విరుదాంచిత వేంగీ సామ్రాజ్య సార్వభౌములగు శ్రీ శ్రీ శ్రీ విమలాదిత్య ప్రభువులకు రాజకేసరివర్మ, అరుణ్మొళివర్మ, మూర్మడిచోళ, నిత్యవినోద, చోళనారాయణ, ముమ్మిడిచోళ, రాజేంద్ర విద్యాధర విరుదాంకిత శ్రీ శ్రీ శ్రీ రాజరాజదేవులు వ్రాయు శుభలేఖార్థములు : ఉభయకుశలోపరి. ఈ చైత్ర బహుళ పాడ్యమి ఉగాది పర్వదినమున మా దేవేరులు లోకమహాదేవుల ప్రతిష్ఠాపనము నెఱపునట్లు దైవజ్ఞులు నిర్ణయించిరి. కాన తాము సకుటుంబ సపరివారముగ వేంచేసి, మమ్మానందింపఁజేసి మహాదేవుల కరుణకుఁ బాత్రులు గావలసినదిగా నెంతయో యభిలషించుచున్నాము."

ఇట్లు, మీ శ్రేయోభిలాషి

శ్రీ శ్రీ శ్రీ రాజరాజ మహాదేవులుగారు

లేఖ చదివి వజ్జియప్రెగ్గడ విమలాదిత్యుని కన్నులలోనికిఁ జూచెను. విమలాదిత్యుఁడు నన్నయభట్టారకుని ముఖమును దిలకించెను. ఆ లేఖఁగొని వెంటనే యాబ్రహ్మణ్యమూర్తి కుందవాంబాశ్రవఃప్రేయము గావింప నంతఃపురమున కేగెను.

విమలాదిత్యుఁడు : ఏమి! చోళవంశీయుల సంప్రదాయప్రియత్వము! ఇట్టి వీరితో సంబంధముచే భ్రమరకీటన్యాయమున నా చిత్తమును శివధ్యాన తత్పరమగుచున్నట్లున్నది.

వజ్జియ : అది యథార్థము. అనివార్యము. ఎంతో సుకృతమునగాని అట్టి మహాపురుష సంబంధము కుదురదు. అయిన ప్రయాణమునకు ....

విమ : సన్నద్ధులము. ఇట్టి పుణ్యకార్యములయందు పాల్గొనుటకు కార్యఖడ్గనిపుణులైన తమవంటి మంత్రిపుంగవుల వలననే యవకాశము మాకు లభించుచున్నది. చాళుక్యసామ్రాజ్యమునకు మీరు పెట్టని కోటలుగదా!

వజ్జి : ప్రభువుల వాక్యములు నా కర్తవ్యమును బ్రబోధించుచున్నవి. ఈ ప్రెగ్గడ బొందిలో ప్రాణమున్నంతవఱకు వేంగిరాజ్యము సురక్షితము.

సేనా : తథ్యము.

ప్రభువు లుత్థితులై కుందవాంబాభవనమార్గ మవలోకించిరి. వజ్జియ ప్రెగ్గడ సెలవుతీసికొని ప్రయాణప్రయత్నముల గావింపనేగెను.

కుందవాంబ లేఖాశ్రవణానంద సంతృప్త మనస్కయై "అయిన ప్రభువు లేమని సెలవిచ్చిరి?" అని ప్రశ్నించినది. అప్పుడే ప్రభువులు ప్రవేశించి "ప్రయాణమునకు సిద్ధముకండ"ని సెలవిచ్చిరి.

నన్న : ప్రభువు లిట్టికార్యములకు వెనుకంజవేయరు. వారి యుత్సాహము కానరానిది.

దక్షారామమునుండి వచ్చిననాటినుండి కుందవాంబ యారోగ్యము స్థిమితముగ లేదు. భోజనమన్న నామె కేవగింపు గల్గినది. పుట్టింటి ప్రయాణమన్న పురంధ్రులకు పట్టరాని ప్రమోదము. ఆ ప్రమోదమే కుందవాంబ నంతమూర ప్రయాణమునకు సన్నద్ధపఱచినది.

మఱునాఁడు ప్రాతఃకాలమున సుముహూర్తము నిశ్చయమైనది. నన్నయభట్టును ప్రయాణముకమ్మని కుందవాంబ యాహ్వానించినది. "దేవేరి పుట్టింటికి రమ్మనుటచే భట్టారకులకిక నా పిలుపుతో నిమిత్తములేదుకదా!" అని విమలాదిత్యుఁడు ఛలోక్తిగాననెను. మృదుస్వభావుఁడగు నన్నయభట్టు మందహాసముతో తన సంసిద్ధతను తెలియఁజేసెను.

౩

ఇరువురుసైనికులు విచిత్రవేషములతో విచిత్రభాషణముల జరుపుచున్న యిరువురు గూఢచారులను బంధించి వజ్జియప్రెగ్గడముందు నిల్పిరి. ప్రెగ్గడ బహుభాషాకోవిదుడు. సునిశితమనస్తత్వ పరిశీలకుఁడు. అందుచే నాతఁడు సైనికులను బంపించి వారితో రహస్యముగ సంభాషించెను. వారు ధరాపురాధీశ్వరుఁడైన భోజరాజ సైనికులు. భోజరాజు పసుపుత్రాచువంటివాఁడు. సింహాసన మధిష్ఠించిన వెంటనే తన గర్భశత్రువైన కుంతలాధీశ్వరుని యంతు తేల్చనెంచెను. చాళుక్యరాజులు కుంతలాధిపతులకు జన్మవిరోధులు. అనఁగా కుంతలులు చుట్టును సుడిమంగళము. మధ్య జయమంగళమన్నట్లు రాజ్యమేలుచున్నారు. కుంతలాధిపతియైన ఇమ్మడి తైలపదేవుడు, భోజుని పెదతండ్రియైన వాక్పతిరాజును చిత్రవధ గావించినాఁడు. ఆ కసి తీర్చుకొనుటెప్పుడాయని భోజుడు కత్తికి సానలు పట్టించినాఁడు. తన రాజకీయజ్ఞత్వము నుపయోగించినాఁడు. అది రహస్యముగ జరుగవలయును. అందుకే యీ గూఢచారుల సంచారము.

ఇదియంతయు గ్రహించినాఁడు వజ్జియప్రెగ్గడ. తమప్రభువుల కాజన్మశత్రువులు కుంతలులు. ప్రభువు పట్టణమున లేఁడు. తాను స్వతంత్రించిచేసిన యేపనిగాని యతఁ డాక్షేపించి యెఱుఁగడు. ఆ విశ్వాసము వజ్జియప్రెగ్గడకు గాఢము. అందుచే సత్వరసాహాయ్యమే తన కర్తవ్యమను నిశ్చయమునకు వచ్చినాఁడు. కాని రాజధానీనగరమును వీడిపోవుట మహాసాహసము. అట్టి సాహసము వజ్జియప్రెగ్గడకుదక్క నన్యులు చేయలేరు. కళింగ ధారుణీధవుఁడు ఇమ్మడి గుండరాజు. ఆంతరంగికవిషయములు సర్దుకొనునప్పటికే యాతనికి తలప్రాణము తోకకు వచ్చుచుండెను. వేంగిభూమిపైపు కన్నెత్తి చూచుటకైన నాతనికి వలనుపడదు. ఇఁక తమకేమి యను ధీరతతో వజ్జియప్రెగ్గడ గూఢ

చారులను బంపివైచెను. వెంటనే ససైనికముగ నాహావభూమికి బయలుదేరెను.

సరిహద్దుప్రాంతములలో భోజవాహిని సద్దగించుచు, కుంతల చాళుక్య నృపాలుఁడు త్రిభువనమల్ల విక్రమాదిత్యుఁడు త్రినేత్రుని వీరావేశముతోఁ బోరాడుచుండెను. దక్షిణమునుండి వేంగిసైన్యము రాదని యాతని విశ్వాసము. విమలాదిత్యుడు కుందవాంబా సమేతముగ దైవకార్యనిమగ్నుఁడై యుండెను గదా యని యాతని ధైర్యము. వజ్జియప్రెగ్గడ వాయువేగముతో సైన్యమును తరలించి, కర్ణాటరాజ్యమునఁ బ్రవేశించెను. బాదామి ముఖ్యనగరమునకు రెండు క్రోసులదూరములో నున్నది. ఇట్టి విపరీత విపత్కర పరిస్థితి యేర్పడినట్లు వేగురులు త్రిభువన మల్లున కెఱిఁగించిరి. తాను మహా రణరంగమున నిస్సహాయుఁడై యంగలార్చుచున్నాఁడు.

ఇట్టి విషమపరిస్థితి నెదుర్కొనవలసిన భారము రాజధానియందున్న నారాయణభట్టు అను బ్రాహ్మణయోధుని భుజస్కంధములపైఁ బడినది. ఆ యువ బ్రాహ్మణునకు ఇట్టిపరిస్థితుల నెన్నింటినైన నెదుర్కొను బుద్ధిబలము, భుజబలము కూడ సమానముగ నున్నవి. వెల్లువగ బారుచున్న చాళుక్యవాహిని నరికట్టకున్నచో కర్ణాటకరాజ్యమే రూపుమాసిపోవును. నారాయణభట్టు నగర రక్షణకైయున్న తగుమాత్రపుబలమును సమీకరించినాఁడు. వెంటనే చాళుక్య యోధులతో తలపడినాఁడు. వజ్జియప్రెగ్గడ, నారాయణభట్టులు సమాన యోధ ద్వయము. ఒకరిపరాక్రమ మొకరి కాశ్చర్యము గల్గించునది. ఇరువురి పరాక్రమములకు వీరులు సంభ్రమాశ్చర్యచకితులైరి. వజ్జియప్రెగ్గడను ముందుకు రానీయకుండ నారాయణభట్టు తన సమస్తశక్తిని ప్రదర్శించెను. నారాయణభట్టు తన ప్రభువునకు వర్తమానమంపినాఁడు. నిస్సహాయుఁడైన ప్రభువు నీవార్త మఱింత నిస్సారుని గావించినది. ప్రతి క్షణమును నారాయణభట్టుసైన్యము సాహాయ్యమున కెదురుచూచుచుండెను. అయినను నాతఁడు తన ధైర్యమును సడలనీయుటలేదు. వివిధదేశాగత గూఢచార సమూహ మీ యద్భుతావహమైన యాహవమును వీక్షించి తమతమ ప్రభువుల కెప్పుడు నివేదింతుమా యని యుత్కంఠించుచున్నది.

* * *

అది తిరువైయ్యారు గ్రామము. చైత్రబహుళ పాడ్యమి. ఉగాది పర్వ దినము. నవనవోన్మేష సుందర మరీచి మాలికా సముల్లసితమైన పల్లీపత్తన జనసమూహము ప్రాతఃకాల పవిత్రావసరమున నా గ్రామమునందు జేరినది. అందర ఫాలభాగములయందలి విభూతిరేఖల ధావళ్యము పగటివెన్నెల కాయుచున్నట్లున్నది. అందఱును పైపంచలు నడుములకు బిగించి జారిపోవు చున్న జుట్టుముడులు సవరించుకొనుచు సాష్టాంగప్రణామముల్ గావించు చున్నారు. రాజరాజదేవేంద్రుల కొకపార్శ్వమున అరకేసరివర్మ, చోళరాజేంద్ర

చోళుఁడును, మఱియొకపార్శ్వమున విమలాదిత్యరాజేంద్రులును సముచితాసనముల నాసీనులై యున్నారు. ప్రజానీక మా మూర్తిత్రయమునుజూచి పూజ్యభావపురస్సరముగ నమస్కరించినది. చాళుక్యచూడామణి వామభాగమునందున్న వల్చనిమూర్తి ఎవ్వరో !! పెక్కుమందికి తెలియక పరస్పరము ప్రశ్నించుకొనుచుండిరి. "అతడు నన్నయభట్టారకుఁడు. బ్రహ్మాండాది నానాపురాణవిజ్ఞాననిరతుఁడ"ని అక్కడక్కడ వినిపించుచున్నది. మఱికొన్ని ప్రదేశములలో కొందఱు "అబ్బా ! అతఁడు మూర్తీభవించిన సంస్కృతవాఙ్మయముఁట !" అని యాశ్చర్యముగఁ జెప్పుకొనుచున్నారు. "ఇంత చిన్నవయసుననే యింతటి యధ్యయన సంపన్నుఁడా !" యని విస్మయమందువారు కొందఱు. "ఈనాఁడు సాయంసమయమున నన్నయభట్టారకులచే పురాణప్రవచనము కావింపఁబడునఁట !! తప్పక వినవలయున"ని యుత్సహించువారు మఱికొందఱు. "సంస్కృతములో మాట్లాడిన మనకేమి తెలియున"ని నిస్పృహజెందువా రింక కొందఱు. "కాదయ్యా ! ఆబాలగోపాలమునకుఁగూడ నాతని భాషణము లవగతమౌన"ని మురిసికొని ముచ్చటించువారు కొద్దిమంది.

రాజమహేంద్రవరమునుండి వచ్చినప్పటినుండియు కుందవాంబాదేవి యారోగ్యమేమియు ననుకూలముగలేదు. ఆహారమన్న నామె కేవగింపు అధికమైనది. పండ్లరసము మాత్రము బలవంతముగ పుచ్చుకొనును. అయినను విశ్రాంతియన్న నామెకు గిట్టదు. ఉపవాసమున్న నామెకు నల్లేరుపై బండినడక. కుందవాంబ యీ విషయమున తల్లియగు లోకమహాదేవిని మించినది. తనకంటె చిన్నదయ్యు, తన కూఁతునందు గాననగు నీ దీక్షానిర్వహణదక్షతకు లోకమహాదేవి లోలోన మురిసికొనును.

మంత్రపురస్సరముగ తిరువైయ్యారు గ్రామమున శివలింగప్రతిష్ఠ పూర్తియయినది. ఆదేవునకు 'లోకమహాదేవుఁడ'ని నామకరణముసేసిరి. సహస్రాధికములగు నారికేళములతో నభిషేకము పూర్తి అయినది. చాళుక్యభూపతి యీ సందర్భమున బ్రాహ్మణబృందమును భూరి దక్షిణలతో సంభావించెను. కాని ఇది యేదియు నా వేంగీధవునకు సంతృప్తి గల్గింపలేదు. తనపేరు శాశ్వతముగ నుండవలయునని యాతని గాఢవాంఛ. లోకమహాదేవునకు నిత్యనైవేద్య దీపారాధనలకు గావలసిన వ్యయమునంతయు తాను భరింతునని యతడు ప్రకటించెను. ఇదిగాక యనేక సుందర సువర్ణపాత్రలనుగూడ పాత్రమెఱిఁగి ద్విజోత్తములకు బహూకరించి తన వదాన్యతను జూపెను. ప్రజలందఱు 'మామగారికి తగిన యల్లుఁడ'ని విమలాదిత్యుని పరిపరివిధములఁ బ్రశంసించినారు.

ఆనాఁడు సాయంకాలము తిరువైయ్యారునం దెప్పుడు కని విననంతగా పండితులు, పామరులు సమావేశమైరి. నన్నయభట్టారకుఁడు బ్రహ్మాండ పురా

ణమును వ్యాఖ్యానించెను. తత్పూర్వము భారతీయసంస్కృతియందు పురాణము లకు గల ప్రముఖస్థానమును బలపఱచెను. "వేదములు ప్రభువులవలె శాసించును. పురాణములు మిత్రులవలె సలహానిచ్చి మానవజీవితమును సముద్ధరించును. జీవితావసరమైన వివిధవిజ్ఞానశాస్త్ర విషయములిందు సంక్షిప్తముగ నిక్షేపింపఁబడినవి.

వేదవిహితధర్మములను బ్రపంచించి. సామాన్యప్రజకు నవగాహనమగునట్లు చేయుటకే పురాణములు వెలసినవి. బ్రహ్మవిద్యాసంపాదనా కుతూహలాయత్తచిత్తునకు బాల్యావస్థయందు దారిచూపి. కొంతదూరము నడిపించుటకీ పురాణము లత్యంతోపయోగములు. ప్రవృత్తి. నివృత్తి మార్గములలో మానవునకు సమగ్రమగు శిక్షణ నొసంగి, ఆధ్యాత్మిక శిఖరారోహణమునకు సోపానముల నేర్పఱచునవి పురాణములు. ఇట్టి నిరంతర పురాణశ్రవణానుగత జ్ఞానముచే సామాన్య భారతీయుఁడు కూడ సమర్థమగు జీవితమును గడపగలవాడగును.

సాధారణమానవుని సంసారబంధమునుండి యున్నతమైన యాధ్యాత్మిక మార్గమునకుఁ దరలించుట కిం దనేకములైన కథ లుద్ఘాటింపఁబడినవి. ఈ కథలు ప్రాపంచికదృష్టితోఁ బరికించినపు డతిశయోక్తులుగా గానవగును. కాని వాని యంతరార్థమేమియో, యే పరమార్థమును బ్రచారమొనర్చుటకవి యుద్దేశింపఁబడినవో గ్రహింపవలయును. ఇందులకొక యుదాహరణము ధ్రువచరిత్ర. ఉత్తానపాదుఁడను రాజునకు సునీతి, సురుచి యను నిరువురు భార్యలు. సునీతి ధ్రువుని, సురుచి యుత్తముని కుమారులుగాఁబడసిరి. ఈనామములతోనే వాని యంతరార్థము సుస్పష్టము. ఉత్తానపాదుఁడనగా ఎత్తైనపాదములుగలవాడు అనఁగా గొప్ప మానవుఁడు. సునీతి యనఁగా నీతిపథగామిని. ధ్రువుఁడనగా నిశ్చలజ్ఞానసంపన్నుఁడు. సురుచి యనఁగా సుఖాపేక్షకలది. ఈ యర్థములతో నీకథను గ్రహించిన, మానవుఁడు సహజసిద్ధమగు జ్ఞానాపేక్షకలవాఁడనియు, ప్రాపంచిక సుఖాపేక్షాప్రలోభుఁడై జ్ఞానమార్గమునుండి వైదొలఁగుననియు, తెలియనగును. ఒకనాఁడు ధ్రువుఁడు తన తండ్రి యొడిజేరుటకు యత్నింపగా, ఉత్తానపాదుఁడు సురుచీ కుటిల భ్రుకుటీవిన్యాసలాలసుఁడై, ధ్రువుని త్రోసివేసినాఁడు. అనఁగా సహజముగా జ్ఞానాసక్తుఁడైన మానవుఁడు ప్రాపంచిక వ్యామోహమునఁజిక్కి పతితుఁడగుచున్నాఁడను సత్యము నీ ధ్రువచరిత్ర ధ్రువపఱుచుచున్నది.

ఇట్టిదే ప్రహ్లాద చరిత్ర. ప్రహ్లాదునితండ్రి హిరణ్యకశిపుఁడు. హిరణ్యమనఁగా భాగ్యము. ప్రహ్లాదమనఁగా సచ్చిదానందము. హిరణ్యమువలన గలుగు ప్రపంచ సౌఖ్యమునకు కొన్నికోట్ల రెట్లధికమైనది సచ్చిదానందము. అట్టి దివ్యానందానుభవమున కీ హిరణ్యము నిరోధకము. కావున మానవుఁడు బ్రహ్మా

జ్ఞాన సంపన్నుఁడై క్షణికమగు ప్రాపంచిక సౌఖ్యముల దిరస్కరించి, బ్రహ్మానందమున నోలలాడవలయును.

ఇట్టి విశేషాంశములను దేవభాషలో నన్నపార్యుఁడు ఉపోద్ఘాతముగ నుద్ఘాటించెను. అనంతరము సృష్టిక్రమమును గూర్చియు, పదునాలుగు లోకములను గూర్చియు రమణీయముగఁ బ్రవచించినాఁడు. లలితపదవిన్యాస విలసితమైన నన్నపార్యుని వాగ్ఝరి పండిత పామరులను బ్రసన్నులఁ గావించినది. అట్లు సంస్కృతమునం దుపన్యసింపఁగల వక్త ఆదేశమునందున్నాఁడా యను శంక పొడగట్టినది. ఏమి యా శ్లోకపఠనాకౌశలము! ఏమి యా యుపన్యాస మాధుర్యము!! ఏమి యా రమణీయసుస్నిగ్ధ పదసంవిధాన కౌశలము!!! "మాటలాడినది దేవభాషయైనను దేశభాషకన్న మిన్నగా నర్థమగుచున్నదే" యని సభ్యుల ముఖములందుండి ప్రశంసలు వెడలినవి. దీనినంతయు నవలోకించుచున్న చాళుక్యభూపతి యానందపరవశుఁడై యిట్టి పౌరాణికాగ్రేసరుఁడు తన కులబ్రాహ్మణుఁడౌట తన పూర్వజన్మ కృతసుకృత విశేషమని భావించెను.

ఇంతలో కొందఱు వేగులవాండ్రు రాజరాజ దేవేంద్రుల సందర్శించిరి. రాజాజ్ఞపై వారు విమలాదిత్యుని సమ్ముఖముననే వజ్రామాత్యనారాయణభట్టుల ద్వంద్వ యుద్ధక్రమమును సవివరముగ వర్ణించిరి. వజ్రామాత్యుని పరాక్రమమునకు రాజరాజనరేంద్రుఁ డద్భుత మందెను. నన్నపార్య వజ్రామాత్యులను రత్నములను సేకరించిన తన యల్లుని యదృష్టమున కానందించెను. వజ్రామాత్యు నవికట్టగల్గిన నారాయణభట్టు పరాక్రమమునకు విమలాదిత్యుఁడు విస్మయ మందెను. అంతటి పండిత వీరుఁడు తమ శత్రువైన కుంతలాధిపతుల యాస్థానమునందుండుట విమలాదిత్యరాజేంద్రున కొకింత యసూయాజనక మాయెను. వెంటనే కతిపయ చోళసైన్యసమేతుఁడై విమలాదిత్యుఁడు వజ్రామాత్యునకు సాహాయ్యముగ యుద్ధభూమికి పయనించెను.

విశిష్టసభ్యమహాశయుల ప్రశంసలఁదనిసిన నన్నయభట్టారకుఁడు రాజభవనము ప్రవేశించునప్పటికి విమలాదిత్యుఁడు ప్రయాణమాయెను. రాజరాజ దేవులమూలమున విమలాదిత్యుని నిష్క్రమణ కారణమెఱింగి యాతఁడు తన సహాధ్యాయుఁడైన నారాయణభట్టు యుద్ధకౌశలమును పదేపది స్మరించి, విస్మయమనస్కుఁ డగుచుండెను. అంతలో రాజరాజదేవులు సకౌతుకముగా "నన్నయభట్టారకులవంటి పండితమాన్యుల యునికిచేతనే విమలాదిత్యుల కీర్తిలక్ష్మి చిఱుగజ్జియలతో నర్తించుచున్నదని యానందించుచున్నాము. కాని వజ్జియప్రెగ్గడవంటి బ్రాహ్మణమహావీరుని జీవిత విశేషములను మీ ముఖతః విననుత్సహించుచున్నాము" అని పలికెను.

నన్నయ : అంతకన్న నానందప్రదమగు కాలక్షేపమింకేమియునుండదు. మా వజ్జియప్రెగ్గడ పేరు స్మరించినపు డొడలు పులకించును. హృదయము

ప్రమోద సంపుల్లమగును. "ఇదం బ్రాహ్మ్యం, ఇదం క్షాత్ర" మనినట్లు రెండు కత్తుల నొకయొరలో పట్టించిన ధీశాలి యతఁడు. విమలాదిత్య నరేంద్రుల బహిఃప్రాణము. కదనరంగమునఁ గత్తిత్రిప్పు వేళలయందును, జపమాలఁ ద్రిప్పుట మానని నిరంతర జపహోమ తత్పరుఁడు. సకల వేదశాస్త్ర నిష్ణాతుఁడు. నిరంతర దాన నిరతుఁడు. బ్రాహ్మణవంశ భాస్కరుఁడు. సత్యవాక్పాలకుఁడు. సుస్థిరచిత్త సౌభాగ్యుఁడు. నీలకంఠ పదారవిందాశ్రయ ద్విరేఫము. త్రికరణ సంశుద్ధ సదాచార సంపద్విలసితుఁడు. ప్రభుభక్తి తత్పరుఁడు. అట్టి యీ యమాత్యశేఖరుని మామకప్రభువులు ఆందోళికాచ్ఛత్ర చామరదిశాల దిశాప కావి బహుసమ్మానము లాదరపూర్వకముగా నొసఁగి సత్కరించిరి.

రాజరాజదేవుఁడు : వజ్జియప్రెగ్గడ వృత్తాంతము శ్రవణానంద దాయకముగనున్నది. ఏ ధర్మము నుపాసించినగాని యందు పారము ముట్టిన పాండిత్య ప్రతిభ సాధించుట బ్రాహ్మణవంశమున గల సార్థక్యము. ఇట్టి గురుకులముచే మా కొలువుకూటములు ధన్యమగుచున్నవి. నన్నయభట్టారక, వజ్జియప్రెగ్గడల వంటి ధీరద్వయము తోపాటు నారాయణభట్టారకునివంటి కార్యఖడ్గ యోధాగ్రేసరుఁడు విమలాదిత్యు నాస్థాన మలంకరించిన ఉభయతారకముగా నుండును గదా!

నన్నయ : ప్రభువుల యూహ అత్యంత శుభప్రదమైనది. మా ప్రభువులు నారాయణభట్టారకున కట్టి గౌరవస్థానమొసంగుట కేమాత్రము వెనుదీయువారు కారు.

రాజ : నారాయణభట్టారకుని మీరెరుగుదురా?

నన్నయ : కేవలమెఱుగుటయేకాదు. మేమిరువురము సహాధ్యాయులము. మేమిరువురము కాశీ శంకరవిద్యాపీఠమున సంస్కృతము నధ్యయనము చేసితిమి. అతని యసాధారణ ధారణాశక్తి యమోఘమైనది. అతనిని చూచిన మాకందఱకు మిక్కిలి భయము. కండలుతిరిగి యినుపకడ్డీవలె నుండెడివాఁడు. ఎప్పుడైన పరిహాసోక్తులు పలికిన నలుకతోవచ్చి మాచేతులుపట్టి మెలివెట్టెడివాడు. సాయంసమయములలో నిత్యము గంగానదిలో గంటలతరబడి యీదులాడనిది యాతనికి తృప్తి యుండెడిదికాదు. విశ్వేశ్వరస్వామి గుడికేగి సగము ప్రసాదము నర్చకుల నదిరించి బెదిరించి మ్రింగెడివాడు. నేనన్న నాతనికి మిక్కిలి ప్రాణము. అందఱొకయెత్తు, నేనొక్కఁడను నొకయెత్తు. అందఱితో కొట్టవచ్చినట్టు మాట్లాడెడివాడు. నాతో శాంతముగ ప్రసంగించెడివాఁడు. నా శ్లోకములను గొనియాడుచుండెడివాఁడు. తానుగూడ నమిత ప్రయత్నమ్మునై శ్లోకముల వ్రాసెడివాఁడు. కాని కర్ణపేయముగ నుండవని యెవ్వరికిని వినిపించెడివాఁడుకాఁడు. ఒకానొక శబ్దస్వరూపమును నిర్ణయించుపట్ల, నతనికిగల సమయస్ఫూర్తి ప్రశంసనీయము. పాణినీయాది వ్యాకరణములను ప్రమాణీక

రించుటలోఁగల యాతని వ్యుత్పత్తి యద్వితీయము. స్నేహసంస్మరణానందాధీన మానసుఁడనై యీ దీర్ఘవృత్తాంతముతో విసువు పుట్టించుచున్నానేమోయని శంకించుచున్నాను.

రాజ : లేదు, లేదు. ఇరువురు ద్విజోత్తముల చరిత్ర వినుటచే నీనాఁడు మాకు విశేష పర్వదినముగనున్నది.

నన్నయ : నారాయణభట్టు వాసవవంశభవుఁడు. వాసవవంశమువారు జామదగ్ని సంప్రదాయమునందు వర్ధిల్లువారు. ఒకవంక నధ్యయన సంపన్నులు. మఱియొకవంక సాహసవిక్రమ ధురంధరులు. వారు దండనాథులై, సేనాపతులై, మంత్రులై, ప్రధానులై, కార్యఖడ్గములతో కుంతలేశ్వరులను గొలుచుచున్నారు. ఆహవమల్ల ఇమ్మడి తైలపదేవునికాలమున వా రాప్తమిత్రులై కుంతలరాజ్య సంస్థాపనమునకు, తద్రక్షణమునకు బాధ్యత వహించిరి.

నారాయణభట్టు పితామహుఁడు కంచెన సోమయాజి. అతడు పురోడాశ పవిత్రవక్త్రుఁడు. వినీతవిద్వాంసుఁడు. పూతమనస్కుఁడు. విష్ణుసన్నిభుఁడు. కంచెనార్యుఁడు కంచవయజ్వపుత్రుఁడు. శత్రుజీమూత సంఘాతమున కాతఁడు ప్రళయ ప్రభంజనము. కవీంద్ర కామధేనువు. సౌహార్ద విహారభూమి, బంధుజనహృదయ సరోజభానుఁడు. ఇతఁడు కర్ణాట చక్రేశ్వరున కమాత్యుఁడు, దండనాథుఁడునై యుండెను. కంచనార్యుని కుమారుఁడు అకలంక శంకనామాత్యుఁడు. ఇతఁడు శౌచాంజనేయ బిరుద సుప్రసిద్ధుఁడు. స్వకీయప్రజ్ఞా విజయ వాచస్పతి. ఈతని ధర్మపత్ని సామెకాంబ. ఆ పుణ్యదంపతుల కుద్భవించినవాఁడు మా నారాయణభట్టు. అతఁ డసుష్ఠిత జగ దుపకరణుఁడు. సంస్కృత కర్ణాట ప్రాకృత పైశాచి కాంధ్రభాషా కవితావిశారదుఁడు. 'కవి శేఖర' బిరుదాంకితుఁడు.

అనుచుండగనే యిరువురు సైనికులనుజ్ఞవడసి రాజరాజదేవులను సందర్శించిరి. నారాయణభట్టు పజ్జియప్రెగ్గడచే పట్టువడి రాజమహేంద్రవరమునకు గొంపోబడియెననియు; కుంతలాధిపతి విమలాదిత్య భూపాలురచే విజితుఁడై భోజరాజునకును, వేంగిప్రభువులకును సమానముగాఁ గప్పము చెల్లించుట కిష్టపడియెననియు వారెఱింగించిరి.

నారాయణభట్టు పట్టువడిన వార్తకు నన్నపార్యుని హృదయమొకింత తొట్రుపడెను. అతని కేమైన పరాభవము జరిగిన దాని నాతఁడు సహించఁడు. సరిగదా, యాతఁడు పగగొన్నచో త్రాచుపాము. ఈ యాలోచనతో నన్నయ మోమొకింత మ్లానమైనది. "నారాయణభట్టు ఖిన్నుడై యున్నాఁడా !" యని ప్రశ్నించెను. "లేదుస్వామీ ! లేదు. విమలాదిత్యప్రభువరేణ్యుల యాదరము నారాయణభట్టులవారికి స్వస్వామి యాదరముకంటె నెక్కువ సంతృప్తికరముగ నున్నట్లున్నది. బంధీకృతుఁడైన నారాయణభట్టులవారిని ప్రభువుల విముక్తి

గావించి, చందనతాంబూలాదులతో సత్కరించి గౌరవపురస్సరముగ రాజమహేంద్రవరమునకు రమ్మని యాహ్వానించిరి. ప్రభువులవారికోర్కె వినుటవాలముగనే వారి మనఃప్రవృత్తి యున్నట్లు వినికిడి.

నన్నయ: ఈనాఁడు నిజముగ శుభదినము. నా సహాధ్యాయుఁడు నా సింహాసనము నధిష్ఠింపఁగలఁడు.

రాజరాజ: అవును మీకేగా దాశుభదినము. అఖిల వేంగీభువనమునకును నిది యపూర్వ పర్వదినము. నన్నయనారాయణభట్టులవంటి మహాపురుషద్వయ సమావేశము నరనారాయణుల సమ్మేళనమే. మాకీవిషయమున మాయిల్లునిపైన నసూయకూడ కల్గుచున్నది.

నన్నయ: ఇదియంతయు మీ ఆశీఃప్రభావము. మా ప్రభువులు రాజమహేంద్రవరమును సమీపించుచుండి యుందురు. మాకు ప్రయాణ ముహూర్తము నిశ్చయము చేయింపుఁడు.

కుందవాంబకు ప్రయాణము చేయగల యారోగ్యము లేదు. అందుచే మఱునాఁడు ప్రాతఃకాల సముహూర్తమున నన్నయభట్టారకుల ప్రయాణ మేర్పఱుపఁబడినది. ఆ రాత్రియంతయుఁ బట్టరాని యానందోత్సాహములచే నన్నపార్యునకు కునుకు పట్టలేదు. తమిళ కవులు, పండితులు తమ రచనలనేకాక, వివిధ కావ్య సంపుటముల బహూకరించిరి. తమిళ వాఙ్మయ సరస్వతి యాతని హృదయసీమను నర్తించినది. పరభాషా ప్రభావమునకుఁ దలయొగ్గని తమిళ సారస్వత సహజ సౌందర్య సంపద యాతనిని తీవ్రాలోచనా నిమగ్నుని గావించినది. తమిళ సాహిత్యము, తమిళ జాతీయజీవన ప్రతిబింబము. భారతదేశ భాషలలో ప్రాచీనతమమగు సారస్వతముగల దేశభాష తమిళము. ఇందు స్వతంత్రమగు కావ్యప్రణాళిక గలదు. లభ్యమగుచున్న తమిళ వాఙ్మయమున తొలిగ్రంథము 'తొలికాప్పియము'. ఇది విశేషముగా వ్యాకరణము. ఇది సంస్కృత సంప్రదాయానుసారము రచింపఁబడినట్లు దాని విభజన ప్రణాళికనుబట్టి ద్యోతమగును. అయినను నందు సంస్కృత సాంకేతికపద మొక్కటియును లేదు. అట్టి యవసరముకూడ వారికి లేదు. కారణము సంస్కృత పదములు, బహు స్వల్ప సంఖ్యయే తమిళముద్రతో నా భాషలోఁ జేరినవి. తెనుఁగుభాషలో నప్పటికే బహుళముగ సంస్కృత పదములు ప్రవేశించినవి. దీర్ఘసమాసములు చేరుచున్నవి. తెనుఁగు భాషాస్రవంతి సంస్కృతమయ మగుచున్నది. దీనినంతయు గుర్తించినాఁడు నన్నయ. గాసటబీసటగానున్న యీ భాషను సంస్కరించి దానికి వైజ్ఞానికస్థాయిని కలిగించవలయునను సంకల్పము నన్నయ మానసమ్మున దృఢము కాజొచ్చెను. తానింతకాలము నిర్వహింపని ఏదో మహత్తర కృషికి నాందీప్రస్తావన గావింపగల తరుణ మాసన్నమైనట్లాతని మానస మానంద తరంగిత మగుచున్నది. తన కాలమున సుప్రసిద్ధములైన పండిత సభలవంటి

సభలు తమిళదేశమున నతి ప్రాచీనకాలమునుండియు నుండుట నన్నయభట్టారకు నకుఁ బ్రమోద మొనగూర్చినది. ఒక్కొక్క సంఘములో వందలాది కవు లుండిరి. ఇట్టి సంఘములు మూఁడు పూర్వమున వర్ధిల్లినట్లును, అనేక కావ్యములీ 'సంగకవులు' రచించినట్లును గల యాధారములు చూచి నన్నయ విస్మయ మందెను. అందు తృతీయ సంఘమునకుఁ జెందిన 'పత్తుప్పాటు' అను సంకలన కావ్యము నన్నయ్యను బాగుగ నాకర్షించినది. 'పత్తుప్పాటు' అనగా పది గుత్తులుగా గూర్పఁబడిన పాటలు. ఈ కావ్య మాకాలమునందలి ప్రభువుల పరిపాలనమును, ప్రజల యాచార వ్యవహారములను, కవిపుంగవుల భావనా విరాసములను, యువతీయువకుల ప్రేమాతిశయములను స్పష్టపఱచుచున్న తెలిఁగి నన్నయ ఆహ్లాద మనస్కుఁడాయెను. అనేక దైనందిన విషయములు రమణీయ కవితా కల్పనలందు ధ్వనించుచుండుట 'పత్తుప్పాటు' కావ్యవిశేషము.

ఎప్పటికైన ప్రజాభిమానమే విజయమును బడయునని నన్నయ విశ్వాసము. అట్టి మహోదయాగమునకు నారాయణభట్టు వేంగీ సంస్థాన ప్రవేశ మరుణోదయము కాగలదని నన్నయభట్టు ప్రత్యయము.

ఇవికాక 'తిరుక్కురళు', 'శిలప్పదిగారము', 'మణిమేగలై', 'జీవక చింతామణి' మున్నగు కావ్యముల ప్రాశస్త్యమునుగూడ నన్నయభట్టారకు తెలిఁగి తమిళ సారస్వత లక్ష్మికి భక్తిపురస్సరముగ నమస్కరించెను. ఇందుచే తన దక్షిణ దేశాగమనము ధన్యమైనట్లు సంతృప్తి గాంచెను. తన తెనుఁగున కట్టి సారస్వత సంపద లేనందులకు నన్నయ విచారించెను. తెనుఁగు భాష ఇంకను బూర్తిగా ప్రభువుల యాదరాభిమానముల నందుకొనలేదు. పండితులకు దేవభాషావ్యామోహము సన్నగిలలేదు. ఇట్లనేకాలోచనా పరంపరలతో నన్నయ ప్రయాణము సాగిపోవుచుండెను. అన్నింటికన్న మిన్నగా నన్నయ నాకర్షించినది 'పెరుందేవనార్' విరచితమగు తమిళ భారతము: దానిపట్ల ప్రభువులకు, ప్రజానీకమునకుఁగల గాఢానురక్తి.

౪

రాజమహేంద్రపట్టణ మంతయు రమణీయాలంకార శోభతో విరాజిల్లు చున్నది. అంతఃపురమునం దుత్సాహ సంరంభము సముల్లసితమైనది. ఒక మహాపర్వదినమునందువలె ప్రజలందఱియందు నెన్నడును గానరాని యానం దాతిశయము స్పష్టపడుచున్నది. ఎక్కడ బట్టినను నారాయణ భట్టారకుని ప్రశంసయే. "అతడు మహామేధావియఁట! నన్నయభట్టారకుని సహాధ్యాయుఁ డఁట!! ప్రభువులవాని కోర్కెను మన్నించి యాస్థానకవి పీఠము నలంకరించు చున్నాఁడఁట!" అను వాక్యములు కొందఱ ముఖముల ముఖరితమగుచుండెను. "వజ్జియ ప్రెగ్గడను బ్రతిఘటించిన వీరుఁడు. కుంతలాధీశుని దండనాథుఁడు.

సంస్కృత కర్ణాట పైశాచికాంధ్రభాషా కవిరాజశేఖర ప్రథిత బిరుదాంచితుఁడు. రాజమహేంద్రవర సుకృత విశేషముచే వేంగీ సంస్థానమును శోభింపఁ జేయు చున్నాఁడ"ని మఱికొందఱు మనసార ప్రసంగించుకొనుచుండిరి.

నన్నయభట్టు దక్షిణదేశమునుండి రాజమహేంద్రవరిమునకు నడుగు పెట్టగనే నూత్నవిజయశోభితుఁడగు విమలాదిత్యునికన్న చిరకాలమిత్రుఁడగు నారాయణభట్టునే ముందు సందర్శింప నేగెను. నారాయణభట్టు ప్రత్యేక రాజ మందిరమున నుత్సవ సన్నద్ధుఁడై నన్నయభట్టారకుని ఆగమన నిరీక్షతో నిర్నిమేషుఁడై యుండెను. నన్నయ లేకుండ తనకు జరుగు గౌరవమొక గౌరవము కాదని యాతని యాలోచన. నన్నయ సరసన తానొక స్థానము నధిష్ఠించుట నారాయణభట్టు చిరకాలవాంఛితము. నన్నయ శుంభన్మూర్తి యాతనిని చిన్నతనమునుండియు నాకర్షించినది. "అగ్నివలె పరమపావనుఁ డతఁడు. యజ్ఞమూర్తివలె జగద్ధితుఁడాతఁడు. వాగ్దేవతా చరిత చిత్రిత చిత్త సద్మఁడతఁడు. అతని మాటలు మంత్రములవలె నాబాలగోపాలము నానంద పఱచును. ఎన్నాళ్లైన దామూర్తిని చూచి ! ఇప్పుడేమైన యొకింత 'ఒళ్ళు' చేసెనేమొ ! అతనిని మెత్తగా కౌగలించుకొనవలయును." అని యేమిదేమియో తలపోయుచున్నాఁడు నారాయణభట్టు. అంతలో నన్నయభట్టారకాగమనవార్త వినిపించినది. ప్రత్యుత్థాన మొనర్చుటకై లేచి రెండడుగులువేయగనే నన్నయ, మందిరములోనికి ప్రవేశించి నారాయణభట్టున కంజలిచ్చెను. నారాయణభట్టు కౌగలించుకొనెను. ఆనందబాష్ప పులకితగాత్రుఁడై "ఎన్నాళ్లకు సందర్శించితి నోయీ !"యని యాప్యాయముగా భాషించినాఁడు నారాయణభట్టు. "దావిగారి సందర్శన భాగ్యమున మాకనంత శుభము లొనగూడ గలవని భావించు చున్నాన"ని నన్నయ వినయముతో బదులుపల్కెను. ప్రక్కనున్న పట్టియ ప్రెగ్గడ "ఇది నరనారాయణుల సమావేశముగా నున్న"దనెను. "అయిన కురుక్షేత్ర సంగ్రామ మేదైన యూహించుచున్నారా !" యని నారాయణభట్టు సోత్సాహముగ ననెను.

పట్టి : ధర్మ సంస్థాపనమునకట్టి విప్లవములు వాంఛనీయములేగదా !

నన్నయ : పట్టియప్రెగ్గడవారి వచనము లమోఘములు. ఆంధ్రావనినట్టి ధర్మ విప్లవ మెంతైన యవసరము. అందులకు చక్రము త్రిప్పవలసిన భార మంతయు మా నారాయణభట్టులపై నున్నది.

ఇంతలో విమలాదిత్య ప్రభువులు, భీమనభట్టు, పాతులూరి మల్లన మున్నగు కవి పండిత బృందముతో నారాయణభట్టుల నుత్సవమునకు గొంపోవుటకై వచ్చిరి. ప్రభువులు నన్నయ్య నారాయణభట్టుల కిరువురకును అభివందించిరి.

నన్నయ : ప్రభువులవారి విజయమునకు మా అభినందనములు.

విమ : ఇది ప్రభువుల విజయమనుటకన్న భట్టారకుల విజయమే. మీ వలన వ్యాపించిన కీర్తి సౌరభముచే మా యాస్థాన మిట్టి పురుషుల నాకర్షించుచున్నది.

నన్నయ : ప్రభువుల వినయ సౌశీల్యమట్టిది. యుద్ధముజేసి రాజ్యముల విస్తరింపఁజేసిన ప్రభువులు, ధనాగారములను నింపిన రాజన్యులు చరిత్రలో దండిగా వినవత్తురుగాని మానారాయణభట్టారకునివంటి పెన్నిధిని సంపాదించిన నృపాలుర నేనెందును చూడలేదు.

విమ : నా రాకీర్తి గడించి యిచ్చిన భట్టారక ద్వయమునకు నా వందన శతము.

వజ్జియ : ఉత్సవ సమయ మతిక్రమించుచున్నది. తద్దర్శనకుతుకాగత జనసినాదము లిక్కడికికూడ వినవచ్చుచున్నవి.

అంతట నందఱును నుత్థితులై చని చిత్ర విచిత్రాలంకృత రథమునందు తమతమ కుచితమైన యాసనముల నధిష్ఠించిరి. నారాయణభట్టునకు కుడివైపున నన్నయభట్టారకులు, ఎడమప్రక్కన విమలాదిత్యులు, విమలాదిత్యుల దక్షిణ పార్శ్వమున వజ్జియ ప్రెగ్గడయు నుండిరి. పురప్రముఖులు, జానపదప్రముఖులు నారాయణభట్టులను బూలమాలాలంకృతులనుజేసి నమస్కరించిరి. అందఱి ముఖ్యులకు వజ్జియ ప్రెగ్గడ నూతనాతిథిని పరిచయముగావించెను.

రాజమహేంద్రపుర రాజవీథులలో రథము మందగమనమున నడచినది. రథమునకు ముందుగా శోభాయ మానములగు భద్రగజములు రెండు అభిగమించినవి. కర్ణాటక రాజ్యవిజయ సంప్రాప్తుఁడగు నొక సాహితీ సమర యోధుని సందర్శించుట కిశేషప్రజానీక మకుంఠితానందముతో నరుదెంచినది. ఆంధ్రప్రజల యుత్సాహతరంగములు చెలియలికట్టలేని సాగరమువలె పొంగులు వాఱినవి. అదిచూచిన నారాయణభట్టుగ విస్మృతాశ్చర్యానందములు ముప్పిరి గొన్నవి. "కల్లకపట మెఱుగని జాతి. విశాలహృదయసంపత్తి. సునిశిత మేధాసంపత్తులతో సమ్మిళితమైన యీజాతి నాపట్లచూపుచున్న యీయవ్యాజాను రాగమునకుఁ దగురీతి కృతజ్ఞత చూపుటెట్లు ?" అను ప్రశ్న నారాయణభట్టు మనోవీథిని మసలినది. నేత్రము లానందబాష్ప ప్రపూరితములైనవి.

నారాయణభట్టారకుని శుభాగమనముచే నన్నయభట్టారకున కందల మెక్కినట్లున్నది. నిష్కల్మష హృదయుఁడు, వివిధ భాషా నిష్ణాతుఁడునైన నారాయణభట్టుల యునికి, నిరంతర నివృత్తి మార్గ నిరతుఁడగు తన్నెదో యొక విధమైన ప్రవృత్తి మార్గములో పెట్టకలదను విశ్వాసము నన్నపార్యుని ముఖమునఁ గనుపట్టుచున్నది. పట్టణము ప్రముఖ వీథులలో రథమూరేగినది. ఏవైపు చూచినను ప్రజ లినుకవేసిన రాలకుండు నట్లుండిరి. పౌరులనేకులు

మధ్యమధ్య రథాలంకృతులకు హారతులిచ్చుచు పుష్పమాలాలంకృతులఁను గావించి సత్కరించిరి.

ఊరేగింపు పూర్తియైనది. రాజభవన మప్పటికే చిత్రవర్ణకమ్మిళితమై దివ్యశోభల వెలార్చుచున్నది. అందఱును తమతమ స్థానముల నలంకరించిరి. నృపాలుఁడులేచి గంభీరముగ నిట్లు చదివెను. "వానసవంశ పవిత్రులు, హారీత గోత్రజులు, ఆపస్తంభద్విజోత్తములు, వినీతులు, పురోడాశ పవిత్రవక్త్రులును, విద్వాంసులునగు శ్రీ కంచెన సోమయాజిగారి మనుమలును, కవీంద్ర కామధేనువును పరమసహృదులు మహాత్ములు శౌచాంజనేయ బిరుదవిదితులు ప్రజ్ఞాజిత వాచస్పతులు అకళంకులునైన శంకనామాత్యుని పుత్రులు శ్రీ నారాయణభట్టారకులు అనుష్ఠిత జగదుపకరణులుగను, సంస్కృత కర్ణాట ప్రాకృత పైశాచికాంధ్రభాషా కవిరాజశేఖర, కవీభ వజ్రాంకుశ బిరుద విభ్రాజమానులుగను విశ్రుత కీర్తి గడించియున్నారు. అట్టివారు నేఁటినుండి మన వేంగి సంస్థాన కవిపుంగవులుగా మా ప్రార్థనపై నంగీకరించుట మన సుకృతముగా భావించుచున్నాము."

ఈ వాక్యములకు సభ్యుల కరతాళధ్వను లాకాశవీథులఁ బ్రతిధ్వనించినవి. అంత వజ్జియప్రగ్గడ లేచి "చాళుక్యవంశ కులబ్రాహ్మణులగు శ్రీ నన్నయ భట్టారకులు, శ్రీ నారాయణ భట్టారకులు సహాధ్యాయులు. కావున శ్రీ నారాయణ భట్టారకులను సభాసదులకుఁ బరిచయము గావింపవలసినదిగా శ్రీ నన్నయ భట్టారకులను సభా పక్షమునఁ బ్రార్థించుచున్నాన"ని పల్కెను. తిరిగి కరతాళ ధ్వనులు మిన్నంటినవి. వినయ సౌజన్య విలసితుఁడగు నన్నయ భట్టారకుఁడు ప్రభువులకు సభ్యులకు నభివాదములు సలిపి "నేఁడు నాకు పరమ పవిత్రదినము. నేనును, నారాయణ భట్టారకులును సహాధ్యాయులము. కాశీ విద్యాపీఠమున మే మధ్యయనము సలిపితిమి. ఆసాధారణ మేధావి మా నారాయణభట్టు. వానిని చూచిన మాకు సింహస్వప్నముగ నుండెడిది. సర్వతంత్ర స్వతంత్రుఁడు. ఆతని పల్కు దారుణాఖండల శస్త్రతుల్యము. హృదయము నవ్యనవనీతము. అనఁగా నీతఁడు నిజమైన బ్రాహ్మణుఁడు. ఈయన కవితా ప్రాభవమును గూర్చియు, వంశానుగత గుణగణ విశిష్టతలనుగూర్చియు ప్రభువులవారు సెల విచ్చి యున్నారు. మేరుధీరుఁడైన మా సహాధ్యాయుఁడు, ఇతఃపూర్వము కుంతల ప్రభువుల దండనాథుఁడు. వాని ధీశక్తి వాని భుజబలమును తలదన్నునది. భుజబలము రాజేంద్రులను బరిరక్షించును. ధీకుశలత సమస్త ప్రపంచము నభ్యుదయ పథమున నడిపించును. ఆ శుభముహూర్తమునకు మనమందఱము నిరీక్షింతము" అని క్లుప్తముగ నుపన్యసించెను.

నన్నయభట్టారకుల రమణీయ పదవిన్యాస తరంగములు సభ్యులను ముగ్ధులను గావించినవి. అవి కేవల మొకవ్యక్తినిగూర్చిన పరిచయవాక్యములు

గావు. అంతేదో ఆంధ్రజాతికి శుభోదర్కమైన యాకాంక్ష తొణికిసలాడినట్లని పించినది.

వేదప్రవచన పూర్వకముగా నారాయణభట్టునకు చందనతాంబూలాదులు సమర్పింపఁబడినవి. నూత్న పరిధాన పారితోషిక పూర్వకముగ సన్మానము జరిగినది. ఈ యఖండ గౌరవమునకు నారాయణభట్టు సంక్షిప్తముగ కృతజ్ఞత వెలిబుచ్చెను. సభ ముగిసినది. ఇంతలో భోజమహారాజు పంపిన నూటపదహారు భద్రగజములు కనులకు కళ్యాణ మొనగూర్చుచు కోటలోనికిఁ జేరినవి. ఇవిగాక అశేషభూషణములు విమలాదిత్యున కుపాయనముగ భోజుఁ డంపెను. అందలి నాయకరత్నము నానందముతో చాళుక్యేశ్వరుఁడు ప్రజ్ఞామాత్యుని గళసీమ నలంకరించెను. కరతాళ ధ్వనులు మిన్నుముట్టినవి. ప్రజ్ఞామాత్యుఁడు వందన పురస్సరముగా దానిని స్వీకరించెను. ఆనాఁటి సభను కుందవాంబ సందర్శించ లేదు. అది నన్నయభట్టారకుల కొకింత కష్టమనిపించినది. మేదాంబ యది తన యదృష్టమని భావించినది. ప్రభువులవారి మానస మతిగభీరము. కావున నీ విషయమున వారి భావన మెట్లున్నది తెలియదు. సభానంతరము విమలాదిత్యుఁడు మేదాంబను సందర్శించెను. మేదాంబ సభను దాను సంపూర్ణముగ తిలకించి యానందించినట్లు నటించినది. నన్నయ భట్టారకుని బలము పెరుగుటామె కిష్టము లేదు. నన్నయభట్టునకు కుందవాంబపట్ల గౌరవము విశేషము. మేదాంబ యందు పట్టమహిషి గౌరవము మాత్రమే. అది రాజకీయము. కుందవాంబపట్ల గల గౌరవాభిమానములు రాజకీయాతీతములు. అవి ఆంతరంగికములు.

౩

అది సాయంతన సమయము. దక్షారామ క్షేత్రమునకు రెండామడ దూరము. వేములవాడ యను గ్రామము. ఆ గ్రామమునందు నేరేడు తోఁపులో బాలురందఱును గలసి కోతికొమ్మంచి యాడుకొనుచున్నారు. అందఱు బాలు రెప్పుడో యొకప్పుడు దొంగ లైరిగాని యొక్కఁడు మాత్ర మెంత యెంతగఁ ప్రయత్నించినను దొంగ కాలేదు. అతనివలె క్షణములో చెట్టుకొనకొమ్మల నెగఁబ్రాకగలవాఁడా మందిలో లేఁడు. అతఁడన్న వారందఱకు నొకవిధమైన యసూయ. ఆ యసూయ యర్థరహితమైనది. అయినను ప్రతిసంఘమున నది యనివార్యము. అతఁడు సంఘ బహిష్కృతయగు నొక యనాథ పుత్త్రుఁడు. ఆ పసిగందున కీ కృత్రిమ సాంఘిక నియమములు తెలియవు. తల్లి యెంత వారించినను నతఁడు వినఁడు. అతనిలోఁ బెల్లుబుకుఁ బ్రతిభ యాతనిని ముందుకుఁ ద్రోయును. ఎచట పదిమంది బాలురుచేరిన అచట తా నుండవలయును. తల్లిని మఱపించి నిమేషములో నాతఁడు బాలుర మూకలోఁ జేరును. బాలురాతని నసహ్యించుకొందురు. ఆ యేవగింపాతని కర్థముకాదు. తన్ను తమ జట్టులోనికి

జేర్చుకొనుమని యాతఁడు బ్రతిమాలును; ప్రాధేయపడును; భంగపడును. అందెవడో జాలిగుండె కలవాఁడు వానిని తమలోనికిఁ జేర్చుకొనును. అతఁడు లేనిది యా యాట రక్తికి, రంగమునకు రాదు. ఇట్లెన్నో దినములు గడచినవి.

ఆనాటి సాయంకాలమా బాలకుల దుండగము ప్రతిఫలించి రాగమునఁ బడినది. కసితీర్చుకొనలేక మసిపూసికొనినట్లైనది వారి పరిపాటి. ఆ యాటలో నోడిపోయిరి. ఇంక నా బాలుని పరాభవింపవలయునని వారందఱు నిశ్చయించుకొనిరి. ఆతని కులగోత్రముల నెత్తి, "ఓరి ముండకొడుకా! నీకెంత దౌర్జన్యమురా!! అందఱను నాటలలో మోసముచేసి నాదే పైచేయి యని కులుకుచున్నావా!" యని యొక బాలనాయకుఁ డతనిని నిందించెను. బాలుని వేడిరక్తము ముదుకెక్కినది. "ఇందు నేచేసిన దౌర్జన్యమేమియు లేదు. మీరోడిపోయి నన్ను నిందించుచున్నారు. నేను ముండకొడుకునైననేమి? రండకొడుకునైననేమి? చాతైన ఆటలాడుడు!" అని యాతడు గద్దించెను. "సిగ్గులేని రండకొడుకుతో నాటలుకూడనా!" యని యందఱు నాతని నటునెట్టి "యితనితో నిఁక యాటలాడరాద"ని జట్టుకట్టి "ముండకొడకా! రండకొడకా!!" యని మిన్నుముట్టునట్లు కేకలువేయుచు నిండ్లకుఁ బోయిరి.

ఆ బాలుని యాపాదమస్తకము దహించినట్లైనది. పరాభవ దందహ్యమాన మనస్కుఁడగుచు నా బాలుఁ డొక్కపెట్టున నింటికి పరుగిడి, "అమ్మా! నా తండ్రి భీమేశ్వరుఁడని పల్కితివే? నన్నందఱును ముండకొడుకని, రండకొడుకని గేలిచేయుచున్నారు. నే నీ యవమానము భరించలేను. నా తండ్రి నిజముగా భీమేశ్వరుడేనా?" యని సూటిగా తల్లిగుండెలు పగులునట్లు ప్రశ్నించెను.

తల్లి ; అవును నాయనా! అవును!!

కుమా : అయిన నే నిదే దక్షారామమునకు బోయి నా తండ్రితో నా పరాభవ గాథను తెల్పుదును. నా తండ్రిని కౌగలించుకొందును.

తల్లి సమాధానమునకు నిరీక్షింపకయే యా డింభకుఁ డొక్కపరుగున భీమేశ్వరాలయమును జేరెను. చీఁకటులు గాఢముగా నలముకొన్నవి. కన్ను పొడుచుకొన్నను మార్గము గోచరించుటలేదు. తీవ్ర పరాభవ వేదనాకులుఁడగు ఆ బాలునకీ చీఁకటి విచారము పట్టలేదు. కాళ్లు కందెలు కట్టినవి. కాని యాతని పట్టు సడలలేదు. మొద్దువారిన శరీరము నతికష్టముపై ఎట్టులో భీమేశ్వరాలయ ప్రాంగణమునకుఁ జేర్చినాఁడు. పూజారి యప్పటికి దేవాలయము మూసి యిల్లు జేరెను. తన తండ్రి దర్శనము కానందులకు, తన శ్రమ ఫలించనందులకు నిరాశనిస్పృహ లలముకొన్న మనస్సుతో నదేపనిగా రోదసి ప్రతిధ్వనించునట్లు విలపించినాఁడా కుమారుఁడు. "తండ్రీ! భీమేశ్వరా! నన్ను లోకము పరాభవానలమునఁ గాల్చుచున్నది. నేనీ లోకమున నిల్వలేను. మా యమ్మ

యూరికి వెలిగా నొంటరిగా కాపురము చేయుచున్నది. ఆమెను బలకరించువారు లేరు. సరిగదా, అందఱును నీసడించువారలే! నీచ శునకమునైన యవసరము పట్ల లోకము పిల్చి యాహార మిడుచున్నది. కాని మా యమ్మను బిలచి మాటాడు వారు లేరు. విద్యాకేళీరంగములలో బాలురెప్పుడును నన్ను 'ముండకొడుకా!' యని దూషింతురు. మా అమ్మమాత్రము 'నాయనా! నీవు కరుణామయుఁడగు భీమేశ్వరస్వామి పుత్రుడవురా!' అని తెలుపుచుండును. ఆమె మాటలలోని యదార్థము నాకు తెలియదు. వాని సత్యాసత్యములను నీ సమక్షమునఁ దేల్చు కొనవలయునని పరువులెత్తితిని. కవాటములు బంధించి యున్నవి. కడకు నీ సందర్శన భాగ్యముకూడ నాకుఁ గలుగలేదుకదా!" యని భావావేశ ముప్పొంగ నా యర్భకుఁడు పరిదేవనము గావించి, కడకు స్పృహదప్పి నేలవ్రాలెను.

పంచెచీఁకటిలోఁదన ముద్దుబిడ్డఁడు మూర్ఛించి దక్షారామమునకు పరువెత్తుటగాంచి, వెఱ్ఱిలెత్తినమనస్సుతోఁ దల్లి బిడ్డను వెంబడించినది. ఆ యంధకారావృతమైన జగత్తులో నామెకు దారిచూపుచున్న జ్యోతి పుత్రగమనమే. గ్రుడ్డిగా నామె యాదారి నమిత కష్టముగా గమించుచున్నది. బాలునితోఁ బరుగిడ లేకపోయినది. ఆవేదనాకులమైన మనస్సు ముందు పరుగిడుచున్నది. సౌందర్య సౌకుమార్య విలసితమగు నామెదేహమట్టి పరిశ్రమకు తగదు. సగముదూర మతికష్టముమీఁద పయనించినది. కాళ్లు కండెలు కట్టినవి. పాదములు కంటక సూచీ విచ్ఛేదములై, విచ్చిన దాడిమీఫలములను దలపించుచున్నవి. ఆ యనాథను బ్రకృతిమాతకూడ కరుణించునట్లులేదు. దక్షారామ దేవాలయగోపురపు చిఱుగంటలు పారావత సంచాలనముచే సంచలించి వినిపించునంత మేరకు నామె నెమ్మదిగా నడచివచ్చినది. అంతలో హఠాత్తుగా "నాయనా! భీమేశ్వరా!" యను విలాపము భయానకముగ వినిపించినది. ఆ యనాథ యువతి నేలకొరిగి నది. ఆ పరిసరములందు గుడారములు వేసికొనియున్న కొందఱు హడావుడిగా నా యాక్రందన జనిస్థానమునుజేరిరి. ఆ యలజడికి విషధరమొకటి జరజర ప్రాకిపోవుచున్నది. వెంటనే యందొక శ్వేతాంబరధారి వస్త్రము చించి పచ్చని చెట్టునకుఁగట్టి యామెను కఱ్ఱపుల్లతో తట్టిలేపెను. ఆ దీనురాలు నిద్రనుండి మేల్కాంచినదానివలె లేచి "నాయనా! నీ తండ్రి నీతో మాట్లాడినాడా? నేనే నీ తండ్రినని చెప్పినాడా? లేక యీ కసాయి సంఘము తనకుఁ బరిచర్యలు సలుప దేమోయను భీతితో బొంకినాఁడా?" యని పరిపరి విధములఁ బ్రశ్నింప సాగెను. వా రామె నోదార్చిరి. శీతల కమండలూదకముల నొసఁగిరి. ఆమెకు కొంత ప్రపంచము తెలిసినది. "స్వామీ! మీరెవ్వరు? ఇటకేల వచ్చితిరి? నన్నేల యవరోధించితిరి? నాబిడ్డ యెట్లున్నాఁడో?" యని వారలను వదిలించు కొని పోవన్నుంకించినది. "తల్లీ!! నీకేమియును భయములేదు. నీబిడ్డ నిన్నుఁ జేరును. నీ వృత్తాంతమును మాకొకింత విశదపఱుపుము" అని యందొక

జ్ఞానమూర్తి, శ్వేతాంబరధారి, పల్కెను. శీతలోపచారములను మించిన ఆ ప్రశాంతమూర్తి యామె హృదయమునకు కొంత యుపశాంతి గల్గించెను. తన్నింతవఱకంతమాత్ర మాప్యాయముగ నీ లోకమున బ్రశ్నించినవారులేరు. తన విషాదగాథ నావ్యక్తికి సంక్షిప్తముగఁ దెలుపుకొనవలయునను నాశపొడమినదా యనాథయువతికి.

"స్వామీ! మాది యీ సమీపముననున్న వేములవాఁడ గ్రామము. మాతండ్రి సోమనయను పండితుఁడు. నేనాతని యేకైకపుత్రిని. పేరు శాంతమ్మ. అష్టవర్షప్రాయముననే నా వివాహము జరిగినది. వివాహానంతరము మా జనని పరమపదించినది. దశవర్షములు నిండీనిండకపూర్వమే నేననాథనైతిని. మా తండ్రియే నాకు గురుత్వమును వహించి సంస్కృతమునఁ బంచకావ్యములు బోధించెను. చక్కని సాహిత్యజ్ఞానమును బ్రసాదించెను. నిరంతర సాహిత్యోపాసనముచే, నేను నా కాలమును గడుపుకొనుచుంటిని. ఇట్లు చాలవత్సరములు గడచినవి.

ఒకనాఁడు దక్షారామ భీమేశ్వరాలయమున కుత్సవసందర్భమున ఇరుగుపొరుగువారితో నేగితిని. అందఱితోపాటు నేనును స్వామికి నమస్కరించితిని. అందొక యువతి "స్వామీ! నాకొక చక్కని పుత్రరత్నమును బ్రసాదింపుమ"ని ముద్దుగఁ బ్రార్థించినది. అప్పుడు నాలోని మాతృత్వము పెల్లుబికినది. ఒడలు పులకించినది. నన్ను నేను మఱచితిని. ఇఁక నుచితానుచిత పరిజ్ఞానమేముండును? "తండ్రీ! యీ దిక్కులేని దానికిగూడ నొకమగశిశువును ప్రసాదింపుము. దానికి నీపేరు పెట్టుకొని యల్లారుముద్దుగాఁ బెంచుకొందునని" నేనును స్వామిని ప్రార్థించితిని. స్వామి నా ప్రార్థన నాలించినాఁడు. నేను గర్భవతినైతిని. చాలకాల మీవిషయము దాచియుంచితిని. దినదినప్రవర్ధమానమగు నా గర్భమే యా వృత్తాంతమును బహిర్గత మొనరించినది. లోకమంతయు కోడియైకూసినది. నన్నును వార్ధకపీడితుండగు నా తండ్రిని సంఘము వెలివేసినది. నా శీలమును శంకించినది. చేయునదిలేక మేము వేములవాఁడలో నొకమూల, నొకరితో సంబంధములేక, లోకుల 'ఛీ, ఛీ'లు 'ఛా, ఛా'లు నోడిదాల్చుచు, దినమొక యుగముగా కాలమును గడుపుకొనుచుంటిమి. దైవకృపచే మగశిశు వుద్భవించినాఁడు. భీమేశ్వరస్వామియే యుద్భవించినాఁడు. ముమ్మూర్తుల నా స్వామియే. కంటికి ఱెప్పవలె వానిని గాపాడితిని. మేఘసందేశ కావ్యగత మందాక్రాంత వృత్తముల నాలపించినగాని నా చిట్టితండ్రి నిదురపోయెడివాఁడుకాఁడు. రామాయణకథఁ జెప్పుచున్నఁగాని బువ్వనోటఁబెట్టనిచ్చువాఁడు కాఁడు. భారతేతిహాసమును వినుట మొదలుపెట్టినపు డాతఁ డాటలుకూడ మానెడివాఁడు. కర్ణుఁడన్న నాతని కెక్కుడలేని యభిమానము. కర్ణుని కరుణా కవితగాథ పదేపది చెప్పుమని బాధించును. ఆటకాయితనమెక్కువై యాతనిని

బట్టశక్యము గాకుండెడిది. చుట్టుప్రక్కల పిల్లలతో నాడుకొనుటకు వెళ్లెడివాఁడు. వారీతనిని మ్లేచ్ఛునికన్న హీనముగాఁ జూచెడివారు. నిత్యము నిద్రకుఁబోవునపుడు తన్నెవ రేయే మాటలాడి యెట్లు పరాభవించినది పూసగ్రుచ్చినట్లు చెప్పెడివాఁడు. రాత్రివేళల నవియే కలవరించెడివాఁడు. నిన్న సాయంతన మాతనిస్థితి విపరీత మైనది. తనతండ్రి భీమేశ్వరుఁడేనా? కాదా? యని తెల్పుకొనుటకే కటిక చీఁకటిలో నొక్క పెట్టున పరువెత్తినాఁడు. వాని నన్వేషించుచు నేనును బయలు దేఱితిని."

ఇట్లు తన విషాదగాథ నా దీనురాలు వినిపించుచుండగనే "అమ్మా! నా తండ్రి భీమేశ్వరుఁడే! నిర్ధారణమైనది" అని కేకలు వేసుకొనుచు బాలుఁడు పరువెత్తుచుండెను. "అదుగో! నా బిడ్డ!!" యని తల్లి యాశ్చర్యచకితయై పలుకగనే కుమారుఁడు తల్లి యంకసీమ నలంకరించి, "అమ్మా! నేను రూఢిగా భీమేశ్వరస్వామి బిడ్డనే! నీమాట యక్షరముల నిజము. స్వామి కలలో గని పించినాఁడు. నా పేరిక నుండి భీమన్న కాదు. 'భీమకవి' యఁట! నా తండ్రి చెప్పినాఁడు. నా వాగ్యము లమోఘములగునఁట". ఈమాటలకు తల్లి యానంద పరవశత్వమున నందనుని పదేపది ముద్దిడుకొని యక్కున జేర్చుకొన్నది. తన జీవితవ్రతము ఫలించినందుల కెంతయో మురిసినది. "స్వామీ! మీరెవరో నాకు తెలియదు. నన్ను విషసర్పఘాతమునుండి సంరక్షించి, నా బిడ్డకు దిక్కు కల్గించినారు. తాము పుణ్యమూర్తులనుటకు తమ యమృత వచోవైఖరియే ప్రత్యక్ష నిదర్శనము. తమ నామము నలంకరించిన యా పవిత్రాక్షరము లేవియో వినిపించి ధన్యను జేయఁగోరుచున్నాన'ని ప్రార్థించినది శాంతమ్మ.

ప్రక్కనున్న యొకవ్యక్తి "వీరు త్రికాలయోగి సిద్ధాంతదేవులు. జైనా చార్యులవారు. చాళుక్య ప్రభువులైన విమలాదిత్య ప్రభువులకు వీరన్న మిక్కిలి గౌరవము. దీనజనసంరక్షకుల'ని పల్కెను. శాంతమ్మ యోగివర్యులకు సాష్టాంగముగ నమస్కరించెను. తనబిడ్డ నాశీర్వదింపుమని యర్థించినది. యోగివర్యులు చిఱునగవుతో భీమకవి జూలపాలు స్పృశించి "యుద్దండుఁడగు మహాకవి కాఁగల సూచనలు స్పష్టముగ నున్నవి" యని నుడివెను. శాంతమ్మ సెలవుతీసికొన్నది. యోగీంద్రులు తమ యాశ్రమమున కేగిరి. ఆ రాత్రి యంతయు యోగీంద్రులు భీమకవినిగూర్చియే యోజించిరి. ఆ బాలుని చుఱుకుదన మాతని కాశ్చర్యము గొల్పినది.

మఱునా డుదయముననే త్రికాలయోగీశ సిద్ధాంతదేవులు రామతీర్థక్షేత్రము నకుఁ బయనమైరి. అచట జైనమత మహాసభ జరుగనున్నది. ఆ సభ కధ్యక్షత వహింపవలసినదిగా విమలాదిత్యభూపతికి సిద్ధాంతదేవులు స్వయముగ లేఖ వ్రాసిపంపిరి. ఆ లేఖను ప్రభువు శిరసావహించిరను వార్త జినయోగికందెను.

౬

కుందవాంబ ఆరోగ్యము కుదుటపడినను నామె దక్షిణదేశమునుండి తరలలేదు. చోళుల కాడుబిడ్డలపై గల యాదర మట్టిది. ఆమెకు సీమంతోత్సవమును జరుపవలయునని వారి యుబలాటము. అందుల కెంతగనో పెద్ద యెత్తున ప్రయత్నములు జరుగుచున్నవి. అందులకై శ్రావణమాసమున శుభ ముహూర్తము నిశ్చయింపఁబడినది. విమలాదిత్యప్రభువుల కాహ్వాన మంపఁ బడినది. ప్రభువుల యానందమునకు మేరలేదు. ఈ శుభవార్తను రాజేంద్రుఁడు చిఱునగవుతో నన్నయభట్టారకునకు, నారాయణభట్టారకునకు, తక్కుంగల యాప్తమిత్రులకు నెఱిఁగించెను. అంతఃపుర మంతయు నీవార్త మలయ మారుతమువలె వ్యాపించి అందఱ డెందముల నలరించినది. 'యువరాజు పుట్ట బోవుచున్నాఁడు. దేవిగారి యచంచల శివదీక్ష చక్కఁగా ఫలించిన'దని యాబాలగోపాలము మక్కువతో ముచ్చటించుకొనుచుండెను.

ఈమాటలు మేడాంబ మేడపైకిగూడ వ్యాపించినవి. మేడాంబ హృదయమున నీర్ష్య సుళ్ళుతిరిగినది. ఏమిచేయుటకును లేక నాలుక కఱచుకొని కుములసాగినది. తానుగూడ వ్రతములబూనిన బాగుండెడిదికదా యని విలపించినది. కాని తనకంత సహనములేదు. అందులకుఁ దాను వేయిజన్మలెత్తవలె ననిపించినది. కుందవాంబకు మగశిశువు పుట్టవలయునని ప్రజాహృదయాంతరాళమున బ్రతిధ్వనించుచున్నది. అట్లే సంభవించిన తనగతి దుర్గతియే. కుందవాంబవలె గౌరవమర్యాదలను అంతఃపురమున తా నందుకొనలేమికి యామె కుములుచున్నది. మేడాంబ కీవార్త యగ్నిపై నాజ్యముపోసినట్లైనది. కుందవాంబా సీమంతోత్సవాహ్వానపత్రికాగమన వార్త పుండుపై కారముచల్లినట్లైనది మేడాంబకు.

ప్రభువులు దక్షిణదేశమునకేగి సీమంతోత్సవముల దిలకించుటయా? లేక మాటయిచ్చినప్రకారము రామతీర్థమునకు బోయి జైనమత మహాసభా కలాపమును కనులపండువుగాఁ గాంచుటయా? వజ్జియప్రెగ్గడ యభిప్రాయము ప్రభువులు సీమంతోత్సవమునకేగి యానందింపవలయునని. ప్రయాణసన్నాహముల జరుపమందురా? యని రెండుసార్లాతఁడు ప్రశ్నించినను ప్రభువులయాజ్ఞ రాలేదు.

నన్నయభట్టారకునకు విమలాదిత్యుల మనోగతము స్పష్టము. జైనమతమునందు రాజేంద్రుల యభిమానము మొగ్గుచూపుచున్నట్లాతఁ డనేక పర్యాయములు గ్రహించెను. ఏలికవారి యభిమానము కేవలము తారతమ్యవిచక్షణతో నేర్పడినదికాదు. ఆర్యమతము సామాన్యమానవ సముద్ధరణము గావింప సమర్థముగాదని వారి యభిప్రాయముగా మన్నది. దైనందిన జీవితశ్రమానుగత

వివృత విధానమును జైనమతము ప్రతిపాదించుచున్నదని విమలాదిత్యుని విశ్వాసము. జైనమతమున నేదో యాచరణయోగ్యమైన విశిష్టత యుండుటనుబట్టియే ప్రజాదరణము దానికి లభించుచున్నదని నృపాలుని నమ్మిక. త్రికాలయోగి సిద్ధాంతుని వ్యక్తిత్వము రాజు నాకర్షించునట్లున్నది. ఆతని ఒక్కొక్కపల్కు నొక యమృతగుళిక. ఆతని యహింసావ్రతపరాయణత్వము, ఆతని దయాధర్మాది విశిష్టమానవగుణవిశేషసంపద, విమలాదిత్యునిచే వినతు లర్పింపఁ జేసినవి. ఆడితప్పుట పాడికాదు. మాట యిచ్చినప్రకారము రామతీర్థప్రయాణమునకే యేర్పాట్లు సిద్ధమగునట్లు వేంగీశుఁ డాజ్ఞాపించెను.

మఱునాఁడు మధ్యాహ్నము రామతీర్థప్రయాణము. ఆ నాఁ డుదయము ప్రభువు మేడాంబను సందర్శించెను. ప్రభువుల రామతీర్థప్రయాణవార్తను వినియు, తన నైజమును బోనీక "ఏలినవారు చోళమండలమునకుఁ బ్రయాణసన్నద్ధులైయున్నారనుకొందును!! సీమంతోత్సవ సందర్శన కుతుకాయత్తచిత్తులగు ప్రభువులకు మేడాంబ జ్ఞాపకముండుట నిజముగా అదృష్టమే యనవలె"నని సూదులు గ్రుచ్చినట్లు సూటిపోటిగా మాట్లాడినది మేడాంబ.

ప్రభువు : సీమంతోత్సవ సందర్శన కుతూహలముకన్న రామతీర్థ మందలి యశేష ప్రజాదర్శనమే మా కానందదాయకము. మేడాంబ కభిమానపాత్రమగు నా యుత్సవముల కాహ్వానించుట కేతెంచితిమి.

మేడాంబ : "ప్రభువుల ధర్మదీక్ష క్రొత్తదిగాదు. ప్రభువులతో పయనించుటకు మేడాంబ సర్వదా సన్నద్ధయే". మేడాంబాసహితముగ విమలాదిత్యుఁడు రామతీర్థమునకుఁ బ్రయాణమాయెను. పజ్జియప్రెగ్గడ తన విధ్యుక్తధర్మముప్రకారము ప్రభువును చాలదూరమ్మువఱకు సాగనంపెను. నన్నయభట్టు, నారాయణభట్టులుకూడ కొంతదూరము నడచి పనివినిరి. దారిలో నారాయణభట్టు ప్రభువుల జైనమతాభిమానమునుగూర్చి ప్రశ్నించెను. జైనమతము సామాన్యప్రజాసముద్ధరణమున దేర్పడినదనియు, వైదికమతము విజ్ఞానవిహీనులగు మానవసముద్ధరణమునకు తగు దోహదము చేయుటలేదనియు విమలాదిత్యులభిప్రాయపడుచున్నారని నన్నయభట్టారకుఁడు నారాయణభట్టునకుఁ దెల్పెను. నారాయణభట్టు గంభీరముగ తలపంకించుచు 'నూ'కొట్టెను. దానిని నన్నయభట్టు గుర్తించెను.

మేడాంబా విమలాదిత్యులొక్క విశాలమగు అందలములోఁ బయనించిరి. మార్గమధ్యమున వారు రమణీయ ప్రకృతిదృశ్యముల సందర్శించిరి. వారి ప్రయాణ మొక ఆనందస్రవంతివలె సాగిపోయెను. ముందును, వెనుకను సైనికులు ప్రయాణావరోధములు గల్గకుండ వేయికన్నులతోఁ గనిపెట్టుకొనియుండిరి. మేడాంబకీ యవకాశ మపూర్వమైనది. రాజుతో నీ ప్రయాణకాలమంతయు నామె కేకాంతము. రాజు నేమోప్రశ్నింపవలయునని యుత్స

హించును. ఏప్రశ్న కేమి యనౌచిత్యమో యని మిన్నకుండును. అయినను స్త్రీప్రకృతి యూరకుండనీయదు. "ప్రభువులకు యువరాజు పుట్టనున్నాఁడు కాఁబోలు" నని మేడాంబ మెల్లగా శ్రుతినొక్కినట్లు పల్కినది. "కాఁబోలు" నన్నాఁడు రాజు.

మేడాంబ : ఎవరియదృష్టమున కెవరుకర్తలు ?

రాజు : ఆ మాటయు నిజమే. ప్రకృతము 'గోత్రవిస్తారకుఁడు' నను టయు నొక యదృష్టమే.

రాణి : అట్టి యదృష్టము గల్గించుటకు నావంటిదానికి భాగ్యముండవల యును గదా !

రాజు : ఎప్పుడోయొకప్పుడు జీవితములో నీకు నట్టియవకాశము గలుగక పోదు.

రాణి : ఏదైనా ముందుగల్గినవారి యదృష్టమునకు సాటిరాదుగదా !

రాజు : దానికి విచారించి ప్రయోజనము శూన్యము.

ప్రయాణము దుర్గమాటవులలో సాగుచున్నది. బోయీ లమిత కష్టముపై పల్లకిని మోసికొనిపోవుచుండిరి. ఇంతలో నొక సింహనినాదము వినిపించినది. భటులు తత్తరపడిరి. వా రారోహించిన హయములు సకిలు నల్పినవి. వెంటనున్న ఆటవికులు తమ వేఁటకుక్కల నుసిగొల్పిరి. వేఁట కుక్కలన్నియు వలయాకృతిలో సింహమును జుట్టుముట్టినవి. కాని యవి దాని గర్జనమునకు నిలువలేక తోఁకలు ముడుచుచున్నవి. విమలాదిత్యుఁడు వాహనముదిగి పరిస్థితి నవలోకించెను. మేడాంబాసంరక్షణకు కతిపయసైనికులను నియోగించెను. మేడాంబ భీతిల్లి రాజేంద్రుని వారింపనెంచినది. ఆమె చంచల విలోచనము లామె మనస్సును ద్యోతక మొనర్చినవి. విమలాదిత్యుఁడు మేడాంబవంకఁజూడలేదు. చూచుట కవకాశము గూడలేదు. ప్రచండమగు పరశువును జేఁబట్టి పిరికిపందలగు పరివార జనులఁ జులకనైన చూపు చూచి సింహముతోఁ దలపడెను. సింహము విమలాదిత్యుని కబళించుటకు లంఘించెను. చాళుక్యవీరుఁడు తన యాయుధమగు గొడ్డలితో నాత్మ సంరక్షణము గావించు కొనుచు, సింహమును జంప యత్నించెను. ఎంత ప్రయత్నించుచున్నను, తన వ్రేటునకది యందక భూపతిని జంపుట కుంకించుచున్నది. ఆటవికు లందఱును ఈ పోరును సంభ్రమాశ్చర్యములతోఁ జూచుచుండిరి. ఇంతటి సాహసముగావించిన రాజును వారెన్నఁడును జూచియుండలేదు. విమలాదిత్యుఁ డెంతకాలమునకును పోరాట మంతమందకుండుటచేఁ దానే యామృగేంద్రునిపై లంఘించెను. ఇట్లు కవ్వించుచున్న రాజేంద్రు నా మృగరాజము చపేటమెత్తి శిరమును వేయి చీలికలు చేయ నుంకించినది. అది గమనించిన చాళుక్యపతి ఎత్తిన దాని పంజాను తన వామహస్తమునఁ బట్టి భయంకరమగు దాని వదన

గహ్వరమును బరశువుతో బ్రద్దలగునట్లు మోదెను. ఆ ఘాతమున కా కేసరిమృగము భీకర రోదనము సేయుచు నేలకూలెను. అటవికులందఱు నా భయానక దృశ్యమును గాంచి చాళుక్య వీరుని ప్రతాపమునకుఁ జేతులెత్తి నమస్కరించిరి. జానపదనాయకులు, రాజేంద్రుని పుష్పమాలాలంకృతులఁ గావించి సత్కరించిరి. ఆ సందర్భమున నటులగు జానపదులనేకులు తమ కళాకౌశల ప్రదర్శనముతోఁ బ్రభువరేణ్యుల శ్రమాపనయము గావించిరి. విమలాదిత్యుని యీ యసదృశ సాహసాటోపము జగద్విదితమైనది.

మూఁడుదినముల ప్రయాణానంతరము రాజపరివారము సింహాచల పుణ్యక్షేత్రమును జేరినది. మేదాంబాసహితముగ రాజు ప్రభాతముననే సింహాచల స్వామిని సందర్శించెను. స్థానిక విద్వాంసుడు క్షేత్రమాహాత్మ్యమును గొంత కాలము పురాణముగా శ్రవణ సుభగముగ వినిపించెను.

విమలాదిత్యుఁడీ వృత్తాంతమును శ్రద్ధగా నాలించి స్వామివారికి చందన యాత్రాసమయమున నలంకరణార్థముగా కొంత ద్రవ్యము నొసంగెను. ఆ సాయంకాలమువఱకును పరిసర రమణీయప్రకృతి దృశ్యములను సందర్శించుచు ప్రభువు కాలక్షేపము చేసెను.

సింహాచలాగ్రమున నిల్చి విమలాదిత్యుఁడు క్రిందికి విలోకించెను. సెలయేటి కన్యల నృత్య భంగిమా విన్యాసములను సందర్శించుటకుగాను ప్రేక్షకులు కుప్పటోపీలు ధరించి, సోపానములుగానున్న యాసనముల నధిష్ఠించిన రీతిగా ననాసతరువులు పర్వతపార్శ్వముల నొప్పారుచున్నవి. ఆ దృశ్యమును ఆనందాశ్చర్యములతో చాళుక్య భూరమణుఁ డవలోకించుచు నట్లే నిలువఁబడెను. పలువిధములైన రంభాఫల తరు సంతతులు కనులకు కళ్యాణముగా నలంకరించుకొని రాజేంద్రునకు రుచిరాగత మొసంగుచున్నట్లలరుచున్నవి. బారులుదీర్చి నిలువఁబడిన నారికేళ వృక్షతతులు చాళుక్య యోధునకు సైనిక వందనము సమర్పించుటకై నిలువఁబడినట్లున్నవి. ఇట్టి యానందదృశ్యావలోకన మా ధరణీధవుని నిర్భరానందమున ముంచెత్తినది. ఆ భూతలస్వర్గసీమను వదలివచ్చుట భూనాథున కిష్టము కాకున్నను గమ్యమును సకాలములో చేరుటకుఁ బ్రయాణింపక తప్పినదికాదు.

తెల్లవారునప్పటికి రాజు, పరివారము రామతీర్థమును జేరెను. చాళుక్యాధిపతి కఖండ స్వాగతము నెఱపుట కన్ని యత్నములప్పటికే సంసిద్ధమైనవి. త్రికాలయోగ సిద్ధాంతదేవుఁడు స్వయముగా రాజకంఠీరవున కభ్యుత్థాన మొనర్చి ప్రీతి పూర్వకముగా యోగక్షేమముల నరసెను. మార్గమధ్యమునఁ గల్గిన ప్రయాణావరోధముల ప్రస్తావన తెచ్చి, సిద్ధాంత దేవులు మృగరాజమును సంహరించిన రాజేంద్రుని పరాక్రమమును నుతించెను. వినీతవశంవదుఁడగు విమలాదిత్యుఁ డంజలిఘటించి, యది యంతయు పెద్దల యాశీః ప్రభావమే

యనెను. మహాసభకు వలసిన యేర్పాటులన్నియు సక్రమముగ జరిగినట్లు నృపాలుఁడు ప్రశ్నించి తెలిసికొనెను. ఇంతలో చాళుక్య రాజాగమనవార్త విని కళింగాధిపతియగు ఇమ్మడి కామార్ణవుఁ డుపాయనపురస్సరముగా చాళుక్యాధిపతిని సందర్శించెను. కళింగ దేశ వృత్తాంతమును గొంత విచారించి విమలాదిత్యుఁడు విశ్రాంతిగొనెను.

విమలాదిత్యుని రాక త్రికాల యోగసిద్ధాంతదేవునకును వారి యనుచరులకును గ్రమముగా నాబాలగోపాలమునకును బరితృప్తిఁ గల్గించినది. ఇది చాళుక్య భూపాలుని యపారమత సహనమున కుదాహరణముగా కొందఱు భావించిరి. జైనమతమునందు ధరణీపతికిఁగల ప్రత్యే కాభిమానముగా మఱికొందఱు భావించిరి.

సాయంకాలము మహాసభ జరుగనున్నది. పలు ప్రాంతములనుండి ప్రజలు తండోపతండములుగా వచ్చిరి. శ్వేతాంబరులైన సన్యాసులందఱును నొక ప్రత్యేకస్థలమున నాసీనులయిరి. ఆ భాగము క్షీరాబ్ధితరంగ మట్లున్నది. స్త్రీలు, పురుషులు వేలు వేలుగా నుండిరి. ఎచ్చట చూచినను 'అహింసే పరమధర్మమ'ను బంగారపు టక్షరములతో నలరారుచున్నయట్టులు వ్రేలాడు చున్నవి. మూఁడు మార్గముల మూలమున వేదికకుఁ జేరవచ్చును. ఒక మార్గమునకుఁ 'గ్రమవిశ్వాసమ'నియు, మఱియొక మార్గమునకు 'క్రమ విజ్ఞానమ'నియు, ఇంకొక మార్గమునకు 'క్రమవర్తనమ'నియు నామకరణములు గావింపఁబడినవి. జైనమతాచార్యుల చిత్రములు వేదిక వెనుకవైపున నలంకరింపఁబడినవి. వాని యన్నింటిమధ్యనున్న మహావీరుని మాన్యచిత్రము మహితకాంతుల నీనుచున్నది.

గృహస్థులు, శ్వేతాంబరులు కలిసి రథముపట్టి త్రికాలయోగ సిద్ధాంత దేవులను వేదికకడకు తీసికొనివచ్చిరి. చాళుక్యనరేంద్రుఁడు భద్రగజగమనముతో ముందునడచెను. కరతాళధ్వనులు మిన్నంటి మారుమ్రోగినవి. సిద్ధాంతదేవుల యాసనమునకుఁ బార్శ్వభాగమున విమలాదిత్య నరేంద్రుఁ డాసీనుఁడాయెను. ఆనాఁటి సభ రాజేంద్రునకు విభ్రాంతి గొల్పినది. అంతటి జనసమూహము నా జనపతి ఇతఃపూర్వము గాంచియుండలేదు. చెలియలికట్ట నతిక్రమించి పౌరలు సముద్రము రీతిగానున్న జనసమూహమును జూచి జైనమతము ప్రజాభిమానములఁ జూరగొన్న మతమే యను దృఢనిశ్చయ మప్రయత్నముగ నాతని కేర్పడినది. 'యథా రాజా, తథా ప్రజా' అనుట సరికాదు. 'యథా ప్రజాః, తథా రాజా' అను నాదర్శమే గొప్పదని తానా యాదర్శము పాటింపవలయునని చాళుక్య ప్రభువేమేమియో యోజింపసాగెను.

కరతాళధ్వనులమధ్య త్రికాలయోగ సిద్ధాంతదేవు లుపన్యసించుటకు నిలువఁబడిరి. మేరుసమానమగు నామూర్తి నిలచినంతనే మంత్రముగ్ధమైనట్లు

ప్రజానముదాయము ప్రశాంతి వహించినది. ఆ దివ్యమూర్తి లోచనములనుండి యమృత సందేశము జాలువారుచున్నది. అతని శ్వేతాంబరము శాంతిసందేశము నందించుచున్నది. అతఁడొక సత్యవలెగాక ప్రవక్తవలె పల్కు పల్కునను నమృత బిందువు లొలికించెను. "అర్హ్యమతము సామాన్యమానవ సముద్ధరణ విషయమును విస్మరించినది. అదియొక ప్రత్యేకకులము చేతిలో కీలుబొమ్మయైనది. మతమున్నది యందఱకు నెన్నిక చేయవలయును. అందఱును వారివారి సంస్కారానుగుణముగా మతము ముక్తిమార్గమును జూపవలయును. మతము పేరిట, ఆత్మస్వర్గాభిలాష పేరిట, దారుణహింసాకాండ సహింపరాని విషయము. పిపీలికాది మానవపర్యంతమైన యీ ప్రకృతిలో నేజీవికిగాని మఱియొక జీవిని చేజేతుల హింసించుట కధికారములేదు. అట్టి హింసాకాండ నరికట్టి పవిత్రాత్మమగు నహింసావిధా నాచరణమున మానవుఁడు తన మానవత్వమును గాపాడుకొనగలఁడని, యాదర్శజీవిగా నిప్పటికి పదునైదువందల సంవత్సరములకుఁ బూర్వమే వర్ధమాన మహావీరుఁడను నుత్తమ మానవుఁడవతరించి చాటినాఁడు. అట్టి యీ మత విధానములను వివిధ విధములఁ బ్రపంచించి తీర్థంకరులు మహోపకారమొనర్చిరి.

ప్రతిమానవునకును క్రమవిశ్వాసము, క్రమజ్ఞానము, క్రమవర్తనము మను రత్నత్రయము శిరోధార్యము. ఈ మూఁటిని పృథక్కుగాకాక సమష్టిగా నాచరణములో ననువర్తింపఁజేయవలయును. అప్పుడుగాని సమగ్ర జీవితానుభవము కలుగదు. వైరాంచనమున ముక్తి కలయికను జేకూర్చుటలేదు. భాగవతులకు భక్తిని, అద్వైతులకు జ్ఞానమును, పూర్వమీమాంసకులకు కర్మను ప్రధానములుగా హిందూ మతము చాటినది. జైనమత మట్టి వింగడింపును సహింపదు. ఒకరోగికి రోగ నివారణము కావలయునన్న మున్ముందాతనికి వైద్యునియందు పూర్ణమగు విశ్వాసముండవలయును. విశ్వాసమున్నంతనే చాలదు. అతఁడిచ్చు నౌషధము నెట్లు సేవింపవలయునో గుర్తెఱిఁగి వర్తింపవలయును. అప్పుడాతఁడు క్రమముగా రోగ విముక్తుఁడగును. అట్లే సంసారియును రత్నత్రయ మార్గానుసారియై, సంసారక్లేశముల నణఁచి యానందమార్గానుగామి కాఁగలఁడు.

మానవులను వారివారి స్థాయినిబట్టి త్రివర్గములుగా విభజింపనగును. మొదటివారు అనువ్రతులు. వీరధిక సంఖ్యాకులు. వీరే సామాన్య గృహస్థులు. వీరు సత్యము, అహింస, అస్తేయము, అపరిగ్రహము, బ్రహ్మచర్యము మున్నగు నియమములను బాటించి యుత్తమ సంస్కారములను సంపాదింపవలయును. ఈ యన్నింటికి అహింస కొలికిపూసవంటిది.

ద్వితీయశ్రేణికిఁ జెందినవారు శ్రామికులు. జినసిద్ధాంతముల నాచరించి అనువ్రతులుగా నారితేరినవారు. వీరు తీర్థంకరులకు శిష్యులై వర్తింతురు. ఇఁక తృతీయశ్రేణికిఁ జెందినవారు మహావ్రతులు. వీరు మనోవాక్కాయ కర్మముల

యందును నహింసావ్రతపాలనము సలుపవలయును. కమండలువు చేతఁబూని బహుప్రాంతములయందు పర్యటన సలుపుచు, నిరంతరగ్రంథపఠనమున వైజ్ఞానికస్థాయి నభివృద్ధి పఱుచుకొనుచు సామాన్యమానవులకు నాదర్శజీవితమును బ్రదర్శించు త్యాగజీవనులు. ఆహారవిహారములయందు వీరు సంయమయుతులై యుండవలయును. శారీరక మానసిక వికారములనన్నింటి నదుపులోనికి తెచ్చుకొని, నితాంత ప్రశాంత జీవితానంద తత్పరులు కావలయును. స్వార్థమనునది వారినేమాత్రము నెన్నంటి రాదు. ఇట్టి అపర్శమహావ్రతుఁడుగాఁ బచేళము స్థితి నందిన వ్యక్తి తీర్థంకరుఁడు నాఁబడును. అనువ్రతుఁడు శ్రావకుఁడై, శ్రావకుఁడు మహావ్రతుఁడై, మహావ్రతుఁడు తీర్థంకరుఁడుగాఁ బరిణమించి ముక్తజీవనమును గడుపుటయే జైనమత ముఖ్యలక్ష్యము. మీరందఱీ మహాశయములను గుర్తించి జైనులుగా మతమును స్వీకరించి ధన్యులగుదురుగాక" యని జలద గంభీరస్వనమున త్రికాలయోగి సిద్ధాంతదేవు లుపన్యసించిరి.

ఇందు పరమత దూషణ మంతగాలేదు. ఆత్మమత ప్రతిపాదన మత్యధికము. సభ్యులు సంతృప్తిఁ జెందిరి. ఆ సంతృప్తి వారిముఖదర్పణములయందు ప్రతిబింబించెను. ప్రజాసంతుష్టియే ప్రజాధిపతి సంతుష్టి. ఇట్టి మహాసభావలోకనము చాళుక్య సార్వభౌమునకు ప్రథమ పర్యాయమే. ఇట్టి యపూర్వావకాశమును గల్గించినవారు త్రికాలయోగి సిద్ధాంతదేవులు. వారికి చాళుక్యరాజు లోలోన కృతజ్ఞత వెల్లడించుకొనెను.

మఱునాఁడు ప్రాభాతమునఁ ద్రికాలయోగి సిద్ధాంతదేవమునిని సందర్శించుటకు విమలాదిత్యుఁడేతెంచెను. అప్పటికింకను వారనుష్ఠానమునుండి లేవలేదు. ఆ తరుణమును బురస్కరించుకొని యచటిప్రధాన శ్రావకుఁడొకఁడు రామతీర్థము ప్రఖ్యాతిని సంక్షేపముగా నివేదించెను. రామతీర్థము జైనసిద్ధక్షేత్రమనియు, జినమునులనేకు లచట జీవన్ముక్తులగుటచే నట్టి ప్రాముఖ్యము నదియందుకొన్నదనియు, నట్టి దివ్యస్థలమునకు విమలాదిత్యమహాప్రభువు లేతెంచుటచే దాని ప్రాముఖ్యము ద్విగుణీకృతమైనదనియు నా శ్రావకుఁడు పీఠికవలుచు నేమేమియో చాళుక్యప్రభువునకుఁ దెల్పెను. చాళుక్యప్రభువు సావధానముగ నా శ్రావకుల వాక్యముల నన్నింటి నవగాహన మొనర్చుకొనుటకు యత్నించెను.

చాళుక్యభూపాలుఁడు త్రికాలయోగి సిద్ధాంతదేవుల సంప్రదాయమును గూర్చి ప్రశ్నించెను. "త్రికాలయోగి సిద్ధాంత దేవమునివరేణ్యులు కొండకుందాన్వయమునకుఁజెందిన నందిగణమువారు. దిగంబర జైన సంప్రదాయము వారిది. అయ్యును నందుకొన్ని సూక్ష్మ సంస్కారములఁ బ్రవేశపెట్టిరి. కేవల దిగంబరత్వము వికృతహేతువని వారు గ్రహించిరి. అది మానవుని ప్రాకృతత్వమును సూచించునని, వికారమును సాధ్యమైనంతవఱకు రానీయకుండుట వారి యభిమతము. అందుచే వీరు శ్వేతకౌపీనమాత్రధారణావ్రతులై, సరసముగు

మనోహరముగా పఠించును. అనంతర మతిరమ్యమైన లలితా సహస్ర నామములు పారాయణ గావించును. బ్రహ్మాండ పురాణాంతర్గతమగు లలితోపాఖ్యానమున కివి యుత్తర భాగము. పరమేశ్వరియగు లలితాదేవిచే ప్రత్యేకముగా నియోగింపఁబడిన వాగ్దేవిచే నీ నామములు రచింపఁబడినట్లు హయగ్రీవుఁ డగస్త్యునకు వీని నుపదేశించు కాలమునఁ బేర్కొనినాఁడు. సంస్కృత సారస్వతమున నామరచన, సూత్రరచన, కావ్యరచనలవలె ప్రత్యేక కౌశలము గలవి. ఇందు లలితాసహస్ర నామములు విశిష్ట కళాకౌశలోపేతములు. పూర్వాపర సంబంధము, లలితపదఘటిత సమాసమార్దవము ప్రశంసనీయము. వీనిని కొన్ని పరిచ్ఛేదములక్రింద విభజింపనగును. దేవీసౌందర్యము, భండాసుర సంహారము, దేవీనివాసములు, మానవశరీరములందలి షట్చక్రములలో నామె పొందిన రూపవిశేషములు మున్నగున వీ విభాగములు. నన్నపార్యునకు చిన్నతనమునుండియు నీ లలితా సహస్రనామములందు ప్రత్యేకాభిమానము. అతనికీ స్త్రీపుంస యోగోద్భవమైన సృష్టియంతయు సౌందర్యసముల్లసితము. సహస్ర నామ పారాయణానంతరము "ఓం, ఐం, హ్రీం, శ్రీం లలితాంబికాయైనమః" అను నామమును సహస్రాధికముగా జపించును. అప్పటి కపరాహ్ణమగును. సాత్వికమగు శాకపాకములతో క్లప్తముగా భోజనముచేసి, వైదిక లౌకిక సాహిత్య వ్యవసాయమునకుఁ గడఁగును. అనంతర మంతఃపురమున కేగి పరిస్థితులను పరిశీలించును. అనుకూల కాలములలో పురాణ ప్రవచనము గావించును. అంతఃపుర కార్యకలాపానంతరము వ్యవధియున్నచో పండిత సభలకుఁ బోయి వారు గావించు సద్గోష్ఠులను ప్రశాంతముగ విని, పండిత మనస్తత్వములను సాకల్యముగఁ బరిశీలించును. ఉద్రేకములకు లోనగుట యాతని స్వభావమునకు వ్యతిరేకము. వాదోపవాదములందు వ్యక్తిదూషణ మాతనికి గిట్టదు. నిరంతర శుచిస్మిత వదనారవిందుఁడగు నన్నయభట్టారకుఁడు పరమప్రశాంత భాగీరథీధుని.

కుందవాంబ యంతఃపురమున లేదు. విమలాదిత్యుఁడు మేడాంబ సహితముగ రామతీర్థమునుండి తిరిగి రాలేదు. అందుచే నన్నయభట్టు తన విశ్రాంతికాలమునంతయు తన సహాధ్యాయుఁడగు నారాయణభట్టుతోనే గడుపుచుండెను. వీరిరువురు సాయంసమయములందు పండితపరిషత్తుల కేగి విద్యా వినోద గోష్ఠీ నిమగ్నులగుచుండిరి.

నారాయణభట్టు రాజమహేంద్రవర కోవిద కోటికంతకును బరిచయము గావింపఁబడెను. పండితు లాతని జూచి యొకింతగా భయచకితు లగుచుండిరి. ఆతని యాకార విశిష్టత యట్టిది. నన్నయ యెంతటి సౌమ్యగంభీరమూర్తియో, నారాయణభట్టంతటి భయదగంభీరమూర్తి. ఆకృతి దాల్చిన శుద్ధసాత్త్వికము నన్నయభట్టు. రూపువహించిన శుద్ధరాజసము నారాయణభట్టు. తాను విశ్వ

"బృహత్కథ" యందు కథాకథన విధానము పరాకోటి నెక్కినది. అతని యనల్పకల్పనా సామర్థ్యము చరాచర ప్రకృతిని సమస్తము పులకింపఁజేసినది. ఈ బృహత్కథ ఆర్యావర్త సంస్కృత సారస్వతమున విశేష ప్రఖ్యాతి గాంచినది. కవికుల గురువగు కాళిదాసుని మేఘసందేశమున ఉదయన కథా కోవిదులయిన గ్రామవృద్ధుల ప్రశంస వచ్చినది. ఈ ఉదయన కథ బృహత్కథలోనిది. "బాణోచ్ఛిష్ట మిదం సర్వము"ని ప్రసిద్ధిగాంచిన బాణ మహాకవి బృహత్కథను హరలీలగా నుతించెను. ఇట్లే సుబంధుఁడు, ధనికుఁడు, దుర్వినీతుఁడు, గోవర్ధనుఁడు మున్నగు ప్రముఖ సాహిత్యవేత్తలు బృహత్కథా ప్రాముఖ్యమును స్తుతించి యున్నారు. ఆంధ్రులీ యద్భుత సృష్టికి గర్వింపవలయును.

ఈ కాలమున వెలసిన మఱియొక మహత్తర కావ్యము 'సత్తసఈ'. శృంగార భావ ప్రపూరితమగు సన్నివేశములను గనులకుఁ గొనగట్టించి పఠితలను మధుర భావావేశములను గావింపఁగల యీ ప్రాకృత ముక్తక కావ్యరాజ మానాఁటి యాంధ్రుల రసికతా జీవనమునకు మణిదర్పణము. నర నారీజన నిత్య జీవనమాధుర్య మిం దుట్టిపడును. పల్లీజన ముగ్ధ మనోహర ప్రేమభావములకిది నికేతనము. వ్యంగ్య మర్యాదల కిది మేర". అని యనేక గాథలను సోదాహరణముగా నిరూపించినాఁడు. నారాయణభట్టు ఉపన్యాస మంతట ముగిసినది. నారాయణభట్టు వాగ్విన్యాస మొక కొంత పరుషమైనది. కాని ప్రతి పదము నావేశభరితమై హృదయమునకుఁ దాకును.

గుణాఢ్యుని వాల్మీకి వ్యాసులతోఁ దుల్యుని గావించినందులకు పండితు ముఖారవిందములు మ్లానము లైనవి. నన్నయభట్టు సభను ముగించుచు ఆంధ్రులు ప్రాకృతభాషకు గావించిన సేవ యఖండమనియు, ఆంధ్రులను స్వస్థాన వేష భాషలయం దాదరాభిమానము లతిశయించుట శుభావహ మనియు సంక్షిప్తముగఁ బేర్కొనెను. సభ ముగిసినది. పండితులెవ్వరును నారాయణ భట్టును బ్రశంసింప లేదు. నారాయణభట్టున కట్టి యపేక్షయు లేదు. ముఖప్రీతి గిట్టని మనీషి యతఁడు. నారాయణభట్టు వెంటనుండుటచే నన్నయభట్టారకుని గూడ నెవ్వరును సమీపించి తమ మనోగతభావములను బ్రకటింపరైరి.

దేవభాషా స్థానమును బ్రాకృత భాషలు కాని, దేశ భాషలు కాని యెన్ని జన్మముల తపస్సు చారవోసినను సంపాదింపలేవని పండితులు తమలోఁ దాము గుసగుసలాడుకొనుచు గృహోన్ముఖులైరి.

నారాయణభట్టునకుఁగల ప్రాకృత భాషాభిమానము నన్నయభట్టారకునకు మాత్రమానందము గల్గించెను. ఆంధ్ర రసిక హృదయము నానాఁటి సభలో నాతఁడు ప్రాకృత కవితాపరముగ పండితకోటిముం దావిష్కరించెను. రాజకీయ భాషయగు ప్రాకృతమున నీ యాంధ్ర కవిపుంగవు లింతటి యుదాత్త

భావోపేతముగ కావ్య సృష్టి గావించిరి కదా! ఆ కృషియే మాతృభాషలో జరిగిన ద్విగుణీకృత భావప్రకటనా సౌలభ్యము కల్గియుండెడివారు కదా! అని యేమేమియో నన్నయభట్టు యోచించెను.

రాత్రిసమయమునందును నిద్రాభంగము కలిగి లేచినపుడు నన్నయభట్టు జపమాల త్రిప్పును. అట్టి దీక్షవహించు గావుననే యీ జపయజ్ఞము నాఁ డారంభించిన యైదు వత్సరములలోనే కోటినామమును జపించి ధన్యత గడించెను. దీనికి శాంతి జరుపుకొనవలయునని సంకల్పించి శుభముహూర్తమున బ్రాహ్మణసహస్రము నాఁ డాహ్వానించెను.

ఆనాఁడు పరిసర ప్రాంతములనుండి బ్రాహ్మణపండితులు అసంఖ్యాకముగా రాజమహేంద్ర పట్టణమునకు విచ్చేసిరి. ప్రధానామాత్యుఁడు, నారాయణభట్టు — నన్నయభట్టునకు రెండుప్రక్కలా నిండుదండగా నిలువఁబడిరి. ప్రధానామాత్యుఁడు కూడ నిరంతర జపహోమ దీక్షాపరుఁడే. అతని యిష్టదైవము నీల కంఠేశ్వరుఁడు. అనవరత రాజకార్యనిమగ్నుఁడగు ప్రధానామాత్యుఁడు కోటి జపమును పూర్తిచేసుకొనెను. తనకన్న నెంతో చిన్నవయస్కుఁడగు నన్నపార్యుఁడిట్లు సాఫల్యమందుట [illegible] కుతూహలమును కల్గించెను.

ప్రాతఃకాలముననే పండితోత్తములు పావన గౌతమీ పులిన భాగముల సాంధ్యకృత్యములఁ దీర్చుకొని సావిత్రిని జపియించి నన్నయ గృహాంగణ మలంకరించిరి. అంతట సంహితా పారాయణము వేదపఠనము ప్రారంభించిరి. ఇందనేకులు వేదార్థప్రవచనముగూడ చేయఁగలవారలు. ఒకవంక విప్రఘోష, వేరొకప్రక్క వేదార్థప్రవచనములు, మఱియొక చక్కి శాస్త్రచర్చలతో సమస్త భారతీయ వైదిక విజ్ఞాన మంతయు నన్నయ గృహాంగణమున సాలంకృతముగ విడిదిచేసినట్లయ్యెను. పిమ్మటాచార్య ప్రముఖులింకను రామతీర్థమునుండి రాలేదు. కులపాలిక ఆనాఁడు పుట్టినింటనున్నదో తప్పక ప్రత్యేకసత్కారముల గావించుకొని నన్నయనికేతమును వెండిచేసినదే. ఆమెలేని కొఱఁతను నన్నయ దుర దృష్టముగా తలంచెను.

పవిత్ర నదీసలిలములతోడను సహస్రనారికేళ జలామృతముల తోడను, కపిలగోక్షీరములతోడను, పంచామృతములతోడను నన్నయ శివలింగము నభిషేకించెను. శివసహస్రనామములు, విష్ణుసహస్రనామములు పఠించి, శివరాత్రిస్తవము, సౌందర్యలహరి, శివానందలహరి, భగవద్గీత, రామాయణ సుందరకాండ, పారాయణముల గావించి యతఁ డిష్టదేవతార్చనా ప్రారంభమ్మునకుఁ గడంగెను. అర్ధనిమీలితనేత్రుఁడై, లలితాసహస్రనామముల పఠించి, కాళిదాసకవీంద్రుని దేవీస్తోత్రమును కంఠమెత్తి పాడి, పవిత్రమగు నిష్టదేవతా నామ జపమునకుఁ గడంగెను. ఏతత్సమయమున నాతని సమస్త గాత్రము

పులకించినవి. సమస్తప్రపంచము నాతనికి కాంతామనోజ్ఞముగఁ గనిపించెను. రమణీయశబ్దబ్రహ్మ మాతని రసనాగ్రమున నర్తించినట్లైనది. అతని హృదయ కవాటములు తటాలున తెఱచుకొన్నవి. రమణీయ కాంతిప్రవాహ మాతని హృదయకుహరము నావహించెను. తోడనే ఆ విద్యుత్కాంతి యాపాదమస్తక మొక్కక్షణములో నన్నయభట్టారకుని దివ్యతేజోవిరాజమానుని గావించినది. ఆతని జపయజ్ఞము ఫలించినది. ఆతని యుపాసనమునకు సంప్రీతయై లలితాంబ సాక్షాత్కరించినది. ఆమెయే శ్రీవాణీగిరిజలై పార్శ్వముందున్న పురుషోత్తమాంబుజభవ శ్రీకంధరులను గ్రమముగఁ జేరిరి. వారే స్త్రీపుంస యోగోద్భవులైన సుందర జగత్సృష్టిస్థితిలయలలో నిమగ్నులైరి. వేదపారాయణము మిన్ను ముట్టుచున్నది. కడకీ మూర్తిత్రయ మొక మహాజ్యోతియై నన్నయ ఫాలభాగమునఁ జేరెను. నన్నయ బ్రహ్మానందమున నోలలాడుచుండెను. నన్నయ పూజామందిరములోని యపూర్వ కాంతిపుంజములను సంభ్రమాశ్చర్యములతో భూసురులు తిలకించుచుండిరి. అంతలో నన్నయభట్టు ఉన్మీలితనేత్రుఁడై ప్రశాంతముగా నీరాజనమును ముట్టించి బ్రహ్మణ్యమూర్తులకుఁ జూపనారంభించెను. ఆ సమయమునందు

"శ్రీవాణీ గిరిజా శ్చిరాయ దధతో
వక్షోముఖాఙ్గేషుయే
లోకానాం స్థితి మావహ న్త్యవిహతాం
స్త్రీపుంస యోగోద్భవామ్
తే వేదత్రయ మూర్తయ స్త్రిపురుషాః
సం పూజితా వస్సురైః
భూయాసుః పురుషోత్తమామ్బుజ
భవశ్రీకంధరా శ్శ్రేయసే॥

అను శ్లోక మాతని పవిత్రముఖ వినిర్గతమాయెను. ఆ మధురవాక్కున కాకర్షితులై వేదపండితులందఱు వింజమూఁకిడినట్లైరి. అందఱి నమస్కృతులు నన్నయ ఫాలభాగమున లగ్నమైనవి. ఆ శబ్దవిన్యాసమునకు విప్రోత్తము లానందభరితులైరి. నారాయణభట్టు ఒడలంతయు చెవులుగావించుకొని యాలకించెను. పద్యము ముగియగనే భూసురవర్యులు రెండుపక్షములుగా నేర్పడి, పరవశతతో "ఓం సహస్రశీర్షం దేవం విశ్వాక్షం విశ్వసంభవ"మ్మని మంత్ర పుష్పము నెత్తికొనిరి. తత్పరిసమాప్తసమయముననే, రాజమందిరమునుండి యొక వార్తావాహుఁడు కులబ్రాహ్మణుఁడగు నన్నయభట్టారకునకును, మంత్రి సత్తముఁడగు వజ్జియప్రెగ్గడకును బ్రత్యేక లేఖలు దెచ్చెను. వజ్జియప్రెగ్గడ వర్తన సరిగా జరుగుచున్నది లేనిది పరిశీలించు పర్యవేక్షకుఁడుగా నుండెను.

నేకగ్రీవముగా విషయప్రతిపాదనాధికారమును నన్నయభట్టారకులకు వదలిరి. మా మిత్రుఁడు నారాయణభట్టు కర్ణాటభాషాకోవిదుఁడు. ఈమధ్య నాదేశివాఙ్మయ మత్యంతాభివృద్ధినొందినది. దానినిగూర్చి మా నారాయణభట్టు ప్రసంగింపఁ గలఁడనినాఁడు నన్నయభట్టు. నన్నయభట్టొసంగిన విషయము పండితులకంత సంతృప్తి నీయలేదు. అంతకుపూర్వమే ప్రాకృతభాషలపై నారాయణభట్టు గావించిన ప్రసంగ మా విద్వాంసులకు కొంత శిరోవ్యథను కల్గించినది. నారాయణభట్టు దేవభాషావిరోధియని వారు సులువుగాఁ దీర్మానించిరి. నారాయణ భట్టు స్నేహముచే నన్నయభట్టునకుకూడ మతి చలించుచున్నదని కొందఱెంచిరి. ఎట్లైన బలవంతపు బ్రాహ్మణార్థము తప్పినదిగాదు పండితులకు.

నారాయణభట్టు కర్ణాట భాషాభిమాని. అతని తండ్రితాతలు కర్ణాట ప్రభువులవద్ద దండనాథులుగా నుండిరి. వారు వేంగిదేశమునుండి వలసపోయిన వారు. తద్భాషాభివృద్ధినిగూర్చి యాంధ్రపండితుల కెఱుకపఱచు తలంపు నారాయణభట్టున కెప్పటినుండియో కలదు. కాని తనకుతానుగా నట్లుకోరు టాతని స్వభావముకాదు. నన్నయభట్టు ప్రశాంతముగానుండి పరుల యభిమానాభిరుచు లెట్లులుండునో భావింపఁగల సమర్థుఁడు. ఈ విషయప్రతిపాదనము నారాయణ భట్టున కమితోత్సాహము కల్గించినది. కాని పండితుల ముఖారవిందములు విప్పారిలేవు. ఆ విషయ మాతఁడు గుర్తించినాఁడు. అయినను నిట్టివాతఁడు సరకుగొనువాఁడుకాఁడు. ఆంధ్రపండితులు కేవల సంస్కృతభాషాభిమానులు గానే యుండుటాతనికి బాధకల్గించెను. ఒకప్రక్క తమిళము, మఱియొకవట్టు కర్ణాటభాష దేశి సారస్వత సంపద్విలసితమగుచుండ, తెనుఁగున కట్టివికాసము గల్గించుట కాంధ్ర విద్వద్వరేణ్యు లుత్సహించకుండుట విచారణీయము. ఇట్టి భావావేశముతో నారాయణభట్టు తన యుపన్యాసమున కుపక్రమించెను. "కన్నడ భాషలో గ్రంథరూపముదాల్చిన ప్రాచీనతమమగుకృతి 'కవిరాజ మార్గము'. ఇది నృపతుంగ విరచితము. నృపతుంగుఁడు రాష్ట్రకూటాధిపతి. ఇతఁడు 9వ శతాబ్దిలో రాజ్యమేలెను. ఇది పద్యములందు కూర్చబడిన యలంకారశాస్త్రము. దీనినిబట్టి యప్పటికే కన్నడ కవితా మాధుర్యము కొంత పరివ్యాప్తమైయుండి యుండవలయునని యూహింపనగును. హాశేబీడు శిలాశాసన కవిత్వమునందీ కన్నడ కవితా కమనీయత సుస్పష్టము. కవిరాజ మార్గములో శ్రీ విజయ కవీశ్వర, లోకపాల, విమలోదయ, నాగార్జున, జయబంధు, దుర్వినీతాది పలువురు ప్రముఖ రచయితల నామము లుదాహృతములు.

కవిరాజ మార్గకర్త కవికాదలచినవారికి కొన్ని ముఖ్యమగు సలహాల నిచ్చినాఁడు. "వివేకశీలురతోడను, ధీశాలురతోడనుస్నేహముకల్గి వారి సామనస్యము నార్జింపుము. గ్రంథచౌర్యమున కెప్పటికిని నొడిగట్టకుము., నీ భావము

లను, నీ స్వకీయభాషలో సుస్పష్టముగ విశదపఱుచు సామర్థ్యమును సంపాదించుము. అల్పాక్షరముల ననల్పార్థరచనగావించు శిల్పము నలవఱచుకొనుము. భావమునకు సరిపడుభాష నీ కబ్బినప్పుడే నీ కవితకు రంజకశక్తి యుండును. నీ భావమెంత యుదాత్తమయినను నీ భాష ప్రసన్నముగా లేనినాఁడు నీ కవిత కాదరముండదు. ఏ మానవుని జీవనశోభాసౌందర్యము లామానవునిలోనే సార్థక్యమును బొందునట్లుగానే కవిహృదయములు కవితారీతులుగూడ విభిన్నములై వైలక్షణ్యముతో విలసిల్లును." దీనిని బుద్ధిపురస్కరించుకొని చూచినచో నృపతుంగుని కాలముననే సాహిత్య విమర్శనమెంత పరిణతత్వము వహించినదో తేటతెల్లమగును. నృపతుంగుని రచనలో సంస్కృత కన్నడ పదసమ్మేళనము సముచితముగా జరిగినది. సంస్కృతాలంకార శాస్త్రమున ప్రసిద్ధములైన భావము లనేకము ఉద్ఘాటించి యున్నాఁడు. అట్లుచేయుటలో పొసఁగమియునులేదు. సంస్కృత వాఙ్మయసర్వస్వము భారతీయుల పెన్నిధి. దానిని సామాన్యజనోపయోగము గావింపఁజేయుటలోనే విపశ్చిద్వర్యుల విశేషప్రజ్ఞ విలసిల్లును. అదియే వారి సద్యఃకర్తవ్యము.

నృపతుంగుని యనంతర మనేక కవులు కావ్యసృష్టి సలిపినట్లు కతిపయాధారములుకలవు. ఇట్టివారిలో గుణవర్మ గణనీయుఁడు. ఇతని దాక్షిణాత్మకమైన గంభీరశైలి.

కన్నడసాహిత్యమున నాదికవి పంపమహాశయుఁడు. ఇతఁడు వేంగి మండలమునకుఁ జెందినవాఁడౌట మనకు గర్వకారణము కాదను. జైన బ్రాహ్మణుఁడు. ఇతఁడు "ఆదిపురాణము", "సమస్తభారతము"ను మహాకావ్యములను రచించెను. ఆదిపురాణమున నాదితీర్థంకరుల చరిత్ర వర్ణింపఁబడినది. జినమత సిద్ధాంతములిందు భక్తి ప్రపత్తులతో చిత్రింపఁబడినవి. ఇవి హృదయానందదాయకములై, మానవజీవితమర్మములను వివరించుచున్నవి. 'సమస్త భారతము', వ్యాసభారత సంగ్రహము. వ్యాసమునిచేఁ బోషింపఁబడిన పాత్రలస్వభావ గాంభీర్యమునిందు నూత్నజీవముతో సాక్షాత్కరించును. పంప మహాకవి పద్యరచనా చాతుర్య మనన్యమై పద్యమాల కన్నడకవి కంఠీరవుల కలంకార యోగ్యమైనది. 'పంప' మహాకవిమాత్రుఁడు కాఁడు, యోధాగ్రేసరుఁడు. చాళుక్యరాజగు అరికేసరికిని సైన్యాధ్యక్షుఁడుగానుండి యనేకాహవ నిర్వహణదక్షుఁడుగా కీర్తిగాంచుటచే నాతఁడు నాకపరిమితానందజనకుఁడు.

పంప తరువాత "పొన్న" యను మహాకవి శాంతిపురాణమును, పదునాలుగు పరిచ్ఛేదములుగల 'భువనైకరామాభ్యుదయము'ను కావ్యమును రచించి కన్నడభాషకు మహోపకారము గావించెను. 'రన్న కవి' అజితపురాణమును, సాహసభీమవిజయమును, రన్నకందమను నిఘంటువును రచించి కీర్తిగాంచెను. ఈ మహాకవీశ్వరునకు కవిరత్న, అభినవ కవిచక్రవర్తి, కవికుంజరాంకుశ

మున్నగు బిరుదములు సార్ధకములైనవి. పొన్న రన్నలుకూడ తమ పూర్వులు వేంగీ దేశస్థులని తమ వంశచరిత్రలోఁ బేర్కొనిరి. పంప పొన్న రన్నలను రత్నత్రయమను సాంకేతిక నామముతో కన్నడులు ముచ్చటించుకొని మురిసిపోవుదురు. రత్నత్రయము గద్యపద్యములకు సమాన ప్రాముఖ్యమునిచ్చి తమ కావ్యములను చంపువులుగనే రచించిరి. వీరు సంస్కృతభాషను, భావములను, ఛందస్సును సర్వతోముఖముగా వినియోగించుకొని తమ భాషను సంపన్న మొనర్చిరి. రన్న సమకాలికులలో నాగవర్మ, చావుండరాయలను సాహిత్యవేత్తలు ప్రశంసింపఁదగినవారు. జైనమతగురువుల చరిత్రను రాయలు గద్యకృతిగా రచించెను. నాగవర్మ సాహసోపేతమైన కార్యమును నెఱవేర్చినాఁడు. 'బాణోచ్ఛిష్టమిదంసర్వమ్మ'ని ఖ్యాతి గడించిన బాణుని కాదంబరీ గద్య కావ్యమును గన్నడీకరించి, కాదంబరీ సదృశమగు నద్భుతానందమును తనదేశీయుల కందించి ధన్యుఁడైనాఁడు. ఈతఁడు ఛందోంబుధియను శాస్త్ర కావ్యమునుగూడ రచించి భాషాయోష కలంకృతినొనర్చెను.

రత్నత్రయమని ప్రసిద్ధిగాంచిన పంప, పొన్న, రన్నయను గవిత్రయము జీవించిన కాలము కన్నడ సాహిత్యమునకు నిజముగా స్వర్ణయుగము. తమిళము తర్వాత కన్నడము దక్షిణభారత భాషలలో వాఙ్మయస్థితినంది యభివృద్ధిగాంచినది. తమిళపద్యరచనమునకు యతినియమము కన్నడపద్యరచనమునకు ప్రాస నియమము తద్భాషామాధుర్యమునకు వన్నెదెచ్చుచున్నవని నారాయణభట్టు తీవ్రమగు దేశాభిమానముతో నుపన్యసించెను. పూర్వప్రసంగమునకన్న నీ ప్రసంగము ప్రసన్నఫణితిని పరువులెత్తినది. నన్నయభట్టారకున కీ విషయములం క్రొత్తవికావు, అనార్యదృక్పథముతో భారతగాథను కన్నడమున రచించిన రత్నత్రయ దృక్పథమును నన్నయ తన యధ్యక్షోపన్యాసమున నిరసించెను. నారాయణభట్టు భాషావాఙ్మయాభివృద్ధులే ప్రస్తావించెను. కాని యీ పైవిసకు దృష్టి తరలింపలేదు. ఇందులకా కవుల దోషములేదని, రాజాభిరుచుల ననుసరించి వారు రచించిరని, తిరిగి నన్నయ రత్నత్రయమును సమర్థించెను. కన్నడభాష యభివృద్ధిచెందిన మార్గముననే తెనుఁగుభాషయు నభివృద్ధిగాంచవలయుననుటలో వివాదములేదని నన్నయ యుద్ఘాటించెను.

ఉపన్యాసములు జరుగుచున్నంతకాలము నన్నయభట్టు పండితపరిష్యుల ముఖదర్పణములందు ప్రతిబింబితములగువారి మనోభావములను బరీక్షించెను. ఇట్లాతఁడొనర్చినట్లుగా నెవ్వరికినిఁ దెలియదు. నారాయణభట్టున కీ పరిశీలనమున కవకాశము లేదు. అతనికి నుద్రిక్తత యెక్కువ. లోకజ్ఞతపట్ల నన్నయకున్నంత సూక్ష్మత నారాయణభట్టునకు లేదన నగును. దేశభాషోద్ధరణ విషయమై యీ పండితద్వయ మేదో యాలోచించుచున్నదవి, అది తమ కనవసరమని, పండితు లచ్చటచ్చట గుసగుసలువోయిరి.

విహరించుచున్న విషయమునుగూర్చి తన్ను ప్రజ లపార్థము చేసికొందురేమో యని యాతఁడు శంకించెను. రాజ్య సంరక్షణభారమును వజ్జియ ప్రెగ్గడపై వదలి, యిన్నాళ్ళు తాను విశ్రాంతిగ కాలము గడుపుచుండుటచే, ప్రెగ్గడ యెంత యొత్తిడిపడుచున్నాఁడో! కుంతలదేశమున పరిస్థితులు మారినవనియు, జగదేకమల్ల ఇమ్మడి జయసింహుఁడు రాజ్యాధికారమును వహించెననియు, యున్మాదాంతరంగిక శత్రులవుల నదుపులోనికి తెచ్చుకొను కార్యక్రమమున నాతఁడు నిమగ్నుఁడై యున్నాఁడనియు వేగులవారివలన చాళుక్యాధిపతి వినెను. అతఁ డే క్షణముననైన తమ గర్భశత్రువులవలన చాళుక్యులపై దండయాత్ర సలుప వచ్చును. ఏతాదృశ భావోద్వేగ చిత్తముతో విమలాదిత్యుఁడు వేవేగ పయనించుచుండెను. మేడాంబ తన భవితవ్యమంతయు కూలినట్లు లోలోన గుములుచున్నది. తా నెట్లు సంతోషమును నటింపవలయునో తెలియక మేడాంబ నిత్తరపోవుచుండెను.

విమలాదిత్యుని సాహాయ్యమున ధారానగరాధిపతి భోజుఁడు కర్ణాటకము నోడించినప్పటినుండి కర్ణాటరాజ్య పరిస్థితి యనేక విపరీతపరిస్థితులకు లోనైనది. త్రిభువనమల్ల విక్రమాదిత్యుని తరువాత అయ్య గణదేవుఁడొక్క సంవత్సరము గూడ స్థిమితముగ రాజ్యమేలలేదు. అయ్యరాజదేవుని పిమ్మట జగదేకమల్ల ఇమ్మడి జయసింహుని ప్రతాపమున కర్ణాటక రాజ్యలక్ష్మి తన పూర్వోన్నత్యము నందుకొన్నది. కర్ణాటరాజ్యమును బరివేష్టించియున్న ప్రచండ శత్రు సమూహమున కాతని పరాక్రమము విస్మయజనకమైనది.

జయసింహుఁడు సింహాసనము నధిష్ఠించిన యచిరకాలముననే శౌర్యధనులగు సైనికవరేణ్యులను సేకరించినాఁడు. భోజుని విజయమునకుఁ గారణభూతుఁడు చాళుక్యాధిపతి విమలాదిత్యుఁడు. కావున నాతనిని జయించిన భోజరాజును జయించినట్లేయని యాతఁడు భావించెను. విమలాదిత్యుఁడు రామతీర్థమున నుండిన సమయము కనుగొని జయసింహుఁడు బ్రహ్మాండమగు బలముతో చాళుక్యరాజ్యముపై దండయాత్ర ప్రారంభించెను.

సహస్రాక్షుఁడగు వజ్జియ ప్రెగ్గడ యీ విషయము నప్పుడే పసిగట్టెను. నగర రక్షణ భారము నాతఁడు నారాయణభట్టున కప్పగించి సముద్రోద్యోగుల నేమరుపాటులేక మెలగవలసినదిగా హెచ్చరికచేసి వజ్జియ ప్రెగ్గడ సైన్యసమీకరణము గావించుకొని జయసింహు నెదుర్కొననేగెను.

ఒకటి రెండు దినములలో ప్రభువు రాజధానీ నగరమును జేరగలఁడు. శత్రువు స్వీయరాజ్యపు సరిహద్దుల నింకను జేరలేదు. సర్వమును ప్రభువు లేతెంచి చూచుకొను వ్యవధి లేకపోలేదు. అయినను తాత్సారము చేయక, షష్టిపూర్తి యగుచున్న వజ్జియ ప్రెగ్గడ, రణకేళీ కుతూహల మానసుఁడై కర్ణాటావనీంద్రు నెదుర్కొన నేగుట వేంగిప్రజల కాశ్చర్యము గల్గించినది.

చాళుక్య సైన్యము నెదుర్కొనెను. జయసింహుఁడు వజ్జియప్రెగ్గడ నన్వేషించుచు వాహినీమధ్యమున మునిఁగెను. వజ్జియప్రెగ్గడ యొక్కచో నిల్చి తన్నెదిరించు వారికి ప్రతిక్రియ సలుపుట కుద్యమించెను. కుంతలసింహము సింహనాదము గావించుచు నమిత ప్రయత్నముపై ప్రతిభటనల నతిక్రమించి వజ్జియప్రెగ్గడను జేరెను.

ప్రభువు : మా దండనాథుఁడగు నారాయణభట్టారకు నపహరించి మా రాజ్యమునకుఁ దీరని కొఱఁతఁ దెచ్చిపెట్టిన మంత్రి సత్తములా మీరు ?

వజ్జియ ప్రెగ్గడ : అవును. నారాయణభట్టు వంటి ధీశాలి నెట్లువయోగించు కొనవలయునో తెలియని కుంతలాధిపతుల ధీకుశలత నేమని ప్రస్తుతింపవలయును ?

ప్రభువు (పరిహాసముతో): మీ రాజుతో కూడ, బ్రాహ్మణ వంశ సంజాతులగు మీతో పోరుట మా క్షాత్ర ధర్మమునకు విరుద్ధము ; అన్నట్లు మీ భూపతి నే భూతలమున దాచిపెట్టితిరి ?

వజ్జియప్రెగ్గడ : మా భూపతి యేభూతలమునైన రంజింపఁజేయగలరు. బ్రహ్మక్షాత్ర ధర్మములను రెండు కత్తుల నొక యొరలో నిముడ్చిన మా నైపుణ్యము మీకు క్రొత్తది గాదు. రణతలమున క్షాత్ర ధర్మనిర్వాహకులమైన మమ్మీసాకుతో తప్పించుకొనఁ జూడకుఁడు.

ఇట్లు వజ్జియప్రెగ్గడ కఠినముగా బల్కి జయసింహునితో తలపడెను. సింహ సదృశ ప్రతాపాభిరాముఁ డగు నా జయసింహ వల్లభునకా యమాత్య శేఖరుని లొంగఁదీయుట శక్యముగాక పోయినది. ఇరుపక్షముల సైనికులు నా యద్భుత దృశ్యము నవలోకించు కుతూహలమున నప్పటప్పుడు పరస్పర వైరమును విస్మరించిరి. వజ్జియప్రెగ్గడ వయసున నధికుఁడు. అయినను నాతని పరాక్రమ మసమానము. ముదిమిని దరిజేరనీయని వాతని నియమపాలనాబలం. జయసింహుఁడు నిండు జవ్వనమునం దున్నవాఁడు. రణకేళీ వీరోత్సాహ విలసితుఁడగు వజ్జియప్రెగ్గడకు జయసింహుఁడు కొఱుకరాని కొయ్య యైనాఁడు. బహువిధ సమరానుభవ కోవిదుఁడగు వజ్జియప్రెగ్గడ, రెండు దినములు ప్రయత్నించినను యౌవనోన్మాద రణకేళీ విహారుఁడైన జయసింహుని జయించుట శక్యముగాలేదు. అంతుపొంతులేక పోరుసాగుచున్నది. ఇంతలో చాళుక్య రాజేంద్రుఁడు శంఖ నినాదమును జేయుచు నాహవ రంగమున నడుగిడగనే చాళుక్య సేనావాహిని ఉల్లాస తరంగిత మాయెను. చాళుక్య కేసరి ఆవృద్ధామాత్య శేఖరుఁ డచంచలమగు చలమునఁ బోరాడుచుండుట తిలకించి చకితుఁడాయెను. విమలాదిత్యుని రాకమగాంచి కుంతల భూపాలుఁ డుత్కంఠతో వజ్జియప్రెగ్గడను విదలించుకొని చాళుక్య భూరమణునితో పోరాడసాగెను. కుంతల చాళుక్య రాజకంఠీరవముల కదనము దిదృక్షులోక లోచనములకు

దిగ్భ్రమ గల్గించెను. అది రెండు వృషభరాజముల పోరాటము. అది రెండు మదపుటేనుగులు ఢీకొనుట.

నారాయణభట్టు సహస్రాక్షములతో రాజమహేంద్రపురమును సంరక్షించుచుండెను. విమలాదిత్యుఁడు యుద్ధభూమికిఁ జనిన మఱునాఁ డర్ధరాత్రమున వృద్ధబ్రాహ్మణాకృతిలోనున్న యొకండు నారాయణభట్టు గృహము నన్వేషించుచుండెను. వెంటనే వేగులవాండ్రీ విషయమును బసికట్టి యావృద్ధ విప్రుని బట్టుకొని రాజభవనమునందున్న నారాయణభట్టు కడకు గొనిపోయిరి. ఆ నిశీథ సమయమునందు నారాయణభట్టొక ప్రక్క దీపాలమును బెట్టుకొని, సంస్కృత మహాభారతమును బఠించుచుండెను. వ్యాసుని పాత్ర చిత్రణ చణత్వమాతని నిత్యాన్వేషణము. భిషగ్వాలియగు నారాయణభట్టున కా గవేషణ యిష్ట మృష్టాన్న భోజనమువన్న సంతుష్టి గల్గించునది. నారాయణభట్టారకుఁడా కపట వృద్ధు నేకాంతమునకు రప్పించెను. అతఁడు తన నిజ రూపమునఁ బ్రత్యక్షమాయెను. అతఁడు కర్ణాట దండనాథులలో నొకఁడగు మధుసూదన భట్టారకుఁడు. వయసున నారాయణభట్టారకుని కన్న మిన్న. వేదాధ్యయన సంపన్నుఁడు. వివిధాహవ నిర్వహణచణుఁడు. నారాయణభట్టున కాతఁడన్న భ్రాతృగౌరవము. అందుచే నాతనిని దర్శించినంతనే నారాయణభట్టాశ్చర్యముతో నమస్కరించి క్షేమసమాచారములను గనుకొనెను. అంత మధుసూదనభట్టారకుఁ డటునిటును వీక్షించి జయసింహవల్లభుఁడు స్వయముగ నారాయణభట్టారకులకు వ్రాసియిచ్చిన లేఖ నొసంగెను. ఆతఁడా లేఖనంతయు నొక్క యుచ్ఛ్వాసమునఁ బఠించి దీర్ఘనిశ్వాసమును విడిచెను. అతని కనుగొలఁకుల కన్నీరు గ్రమ్మినది. కొన్నితరాలుగా తన వంశీయులు, కర్ణాటరాజ్యాధిపతుల కొలువు నలంకరించి విశ్వాసపాత్రులై, వివిధ మైత్రయాత్రలలోఁ బాల్గొని, రాజేంద్రుల సమ్మానము లందినారనియు, చాళుక్యభూపతికి వశమైనంతనే రాజమహేంద్ర పురముననే యుండుట, తమను కావగానున్నవనియు తా మెట్లో యేదేని యొక మిషతో తమ యాస్థానము నలంకరించి, దండనాథత్వముగాని మంత్రిత్వము వహించుట తమకును కర్ణాట రాజ్యలక్ష్మికిని శుభదాయకమనియు జయసింహుఁడు తన లేఖలో వెలువరించెను. నారాయణభట్టీ యుత్తరమును మఱియొకసారి చదువుకొనినాఁడు. తాను బందీగా పట్టియప్రెగ్గడ చేతిలోఁ జిక్కినాఁడు. రాజనీయ వైజ్ఞానికనిధియు, సౌజన్యమూర్తియు నగు పట్టియ ప్రెగ్గడ యుదాత్తమగు నుదారతతో సఖండ గౌరవసంపదలతో చాళుక్యప్రభువుల యాస్థానమునఁ దన్ను విద్వాంసునిగా నియోగింపఁ జేసినాఁడు. సురుచిర ప్రసన్న మూర్తియగు నన్నయభట్టారకుని సుస్నిగ్ధ స్నేహానుబంధము విడదీయుటకు వీలుకానిది. అట్టి తాను తిరిగి కర్ణాటమునకుఁ బోవలసినపని కానరాలేదు. కర్ణాటము తన కాణాచి కాదు. తన జన్మస్థలము వేంగిభూమియే. ఆ పవిత్ర

భూమియందుండుట తనకు స్వర్గమునందుండుటయే. కర్ణాటదేశమంతయు నవైదికముగ బరిణమించినది. తత్సంబంధమగు చిహ్నములు పవిత్రాంధ్రావని యందును బొడగట్టుచున్నవి కాని, నన్నయభట్టారక, పట్టియుగ్రపెగ్గడాది పరమ బ్రహ్మణ్యమూర్తు లసంఖ్యాకులుగా నున్నారు. వారి సందర్శనమునకైన తన కానంద మొదవును. తాను వేంగిమండలమునకు శాశ్వతమహోపకార మేదైన నిర్వహించి, తన నామమును సార్థకమొనర్చుకొనవలయునని యేమేమో తలపోసినాఁడు నారాయణభట్టు. "తనవంటి యాత్మగౌరవముగల వ్యక్తికి పంపనగు సందేశ మిదికాదని మీ ప్రభువులకు విన్నవింపుడు" అని గంభీరముగ నారాయణభట్టు మధుసూదనభట్టుతోఁ బల్కెను. మధుసూదనభట్టు "నేనీ నిర్ణయము నా జయసింహప్రభువుల కెప్పుడో తెల్పితిని. కాని నీ వీరప్రతాపము లందుగల ప్రీతితో నాతడు నన్నంపెను" అని రెండడుగులు ముందునకు వేసెను. తాను తన సోదరతుల్యుఁడగు మధుసూదనభట్టారకుని హృదయమును నొవ్వజేసితినేమోయని నారాయణభట్టు లోలోన బాధపడెను. ఇంతలో నాతని మానసాకాశమున స్థిరసౌదామినివలె నాతని యేకైక పుత్రి కుపమాదేవి సాక్షాత్కా-రించినది. ఏ యేడాది గ్రుడ్డుగానున్నపుడో కుపమాదేవి జనని స్వర్గమున కేగినది. అప్పటినుండి యామెను తన యరచేతులలో నల్లారుముద్దుగా సాకినాఁడు. తన మేనల్లుఁడు శిష్యుఁడు నగు కేదారభట్టున కష్టవర్ష ప్రాయమగు కన్యను సాలంకృతముగ సమర్పించినాఁడు. కేదారభట్టు కర్ణాటరాజ్య దండనాథులలో యువకుఁడు. మామగారియం దభిమాన మపారముగఁ గలవాఁడు. "జామాతో దశమోగ్రహః" అను నార్యోక్తి కపవాదమతఁడు. ఇట్లాలోచించుచుండగనే మధుసూధనభట్టు మఱికొన్ని యడుగులు వేసెను. నారాయణభట్టారకుఁ డాతురతతో మధుసూదనుని పిలచెను. అతఁ డున్ముఖుఁడై వచ్చుచుండగనే నారాయణభట్టెదురుగనేగి, "మా అమ్మ కుపమాదేవి క్షేమముగ నున్నదా? మా యల్లుఁ డేమైన నాతో జెప్పుమనెనా?" యని ప్రశ్నించెను. "కుపమాదేవి క్షేమముగానేయున్నది కాని కేదారభట్టుపై ప్రభువుల విశ్వాసము సన్నగిల్లినది. అతఁ డేమైన రహస్యవర్తమానము నిట కందజేయునేమో యని వారి శంక. నేను వచ్చువార్త యతనికిఁ దెలియదు" అని మధుసూదనభట్టు పలికెను. నారాయణభట్టుగుండె మఱింత ప్రజ్వరిల్లినది. కర్ణాటాధిపుల ప్రవర్తనమునకు నారాయణభట్టు రోఁత పడినాఁడు. కేదారభట్టు మానసికముగ నెంత బాధపడుచున్నాడో యని విచారించినాఁడు. అన్నిటికిని విధి యొక్కటే కలదు. దాని నెవ్వరును నతిక్రమింపజాలరను మనోనిశ్చయముతో నారాయణభట్టు కుములుచు దలంచుకొనుచు నిలిచిపోయెను. మధుసూదనభట్టు తిరిగి ముసలి బ్రాహ్మణ వేషము ధరించి తనదారిని బోయెను. నారాయణభట్టునుండి యెట్టి యాజ్ఞయు రాకపోవుటచే రాజభటు లెవ్వరును నాతనిని నిరోధింపలేదు.

రెండుదినములుగా నిరంతర సమరము సాగెను. ఇంతలో నుత్తరదిశ నుండి ధారానగరాధిపతి భోజుఁడు తన మిత్రరాజగు విమలాదిత్యుని లేఖ నందుకొని కర్ణాటముపై కాలుదువ్వెను. ఆవార్త చెవిసోకినంతనే జయసింహుని గుండెలు కొట్టుకొన్నవి. భోజుఁడు తన్నులజడి వణఁకుచున్న ఉత్తరదేశీయుల నణఁచుటకుఁ బోయిన తఱుణమును జూచుకొనియే పంతలాధీశుఁడు చాళుక్యులపై దండెత్తెను. తలవనితలంపుగా నేర్పడిన యీ క్లిష్టత నెదుర్కొను భారము రాజధానియందున్న కేదారభట్టు భుజస్కంధములపైఁ బడినది. కేదారభట్టున కొంటరిగ భోజరాజు నెదుర్కొను సామర్థ్యములేదు. కాని యచంచల ధైర్యసాహసము లాతనికి వెన్నతోఁ బెట్టినవి. నిత్యోత్సాహవిలసితమైన వీరాగ్రేసరుఁడా కేదారభట్టు.

జయసింహునకుఁ గర్తవ్యము తోఁచకున్నది. తనబలమునుండి కొంతపాలు కేదారభట్టునకుఁ బంపినచో విమలాదిత్య, పట్టియప్రెగ్గడలు తన్ను, తన సేనను నుసినుసి యొనర్తురు. సింహభూపతి పని యదరత్తైరలోఁ బడినట్లైనది. మానసికముగ గల్గిన యీ యలజడి శారీరకముగఁ గూడ నేర్పడినది. కేదారభట్టును గా వింతనసుక శంకించెను. తన యనాత్మప్రవర్తనచే కేదారభట్టు దానిని పరాస్తము గావించెను. ఇంతలో బ్రొద్దుక్రుంకినది. ఆ రాత్రిలోపుగా విమలాదిత్యునితో సంధిగావించుకొనవలయునను నిశ్చయమునకు జయసింహుఁడు వచ్చెను. ఇంతలో మధుసూదనభట్టు గుఱ్ఱమును దిగి రాజును సందర్శించెను. నారాయణభట్టు విషయము నాతఁడు తేని తెలింగించెను. ప్రభువునకు నారాయణభట్టుపై బట్టరాని యాగ్రహము వచ్చెను. అతనిని విశ్వాసఘాతకుఁడని నిందించెను. వెంటనే కర్ణాటభూపతి మధుసూదనభట్టును చాళుక్యరమణునిరతకు రాయబారిగాఁ బంపెను. విమలాదిత్య, పట్టియప్రెగ్గడలు భోజరాజు దండయాత్రను గూర్చియు, సేనానాయకుఁడైన కేదారభట్టు ప్రతిఘటనను గూర్చియు వచ్చిన వార్తావిశేషములను ముచ్చటించుకొనుచుండిరి. రాయబారి యాగమనము రాజేంద్రునకు విన్నవింపఁబడినది. వినయసంపన్నుఁడగు విమలాదిత్యుఁడు మధుసూదనభట్టారకునకు నమస్కరించి, సాదరముగ నుచితాసనమును జూపెను. మధుసూదనభట్టు పట్టియప్రెగ్గడకును నమస్కరించెను. మందస్మితవదనముతో నాతఁడా నమస్కృతిని స్వీకరించెను.

మధుసూదనభట్టు తమ యోటమిని ప్రకటించి సంధి యాచించెను. విమలాదిత్యుఁడు పట్టియప్రెగ్గడవంకఁ జూచెను. ఒకింత నిమీలితలోచనుఁడై పట్టియప్రెగ్గడ "మాతో యుద్ధము విరమించినచో మా మిత్రుఁడగు భోజభూపతి తోడను యుద్ధము విరమింపవలయును. శాంతిని భంగపఱచి, యుద్ధమునకుఁ బ్రేరేచినందులకు విమలాదిత్య భోజాధిపులకు కొంత రాజ్యమును, ధనము

నీయవలయును. మా భోజరాజునకుఁ జిక్కిన బందీలను వారికే వశపఱుప వలయున"ని సంక్షిప్తముగఁ జెప్పెను. విమలాదిత్యుఁ డీమాటలన్నియు శ్రద్ధగ నాలించినాఁడు. వజ్జియప్రెగ్గడ మాటలలోని యంతరార్థ మాతని కిప్పటికి గోచరింపలేదు. మధుసూదనభట్టు సంధిషరతుల కంగీకరించి వెడలెను. భోజరాజుతో సమరము తప్పినందులకు సింహభూపతి చింతిల్లెను. ఎప్పటికైన ధారానగరాధిపతిని రూపుమాపి, ద్విగుణీకృత సైన్యసమేతుఁడై విమలాదిత్యు నెదుర్కొనవలయునని సింహభూపతి యేమేమియో యోచించెను. మఱికొంత తడవు 'వజ్జియప్రెగ్గడ యుండగా విమలాదిత్యుని జయించుట శక్యమా?' యని సందేహించెను. ఇట్లు పరిపరి విధములగు ఆందోళనములతో చాళుక్యులకు నష్టపరిహారముగ కొంత రాజ్యమును, ధనమును సమర్పించి జగదేకమల్ల ఇమ్మడి జయసింహుఁడు నిజరాజధానికిఁ దరలెను.

౫

కుందవాంబకు తన ముద్దుబిడ్డతోడిదే లోకమైనది. ఎన్ని పనులున్నను తాతగారగు రాజరాజు దినములోనే రెండు మూఁడు పర్యాయములైన వచ్చి తన ముద్దుల మనుమని పలుకరించకుండ నుండఁగల్గెడివాఁడు కాఁడు. మేనమామ రాజేంద్రచోళుని మాట చెప్పఁబనిలేదు.

చాళుక్యవంశ రాకాసుధాకరునకు నామకరణ సంస్కార మహోత్సవ మతి వైభవముగ జరిగినది. ఈ నామకరణ మహోత్సవము చోళుల నూత్న రాజధానియగు గంగైకొండ చోళపుర ప్రవేశ మహోత్సవముతో ముడిపెట్టఁబడినది. చోళుల యద్భుత శిల్పకళా వైభవమునకుఁ బ్రత్యక్ష సాక్ష్యముగ నీపురము వినిర్మింపబడినది. సున్నము, గార లేకుండగనే యీ ప్రాకారపు గోడలు నల్లజాతి చెక్కలతో సమర్చఁబడినవి. మధ్య నాగబంధము లల్లి, కొసలు కొనలు దేలిన గుండ్రని బిళ్ళలుగల స్తంభములు, వానిపై నొకటి కొన కొట్టివేసినట్లున్న చదరపు టొడెలతో నొప్పు నాప్పురి నిర్మాణ చమత్కారము చోళుల వాస్తుశాస్త్ర వైదుష్యమునకు ప్రతిరూపము. అనేక పురములలోని చోళుల వివిధ దేవాలయ నిర్మాణములును నిట్టి వాస్తు శిల్ప సంశోభితములే. కాంచీపురమున చోళులు కట్టించిన చాళుక్యేశ్వరాలయము, ఐరావతేశ్వరాలయము, అనంతేశ్వరుని కోవెల వారి శిల్పకళా పరిణతను చాటుచున్నవి.

నామకరణ మహోత్సవ సమయమున విమలాదిత్యుఁడు సింహభూపతితో యుద్ధమాడుచున్నాఁడు. వేంగి మండలాధిపతిలేని కొఱఁత నందఱు తలంచిరి. తన ప్రభు వీ యానందసమయమున తమ కులబ్రాహ్మణుఁడు, పరమబ్రాహ్మణ్య మూర్తియు నగు నన్నయభట్టారకునితో ఫేంచేసి యుండునని కుందవాంబ

తంద్రివంక దృష్టులు సారించును. మఖల యిరుపురి నేత్రములు బిడ్డవంక ప్రసరితమౌను.

రాజరాజు స్వహస్తములతో భూసురవర్యులను వారివారి యర్హతల కెక్కుడుగ సదక్షిణ తాంబూల పూర్వక నూత్న పరిధాన గోదానాదికములతో సంభావించెను. గంగైకొండ చోళపుర నిర్మాతలగు శిల్పులకందఱకును సముచిత సన్మానముల గావించి, ప్రత్యేక సువర్ణపతక భూషణాదుల సమర్పించెను.

ఆ సాయంకాలము 'తిరుక్కురళ్' ప్రవచింపఁబడెను. 'తిరుక్కురళ్' అనఁగా పవిత్రములగు పద్యములని యర్థము. రెండు పాదముల పద్యమునకు 'కురళ్' అని పేరు. ఇందు మొత్తము సహస్రాధికములగు పద్యములు కలవు. ప్రతి పద్యము నవనవోన్మేష భావస్ఫోరకమైనది. ఇందలి పద్యములు ప్రవృత్తి, నివృత్తి మార్గములను విశదపఱచునవి. ప్రవృత్తి మార్గమునందు రాజ్యాంగ విధానము, కోశపద్ధతి, మిత్రత్వము, పాలకపాలిత సంబంధాదులను వక్కాణించు నధ్యాయములు కలవు. ఆదర్శ దాంపత్యమునకు సంబంధించిన యనేక విషయములు తత్కర్త వల్లువరు స్వానుభవములోనివి. ఆయా పద్యములన్నియు పౌరాణికుఁడు చదివి యర్థ వివరణముఁ గావించెను. ఇట్లే నివృత్తి మార్గమున వివిధ తత్త్వ ప్రతిపాదకములైన పద్యములనుగూడ పఠించి వ్యాఖ్యానించి శ్రోతలకు హృదయ ప్రమోదమును గల్గించెను.

ఆ రాత్రి కథాకళి నృత్య ప్రదర్శనము అతి మనోహరముగ జరిగెను. కథాకళి దక్షిణ భారతదేశమునందును, కేరళప్రాంతమందును విశిష్టత సంపాదించుకొన్న నాట్యకళ. ఇది నృత్య గీత అభినయాత్మకమైన యొక కళాకేళి. జటిలతరమగు హావభావములను, నాహ్లాదకరమగు కథను, పాత్రధారులు మూఁగగా నభినయించి, ప్రేక్షకహృదయంగమముగా సుబోధమొనర్పఁగలదీ కథాకళి నృత్యము. ఆహార్యాభినయమున కిందత్యంత ప్రాముఖ్యము కలదు. కథాకళి సాహిత్యము ముఖ్యముగా రామాయణ మహాభారతముల నాధారము గావించుకొని యుద్బుద్ధమైనది. ఇందలి పాత్రలు స్థూలముగా త్రివిధములు. అవియే తామసిక రాజసిక సాత్త్విక పాత్రలు. పాత్రల స్వభావమునఁ బ్రముఖముగా నేగుణము ద్యోతకమగునో దానినిబట్టి వారి యాహార్యము నిర్ణయింపఁబడును. ఇందు నృత్యనాటక కళలు రెండును మిళితమైనను, నిదిముఖ్యముగా నటనాత్మకమైనది. ఇందలి యభినయము సామాన్య నాటకాభినయముకన్న క్లిష్టతరమైనది. కారణ మిందు వాచికాభినయ ముండదు. వాచికాభినయములేని లోపమును నృత్యసంగీతాదులు, సాత్త్వికాహార్యాభినయములు పూరించును. అదియే యిందలి జటిలత. నటకుని హృదయోద్వేగము వివిధ రసానుకూలములైన హావభావాదులు, ముఖమునందలి కవళికలలోనే ప్రస్ఫుటమై ప్రేక్షకులకు రస స్ఫూర్తిని గల్గించును.

ఆనాఁటిరేయి కథాకళీ నటనాట్యంబున "కిరాతార్జునీయము"ను నటించినది. మహాభారతమునఁగల పాత్రలలో నర్జునుఁడుదాత్తుఁడు. ఇతఁడు మూర్తీభవించిన దైవ పౌరుషశక్తులు. భారతీయ విజ్ఞాన సర్వస్వమగు భారతేతిహాసమునకు హృదయమనఁదగు "భగవద్గీత"ను శ్రీకృష్ణపరమాత్మ ప్రబోధించినది పుణ్యపురుషునకే. ఇతఁడు బాల్యమున భరద్వాజ గురుకులమున సమస్త శస్త్రాస్త్ర విద్యలను గూలంకషముగనేర్చి, గురుదేవుని ఋణమును దీర్చిన యాదర్శ విద్యార్థి. ఇట్లు సంప్రాప్తమైన విద్యలతోఁ దనియక, తనప్రవాసకాలమును వ్యర్థముగానీయక, సమాహితచిత్తుఁడై, పాశుపతాది మహాస్త్రములను సముపార్జింప నిశ్చయించినవాఁడై, శివునిగూర్చి తపమాచరించెను. అర్జునపాత్ర సత్త్వగుణ సూచితములగు ధవళ వస్త్రములు ధరించి, విశాలఫాలభాగమున విభూతిరేఖలను దీర్చిదిద్దుకొని, రుద్రాక్షమాలలు వక్షస్థలమున వ్రేలాడుచుండ, నొకచేత రుద్రాక్షమాలఁ ద్రిప్పుచు, పద్మాసనస్థుఁడై యర్ధనిమీలిత నేత్రములతో రమణీయప్రకృతి వాతావరణమునఁ బ్రత్యక్షమైనది. అర్జునుఁడు క్రమక్రమముగఁ దనువు కృశింపజేసి, ఊర్పులను బిగపట్టి తపఃపరిణామ తీవ్రతను బ్రదర్శించెను. అనంతరము దీక్షాపరుఁడై, యేక పాదాంగుష్ఠమున నిలిచి, వాయుభోజనము జేసెను. అర్జునుని తీవ్రతమ తపోనిష్ఠాగరిష్ఠతకు ఋషిపుంగవులు ఈశ్వరుని సన్నిధికేగి భయానకమగు నా కిరీటి తపస్సును నటించి చూపిరి. అంతయు నవగతము గావించుకొనిన యీశ్వరుఁ డభయముద్రను బట్టెను. ఋషులు తమ తపోభూములకేగిరి. శివుఁడంతట కిరాతవేషమును ధరించెను. అది చూచుటకుఁ జాలముచ్చటగనున్నది. పార్వతి తన సుకుమార హస్తములతో పతినలంకరించినది. ఈశుఁడెఱుకరాజుకాగా, నీశ్వరి తగిన యెఱుకరాణియైనది. కుఱుచచేతులు, మిడిగుడ్లు, వదుకొన్న తలకట్టలు, చెంచుదలలు గల్గి విండ్లుచేఁబూనిరి. ఈశ్వర సంకల్పమున ననేకములగు నెఱుకజంటలు బయలుదేరి యారాజదంపతుల పక్కియల సంచరించినవి. ఈ విధమగు కిరాత బలముతో నెఱుకఱేఁడు పందులను వేటాడుచు నర్జునుఁడు తపమాచరించు ప్రాంతమునకు వచ్చెను. ఇంతలో పరమేశ్వరబోధితుఁడై, దైత్యుఁడను రాక్షసుఁడు సూకరుఁడై భీకరాకారమున బీభత్సుని వధియింప సమకట్టెను. అంత నా వీరుఁడు దానిని బాణమున నేయును. అదేసమయమున చంద్రశేఖరుఁడు బాణమేయును. హరుశరమును నరుశరమును నిరుపక్కియల దాకగా నా వరాహము శరనిధిమథనమునఁ దిరుఁగు శైలము పగిదినైనది. అంత నిరువురును నేను ముందేసితినన్న, నేను ముందేసితినని పోరాడిరి. ఈ పోరాటము ప్రజలలో నుత్సాహాతిశయమును రేకెత్తించెను. పార్థుని ధైర్యసంపదకాశ్చర్యపడి, నిజ రూపము చూపఁగా నతఁడు పరమేశ్వరుని స్తుతించును. ఆ స్తుతించుట వాచికముగా నుండదు. పరమేశ్వరుని ఘనతను, పరాక్రమమును, నాధ్యాత్మిక సంపదను,

చిద్విలాసములను నర్తనుఁడే వివిధనృత్యభంగిమల మూలమున ప్రేక్షకుల మనసు రంజిల్లున ట్లభినయించును. పరమేశ్వర విభూతిని హృదయములకు హత్తించుటలోని నటన మనన్య సాధారణము. అంతట హరుఁడు సుప్రసన్నుఁడై, పాశుపతాద్యనేక దివ్యాస్త్రములను నరునకుఁ బ్రసాదించి యాశీర్వదించును. కుందవాంబ మిక్కిలి శ్రద్ధాసక్తులతో నీ ప్రదర్శనమును దర్శించినది. తన ముద్దుబిడ్డఁడుగూడ 'కోదండపార్థుఁడు' గావలయునని యాశించినది. చోళ ప్రభువులానాఁటి కార్యక్రమములఁ దిలకించిరి. మిన్నుముట్టిన ప్రజోత్సాహమునకు, ఆనందమునకు వారి సంతృప్తికన్న కుందవాంబ శివలీలామహోత్సవములకుఁ బొందిన యానందము వారికెక్కుడు సంతుష్టిని గల్గించెను.

సింహభూపతిని జయించి విమలాదిత్యుఁడు తన సైనిక పరివారముతో రాజమహేంద్రవరమునకు రాగా పురజను లఖండస్వాగతము నొసంగిరి. శత్రురాజులకు సింహస్వప్నముగానున్న సింహభూపతి దండయాత్ర నరికట్టుటయేగాక, యింకతాను తనజన్మలో వేంగిభూమండలమును గన్నెత్తియైన గాంచరాదను నిబంధనముతో సంధి కుదురుట నిజముగా వేంగిభూమండలమునకు శుభోదర్కము. యువరాజు పుట్టిన వేళావిశేష మిట్టిదని యశేష ప్రజాసమూహము సమధికోత్సాహముతోఁ జెప్పుకొన్నది.

వజ్జియప్రెగ్గడ విమలాదిత్యులిరువురును సమానములగు బుద్ధిసంపదలు కలవారు. శత్రువులను వజ్జియప్రెగ్గడ ముందు బాగుగా నలయించును. అట్లలసిన వైరులు విమలాదిత్యుని ధాటికోర్వలేక తిరోధానులౌదురు. ఇదియొక యపూర్వమైన సమ్మేళనము. వజ్జియప్రెగ్గడ నాందీప్రస్తావనకు, విమలాదిత్యుఁడు భరతవాక్యమును బలుకుటకు సమర్థులు.

గంగైకొండ చోళపుర ప్రవేశము, చాళుక్య యువరాజునకు నామకరణ మహోత్సవము జయప్రదముగ జరిగిన వృత్తాంతమును విమలాదిత్యునకుఁ దెలిసినవి. చోళసార్వభౌముఁడగు రాజరాజునామమును చాళుక్యరాజ శిశువునకుఁ బెట్టఁబడెనని విని విమలాదిత్యుఁడు సంతోషించెను. రాజరాజునకు విమలాదిత్యుఁడు, రాజేంద్రచోళుఁడు వేఱుకాదు. రాజరాజుని యాశీర్వాదప్రభావముచేతనే చాళుక్యరాజ్యమభివృద్ధి పొందినది. చాళుక్యచోళ సామ్రాజ్యముల శాశ్వతస్నేహమునకు తన వివాహమొక పవిత్రచిహ్నమను విషయము విమలాదిత్యుఁడెప్పుడును సంస్మరించును. నేఁడు మఱియొక శాశ్వతచిహ్నమేర్పడినది. ఏవంవిధ భావ పరంపరలతో విమలాదిత్యుని మానస ముద్వేగ భరితమైనది. అతని ముఖాంబుజ మెఱ్ఱవారినది. అది గ్రహించినాఁడు ప్రక్కనున్న వజ్జియప్రెగ్గడ. నన్నయభట్టు ప్రభువు కన్నులలోఁ జూచుచుండెను.

వజ్జియప్రెగ్గడ : రాజరాజు తమకుతానై కూఁతు నిత్తునని రాయబారి నంపెను. చోళ చాళుక్య వంశములకు పరస్పరము వర్ధిల్లుచున్న మైత్రి యీ

ప్రేమ బంధముతో శాశ్వతమై యలరారునని యా చోళ సార్వభౌముని యుదారాశయము. ఆ యాశయము నేటితో ఫలించినది.

విమలాదిత్యుఁడు : అవును. మీ మాటల మూలమున నాకు గతచరిత్ర మంతయు స్ఫురించుచున్నది. మా అన్న శక్తివర్మ వేంగి సింహాసనమును మరల సంపాదించుటకుఁ బ్రయత్నించెను. కుంతలాధిపతి యగు ఇమ్మడి తైలపదేవుని యండతో వేంగి మండలమును నిరాఘాటముగ నాక్రమించుకొని పరిపాలించినాఁడు జటాచోడ భీముఁడను తెనుఁగు చోడుఁడు. జటాచోడుఁడు సమరైక వీరుఁడు, కార్ముక రాముఁడు, రణరంగ రాక్షసుఁడు. ఈతఁడు తైలపదేవుని యనంతరము కుంతల సింహాసనము నాక్రమించిన ఇరివబెడంగ సత్యాశ్రయునకు సాహాయ్యకముగా కర్ణాట దేశమున కేగిన తరుణమును గనిపెట్టి, మా సోదరుఁడు శక్తివర్మ వేంగి సింహాసనము నాక్రమింప నుద్యోగించెను. అప్పుడు మామగారు 'అరియు రాజరాజ'ను దండనాథునకుఁ బ్రబలమగు సైన్యము నొసంగి పంపెను. ఈ వార్తవిని జటాచోడుఁడు కర్ణాటకమునకుఁ బూర్తిగా చేరకుండగనే తిరిగి వచ్చెను. మా అన్న శక్తివర్మ కోదండరాముని వలె విజృంభించి చోళుల యండతో జటాచోడ రావణుని సంహరించి, చోళ నారాయణుఁడను బిరుదు వహించి వేంగి సింహాసన మధిష్ఠించెను. ఆ కష్టదశ తలంచినపుడు నా గుండె లదరును.

నన్నయభట్టు : "క్లేశః ఫలేన హి పునర్నవతాం విధత్తే" యనికదా కవిసూక్తి. ఆ గతచరిత్ర యట్లుండ నీ చాళుక్య యువరాజ జనన మీ వేంగి మండలమునకు శుభోదర్కమగునని దైవజ్ఞులు ముక్త కంఠమున వచించిరి.

వట్టియప్రెగ్గడ : అవును. ఈమధ్యనే నన్నయభట్టారకులు కోటినామ జపదీక్షను బూర్తిగావించి బ్రాహ్మణ సంతర్పణము గావించిరి. ఆ శుభ సమయముననే యీ యువరాజోదయ వార్తయుఁ జనుదెంచెను. ఇవి యాదృచ్ఛికములని, త్రోసిపుచ్చరాని సంఘటనలని నా యభిప్రాయము.

విమలాదిత్యుఁడు నన్నయ ముఖము నొకింత తేఱిపాఱఁ జూచెను. అనిదంపూర్వమగు తేజోరేఖ లాతని ముఖమునందుఁ బ్రకాశించినవి. వెంటనే ప్రభు వంజలి ఘటించెను.

నన్నయభట్టు : ప్రభూ! నన్నేమియో క్రొత్తగాఁ జూచుచున్నారు. నేను మీ నన్నయభట్టునే. కుందవాంబ మాకన్న శివదీక్షలో మిన్న. ఆమె తపః ఫలమే చిరంజీవి రాజరాజు.

విమలాదిత్యుఁడు : (చిఱునగవుతో) మా కుల బ్రాహ్మణులు దేవీ పక్షపాతులు. అందుచే ఆ రీతిగనే వచింతురు.

మువ్వురును మందస్మిత సుందర వదనారవిందులైరి. ఇంతలో నొక వార్తాహరుఁడు ధారానగరమునుండి వచ్చెను. అతఁడు తన చేతి కమ్మను

వజ్జియప్రెగ్గడ కందించెను. ప్రెగ్గడ యా లేఖను చాళుక్యతిలకునకుఁ జదివి వినిపించెను. సింహభూపతి పై విజయమును సాధించినందులకు భోజరాజు విమలాదిత్యు నభినందించుచు మైత్రీ సూచకముగ ధనకనకవస్తువాహనాదులను, దాసదాసీజనములను బంపుచు వ్రాసిన లేఖ యది. "కుంతల దండనాథుఁడగు కేదారభట్టు మమ్మెదుర్కొనెను. అతని మోము చిచిపి చీపము పెట్టపచ్చెను. మా కాతనితో యుద్ధము జేయుటకు బుద్ధి పుట్టలేదు. అట్లని యూరకుండ లేక పోతిమి. అతఁడు పద్మవ్యూహమున ప్రవేశించిన యభిమన్యు కుమారునివలె మా సేనా వ్యూహమునఁ జేరెను. అతని కున్న సైన్యమా యల్పము. సింహభూపతి తనకున్న సర్వసైన్యముతో మిమ్మెదుర్కొనినాఁడు. ఆరితేరిన యుద్ధవిశారదులగు మా దండనాథు లనేకు లాతని చేత మడిసిరి. ఇది నాకు కనువిప్పు గల్గించినది. మిన్నకుండిన విషయము శ్రుతిమించునట్లు తోఁచినది. ఇఁక నేనా యువకునితోఁ ఘోర సమరట్టితిని. ఎంతసేపైనను మా ద్వంద్వ యుద్ధము తెగలేదు. ప్రాణమునకుఁ దెగించి విసుగు జనింపగా నా నిశిత కరవాలమున కా యువవీరుని బలిగొంటిని, ఎంత మహాపాతకమున కొడిగట్టితిని! ఆ మఱుక్షణముననే యుద్ధ విరమణ వార్త వచ్చినది. శత్రువర్గ మాతని కళేబరమును రాజవీర లాంఛనములతోఁ గొనిపోయినది. నా హృదయము దుఃఖార్ణవమున ఘూర్ణిల్లినది. బ్రాహ్మణ హత్యాదోషమే కాక సుందరోజ్వల కుంకుమ శోభామూర్తిని జీవితమును శోభా విహీనమును గావించితినని బాధనందితిని. ఇంతలో నా యుప దండనాథుఁడు కేదార భట్టను నామము గలవాఁడనియు నాతఁడు మీ సంస్థానము నలంకరించిన నారాయణభట్టారకుని యల్లుఁ డనియుఁ దెలియ వచ్చెను. మా దుఃఖము ద్విగుణీకృతమైనది. ఇందులకు మిమ్ములను, నారాయణభట్టారకులను క్షమాభిక్ష నర్థించుచున్నాము."

ఈ దీర్ఘలేఖాంశము లాలింపగా విమలాదిత్యుని కంటికొలంకులలో నీరు తిరిగినది. నన్నయభట్టారకుని మెత్తనిగుండె విలవిల లాడెను. మహామాత్యుని వజ్రహృదయము బెండైనది. దయార్ద్ర హృదయుఁడగు చాళుక్య ప్రభువు కమ్మనందుకొని నన్నయభట్టారకుల కందించెను. నారాయణభట్టున కీ వార్త తెలుపుభారము నన్నయభట్టుపైఁ బడెను. ప్రభువిఁక మాటాడలేక విశ్రాంతి మందిరమునకు మరలెను.

నన్నయభట్టారకుఁడు సరాసరి నారాయణభట్టు గృహమున కేగెను. ఆ సమయమున నారాయణభట్టు మహాభారతమును బిగ్గరగాఁ బఠించుచుండెను. ఆతని కంఠము గాద్గదికమైనది. ప్రక్కనవచ్చి నిలువఁబడిన నన్నయభట్టారకు నాతఁడు గుర్తించలేదు. కొంతసేపట్లే నిలువఁబడినాఁడు నన్నయ. నారాయణ భట్టు అశ్రుకలిత నయనుఁడాయెను. అట్లే యోచించుచు గ్రంథమును మూసి

మరల చింతింపసాగెను. "బావగారు ! ఏదో దీర్ఘముగా యోచించుచున్నారే" యని నన్నయ ప్రసన్నముగాఁ బల్కరించెను.

నారాయణభట్టు: మహాభారతమువంటి నాకు ప్రీతిదాయకమగు నితర గ్రంథము లేదుగదా ! ఇప్పుడే యభిమన్యువధా ఘట్టమును చదువుచు కరుణా రసార్ద్రుఁడనై రసచర్వణమును జేయుచున్నాను.

నన్నయ కా ఘటనా సాదృశ్యము చింతగొల్పినది.

నన్నయ: ఇపుడు జరిగిన యుద్ధములోను అభిమన్యుని వంటి యసహాయశూరులు మరణింపగా పితరులు, పితృవ్యులెట్లు కృశించు చున్నారో పాపము !!

నారాయణభట్టు: అట్టివారు భారతమున నిట్టి ఘట్టములను బఠించి, ఆ లౌకిక శోకము నలౌకికరసముగా మార్చుకొని యానందింపవలయును.

నన్నయభట్టు: అది సాధ్యమా ! బావగారూ !!

నారాయణభట్టు: కష్టసాధ్యము. అదే సాహిత్య ప్రయోజనము. దీని కెంతో సంస్కారబలము కావలయును. వాఙ్మయ ప్రయోజనమును వాస్తవిక జీవితానుభవమున సాధించుటయే వాఙ్మయ ధురంధరత. నావంటివానికి సైత మట్టిది ఎంతవఱకు సాధ్యమో చెప్పలేను బావా !

నన్నయభట్టు: అట్టి యవకాశము లభించుటకూడ నొక యదృష్టమే యని భావింతురా బావగారూ !

నారాయణభట్టు: ఒక్క కరుణముపట్ల తప్ప తక్కిన రసములవల్ల నది యభిలషణీయమే కాని. కరుణరసమునకున్న హృదయద్రవీకరణ మన్య రసములకు లేదు. బావా ! నన్నేదో పరీక్షించుచున్నట్లున్నది ?

నన్నయ: అంతటివాఁడనా బావగారు ! సానుభూతితోడనే నోట మాటరాక యిట్టి తాత్త్వికచింతనమున మగ్నుఁడనైతిని.

నారాయణ: చెప్పుము. మనవంటి వివేకవంతులే శోకభయస్థానముల కాకుల పడుటయా ??

నన్నయ: ఏమియులేదు. కుమారుఁడు కేదారభట్టు....

నారాయణ: కేదారభట్టు ! ఏమైనది !! కర్ణాటాధిపతి శంకించి యవమానముపాలు చేసెనా ? భరించలేను. చెప్పుబావా !!

నన్నయ: బావగారూ ! ఉద్వేగమును స్వాధీనము కానిండు. మృత్యువే సమ్మానించినది.

నారాయణ: మృత్యువా !! ఎన్ని గుం....డి....య....లు !

(నోట మాటరాలేదు.)

నన్నయ: బావగారు ! విధివిలాసము !! భోజభూపతి పశ్చాత్తప్తుఁడై తమ క్షమాభిక్ష నర్థించుచు పంపుకొన్న లేఖను దిలకింపుఁడు.

నారాయణభట్టు తరుముకొని వచ్చుచున్న కన్నీటి నదుముకొనుచు, మధ్యమధ్య కన్ను లుత్తరీయాంచలముతో నొత్తుకొనుచు లేఖను బూర్తి గావించి, "కేదారభట్టు తన కర్తవ్యమును నెఱవేర్చిన ధన్యజీవి. అపరాధిమనుష్యుఁడు. అతని మరణమునుగూర్చి విచారింపవలసిన దేమియు లేదు. మఱల నింకొక మాఱు అభిమన్యువధా ఘట్టమును బఠించి, రసస్థాయి నందుకొందును. కాని నా కూఁతురు కుపమాదేవి యెట్లు కుమిలిపోవుచున్నదో! తలిదండ్రు లిరువురును గతింపగా దిక్కులేని మేనల్లుని చేరదీసి పెంచి, పెద్దచేసి విద్యాబుద్ధులు గఱపితిని. కుపమా కేదారులు చిన్నతనమునుండియు నొక్క కంచమునఁదిని యొక్క మంచముపై బరుండువారు. వారి వివాహానంతరము నా యర్ధాంగి గతించినను వారి దివ్య-దాంపత్య సందర్శనైక సంతృప్త మానసుఁడనై కాలము గడపితి"నని చెప్పుచుండగా గుఱ్ఱపుగిట్టలచప్పుడు వినిపించినది. ఆ ధ్వను లాగినయంతలో వజ్రామాత్యుఁ డశ్వమునుదిగి లోనికేగెను. అతని ననుసరించిన యశ్వారూఢుఁ డక్కడనే నిలువఁబడియెను. వజ్రామాత్యుఁడు నారాయణభట్టును కౌఁగిలించుకొని, మ్లానవదనముతో తన సానుభూతిని వెలిబుచ్చెను. మఱల నారాయణ భట్టారకుఁ డిట్లు నెమ్మదిగాఁ జెప్పఁ దొరకొనెను. "మా బావయు, సోదరియు సమస్తప్రయాసల కోర్చి కాలినడకను కాశి, గయ, ప్రయాగాది పుణ్యక్షేత్రములను దర్శించి తనియక కేదారమువరకును బోయి, కేదారేశ్వరస్వామిని సందర్శించి, తిరిగి సుఖముగ నిల్లుజేరినతరువాత నా యల్లుఁడే కేదారభట్టు జనించినాఁడు. కేదారభట్టు రెండేళ్ళ శిశువుగా నున్నపుడే మొదట తండ్రియు, తరువాత నా దుఃఖమునకుఁ దల్లియు మరణించిరి. అప్పటినుండియు నాతఁడు సంస్కృత కర్ణాటాది భాషలు, రణవిద్యయు నేర్చి నా కల్లుఁడుగాను, కుమారుఁడుగాను మెలఁగినాఁడు" అని నారాయణభట్టు వచించుచుండగనే వజ్రామాత్యుఁ డందుకొని "బ్రాహ్మణ ధర్మములను విడనాడకున్నను, క్షాత్రధర్మము నెప్పుడు ప్రధానముగావించుకొంటిమో, యప్పుడే మన మిట్టి యాపదలకుఁ బాలుగాక తప్పదు. మీ యాపదపట్ల మన యేలిక యెనలేని సానుభూతిని ప్రకటించెను. ముందు కర్తవ్యము నిర్ణయించుకొందము. మన ప్రధానప్రణిధి నిప్పుడు మీ వశము గావించుచున్నాను. మీరు వెంటనే బయలుదేరి శోకాగ్నిని దహించుచున్న కుపమాదేవి సంరక్షణమున కుద్యుక్తులు గండ"ని కర్తవ్య ముపదేశించెను. నారాయణభట్టామాటలకు చకితుఁడాయెను. కుపమా సంరక్షణ విషయజ్ఞానశూన్యుఁడుగానున్న నారాయణభట్టు తన యవివేకమునకుఁ జింతిల్లి వెంటనే వజ్రామాత్యుల యాదేశమును శిరసావహించుచున్నట్లు లేచి నిలువఁబడెను. బయట నిలువఁబడియున్న ప్రణిధుఁడు, కుంతలదేశానుకూలమగు సైనికవేషమును నారాయణభట్టున కొసంగెను. గూఢచారియు నట్టివేషమును వేవేగ ధరించెను. వజ్జియప్రెగ్గడ తా నధిరోహించిన గుఱ్ఱమును నారాయణ

భట్టున కొసంగెను. నారాయణభట్టు సైన్యమును జయించుచున్న ధైర్య వదనముతో భట్టారక ద్వయమునుండి సెలవు గైకొనుచునే, "నాహా! మఱచితిని. ఆ భారతప్రతి నందిమ్మ"ని నన్నయను గోరెను. దానిని నన్నయ యందించగా గుఱ్ఱము కదలిపోయెను. పట్టియప్రెగ్గడ 'ఆ ప్రతి యేమి ?' యన్నట్లు నన్నయ వంక చూచెను. "ఈ సంఘటనమువలన వాఙ్మయ రహస్యమును దెలిసికొంటిని. అది భారతము—ద్రోణపర్వము. అభిమన్యు వధాఘట్టము నార్తుఁడై పఠించుచున్న నారాయణభట్టున కీ దుఃఖవార్త వినిపించితిని. లౌకికమగు దుఃఖమును రసముగా పరివర్తింపఁజేసి యానందించు టెట్లో యాతని ముఖమున ననుభవపూర్వకముగాఁ దెలిసికొంటిని. నారాయణభట్టు వాఙ్మయ ధురంధరుఁడు.

పట్టియ : మావంటి రాజకీయజీవుల కిట్టి కళారహస్యముల నవగతము గావించుటే కాక, సామాన్య ప్రజలుఁగూడ సందుబాటు గావింపవలయునని నా మనవి. కుంతలాధిపతి నారాయణభట్టుపై పగపట్టియున్నాఁడు. ఎట్లీతఁడు తన పుత్రిని సంరక్షించుకొని వేంగీభూమికి మరలివచ్చునో !!

నన్నయ : నాకును నా విషయము సందేహాస్పదముగ నున్నది. తిరిగి నారాయణభట్టు వేంగి సంస్థానమునకుఁ జేరునంతవఱకు నా యాత్మకు శాంతిలేదు.

నన్నయ, పట్టియప్రెగ్గడలు తమతమ నికేతనముల కేగిరి. ఆ రాత్రి యంతయు నన్నయభట్టారకుఁడు నారాయణభట్టును గూర్చియే విచారించుచు నిద్రగాని నిద్రపోయెను.

౧౦

త్రికాలయోగిసిద్ధాంతదేవుఁడు రామతీర్థము కేంద్రముగా యా పరిసర ప్రదేశములందు జైనమత వ్యాప్తిని గావించెను. అతని మూర్తి విశేష మశేష ప్రజానీకమును విశేషముగ నాకర్షించినది. అతని మహిమలు జనులనాకర్షించినవి. ప్రజలలో నాతఁడు మునిఁగిపోవును. అందఱను నోరారఁ బల్కరించును. మనసార మాటాడును. హృదయమును సమర్పించును. ఒక దీపముతో ననేక దీపములు వెల్గించిన ట్లొక హృదయముతో వేలాది హృదయముల నాకర్షించు శక్తిసమంచితుఁ డా జినమునీంద్రుఁడు. బిడ్డలు లేనివారి నాతఁ డాశీర్వదించిన బిడ్డలు పుట్టుదురని ప్రజలకు విశ్వాసమేర్పడినది. సర్వవిధములగు నాధివ్యాధుల నా జినేంద్రుఁడు మంత్ర తంత్రకలాపములతో రూపుమాపుచుండుటచే నాతనిని ప్రత్యక్షదైవముగ భావించి దేశీయు లారాధించుచుండిరి. ఆంధ్రదేశమున నాతనికిఁ బ్రాప్తించిన యఖండ గౌరవ మింకే ప్రాంతములందును లభింపలేదు. ఆంధ్రుల మేధాసమ్మిళిత హృదయసంపద యాతని హృదయమును జూరగొన్నది.

సిద్ధాంతదేవుఁడు, పాదచారులైన జనులు, శ్రావకులు శతాధికులుగా వెంట రాగా, గ్రామగ్రామమును సంచరించుచు జైనమతవ్యాప్తి గావించుచుండెను.

ఇతఃపూర్వమున్న పరమతసహన మాతనిలో నానాఁటికి సన్నగిలుచుండెను. యజ్ఞ యాగాది క్రతువులు కేవల హింసాకాండ మాత్రమే. స్వర్గాది భోగముల కాసఁజేసి, స్వార్థపరులై, వేద వేదాంగవిద్యా విశేషులమని యహంకరించుకొనువారు సూనరులై యీ జీవహింసను గడంగుట సహింపరాని చర్య యని జినమునీంద్రుఁడు ప్రచార మొనర్పసాగెను. జైనమతము మానవునకీ ప్రపంచమునందే ముక్తిని కరతలామలకము సేయును. స్వర్గాది సౌఖ్యములు రిక్తములైనవి. సర్వభూతహితమే మానవుని ఏకైక లక్ష్యమను విషయము జినశ్రావకులు వాడవాడలఁ జాటుచుండిరి. ప్రజలందఱును తండోపతండములుగ సభలకు విచ్చేసి తమ యభిమానము ప్రదర్శించుచుండిరి. రామతీర్థము, విజయనగరము, సింహాచలము, అనకాపల్లి మున్నగు ననేక ముఖ్యప్రదేశములలో నీ ప్రచారము పరాకాష్ఠ నెక్కెను. వివిధ ప్రదేశములందు జినవసతు లేర్పఱుపఁ బడినవి. వాని పోషణమును ప్రజలే ప్రత్యేక శ్రద్ధతోఁ గావించిరి. మఱికొన్ని స్థలములలో దుర్గాధిపతులుకూడ సాయమొనర్చుచుండిరి.

ఇట్లుండగా దక్షారామ పుణ్యక్షేత్రమున చైనము జరుగుచున్న వార్త జినస్వామికిఁ దెలిసినది. తానింతదనుక నా ప్రాంతములలో మత ప్రచారము సలుపలేదు. ఉత్తర దిక్కునుండి దక్షిణముగా తన మతమును విస్తృత మొనర్పవలయునని యాతని యభీష్టము. ఉత్తరదిశలో తన మతముపట్ల ప్రజాభిమానము సాంద్రమైనది. ఆ ప్రాంతములందు బ్రాహ్మణ పండితుల ప్రతిఘటన మేమియు నాతనికిఁ గల్గలేదు. కారణ మేమన వారి కొక్కటే యొక గాఢ విశ్వాసము. అవైదికములగు మతము లేవియు నీ యార్యావర్తమున నిలువజాలవనునది. జినేంద్రులకు దక్షారామమునకు వెళ్ళవలయు ననియు చైనము నాపించి హింసను నివర్తింపవలయు ననియు సంకల్పము కల్గెను. వెంటనే తన కార్యక్రమమును వేవేగ కొన్ని ముఖ్యకేంద్రములలో ముగించుకొని జినస్వామి దక్షారామమునకు పయనమాయెను.

జినేంద్రుని దక్షారామ ప్రయాణము మూడు దినములు పట్టినది. అప్పటికే చైన మారంభమై నాల్గు దివసములు గతించినవి. వేంగి మండలములోని వేదాధ్యయన సంపద్విశారదులైన విప్రపుంగవులందఱు నా పవిత్ర ప్రదేశమున సమావేశమయిరి. చైనవాటిక భీమేశ్వరాలయమునకు సమీపముననే కలదు. ఒక చతురస్రాకారపు గుంటలో వివిధాకృతులు దాల్చిన యిటుకరాళ్లు వేదవిహితముగ పఱుచఁబడినవి. ఋత్విక్కులందఱు చైన దీక్షితుఁడైన దేవేంద్ర సోమయాజిని పరివేష్టించిరి. యజ్ఞముచేసి సోమయాజి యైనవాఁడుకాని చైనముచేయుట కర్హుడు కాడు. సోమిదేవమ్మ సోమయాజి పార్శ్వమున నున్నది. యజ్ఞశాల యించుమించుగా నేలకాని యున్నట్లున్నది. స్వాహానినాదములు మధురమంజులముగా వినిపించుచున్నవి. హోమగుండమునఁ బడుచున్న ఆజ్యధారలకు నగ్నిజ్వాలలు

ఒక్కొక్క సమయమున తీవ్రముగ పైకెగయుచున్నవి. ఋత్విజులు వానిని చేటలతో నణచుచున్నారు. పదవ దినమునాఁటి జైనమునకు త్రికాలయోగి సిద్ధాంతదేవుఁడు తన పరివారముతో దక్షారామమునకు వెలుపల విడిదిచేసెను. వెంటనే కతిపయ పరివార సమేతుఁడై జినస్వామి జైనశాలకరిగెను. జైనశాల సమీపమున ప్రేక్షకులతోపాటు తానును గూర్చుండి కార్యకలాప సందర్శన కుతూహలుఁడై యుండెను. దేవేంద్ర సోమయాజి యంత బలశాలి కాఁడు. అయినను నాతని దీక్షాదక్షత అనన్యమైనది. తొలుత పాకయాజియై, పిమ్మట సోమయాజియై యిప్పుడు జైనులుగా ఖ్యాతిగాంచు టాతని యుబలాటము. బక్కపలుచని శరీరము, దబ్బపండువంటి శరీరచ్ఛాయ, చక్కని కోలముఖము. నల్లని కనీనికలు, దివ్యకాంతులీను కుండలములు మమ్మూర్తుల అపర దేవేంద్రుఁడే యనిపించును. జైనదీక్ష యొక యసిధారా వ్రతము. ఇరువదియొక్క దినములు భోజనము చేయరాదు. పచ్చిపాలు మాత్రము త్రాగవచ్చును. కటికనేలపై పరుండవలెను. స్నానము చేయరాదు. దీక్షావస్త్రములేగాని యన్యవస్త్రములు ధరింపరాదు. నఖములతోగాని చింతకొమ్మతో శరీరమును గీఱవలయును. ఇట్టి నియమములు సోమిదేవమ్మకూడ వర్తించును. జినదేవున కీ విషయము లన్నియు దిగ్భ్రమ గల్గించినవి. కాని పదునొకండవ దినమున మేకను హింసింతురను వార్త యాతనికి దారుణముగా తోచినది. ఆ హింసయు కసాయి వాఁడు కావించు హింసవంటిదైన కాదు. అంతకన్న బాధాకరమైనది. నవ రంధ్రములొక్కొక్కదానినే బిగించి చంపుట. జినస్వామి కిది ఆపాదమస్తకము వేదనాకరమైనది. ఒక ప్రాణి నిట్లు హింసించి పడయు స్వర్గసుఖము పరమ నీచమని యాతఁడు భావించెను. అట్టి హింసాకాండను నివారించి, పిష్టపశువుతో యజ్ఞయాగాదులు పూర్తిచేసికొనుట సర్వజన సమ్మతమగునని యతని యభిప్రాయము. ఆనాఁడు వారికి మేకనే చిక్కనీకుండఁ జేసిన బాగుండునని యొక ఆలోచన జినదేవునకుఁ దట్టినది. ఆ యాలోచన మతని నటనుండి లేవతీయుటకు యత్నించినది. కాని యాతఁడు స్తిమితముగ నచ్చటనే కూర్చుండి ప్రేక్షక సమూహమును తిలకించెను. దేవేంద్ర సోమయాజి పంపిన ప్రత్యేకాహ్వానము నందుకొని వైదికమతాభిమానులనేకులు వేంచేసిరి. అందు నన్నయభట్టారకుఁడు, వజ్జియప్రెగ్గడకూడ నున్నారు. ఇంకను వేలాది భూసురులు, వేదవేదాంగాధ్యయనవేత్తలు, అధీతిబోధాచరణముల నతిక్రమించిన వేద ప్రచారకులుకూడ నా సభ నలంకరించిరి. వారి నందఱను గాంచి నన్నయభట్టు ప్రమోదాంతఃకరణుఁడాయెను. ఎక్కడెక్కడివారును నన్నయభట్టుతోడను, వజ్జియప్రెగ్గడ తోడను బరిచయము కావించుకొనుచుండిరి. అందఱకును నన్నయ ముందుగనే నమస్కరించుచుండెను. అతని ముఖమునం దుట్టిపడుచున్న తేజస్సు వినయ సౌజన్య సమ్మిశ్రితమై యవనీసురులందఱకు నాహ్లాదము పుట్టించినది. త్రికాలయోగి

సిద్ధాంతదేవు లాసీనులైన కొలఁది కాలమువఱకును వారెవరో యెక్కువమందికి తెలియదు. యజ్ఞయాగాదుల కిట్టి శ్వేతాంబరు లెవ్వరును రారు. ఈ వచ్చిన వాఁడెవఁడో యజ్ఞభంగము కల్గించుటకే వచ్చియుండుననుగుసగుసలు బయలు దేరినవి. కడకాతఁడు జైన మునీంద్రుఁ డనియు, త్రికాలయోగి సిద్ధాంత నామ ధేయుఁ డనియు, దక్షిణ కళింగదేశమున జైనమతమును దేశీయమతముగా వ్యాప్తిగావించినవాఁ డనియు నందఱును జెవి కఱచుకొని చెప్పిరి. ఇట్లెసఁగ మెసఁగిన గుసగుసలలో నింక తా నక్కడుండుట భావ్యము కాదని జినయోగి మెల్లగ లేచిపోయెను.

తన నివాసమున కేతెంచి, జినస్వామి శ్రావకుల గొందఱను గొల్లపల్లెకుఁ బంపి బ్రాహ్మణులకు నజముల నమ్మనీకుండఁ జేయునట్లును, అవసరమైన నధికమూల్య మిచ్చి కొని హింసాకృత్యమును నిరోధించవలసినదిగా నాతఁ డాజ్ఞాపించెను. శ్రావకులు శ్రమపడి గొల్లవాడల కేగి తమ గురువర్యు నాజ్ఞ చొప్పున నజముల నమ్మవలదని ప్రచారము చేసిరి. కొంత తడవునకు బాపనయ్యలు మంచిమంచి మేకలను ప్రత్యేక స్థలములలో సుడులు గిడులు గలవానిని చూచికొని పెంచుచున్నారని యొకానొక యాదవుఁడు నుడివెను. అంతటితోవారు నిరాశఁజెంది తమ గురువర్యులకావిషయమును నివేదించిరి. గోటితోఁబోవుపనికి గొడ్డలి నుపయోగింపవలయునేమోయని జినయోగి చింతించెను.

ఆనాఁడుదయము రెండుజాములు ప్రొద్దుమీఱినపిమ్మట మేకల వపతీయఁ బడును. ఆ వపనేతిలో వ్రేల్చబడును. అట్లు వ్రేల్చిన వపను దీక్షితులైన సోమయాజి, సోమిదమ్మ, ఋత్విజులు భుజింపవలయును. ఏతత్కార్యమును భంగపఱచుటెట్లాయని గతరాత్రియంతయుఁ జినేశ్వరుఁడు యోచించెను. ఈ విషయమును చాళుక్యప్రభువుతోఁ జర్చించిన బాగుండునేమోయని కొంత తడవు తలపోసెను. నిక్కముగ విమలాదిత్యునకుఁ దనపట్ల నఖండగౌరవము కలదు. కాని రాజునకుఁగల వ్యక్తిగతాభిమానమును బురస్కరించుకొని యిట్టి విషయములో సాయపడుమని యపేక్షించుట భావ్యముకాదనికూడ జినస్వామి వెంటనే సమాధానపడెను. ఇట్టి యాలోచనతో నాతనికంతగా నిద్రపట్టలేదు. కాసింత దనుక జినమత ప్రచారము సల్పిన ప్రదేశమంత విజ్ఞానవికాసములు కలదికాదు. సామాన్య ప్రజలలోఁ దన ప్రబోధములు ఫలించినట్లే దేశమున ఫలించుట దుర్లభమని గ్రహించెను.

తెల్లవారినది. దక్షారామాలయకాంచన శిఖరమున బాలారుణాతపకిరణజాలము ప్రతిబింబించెను. బాలసూర్యుఁడు చాపలమున తచ్ఛిఖరము నధిష్ఠించి యాడుకొనుచున్నట్లు తోఁచెను. అప్పటికే జినముని కాల్యకృత్యములు దీర్చుకొని మహావీరారాధనము గావించెను. శిష్యులగు శ్రావకులుకూడ సంసిద్ధులైరి.

శ్రావకులందఱు ననుగమింపగా జినముని దక్షారామ గ్రామమునందు ప్రవేశించెను. ప్రజలందఱును నీ నూతనవ్యక్తి ముఖారవిందమున కాకర్షితులై నిలువఁబడిరి. సిద్ధాంత యోగీశ్వరులొక చతుష్పథమున నిలిచి, పవిత్ర భీమేశ్వరాలయ సమీపమున చైనము జరుగుచున్నదనియు, అందులకై నోరులేని జీవములు హతము కానున్నవనియు, అట్టిహింసాకాండ జరుగనీకుండ చూచుట తన కర్తవ్యమనియు, అట్టి కార్యభారము వహించియే తానీమండలమునకు విచ్చేసితిననియు జినేంద్రుఁడుపన్యసింప మొదలిడెను. ఈ మాటలాలించుచు కొందఱు గ్రామస్థులు స్థిమితముగాఁ గూర్చుండిరి. వేదములు కర్మనిర్వహణము ప్రధానముగా కలవియని బల్కి బ్రాహ్మణులు నిరంకుశముగా వానిని తమ స్వాధీనమందే యుంచుకొని వర్తించుచున్నారు. ఘోరహింసకు వెనుదీయక స్వర్గాది తుచ్ఛ సౌఖ్యముల కాసపడి యజ్ఞయాగాది క్రతువులను గావించి, స్వార్థపరులై ప్రవర్తించుచున్నారు. వారి యీ హింసాకాండను సహించి యూరకున్న ప్రయోజనములేదు. ఇప్పుడు లోకమంతయు పరమ పవిత్రముగా భావించు భీమేశ్వరాలయ సమీపముననే ఘోర హత్యాకృత్యము జరుగనున్నది. మీరందఱు నీ విషయమున మాకుఁ దోడ్పడవలసినదిగా కోరుచున్నాను. ఆర్యమత మిట్లు కలంకమగుటచేతనే వేయిసంవత్సరములకుఁ బూర్వము వర్ధమాన మహావీరుడను మహాపురుషుఁడీ దేశమున నవతరించి జైనమతధర్మము నిచ్చట ప్రతిష్ఠించెను. అహింసా ధర్మ మీ మతసూత్రమాలికయందు మణిపూస. మీరందఱును నీ హింసావ్రత పరాయణుల యుద్యమము నరికట్టవలయున"ను ధోరణిలో జినయోగి యుపన్యాసమొక యరగంటకాలము సాగినది. ఆయనమూర్తి ప్రజల వరికట్టినది. వారి మానసము లుద్రిక్తములైనవి. సభానంతర మందఱును కఱ్ఱలు, బుఱ్ఱలు పట్టుకొని క్రతుశాలను సమీపించిరి. అప్పుడే మేకలు తత్సమీపమునకుఁ గొనిరాఁబడినవి. ప్రజలొక్కమారుగా బ్రాహ్మణులను సమీపించి వారిచేతనున్న పలువులను లాగిరి: బాపలు భయభ్రాంతులైరి. శూద్రజనము తమ్మెతాకి మయిల పఱచినందులకు వారికిఁ బట్టరాని యాగ్రహము వచ్చినది. ఎఱ్ఱవారి మోములు కందగడ్డలైనవి. క్రతుభంగమయినచో నెంతయో శాంతిక్రియలు జరుపుకొనవలసి యుండును. భావి కార్యవిధానభంగము వారిని మఱింత కలవరపఱచినది. ఏమి సమాధానము చెప్పవలయును? ఏమనిచెప్పిన వారికర్థమౌనో వారి కవగాహనము కాలేదు. ఇంతలో వల్లియప్పెగ్గడ నన్నపార్యులా సమీపమునకు వచ్చిరి. వల్లియప్పెగ్గడను జూచినతోడనే జనసమూహము జంకినది. కనుబొమలఁ గుంకుమబొట్టు, ఫాలభాగమున శరచ్చంద్రికాకాంతుల కెనయగు విభూతిరేఖలు, శిరఃప్రసారిత కేశగ్రంథి, పచ్చనిపట్టుశాలువ, కటి ప్రదేశమునుండి జాలువారు కరవాలముగల యాతని మూర్తి వారికి భీప్రదమైనది. అతని ముఖమ్మున క్షత్రియతేజము వెల్లివిరియుచున్నది. అట్లు తన్నుజూచి జంకిన

గుంపు నాతఁడావలికి పొమ్మని గద్దించినాఁడు. అంతొక్క యువకుఁడు. "పేరు
నకు బాపనయ్యలు! చేయునది జీవహింస!!" యని యాక్షేపించినాఁడు. ఆ
యువకుని సాహసము వజ్రామాత్యునకు మఱింత కోపకారణమైనది. ఇది వాని
స్వకపోలజనితముకాదని యాయన కెఱుకయే. ఎవ్వరో వెనుకనుండి యీ
నాటకమాడించుచున్నారు. "నీకు తెలిసినంత మాత్రపు హింసాహింస వివేకము
మాకుఁదెలియకపోదు. మా మార్గమును మీరడ్డగించిన గాజులుధరించి యూర
కుండువారముకాము. మీపని మీరుచూచుకొనుఁడ"ని వజ్రామాత్యుఁడు ఘాటుగా
బదులుపలికెను. ఋత్విక్కులు వెంటనే స్నానములుచేసి మడుఁగు దోవతులు
ధరించి వచ్చిరి. మేకలు యజ్ఞశాలకు గొంపోఁబడినవి. క్రతుకలాపము నిర్వ
ర్తింపఁబడినది. జనసమూహము వెనుకకు మరలినది. నన్నయభట్టారకుఁ
డిదియంతయు విస్మయమానసముతో విలోకించుచుండెను.

వజ్రామాత్యుఁడు : కాలము విపరీతమగుచున్నది. అవైదిక మతములు
ప్రబలి జ్ఞానహీనులగు సామాన్య మానవులను పెడత్రోవల కీడ్చుచున్నవి.

నన్నయభట్టు : ఆర్యధర్మము సామాన్య మానవుని సమీపమునకుఁ
బోవుటలేదు. ఈ ధర్మమేదో యొకవర్గమునకు మాత్రమే చెందినదను ప్రచారము
నన్యమతములు గావించుచున్నవి. సర్వజన సమ్మోదదాయకమగు ధర్మప్రబో
ధము మాతృభాషలో జరుగవలయును. అప్పటికిగాని యిట్టి దుష్ప్రచారములు
కొంత సద్దుమణగవు.

వజ్రామాత్యుఁడు : ఆహా! అద్భుతమగునూహ!! నిజమే....యెంత
కాలమిట్లు ప్రజలనరికట్టుట? ప్రజలకు దూరముగా మడిగట్టుకొనియుండుట??
నన్నపార్యా! మీరే యీ యుద్యమమునకు నడుముకట్టవలయును.

నన్నయ : మీకు నాయందున్న భ్రాతృప్రేమయే యిట్లు పలికించు
చున్నది. దైవమెవ్వరిచే నాకార్యమును నిర్వర్తింప నియోగించెనో! అట్టి
నిర్ణయమేజరిగి యీ మహాయజ్ఞము పూర్తియైన యాంధ్రావనికి మహోదయము
కల్గును.

ఇట్లు ముచ్చటించుకొనుచు నన్నయభట్టారక వజ్రియప్రెగ్గడలు లైన
సందర్శనాగతులగు బహుదేశాగత పండితోత్తములను సమీపించిరి. ప్రతి
భూసురోత్తమునకును నన్నయభట్టారకుఁడు మున్ముందుగనే వినమిత
శిరస్కుఁడై యంజలించును. ప్రత్యంజలిని తన మృదు కరద్వయముతోఁ బట్టి
కనుల కద్దుకొనును. చాళుక్య కులబ్రాహ్మణునిలోఁ గల ఈ సహజ వినయ
సౌజన్య సౌందర్యసంపద పండితసదస్సునకు సంతోషాశ్చర్యములను జనింపఁ
జేసినవి.

నన్నయభట్టారకునకు పూర్వమీమాంసపట్ల మక్కువ యెక్కువ.
జైమినిమహర్షి విరచితమగు పూర్వమీమాంసా సూత్రములకు శబరస్వామి

భాష్యమును రచించెను. ఈ శబర భాష్యమును కుమారిలభట్టు శ్లోకవార్తికము, తంత్రవార్తికము, టుప్టీక యని మూఁడు భాగములుగా వ్యాఖ్యానించెను. ఈ వ్యాఖ్యానముల కనేక వ్యాఖ్యానములు వెలసినవి. నన్నయ వాని నన్నింటిని క్రాంతదర్శి స్థూలముగ పరిశీలించెను. అయినను తన మనోగతాభిప్రాయములను వెలువరించుపట్లఁ గాక, ఇతరుల యభిప్రాయ విశేషములను విని యన్య దృక్పథములను గ్రహించుపట్లనే యాతని కాసక్తి యధికము.

పండితవరేణ్యులతో నన్నయభట్టారకుఁ డానాఁ డనేక విషయములను చర్చించెను. అవి కేవలము విషదాహంకారముతోఁ గావింపఁబడినవికావు. ప్రతి వివాదము నాతఁ డెక్కడికక్కడ సమన్వయపఱచును. మొత్తముమీఁద వేదవిహిత కర్మాచరణముపట్ల ఆనాఁటి విప్రవరులు విశేషామోదమును ప్రదర్శించిరి.

భక్తి జ్ఞాన కర్మలలో నన్నయార్యునకు కర్మమార్గ మత్యుత్తమమని దృఢపడినది. ఎంతటి జ్ఞానయోగి యైనను కర్మను విడనాడినచో నాతనిలోని జ్ఞాన జ్యోతి కొడిగట్టి యారిపోవును. అగ్నికి రెండువిధములగు శక్తులు గలవు. ఒకటి: తేజశ్శక్తి: రెండవది: తపనశక్తి. ఇందొకటి వినా మఱియొకటి లేదు. ఇవిపైకి భిన్నములుగా గోచరించినను తత్త్వతః రెండు నొక్కటియే. ఈ రెంటిని మనము విభిన్నముగా జ్ఞానేంద్రియముల మూలమున నవగాహనము గావించుకొనుచుండుటచే నీ రెంటిని వేఱువేఱుగా మనము గుర్తించుచున్నాము. "బ్రహ్మోద్భవం కర్మ" యని గీతాకారుఁడు వచించెను. కర్మ గౌణము; ముఖ్యముకాదని ప్రకటించు ప్రజ్ఞావాదులు తన్మూలమున కర్మభ్రష్టులు కాఁజొచ్చిరి. అందువలన శాశ్వతానంత సంపద్విలసితుఁడగు నే బ్రహ్మము నుండి జ్ఞానము ప్రకాశించుచున్నదో, అదే మూలమునుండి కర్మ వెలువడుచున్న దని పరమాత్మ ప్రవచించెను. బ్రహ్మోద్భవమైన కర్మ, జ్ఞానహేతువు కాకుండ నుండఁజాలదు. కర్మ చిత్తశుద్ధిసాధక మనుట సత్యమే. కాని చిత్తశుద్ధి వట్టి శుష్కకర్మ మాత్రముననే సంప్రాప్తము కాదు. జ్ఞానదగ్ధమైన కర్మయే చిత్తశుద్ధి సాధన మగును. జ్ఞానసిద్ధి కల్గిన వెంటనే కర్మప్రసక్తి యుండదని తలంచుట పొరపాటు. అందువలననే కృష్ణపరమాత్మ యంతటివాఁడు తాను పొంద వలసినది జగత్తున నేమియు లేకున్నను కర్మ చేయుట మానలేదు. ఆ హేతువు చేతనే తనచే ప్రవర్తితమగు కర్మచక్రము ననుసరింపు మని యాతఁ డర్జునుని హెచ్చరించెను. జ్ఞానము తనలో తా నిముడిపోవు స్వభావముకలది కాదు. అది సృజనశక్తి గల్గి బహిర్గతమై విశ్వరూపము దాల్చవలయును. జ్ఞానసిద్ధి కల్గినట్లు గ్రహించుటకు పరీక్ష యెట్టిది? లోక సంగ్రహముగా సాధర్మ్యరూపములను బొంది సత్యశివముల కైక్యము సాక్షాత్కరించుకొన్నప్పుడు, సమగ్రమైన జ్ఞానము సిద్ధించిన ట్లగును. జిజ్ఞాసువు తన జ్ఞానమును గర్మదృష్టితోడను,

గర్మను జ్ఞానదృష్టితోడను జూచి, రెంటిని మోక్షసాధకములుగఁ జేసికొన వలయును. ఈ యుదాత్తమగు సమన్వయ జ్ఞానము నన్నయభట్టారకున కీ సమయమున విశేషముగా నేర్పడినది.

ఆనాఁటి చైనమునందలి కార్యక్రమము నిర్విఘ్నముగ నెఱవేరినది. మధ్యలో వచ్చిన యంతరాయమువలన భోజనము లాలస్యమైనవి. అనఁగా సూర్యాస్తమయమునకు మూఁడు నాల్గుఘడియలు మాత్ర ముండును. భోజనములు సగము పూర్తియయినవి. అందొకమూల నొక బ్రాహ్మణపంక్తిలో నొక బాలుఁడు కూర్చొనియుండెను. అతఁడు పిరికిగుండెతో భోజనము చేయు చున్నాఁడు. ఎవరైనఁ దన్నుజూచి గుర్తించినచో తన కామాత్రముకూడ ప్రాప్తముండదని యాతని భీతి. దానికి తగినట్లే యొక బొజ్జబాపఁడు పిండివంట వడ్డించుచు నొదిగి భుజించుచున్న బాలుని ముఖములోనికి తొంగిచూచెను. వెంటనే వడ్డన మాని వామహస్తమును బట్టుకొని సంప్రహారములతోఁ బంక్తు లన్నియు దాటించుకొని, "ముండకొడకా! తగుదుమని వచ్చితివా?" యని గద్దించుచు నవతలకు గెంటెను. ఆ బాలుఁ డాపాదమస్తకముగా మండిపడెను. నేత్రాంచలములనుండి అశ్రుజలము జలజల ప్రవహించినది. నోటికడ నున్న భోజనమునుండి తన్ను తొలగించిన యా బొజ్జబాపని నిలువున ద్రుంగుడ మన్నంతగా కష్టము కల్గిన దాతనికి. తన తండ్రి భీమేశ్వరుఁడు తన వాక్కునకుఁ దిరుగులేదని చెప్పెను. ఆ మాట స్ఫురణకు వచ్చినదా బాలునకు. "ఈ యప్పాలన్నియుఁ గప్పలగుఁగాక! ఈ యన్నము సున్నముగుఁగాక!!" యను మాట లప్రయత్నముగా నాతని నోట వెలువడెను. భీమేశ్వరుని ప్రభావము వలన నాతని మాటలు యథార్థములైనవి. అందఱును గగ్గోలెత్తిరి. ఈ విపరీత స్థితి కేమిచేయవలయునో యెవ్వరికిని తోఁచలేదు. ఒకప్రక్క పంక్తిలో ఋత్విక్కులు, వారిప్రక్క నన్నపార్యుఁడు, వజ్జియుప్రెగ్గడలు కూర్చుండి యుండిరి. ఈ దుస్థితి యందఱకును దుర్భరమైనది. నన్నపాచార్యుఁడు నిమీలిత నేత్రుఁడై యోజించి, "భీమేశ్వర వరప్రసాదునకు మహాపచారము కల్గినది. ఆతనిఁ బిల్పించి మన్నింపుఁడ"ని నుడివెను. బ్రాహ్మణులు విస్తరిముందుండి లేవలేదు. మార్గాంతరములేక నన్నపాచార్యుఁడే స్వయముగా నా కుమారుని బిలిచి "భీమేశ్వర పుత్రా! అజ్ఞుఁ డొనర్చిన కృత్యమునకుఁ గినియకుము. రమ్ము! నా పంక్తియందు కూర్చుండి భుజింపుమ"ని ప్రేమపూర్వకముగా నాహ్వానించెను. భీమకవి మానస మా మహనీయుని మంత్రముగ్ధమగు మాటలకుఁ బ్రసన్నమైనది. వెంటనే కప్పలన్నియు నప్పాలుగను, సున్న మన్నముగను బరివర్తన మైనవి. భీమకవి ముఖారవిందము నన్నయభట్టారకునికి ముచ్చట గొల్పినది. భోజన మధ్యమున నాతని వృత్తాంతమంతయు నన్నయభట్టు ప్రశ్నించి తెలిసికొనెను. భోజనానంతరము వజ్జియప్రెగ్గడ సామాన్య నియమము

లసాధారణ ప్రజ్ఞా వైభవోపేతులపట్ల చెల్లదని బొజ్జనాపనయ్యను మందలించెను. భీమకవి సమున్నత నియమపాలనముతో పరమేశ్వరుని వరమును సద్వినియోగము గావించుకొన్నచో మహాకవీశ్వరుఁడు కాఁగలఁ డని నన్నయభట్టారకుఁ డాశించెను. ఇట్లింపలి సహాయ సంపదలతో వైదికకార్యము పరిసమాప్తమైనది.

ప్రజలు తన ప్రబోధమును విని జంతుహింస నరికట్టుటకై గావించిన యత్నములు విఫలమైన పిమ్మట: త్రికాలయోగి సిద్ధాంతదేవుఁడు రాజమహేంద్రవరమున కేగెను. ఆనాఁ డంతఃపురము సంతోష సంరంభముల నోలలాడుచుండెను. మేడాంబాదేవికి మగశిశు వుదయించెను. ఆ యానందతరుణమున విమలాదిత్యుఁడు జినయోగికి హృదయపూర్వక స్వాగత మొసంగెను. జినస్వామి రాజధానీ నగరమునకు వచ్చు టదియే ప్రథమ పర్యాయము. విమలాదిత్యుఁ డిచ్చిన ఘన స్వాగతమును బట్టి ప్రజ లా జైనయోగి మహిమ యెంతటిదో యని భావించుచుండిరి. పురప్రముఖులు గూడ నీ స్వాగతములోఁ బాలు పంచుకొనిరి.

విమలాదిత్యుఁడు జైనమహర్షితో ప్రీతితో గోష్ఠి గావించెను. జినముని తన మతప్రచారోద్యమ సాఫల్యమును ప్రభువున కెఱిఁగించెను. అందుల కాతఁడు చిఱునగవుతో వార్త లెప్పటికప్పుడు తనకు వినవచ్చుచున్నవనియు, ప్రజానీకము నాకర్షించుటలో వారి మూర్తిమత్వ మఖండమనియు ప్రభువు ప్రశంసించెను. తరువాత జినయోగి దక్షారామమున దేవేంద్రసోమయాజి చైనముచేసి, పశువులను ఘోరముగ బలిగావించె ననియు, నది తమ హృదయమును గొడ్డలిపెట్టువలె బాధించినదనియు వేంగీశ్వరునితోఁ బల్కెను. "హింసాహింసల పరిజ్ఞానము నందెన్నియో సందేహములున్నవి. వాని నన్నింటిని విపులముగాఁ జర్చించి గ్రహించినఁగాని తనకొక విస్పష్ట భావమేర్పడద"ని విమలాదిత్యుఁడు సమాధాన మిచ్చెను. గోష్ఠి యంతటితో ముగిసినది. రాజమందిరము నందలి యతిథి గృహమున జినస్వామి విడిది చేసెను. నిర్ణీతమగు కార్యక్రమము ననుసరించి త్రికాలయోగీంద్రులు ప్రజలను గలిసికొని, జనులకు వారివారి కుచితమగు మహోపకారములను సలుపుచుండెను. ప్రజలు తిరునాళ్లవలె నీస్వామిని సందర్శించుటకు వచ్చిపోవుచుండిరి. ప్రజాసముద్రమిట్లే జినచంద్రునిగాంచి యుప్పొంగుట కనులారగాంచి చాళుక్యచంద్రుఁ డాశ్చర్యచకితుఁ డగుచుండెను. అతనికి జినయోగిపైగల గురుభావ మెక్కువగుచున్నట్లున్నది.

ఈ సందర్భమున రాజమహేంద్రవర పురజనుల కోరికను బురస్కరించుకొని యొక బహిరంగసభ యేర్పాటు చేయఁబడినది. ఆనాఁడును సభకు విమలాదిత్యభూపాలుఁడే యధ్యక్షత వహించెను. ఆనాఁటి సాయంతన సమావేశమునకు

జన మినుక వేయగా రాలనట్లుండెను. ఆ దృశ్యమును సందర్శించిన విమలాదిత్యుఁ డబ్బురపడెను. అందు పండితులును, పామరులును నున్నారు. పండితు లుపన్యాసకుని శక్తిసామర్థ్యములఁ బరీక్షించుటకు వచ్చిరి. పామరు లెవ్వరో మహానుభావుఁడు వచ్చెనుగదా! సందర్శించి ధన్యుల మౌదుమను మూఢ విశ్వాసముతో నేతెంచిరి.

త్రికాలయోగి సిద్ధాంతదేవుని కంఠము గంభీరమైనది. ఖంగు ఖంగున మ్రోగుచున్నను మధుర మనోజ్ఞమైనది. అందుచే నెంతటి జనసమూహమైనను సమ్మోహనాస్త్రమునకు వలె నిశ్శబ్దమౌను. జినయోగి నిలిచి యాంధ్ర ప్రజలు తనపట్ల చూపుచున్న భక్తిశ్రద్ధలకు కృతజ్ఞతాభివందనముల సమర్పించెను. అనంతరమాతఁ డిట్లుపన్యసింప నుపక్రమించెను. "సామాన్యమగు పశువృత్తిని జయించి, యుత్తమ నైతిక ప్రతిపత్తితో జీవించువానిని జైనుఁడని యందురు. అట్టి జైనుల మతము జైనమతము. సుమారు పదునైదువందల సంవత్సరముల క్రితము మగధ దేశమున క్షత్రియ కుటుంబమున నవతరించిన శ్రీ వర్ధమాన మహావీరునిచే నీ మతము ప్రవర్తితము. ఇరువది యెనిమిది సంవత్సరముల ప్రాయమున నతఁ డాధ్యాత్మిక జీవిత రంగమునఁ బ్రవేశించెను. అప్పటినుండి పండ్రెండు సంవత్సరము లసిధారావ్రతముగా జీవితమును గడపెను. ఉగ్ర కాననములయందు తీవ్ర తపమాచరించెను. అనంతర మాతఁడు దిగంబరియై జైనమత ప్రవక్తయై తీర్థంకరుఁడని ప్రసిద్ధినందెను. అప్పటినుండి యాతనికి జినుఁడను బిరుద మేర్పడెను. జినుఁడనగా నాధ్యాత్మిక విజేతయని యర్థము. అతఁడుద్ధరించిన యా మహామతము సర్వజన సంతృప్తిదాయకమై యచిర కాలమున నుత్తరా పథమునను, పిమ్మట దక్షిణా పథమునందును వ్యాప్తి జెందినది. నేఁడీ యాంధ్రజనము మహోత్సాహముతో తన్మత విశేషములను విన నుత్సహించుట నా సుకృతము.

అనంత సంఖ్యాకమగు జీవరాసుల సమూహమే యీ విశ్వము. అల్పమగు నొక యణువు కూడ ననేక జీవరాసులతోఁ గూడినది. మీన సంయుతమగు సరస్సును బోలి ప్రతి పదార్థము ననేక జీవరాసుల కాటపట్టు. పదార్థము నాధారము గావించుకొని యుండినది జీవము. పదార్థమునుండి విముక్తమైనది యాత్మ. ఆత్మ యనఁగా నకలంకమగు చైతన్య శక్తి. జీవునిలోఁగల యధ్యాత్మిక శక్తి యూర్ధ్వ గమనము కలది. జీవునిలోఁగల భౌతికశక్తి యధో గమనము కలది. మానవుఁడు తనలోని యాధ్యాత్మికశక్తిని పెంపొందించుకొని యున్నత జీవుఁడు కావలయును". ఇట్లమృతమగు ధోరణిలో జినయోగి జైన మత పార్థక్యమును విపులీకరించెను. తన యుపన్యాసాంతమున కాయక, వాచికా, మానసి కాహింసావ్రత నిర్వహణమును గూర్చి వివరించెను. అంతవఱకును బరమత ప్రస్థాపన తేలేదు. చిట్ట చివర

రామతీర్థమున నుండగా నీ శిశువు గర్భమునఁ బ్రవేశించెను. తిరిగి యీతని నామకరణము నాచేతులమీఁదుగా జరుగుట మిక్కిలి శుభోదర్కము. తస్మాంమున నేదోయొక యవ్యాజానుబంధమవ్యక్తముగ మా యిరువుర యంతరాత్మలను సన్నిహితమొనర్చుచున్నది." అని జినస్వామి మృదుమధురముగను, పరిమితముగను భాషించెను. చాళుక్యస్వామి యందులకుఁ దన కృతజ్ఞత ప్రకటించెను. అప్పటికే విమలాదిత్యుఁడణువ్రత నియమపాలనమును గావించుచుండెను. ఆవ్రతమవిచ్ఛిన్నముగఁ గొనసాగుచున్నదని ప్రభువు స్వామికిఁ దెల్పెను. "ప్రభువులంతటివారు విషయభోగలంపటులుగా నుండక, ఆత్మవివేకముతో నణువ్రత నియమముల నాచరించుటానందప్రదము. ఈ దీక్షను కొనసాగించి మహావ్రతులు గూడ నై ప్రపంచమునకు మార్గదర్శకులు కాగలరని యాశించుచున్నాన"ని జినముని ప్రోత్సాహకరముగ సూచించెను.

ఆనాఁడు భిక్ష, రాజమందిరమునందే జరిగినది. [illegible]ంతఃపురమందే యతిథి సత్కారములనందిరి. పట్టణములోని విప్రబృందమునకీ విపరీత చర్యకు విమలాదిత్యప్రభువుని నిరసించినది. సద్బ్రాహ్మణోత్తములును, దుర్బ్రాహ్మణులును రాజధాని నగరమున లేకుండుటచేతనే యిట్టి వైపరీత్యము వాటిల్లినది కొందరు భావించిరి. లక్ష్మీసమానయగు కుందవాంబాదేవి లేకపోవుటచేత నంతఃపుర మనార్యమగుచున్నదని పలువురభిప్రాయపడిరి. [illegible]ఁడై, రాజేంద్రుఁడిట్టి పెడదారులు వట్టెననియు పనేరులు దింతిల్లిరి. ఎవ్వరేమనుకున్నను విమలాదిత్యుల హృదయము జైనమతాసక్తమైనది. అందరు శ్రావకులు తనకతిథులై భోజనములు చేయుచున్నపుడా ప్రభువునకుఁ గల్గిన యానందము సహస్రబ్రాహ్మణము భోజనములు చేయుచున్న వేళయందును లేదు. భోజనానంతరము స్వహస్తములతో శ్రావకుల కందఱికిని వేంగి ప్రభువు వస్త్రదానములు చేసెను. రాజమహేంద్రపుర పరిసరమున జినవసతుల నిర్మాణమునకుఁ దగు భూమి నొసఁగెను. అందఱును వీరవిజయాదిత్య ననేకరీతుల యాశీర్వదించిరి. తలవని తలంపుగా నింతటి మహోత్సవము జరిగినందులకు మేడాంబ యానందము చెలియలికట్టలేని సముద్రము వలె నుప్పొంగినది. ఈ శుభోదయ మొకింత ముందు జరుగలేదను చింతాశల్య మొక్కటితక్క, ఆమెను వేధించు నన్యవిషయమేలేదు. ఇన్నాళ్లనామె కుందవాంబయే యదృష్టశాలిని యని భావించి, యీర్ష్యఁజెందినది. తత్తుల్యమగు నదృష్టము తనకు జినస్వామివలనఁ బ్రాప్తించినదని మేడాంబ కందలమెక్కినట్లయినది. జినదేవుఁడు తన పతిదేవునకు గురువగుటచే తన పుత్రుని యదృష్టము రాజరాజును మించగలదనియు నామె తలపోయకపోలేదు. కాలచక్రము తనకనుకూలముగ మరలగలదని యామెకు దృఢ విశ్వాసము కుదురుకొనసాగినది. భీమనభట్టు కవీశ్వరుఁడు నెక్కుడుగా నాదరింప మొదలిడినది. ఆస్థానమున నన్నయభట్టారకులకుఁ గల గౌరవము వంటి

గౌరవమాతనికి గల్పింపవలయునను నభీష్టమామెకెక్కుడైనది. ఎంతవారికైన కార్యసిద్ధికై కొందఱనుచరులు కావలయును. పందవాంబ కట్టి యభిమానులు లభించిరి. తాను నట్టి పరివారమును పెంచుకొనవలయునని మేడాంబ నిశ్చయము.

జైనము సంక్షీణముగా సంపూర్ణమైనది. జైనులు తన్ను సాగనంపుచు రాగా నన్నయభట్టు సెలవు ప్రార్థించెను. నన్నయభట్టునకప్పటికి ముప్పదియేండ్లు మాత్రమే పూర్తియైనవి. ఈ ముప్పది యేండ్లలో నతఁడు వైదిక వాఙ్మయము నంతను నవలోకించెను. లౌకిక సాహిత్యమాతని రసనాగ్రమున నర్తించును. ఇంతటి విద్యావ్యాసంగము కలిగినను నాతనిలో విద్యామదమను మాటయే కానరాదు. "అల్పమయ్యె దర్పము. బహుకాల సంచిత తపః ఫలమోని" నౌనన్నయని యాతని ప్రత్యయము. ఈ స్వల్ప వ్యవధిలో నన్నయభట్టారకుఁడు పండితుల సన్నిధిని వేదాంత పరమ రహస్యముల నెక్కుడుగా నవగాహనము గావించుకొనెను. కర్మాసక్తుఁడగు నాతని హృదయమును పూర్వ మీమాంసా సిద్ధాంత రహస్యములు విశేషముగా నాకర్షించినవి.

పూర్వమీమాంస వేదవిహిత కర్మాచరణమును ప్రధానముగా బోధించును. ప్రభుసమ్మితములైన వేదములు ధర్మవిధుల నాదేశించును. అందు యజ్ఞయాగాది క్రతువులత్యంత ప్రధానములు. పవిత్ర కర్మాచరణము పరిశుద్ధజ్ఞాన సముపార్జనమునకు నాందీ ప్రస్తావనవంటిది. జ్ఞాన కర్మములకు విశేషమగునంతరమును బేర్కొన్న శంకరాచార్యులే యీజన్మమునగాని, పూర్వజన్మమునగాని కావించిన సత్కర్మమే సత్యాన్వేషణ కాధారభూతమగునని తెల్పెను.

ధర్మప్రభావ పరిశీలనమే పూర్వమీమాంస ప్రధానలక్ష్యము. ఆలోచనము కన్న నాచరణమందు ముఖ్యము. వేదప్రామాణ్యమే దీనికి ప్రాణము. అవైదికమగు నేమతమునుగాని, సిద్ధాంతమునుగాని యది యంగీకరింపదు. ఆర్యమతమునందీ సిద్ధాంతమున కధిక ప్రాబల్యము కలదు. ఆర్య జీవితవిధానము నీ పూర్వ మీమాంసా సూత్రము లాధారముగాఁ దీర్చిదిద్దఁబడెను. వేదములను బఠించినందువలన, వేదవిహిత కర్మాచరణము మూలమునఁగల్గు ఫలితమువంటి ఫలితము సామాన్య ప్రజానీకమునకుఁగూడఁ గల్గవలయునని నన్నయ్యగారి యాశయము. నన్నయభట్టారకుఁడీ సిద్ధాంతమునకు సంబంధించిన వాఙ్మయము నింకను సమగ్రముగాఁ బరిశీలింప నుత్సహించెను. సంసక్త హృదయముతో నాతఁడు రాజమహేంద్రవరమునకుఁ బయనమాయెను. వజ్జియప్రెగ్గడ యొకింత ముందుగనే పట్టణమునకుఁజనెను. ఇరువురును మేడాంబా పుత్రజననవార్తయును, త్రికాలయోగి సిద్ధాంత దేవులచే నామకరణ మహోత్సవము జరిగిన విషయములను వినిరి. వజ్జియప్రెగ్గడ మానసమందులకుఁ గలవరమందినది. అవైదికమగు మతమువట్ల విమలాదిత్య భూపాలుఁడిట్లు ప్రత్యక్షముగ నభిమానమును జూపుట చాళుక్యవంశ ప్రతిష్ఠకు విరుద్ధమని ప్రెగ్గడ తీవ్రముగ

భావించెను. వేంగి సింహాసనమధిష్ఠించువాఁడు పరమబ్రహ్మణ్యుఁడును, పరమభట్టారకుఁడునేకాక పరమమాహేశ్వరుఁడు గూడ గావలయును. ఈ యాచారము కుబ్జవిష్ణువర్ధనుని కాలమునుండియు నవిచ్ఛిన్నముగ వచ్చుచున్నది. అట్లని వారు బౌద్ధ ధర్మోపాసకులను, జినమునులను, బ్రాహ్మణులను గౌరవించుట మానలేదు. సంఘారామములకు, జినవసతులకును వారు భూదానములను, భూరి విరాళములను నొసంగిరి. అది రాజధర్మము. అంతేకాని ప్రత్యక్షముగ ఆ మత సమావేశముల కధ్యక్షత వహించి, పక్షపాతమును జూపి ప్రోత్సహించుట భావ్యము కాదని వజ్జియప్రెగ్గడ దీర్ఘముగా వివరించెను.

నన్నయభట్టారకుఁడు గూడ పట్టణములోని వార్తావిశేషములను వినెను. ఆతని యాగమనమును విని పండిత మిత్రు లాతనిని సందర్శించి వార్తలను సవివరముగ వినిపించిరి. విమలాదిత్యుల యండతో రాజమహేంద్రవరమున జినయోగి యొసంగిన యుపన్యాసమును బూసగ్రుచ్చినట్లు నన్నయభట్టారకున కొక విద్వాంసుఁడు నివేదించెను. కడకు యూపస్తంభములతో యజ్ఞయాగాదుల విషయమును బ్రస్తావించి, యందలి పశుహింస యమానుషమని జినేంద్రుఁడు ఖండించుటనుగూడ నాతఁ డభినయ పూర్వకముగా తెలియఁజేసెను. మంద స్మిత వదనముతో నన్నయ వానిని గ్రహించెను. ఆతఁడు రాజేంద్రుని నేమియు విమర్శింపలేదు. ఎవ్వరెంత యత్నించినను సనాతన మతము నణచుటకు శక్తి చాలినవారు కారనియు, సర్వతోముఖ సనాతన సంస్కృతి స్వరూప మచిర కాలముననే వేంగి మండలమున సాక్షాత్కరింపఁ గలదనియు, నందులకు పండిత సహకార సాహాయ్య సంపద లవసరమనియు, నన్నయభట్టారకుఁడు విప్రవరేణ్యులకు వినయపూర్వకముగాఁ దెల్పెను.

ఆ సాయంతన సమయమున నన్నయభట్టారకుఁడు రాజేంద్రుని సందర్శించి, వీర విజయాదిత్య కుమారప్రాప్తికి తన యానందమును వెలిబుచ్చెను. ప్రభువుతో దానును నంతఃపురమున కేగి రాజపుత్రుని సందర్శించెను. ఆ తరుణముననే మేడాంబనుగూడ నతఁడు దర్శించి పుత్రప్రాప్తికి తన సంతసమును బ్రకటించెను. అనంతరము రాజరాజనరేంద్రుల ప్రస్తావన వచ్చి "యువరాజులవారి క్షేమసమాచారములు తెలియుచున్నవా?" యని నన్నయభట్టు విమలాదిత్యుని పృచ్ఛించెను. "తెలియుచున్నవి. మే మా దేశమునకు వచ్చి యువరాజును జూడలేదని వారికి కొఱఁతగా నున్నట్లున్నది. యువరాజును వీడి తాతగా రొక్క క్షణమైన నుండలేకుండ నున్నారఁట. తన నామధేయుఁడగు ఆ దౌహిత్రునిపట్ల తాతపాదులకుగల ప్రేమాతిశయమును భంగపఱచి యిక్కడికి గొనివచ్చుట నాకంత యిష్టములేద"ని ప్రభువు ప్రత్యుత్తర మిచ్చెను. ఇంతలో వజ్జియప్రెగ్గడ వారిని కలిసికొనెను. ఆతని ముఖము చిటిముటిపడియుండెను. విమలాదిత్యుని ప్రవర్తనముపట్ల నతనికిఁ గల్గిన యసంతృప్తి నాతఁ డణచుకొన

లేకపోయెను. ఆ వికారభావలక్షణము లాతని ముఖమునఁ గొంత బొడగట్టినవి. లోని వికారముల నెవ్వఁడైన పైకి పొడగట్టనీయకుండుట గొప్ప నేర్పు. అందు నన్నయభట్టారకుఁడు పరిణతప్రజ్ఞ గలవాఁడు.

పట్టియుఁ బ్రగ్గడ కొంత ప్రసంగించిన పిమ్మట నారాయణభట్టు విషయము వచ్చినది. పట్టియుఁ బ్రగ్గడ యిట్లనెను, తానిప్పుడే ప్రవాసులతో సంభాషించితి ననియు, నారాయణభట్టు తన కామాక్షియను బహుమానమును గైకొని ప్రచ్ఛన్న రూపమున వచ్చుచు దగా కత్తాలదని గూఢచారులు వానిని బట్టి గుర్తించి సింహభూపతి కెఱింగించిరనియు, సింహభూపతి స్వయముగా నేగి నారాయణభట్టును, నాతని కామాక్షిని బట్టి బంధించుట గావించెననియు వివరముగా తెలియఁజేసెను. నారాయణభట్టువంటి మహాప్రాజ్ఞునకు వచ్చిన యాపదకు విమలాదిత్యుఁడు పరితాప మనుభవించెను. తగిన ప్రతీకారమును సముచితముగ గావింతు నని యతఁడు నిశ్చయముగాఁ బల్కెను. తన మిత్రుఁడగు నారాయణభట్టుపై రాజనరుఁగల యభిమానమునకు నన్నయభట్టు సంతసించెను.

నన్నయభట్టారకుఁడు బాహ్యవిషయముల నంతగా పట్టించుకొనఁడు. తామరాకుపై నీటిబిందువువలె నుండును. అతని మనసు పూర్వమీమాంసా విషయ సమగ్ర పరిశీలనమునందే నిమగ్నమైనది. అమోఘమగు నట్టి శ్రద్ధ యహోరాత్రములను సంధింపఁజేయును. ఆ శ్రద్ధాబలమునకు గ్రంథ పరమార్థము స్థిరసౌదామినీ సన్నిభముగ భాసించెను.

సాహిత్యాధ్యయన సమయమునను నిట్టి దివ్యానుభూతి యాతని కొక పర్యాయము తటస్థించినది. వేదసారమనఁదగు రామాయణము నాతఁ డత్యంతాభిలాషతోఁ గూడిన దీక్షతో నుపాసించెను. వాల్మీకిమహర్షి కథాకథన కౌశలము, అపూర్వ కవితా ప్రతిభ, వాల్మీకియే ప్రత్యక్షముగ నాతనికి బోధించినట్లైనది. రామాయణ కావ్యమునందలి ప్రత్యుపమానము, కథా సంవిధానోచితమగు ప్రకృతి వర్ణన లాతనిని తన్మయు నొనర్చినవి. అపార కావ్య సంసారమున వాల్మీకియే యాది కవి, వాల్మీకియే యంతిమ కవి యను నభిప్రాయ ముద్ర యాతని శుభ్ర మనఃఫలకమున చిత్రితమాయెను.

నన్నపార్యుని యాధ్యాత్మిక జీవితమున కీ కాల మత్యంత ప్రధానము. భగవంతుని దర్శించుటకు ధర్మము ప్రధానము. ధర్మ మనఁగా ఋజుజీవిత విధానము. ఈ ధర్మము యజ్ఞమూలమున లభించును. సృష్టి ప్రారంభమున బ్రహ్మ యజ్ఞములతో గూడ జీవులను సృష్టించి యిట్లు పల్కెను—"ఈ యజ్ఞముల వలన మీరు సదా సమృద్ధిని బొందుఁడు. ఈ యజ్ఞము మీ కభీష్టముల నొసఁగు కామధేనువగు గాక!" ఇట్టి యజ్ఞములు పలువిధములు: ద్రవ్యయజ్ఞము, తపోయజ్ఞము, దైవయజ్ఞము మున్నగునవి. ద్రవ్యమును సద్వినియోగము గావించుట

ద్రవ్యయజ్ఞము. తపస్సుచేత భగవంతు నారాధించుట తపోయజ్ఞము. తపస్సు ననేక విధములుగా వేదమాత యాదేశించినది. "శ్లో॥ ఋతం తపస్సత్యం తపశ్శ్రుతం తపశ్శాన్తం తపోదమస్తప శ్శమస్తపోదానం తపోయజ్ఞం తపం, భూర్భువ సువర్బ్రహ్మై తదుపాస్స్వైత త్తపః" ఋతము తపస్సు. ఋత మనగా మానసికమైన యథార్థ చింతనము. సత్యము తపస్సు. వాక్కుచేత యథార్థము పలుకుట సత్యము. శ్రుతము తప మనఁగా వేదవిషయిక సంశయ నివారణార్థమైన శాస్త్రాధ్యయనము. శాంతము తపస్సన బాహ్యేంద్రియ నిగ్రహము అనఁగా శబ్ద స్పర్శ రూప రసగంధాదులను మితిమీరి వ్యసనముగా ననుభవింపక ధర్మబద్ధముగా ననుభవించుట. దమము తపస్సు. అనఁగా శాస్త్రీయములగు నుపవాసాది నియమములచేత సంతతేంద్రియ నిగ్రహమును సాధించుట. శత్రువునందైనను క్రోధము లేకుండుట శమమను తపస్సు. యోగ్యమగువారికి సాత్విక త్యాగము చేయుట, దానమను తపస్సు. భూర్భువస్సువరాత్మక విరాడ్రూపధారి నారాధించుట బ్రహ్మోపాసన తపస్సు. వీని యన్నింటి సమాహారమే తపోయజ్ఞము. మూఁడవది యోగ యజ్ఞము. ప్రాణయామ మొనర్చి వాయువును నిరోధించుట మున్నగు సాధనములు. ఇం దాసక్తి స్వభావముచే నున్నయ్యెడ లేదు. చిత్తవృత్తు లిట్టి సాధనములు లేకయే నన్నియు నాత్మాధీనములు. నాలుఁగవది స్వాధ్యాయ యజ్ఞము. అనఁగా వేదాధ్యయనము. రామాయణ, భారత, భాగవత గీతాపఠనములు దీనిలోనికిఁ జేరును. ఐదవది జ్ఞాన యజ్ఞము. తా నధీతి మూలమున నార్జించిన విజ్ఞానమును లోకోపయోగ మొనర్చుట. కడపటిది దైవయజ్ఞము. కర్మయోగులు దీని నాచరింతురు. ఇట్టి తపస్సులలో తన స్వభావానుకూలమైన వాని నాచరించి ప్రతి వ్యక్తియు, ఏ విధమునను జెందినను తన జీవితమును రమణీయమొనర్చుకొన వలయునని సన్న్యాసి హృదయపూర్వకమగు నాశయము.

ఇంతటి నిరంతర మానసిక వ్యవసాయమునందు నప్పుడప్పుఁ డాతని మనోవీధిని మసలు వ్యక్తులిరువురు. వారే యువరాజగు రాజరాజ నరేంద్రుఁడు, సహాధ్యాయుఁడగు నారాయణభట్టు. విమలాదిత్యుఁ డద్వైదిక మతమునందాసక్తి గలవాఁడైనందుల కాతఁడు విచారింపఁడు. కారణము: భూపాలుని పూర్వజన్మ సంస్కార మట్టిది. అట్టి విమలాదిత్యుని కుమారుఁడే రాజరాజ నరేంద్రుఁడు. అయ్యును నాతఁడు సనాతన మత సముద్ధారకుఁడు కాగలఁడని వన్నియకు దృఢప్రత్యయము. భౌతికముగ జనకుడైనంత మాత్రమున తండ్రి యభిమతములు కుమారునియందు ప్రభవింపవనుట సత్యవిరుద్ధము. తల్లిదండ్రులలోఁ దల్లి సంస్కారము బలీయముగ నుండవచ్చును. అప్పుడు పిల్లల సంతానమునం దా జననీ ప్రభావమే యెక్కుడుగా ప్రసరించును. కుందవాంబ సనాతన ధర్మసంసక్తచిత్త. అప్పటికి విమలాదిత్యున కే మతమునందును

నంతరము దక్షిణరాజ్యము లాతని వశంవదము లైనవి. అనంతరము ముమ్మడి చోళుని దృష్టి యుత్తరదేశములకుఁ బ్రసరించినది. గంగవాడి నోళంబవాడులను జయించుట కాతని సర్వశక్తులను వినియోగించెను. తనతో సమాన వీరులగు నాహవమల్ల జటాచోడ భీములు బ్రతికియున్నంతవఱకు నాతఁడుత్తరదేశముల జయింపలేకపోయెను. కడ కాతని జీవితకాలముననే యాతని యభీష్టములు నెఱవేరినవి. అతఁ డవాప్తకాముఁడు, సనాతన ధర్మపరాయణుఁడు, నిరంతర దాననిరతుఁడు, వేంగీరాజ్య హితుఁడు. అతని కేమియు కొఱఁత లేదు. ఈ రీతిగా నా నిశీథిని జాగృతయైన కుందవాంబ మానసమున పితృదేవుని పవిత్ర పూర్వచరిత్రస్మృతులు విద్యుల్లతా సదృశమున మెఱసినవి. ఆ రాత్రియంతయు నామె కేమియో యెన్నడు నెఱుఁగని భీతి గల్గినది. అందుచేఁ దమ్ముఁడగు రాజేంద్రచోళు నప్పటికప్పుడు పిలిపించుకొని చెంగటఁ గూర్చుండబెట్టుకొన్నది.

బ్రహ్మ ముహూర్తమున వృద్ధ చోళచక్రవర్తికి గొంత స్ఫూర్తి కల్గినది. తన కూఁతును, గుమారుని శయ్య కిరుపైపుల కాహ్వానించినాఁడు. "చోళ చాళుక్య సంబంధము లిట్లే శాశ్వతముగ నుండునట్లు కాపాడుము. సనాతన హైందవ మత సంరక్షణము గావింపుము"ని వృద్ధరాజు పుత్రు నాదేశించినాఁడు. చోళరాజు తండ్రికి నమస్కరించి చేతులు కట్టుకొని వినయముగా నిలువఁబడెను. "తల్లీ! కుందవాంబా!! పరమశివుఁడు నీ కడుపునఁ బంగారుపంట పండించినాఁడు. ఈ నీ. కుమారోదయమున నాంధ్రజాతి నావరించిన పరతమసము విచ్ఛేదమై మహోదయము గల్గెను. చాళుక్య చోళ సంబంధముల నభివృద్ధి గాంచునట్లు నీ యిష్టదైవమును నిత్యము ప్రార్థింపుము"ని ప్రియ జనకుఁడు ప్రియాత్మజను గోరినాఁడు. వెంటనే యాతని నేత్రములు ప్రశాంతము లైనవి. హస్తములు ముకుళితము లైనవి. కుందవాంబ హృదయ మావేదించెను. రాజేంద్రచోళుని నేత్రాంచలముల నీరు గ్రమ్మినది. పితృ కపోల ప్రదేశము నలంకరించిన కుందవాంబ హస్తము లరుణార్ద్రములైనవి. అది చూచుకొని కుందవాంబ మఱింత తహతహ లాడినది. జనకుని కపాలము పండిన దానిమ్మపండువలె రెండుగా బ్రయ్యలైనది. ప్రాణోత్క్రమణ మైనదని కుందవాంబ గ్రహించి తమ్ముని కెఱిఁగించినది. ఎంత సంయమించుకొనినను నాగక యామె లోచనములనుండి జలజల విషాద బాష్పములు రాలినవి.

విద్యుద్వేగమున నీ విషాదవార్త యంతఃపుర మంతను వ్యాపించినది. దుఃఖ సూచకములైన గంటలు మ్రోఁగినవి. పుర ప్రజలందఱు తండోపతండములుగ నా వృద్ధ చోళభూపతిని సందర్శించి, నమస్కరించి పోవుచుండిరి. "సుస్థిరముగ రాజ్యమును స్థాపించి శాంతిభద్రతలను నెలకొల్పిన నృపాలుఁడ"ని

కొందఱు ప్రశంసించిరి. "ఆర్య సంస్కృతికి దక్షిణభారతమున శాశ్వత స్వరూపమును దీర్చిదిద్దిన మహాశిల్పి యీతఁడ"ని మఱికొందఱుగ్గడించిరి. "శివభక్తిపరాయణుఁడు, శివసాయుజ్యము నందినాఁడ"ని యింక కొందఱు మతించిరి. భూసురు లుత్క్రమించిన ప్రాణము క్షేమముగా స్వర్గమునకుఁ జేరునట్లుపరవేదమునుండి యాశీర్వాదములు గావించిరి. పౌరాణికులు గరుడ పురాణములు వివిధ వేదికలనుండి వినిపించిరి. బంధు మిత్రవర్గమునకీ వార్త పంపఁబడినది.

రాజరాజు పరలోక గమన వార్త రాజమహేంద్రవరమునకుఁ గూడఁ జేరినది. విపులాదిత్యుఁ డీ వార్త వినఁగనే కుప్పగూలినట్లు కూలెను. ఆ వర్తమానమును వేవేగ తన కులబ్రాహ్మణున కందించెను. నన్నయభట్టారకుఁ డప్పటికి పూర్వ మీమాంసా విజ్ఞాన సమగ్రజ్ఞాని యాయెను. వివిధ తపోయజ్ఞ దీక్షలు కారణముగ నాతని ముఖము వినూత్న కాంతిపుంజముల విరజిమ్ము చున్నది. ఆ పట్టుదలతోడనే యతఁ డుత్తర మీమాంసా సంబంధమగు పరిజ్ఞానమును బడసెను. బాదరాయణప్రణీతమగు బ్రహ్మసూత్రములకు శ్రీమ చ్ఛంకర భగవత్పాదుల విపులవ్యాఖ్యానము నంతయు నామూలాగ్రముగ నన్న పార్యుఁ డవలోకించెను. ఇంతకుఁ బూర్వమే సమస్తోపనిషత్స్వరూప మాతివి కవగాహన మగుటచే నీ పరిశీలన మాతని కెక్కువకాలము పట్టలేదు. ఉపనిషత్తులయందుఁ జర్చింపఁ బడిన జీవస్వరూపము, బ్రహ్మస్వరూపము, మోక్షస్వరూపము మున్నగు విషయములు పూర్వపక్ష సిద్ధాంతరూపమునం దిమిడి యున్నవి కావున వీనికి వేదాంత సూత్రము లనియు, బహ్మసూత్రము లనియుఁ బ్రసిద్ధి. పూర్వోత్తర మీమాంసల నపేక్షభావముతోఁ బరిశీలించిన పిమ్మటగూడ నన్నపార్యుని మానసము పూర్వ మీమాంసాపక్షమునకే మొలు చూపినది. సత్కర్మను మించిన సదుపదేశ మింకొకటి లేదను విశ్వాస మచంచలముగ నాతని మనస్సున స్థాపితమయ్యెను. జ్ఞానముయొక్క లోతుల కైనను జొరవచ్చునేమో కాని కర్మవైచిత్ర్యమును దెలిసుకొనుట దుస్తరము. కారణ మేమియన కర్మ యనునది మానవుఁ డాచరించు శ్రౌతములుమాత్రము కాదు. అసలీ సృష్టియే మహాకర్మ. ప్రకృతి కర్మలో పుట్టి, కర్మచేతనే సిద్ధి పొందుచున్నది. ప్రకృతి యనాది యైనట్లే, కర్మకూడ ననాదియే. "స్వభావ నియతం కర్మ" యని గీతాకారుఁడు పేర్కొనెను. స్వభావ మనఁగా నొక జీవుఁడు చేసిన పుణ్య పాపకర్మ లన్నింటిని లెక్కించి, యందులో శీఘ్ర ఫలప్రద కర్మలను, ఆలస్యముగ ఫలములిచ్చు కర్మలను విభజించి, తదనుగుణ ముగ నుత్తరదేహమును నిర్ణయింపనగు ప్రారబ్ధమగు కర్మఫలము. ఇదియే ప్రతి వ్యక్తియొక్క జాతి వర్ణములకు హేతువు. అయిన నీ స్వభావ మెప్పటిది? అనాదిది.- అనఁగా సృష్టిమూలముననే యున్నది. "యాథాతథ్యతో ఆర్థాన్

వ్యథదాన్ శాశ్వతీభ్యః సమాభ్యః" ఏయే వస్తువుల కేయే విశిష్టగుణకర్మ లుండ వలయునో యవి శాశ్వతముగా విభజింపబడినవని ఋషులు పేర్కొనిరి. ఇట్టి పరిజ్ఞానామృతమునకు నన్నయభట్టారకుని హృదయము భాండాగార మైనది. అప్పు డాతనికి సనాతన ఆర్యధర్మ మీ సృష్టికి మకుటాయమానమగు మానవుని, నాలుగు వర్ణములుగా విభజించుటలోని యౌచిత్యము బోధపడినది. శంకరుని యవిద్యావాద మాతని కంతగ నచ్చలేదు. శంకరుఁడు తన జ్ఞానబలము నంతయు బ్రహ్మసత్యమను సిద్ధాంతమును బ్రతిష్ఠించుటకే ధారవోసెను. అతఁడు గావించిన త్యాగము నన్నయ్యను విస్మయ చకితుని గావించినది. శంకరుఁడు జగత్తు మాయ యని లోకమును విడనాడక, లోక సంగ్రహార్థ మనేక స్తోత్రములను, వ్యాఖ్యానములను రచించుటే గాక తన యల్ప జీవితకాలముననే యావ ద్భారతమును సంచరించి, వాదోపవాదములు సలిపి, యపూర్వ సంఘటనా పటిమను జూపి యవైదికములగు మతముల నణచుట తలఁచినపుడెల్ల నన్నయ యొడలు పులకరించెడిది.

నిరంతర వేదాంతమథన నిమగ్నచిత్తుఁడగు నన్నపార్యుఁడు పూర్వము వలె తఱుచుగా నంతఃపురమున కేఁగుటలేదు. విమలాదిత్యుఁడు గూడ నీ విషయ మంతగా బట్టించుకొనుచున్నట్లు గనిపించదు. రాజరాజు మరణవార్త యాతని కొక క్షణకాలము బాధయనిపించినది. కుందవాంబను, నరేంద్ర యువరాజును జూడవలయునని యాతని కనిపించినది. చాళుక్యపతి ప్రయాణ మగుచు తన్నుగూడ రమ్మని యాహ్వానించునని యాతఁడు తలంచెను. ఆ క్షణముననే నన్నయభట్టు చాళుక్యరాజును సందర్శించెను. చోళభూపతి గుణ గణములను నన్నయభట్టు ప్రశంసించెను. విమలాదిత్యునితో సాంత్వన వచనములు వలికెను. నన్నయ యాశించినట్లే విమలాదిత్యుఁడు 'ప్రయాణము కంద'ని నన్నపార్య నాహ్వానించెను. ఆ సాయంత్రముననే చాళుక్యరాజు తన కులబ్రాహ్మణునితో గంగైకొండ చోళపురమునకుఁ బయనమాయెను. రాజరాజ నరేంద్ర యువరాజ మధురవృత్తాంత సంస్మరణముతోడను, చోళరాజరాజ వివిధ విశేష గుణగణ ప్రశంసతోడను, చాళుక్యులపట్ల నా రాజరాజునకుగల సమధికహితచింతా సముచిత కృతజ్ఞభావములతోడను, వారి ప్రయాణము చరచర సాగిపోయినది.

౧౩

నారాయణభట్టు కారాగారమునందున్నను, నాతనికెట్టి కొఱఁతయు రానీ కుండ కర్ణాట భూపతి చూచుచుండెను. కోరిన గ్రంథములన్నియు నాతనికి పంపఁబడుచున్నవి. అప్పుడప్పుడు జయసింహుఁ దేతెంచి తన యాస్థానమునం దుండుమని మాట యీవలసినదిగా నారాయణభట్టును గోరుచుండును. ఉత్తమ

వంశ సంజాతుఁడగు తన్నీరీతిగా నవమానించినందులకు నారాయణభట్టు హృదయము క్షోభించినది. నారాయణభట్టు మిత్రులనేకులు తన్ను విడుపింతుమని యాతనికి కబురంపిరి. నారాయణభట్టందులకు సమ్మతింపలేదు. తనకొఱకై తానుగాని మఱెవ్వరుగాని నీచవిధానము నవలంబింపరాదని నారాయణభట్టు పట్టుదల. ఆతనికి కారయందు జరుగనిదేమియులేదు. తనసర్వస్వమగు కొమార్తెయు నతని ప్రక్కనే యున్నది. అప్పుడప్పు డామె విషాదస్వరూప మాతనిని దుఃఖాబ్ధిని మున్కలెత్తించెడిది. ఆ క్షణకాలమతని మానసము తీవ్ర విచారమునకు స్తబ్ధత వహించును. మఱుక్షణముననే తిరిగి యాతఁడు విజ్ఞాన ప్రపంచమునఁ బ్రవేశించును. శోకభయ స్థాపము లందఱకును సమానముగనే కల్గును. అవివేకి యందులకు బుద్ధివిగతుఁడై క్రుంగిపోవును. వివేకి యట్లుకాక ధైర్యము వహించును. నారాయణభట్టును కట్టిధైర్యము జన్మప్రాప్తము.

తనకొమార్తె కుసుమాదేవి దుఃఖోపశమనార్థ మాతఁడామెకు సంస్కృత సాహిత్య బోధన మారంభించెను. అంతకుఁ బూర్వమే యామెకుఁ జక్కని శబ్ద జ్ఞానము, ధాతుజ్ఞానము కలదు. ఆమెకు కన్నడమందు మిక్కిలి యభినివేశము కలదు. రత్నత్రయ కావ్యములను గూలంకషముగఁ జదివినది. ప్రకృతము నారాయణభట్టు కారను విద్యాలయముగ మార్చినాఁడు. సంస్కృత కావ్యములను బోధింప నారంభించెను. కవికుల గురువగు కాళిదాసు కవనమును దన విద్యాభ్యాస కాలమున నారాయణభట్టు మిక్కిలి కుతుకముతోఁ బఠించెను. తాను విద్యార్థిగా నున్నపుడు ఎంతటి సమాసమునకైన విగ్రహవాక్యమును జెప్పుటలో వన్నయ్యది అందెవేసిన చేయిగా నుండెడిది. అట్లని తనకు తెలిసినట్లు కనిపించెడివాఁడు కాఁడతఁడు. ఏమి యాతని వినయము! అట్టి వినయసంపద నాతఁడు జీవిత తపముగా నభివృద్ధి కావించుకొనుచున్నాఁడు. అది యాతని సహజశీలముగఁ బరివర్తనమందినది. వినయము స్వాతిశయము నణికట్టును. స్వాతిశయము కూడదనఁగా ఉత్సాహమే యుండకూడదనికాదు. అది కృపణత్వమగును. కృపణత్వ ముత్సాహమును మందగింపఁజేయును. స్వాతిశయ ముత్సాహమును గ్రియాశూన్యము గావించును. వినయ సౌశీల్యములతోఁ గూడిన యుత్సాహశక్తియే నన్నయమూర్తిలోని విశిష్టతయని యేమియో భావించెడివాఁడు నారాయణభట్టు.

కుసుమాంబా సాహిత్య పఠనము మేఘసందేశముతో నారంభమైనది. కాళిదాసుని కమనీయ కవిత్వ ప్రతిభకుఁ బ్రత్యక్షదర్పణమగు నా కావ్యమామెకు హృదయశాంతి నొనగూర్చినది. అది చదువుచున్నంత కాలమామె వీరస్వర్గ మలంకరించిన తన హృదయేశ్వరునకు దన పవిత్ర ప్రేమసందేశము నంపుచున్నట్లు భావించినది. సాహిత్యములోని విశ్వజనీనధర్మమన నిట్టిదే. మహాకావ్యమును పఠించుచున్నపు డట్టి యాత్మీయభావ పరితృప్తి కలుగవలయును.

వ్యక్తిని సమష్టిగను, సమష్టిని వ్యక్తిగను మార్చు శిల్ప మొక్క మహాకవికే చెల్లును. ప్రపంచ సాహిత్యమున నీ కవిసార్వభౌముని మేఘసందేశ లఘుకావ్య మున కలముత్తరమైన స్థానముకలదు. శబ్ద సౌందర్యము, సమాససౌందర్యము, అలంకారసౌందర్యము, ఛందోరామణీయకము, సుమధుర భావనాపటిమ ఇందు సరసముగా సమ్మేళనమందినట్లు మఱి యే యితర కావ్యమునందును గానరాదు. వానినన్నింటిని కుపమాదేవికి వివరించినాఁడు నారాయణభట్టు. దీనికంటెకూడ నామెకు కుమార సంభవ కావ్యరాజము నందలి దివ్యప్రణయ సంకీర్తనము హృదయమునకు హత్తుకొన్నది. శాకుంతలములోని దుర్వాసుని శాపమును, కుమారసంభవము నందలి కామదహనమును, కాళిదాసునకు కవితాప్రపంచమున సార్వభౌమత్వము నాపాదించినవని వాఙ్మయ రహస్యము లనేకము లాతఁడు కూఁతునకు బోధించెను.

పూర్వము నారాయణభట్టునకు వేదాంత గ్రంథావలోకన కుతూహల ముండెడిదికాదు. ఎప్పుడు నాతనికి సాహిత్య సమీక్ష యందు దత్యం తాభిరుచి. అందును భారతపఠనము చేయని దినమాతనికి దుర్దినము. మానవుఁడు సర్వతో ముఖ వికాసవైభవముల నందవలయునన్న భారతమే శరణ్యమని నారాయణభట్టు సదా వక్కాణించుచుండును. ఆ జీవిత కృషిగా భారతము వివిధ ప్రతులను నారాయణభట్టు సముపార్జించి వానియందుఁగల పాఠ్యభేదములను గుర్తించి నాఁడు. ప్రస్తుతమాతనికి వేదాంత గ్రంథావలోకనమున మనసు కుదిరినది. మహా మేధావి కసాధ్య మేముండును? భాష్యత్రయ మాతని కాహారమైనది. శంకర భగవత్పాదులు గావించిన భాష్యత్రయమును మథింపసాగెను. తనకొమార్తెకు సాహిత్యమును బోధింపగా మిగిలిన కాలమంతయు నీవ్యాఖ్యానావలోకనము నందే నారాయణభట్టు గడుపును. అప్పుడప్పు డర్ధరాత్రములందు కుపమాదేవి మేల్కాంచి చూడగా నారాయణభట్టు తన్మయతతోఁ జదువుకొనుచుండెడివాఁడు. తండ్రియారోగ్యమేమైన భంగపడునేమోయని కుపమ తహతహలాడెడిది. కాని తన తండ్రితో నామాటఁజెప్పుటకు భీతిల్లెడిది. జనకుని సమీపించి తన మృదు హస్తములతో మెత్తగాఁ బాదము లొత్తెకిని. నారాయణభట్టొకచేత పుస్తకమును బట్టి పఠించుచునే మఱియొక హస్తమున నామె కపోలమును స్పృశించెడి వాఁడు. ఇట్టి జాగరణములెన్నియో వారలా కారాగారమున గావించిరి.

* * *

చాళుక్యభూపతి తన కులబ్రాహ్మణునితో గంగైకొండ చోళపురమునఁ బ్రవేశించెను. తల్లి యాదేశానుసారము చాళుక్యరాజకుమారుఁడు తన తండ్రి కిని, కులబ్రాహ్మణునకును సాష్టాంగముగ నమస్కరించెను. విమలాదిత్యునిలో వాత్సల్యరస ముప్పొంగినది. ఆనందము సోడుముట్టినది. అమాంతముగా తన తనయు నెత్తుకొని పొరింబొరి ముద్దులాడినాఁడు. ప్రమోదబాష్ప బిందువుల

మౌక్తికములట్లు రాజరాజనరేంద్రుని కపోలమున రాలినవి. నన్నయభట్టారకుఁడు తదేక దృష్టితో చాళుక్యనరేంద్రుని వీక్షించెను. ఆతని ముఖలక్షణము లన్నియు శివప్రదములుగాఁ గోచరించినవి. కుందవాంబా పవిత్ర ముఖాంభోజ సౌందర్య మాతని ముఖారవిందమున మూర్తీభవించినది. ఎట్టి విలక్షణ లక్షణుఁడు కుందవాంబా గర్భమునఁ బ్రభవించునని నన్నయభట్టారకుఁ డాశించెనో యట్టి పుత్త్రుఁడే యావిర్భవించెనని యాతఁ డానందోత్ఫుల్ల హృదయాంభోరుహుఁ డాయెను.

రాజరాజ మరణ వృత్తాంత మంత చాళుక్యరాజు మనసున వర్తించినది. ఆనంద బాష్పము లా ముహూర్తముననే విషాద బాష్పములుగా మారినవి. అతఁడు కుందవాంబను సమీపించెను. కుందవాంబ అధోముఖ ఖిన్నమానస యైనది. "రాజరాజేంద్రులు దేవికే కాక మాకుఁ గూడ పితృసమానులు. మాకే కాదు దక్షిణ భారతదేశమే యాతనికి ఋణపడినద"ని విమలాదిత్యుఁడే మేమియో సాంత్వన వచనములు పలుకుచుండగనే రాజేంద్రచోళుఁడు బావగారిని సందర్శించుటకు వచ్చెను. విమలాదిత్యుఁడు రాజేంద్రుని కౌగిలించుకొని తన దుఃఖమును వెలిబుచ్చెను. రాజేంద్రచోళుఁడు నన్నయభట్టారకులకు వినమ్రతతో నమస్కరించెను. నన్నయభట్టారకుఁడు "రాజరాజ మహాప్రభువులు హైందవ సంస్కృతి సంరక్షకులు. వారులేని కొఱఁతను దామీ మార్గమునఁ దీర్చి, నిత్య సత్య విలసితమగు సనాతన ధర్మమును బరిరక్షింతురని యాశించుచున్నాన"ని యుపశమన వాక్యములలోనే కర్తవ్యము నుపదేశించెను.

తదనంతరము నన్నయభట్టారకుఁడు తన విశ్రాంతి మందిరమున కరిగెను. విమలాదిత్యుఁడు కుందవాంబా మందిరమున కేగెను. ఇన్నాళ్ళకుఁ గాను చాళుక్యపతి తన్నుఁ జూడవచ్చినందులకు కుందవాంబ మానసమున నొకింత కినుక వహించినది. కాని గంభీర యగుటచే నామె తన మనోభావములను వ్యక్తము జేయలేదు. రాజరాజనరేంద్రుని వివిధమగు గుణ గణములను, తాతగారియెడ నాతనికిఁగల చనువును నామె మనోహరముగ వివేదించినది. రాజేంద్రుఁ డా పలుకులను మందస్మిత వదనముతో నాలించెను. సంభాషణ మధ్యమున నామె మేడాంబ పుత్త్రుని క్షేమసమాచారమును బ్రశ్నించినది. విమలాదిత్యుఁడు, జినేంద్రస్వామి కటాక్షమున నాతఁడు ప్రవర్ధమానుఁ డగుచున్నాఁడని బదులువల్కెను. ఈ వచనములు కుందవాంబకు విస్మయము కలిగించినవి. చాళుక్యపతికి జినమతాభిమానము ప్రవర్ధమానమైనందుల కామె యావేదనము నందినది.

ఆ మధ్యాహ్నమున విమలాదిత్యుఁడు తన మామగారగు రాజరాజున కాత్మశాంతి గలుగునట్లు షోడశమహాదానములఁ గావించెను. ఆ సాయంకాలము చాళుక్యాధీశుఁడు తన కులబ్రాహ్మణునితో గంగైకొండచోళపురము సందర్శించుట కేఁగెను. ఆ నగర నిర్మాణమే యనిదం పూర్వమైనది. శత్రు

దుర్భేద్యమైనవి. అందలి స్తంభము లన్నింటిపై హంసవిలాస గాథలక్షర రమ్యముగాఁ జెక్కఁబడినవి. అందలి దేవాలయములలోని చక్కని విగ్రహ రచన వేంగీజనకు విస్మయము గొల్పినది. అందలి ప్రసన్న మధురిమ, సముచితాలంకారిక విధానము, ముద్రాభేదములు, కోమల తనూవల్లికలు, అంగ రేఖా సౌష్ఠవము శిల్పకళా చరిత్రలో నూతనాధ్యాయము లారంభించినట్లున్నవి. ఆర్య సంస్కృతి యిట్లు దేవాలయములందు శాశ్వతమై సామాన్యమైన మానవున కుత్తమ సంస్కారము కలిగించి యున్నతాధ్యాత్మిక శక్తి సముపార్జనకు మార్గము చూపునని నన్నయభట్టారకుఁడు లోలోన నుబ్బెను. ఇంతటి మహాకార్యమును నిర్వహించిన చక్రవర్తి యింకలేఁడు. విమలాదిత్యునకు శిల్పమన్న నభిమానమే కాని ఆర్యమతాభిమాన మాతనిలో సన్నగిలుచున్నందులకు నన్నయ విచారించెను. విమలాదిత్యునిపట్ల నన్నయకు సంపూర్ణ ప్రత్యయము మొదటినుండియు లేదు. శక్తివర్మ విమలాదిత్యులు వేంగిదేశమున సుస్థిర రాజకీయ పరిస్థితుల మాత్రమే స్థాపింతురనియు, నా తరువాతకాని యాంధ్ర సంస్కృతికి సంపూర్ణ వికాసముతోఁ గూడిన మహోదయము కలుగదనియు నన్నయభట్టు యోజించెను. కుందవాంబా కుమారుఁడగు యువరాజును చూచినప్పుడా సత్యతపస్వి హృదయాకాశమునం దేదియో యనిర్వచనీయమగు ఆశాసౌదామిని ప్రకాశించెను. రాజమహేంద్రవర వాతావరణము కలుషితమైనది. ప్రజలు జినమత ప్రసక్తియందే ఆసక్తి గలిగి యున్నారు. బ్రాహ్మణ దూషణము, విబుధదూషణము నెక్కువైనది. దానిని ప్రతిఘటించి ప్రయోజనము లేదు. పాలకులనుబట్టి పాలితుల మనస్తత్వము లుండునని చోళపురమున రమ్యహర్మ్యమున శయనించిన నన్నయభట్టారకుఁ డేమేమియో పరిపరి విధముల భావించుచునే నిద్రవోయెను.

౧౪

భీమకవికి యుక్తవయస్సు వచ్చినది. యాగ నిర్వహణ సమయమున నాతఁ డప్పాలు కప్పలు కావలయు ననియు, నన్నము సున్నము కావలయు ననియు శపించి నప్పటినుండియు నాతఁడు శాపానుగ్రహశక్తి సంపన్నుఁడుగాఁ బేరు మోసెను. ఆతనిని గాంచినంతనే సమస్త కులములవారును భీతచిత్తులై తొలఁగిపోవుచుండిరి. వైశ్యులందఱు నాతనికి వశ్యులై కోరిన దెల్లయు నొసంగుచుండిరి. శాంతమ్మ పరమ పతివ్రత యని లోకమునకు నిరూపితమైనది. ఆమె భీమేశ్వరుని భక్తురాలని గుర్తింపఁబడినది. శాంతమ్మయాత్మ శాంతించినది. ఆమె నిరంతర పూజాకలాపనిమగ్నయై యుండును. కుమారుఁడు తన చెలికాండ్రతో స్వేచ్ఛగా నెచ్చటనో తిరిగి యపరాహ్ణమువేళ కాఁకలి గొనివచ్చును. అత్తఱి శాంతమ్మ పూజనాపి కుమారున కాప్యాయముగా భోజనము పెట్టి పంపును. వ్యక్తత తెలిసినప్పటినుండియు, తన జననిని గాంచినంతనే భీమన హృదయము

వేదనాకులమై బాధపడసాగెను. అదియొక కారణముగా నతఁడింటిపట్టున నుండక దేశాటనము గావించుచుండును.

భోజన సమయమున శాంతమ్మ తన సహజ శాంతవచో మాధుర్య ముట్టిపడునట్లు పుత్రునకు నీతు లుపదేశించును. "నాయనా! భగవద్దత్తమగు శక్తిని దుర్వినియోగ పఱుపకుము. సంఘము నిన్ను ప్రేరేచి దౌర్జన్యముతో నేమేని పల్కినను దల యొగ్గుము. నీవు వాఙ్మయ తపస్వివి కావలయునని నా గాఢాకాంక్ష. నీ మనస్సును వేగముగా పనిచేయింపకుము. అది మేధావి లక్షణము కాదు. మనస్సును చిక్కపఱుపుము. దానిని నివృత్తించుము. ఇక్కడ నీ కొక్క సంశయము కలుగవచ్చును. తుఫానుగాలి ఘుంఝూమారుతమువలె ప్రచండముగా వీచును. మహావృక్షములనుగూడ పెకలించును. అట్టి తుఫాను గాలిలో బలము లేకున్నచో కదలకుండ నుండును. గాలిలో బలమే ముండు ననుకొనుచున్నావు. ఇక్కడేరహస్యమున్నది. సంచారవాయువునకుఁ గల శక్తి యదినిశ్చలముగా నున్నప్పుడార్జించుకొన్నదే. ఇట్లే నీ చిత్తవృత్తుల స్వేచ్ఛావిహారము నరికట్టి నీ మనస్సును నిశ్చలము గావించుకొంటివా, నీ బుద్ధి తేజోవంతమై నీ పరిశ్రమ లేకుండనే వెలుఁగొందును. దానివలన లోకరహస్యము గోచరించును"ని శాంతమ్మ యేమేమియో బోధించును. భీమకవి కీమాటలు చెవిమాటెకివికావు. కాని తల్లిమనసు నొవ్వకుండ నూగొట్టెడివాఁడు. అతని మనఃప్రవృత్తి విభిన్నమైనది. దేశాటనము నందతని కభిరుచిమెండు. ఎంత జటిల కావ్యమైన నాతఁడన్వయింపఁగలఁడు. ఆతఁడు ఘడియలోఁ జదివి దేనినైన నేకసంథా గ్రహింపఁగలఁడు. ఎంత క్లిష్టప్రాసతోనైనఁ దడువుకొనకుండ పద్యము లాఘవుగాఁ జెప్పుటాతనికి మంచినీళ్ళప్రాయము.

తన్ను నీతిమార్గమునఁ బెట్టుటకు సదాయత్నించు మాతృదేవి నప్పుడప్పుడు భీమకవి సాహిత్య సంబంధముగఁ బ్రశ్నించును. శాంతమ్మ తన తాతపాదుల సన్నిధిని సాహిత్య రహస్యము లనేకము లవగాహన గావించుకొన్నది. అందుచే నామెకు సార సాహిత్యసంపద యలవడినది. ఒకనాఁడు భీమన తన మాతృదేవిని "కాళిదాసునకును భవభూతికిని గల కవితా తారతమ్య మేమ"ని ప్రశ్నించెను. తన కుమారుఁడిట్టి విమర్శనాత్మకప్రశ్న యడిగినందులకు శాంతమ్మ యందలమెక్కినది. కాళిదాసుని మహోన్నత భావనా మహిమయు, భవభూతి భవ్యరసపోషణవైభవమును శాంతమ్మ యంతరంగము నానందతరంగిత మొనర్చు దివ్యమందాకినీ స్రవంతులు. "నాయనా! ఇరువురు మహాకవులకుఁగల తారతమ్యమును వివరించునంతటి క్లిష్టకృత్యము సాహిత్య విషయమున వేఱొండుండదు. అయినను నా యనుభవమునుబట్టి చెప్పెదను. కాళిదాసు గంభీరుఁడగు జనకునివంటివాఁడు. భవభూతి పరిపూర్ణ ప్రేమ హృదయ యగు జనయిత్రిని బోలినవాఁడు. ఒకడు విశేషముగా మేధోన్మీలనము

గావించి. తన్మూలమున రసానందమును గలిగించును. మఱియొకఁడు హృదయమును గదిలించి రసపారవశ్య మొనర్చును. భవభూతిహృదయము రస సముద్రమున సంక్షుభితమగును. కాళిదాసు రస సముద్రమున శేషశాయివలె నానందముగాఁ బవ్వళించును. భవభూతి కవిత విషయము నాధారము గావించుకొని పరిమితశక్తి సంపన్నమైనది. కాళిదాస కవిత స్వర్గభూములకు రససేతువులను నిర్మించును. నా యట్టి యభాగ్యురాలికి భవభూతి మహాకవి కాళిదాసుకన్న సన్నిహిత బాంధవుఁడ"ను చుండగనే శాంతమ్మ యపాంగము లార్ద్రములైనవి. భీమన యదిచూచి సహింపలేకపోయెను. వెంటనే యాతఁడు భోజనమును త్వరగా ముగించుకొని చనెను.

శాంతమ్మ కీ లోకమున నొక్కటియే కొఱఁత. తన కుమారుఁడొక యింటివాఁడైన చూచి యానందింపవలయునని. కాని యది యందని ద్రాని పండని యామె కంపించును. ఇట్లు కొన్ని సంవత్సరములు గడచినవి. ఆమె జీవితైకవాంఛ యామెలోఁ బూర్తిగ నశింపలేదు. అప్పుడప్పు డది తానున్నానని కనిపించుచుండును. కాని వెనుకటి పటుత్వము సన్నగిల్లినది. చివరికాకోర్కె యడుగంటినది. దానితో నామె శారీరకముగఁ గూడ కృశించినది. ఇఁక నామెకుఁ గోరదగిన దీ విశ్వమున నేమియునులేదు. భీమకవిపై గూడ నామెకు మునుపటి యనురాగములేదు. పూర్వమొక్కదిన మాతఁడు కానరాకున్న తహతహలాడెడిది. గ్రామమంతయుఁ గాలించెడిది. ఆతని చెలికాండ్రను ప్రశ్నించెడిది. ఇప్పుడామెలో నాయారాట మంతరించినది. హృదయము శాంతి వహించినది. ఆమె నిమేష మాత్రమున భీమనాయకుని స్మరించి పరవశయగుచుండును. లోలోన నవ్వుకొనుచుండును. ఆహారముతోఁగూడ నామెకుఁ బనితప్పినది.

తల్లియవస్థ తనయునకేమియుఁ దెలియదు. ఉత్సాహపూరితుఁడై దేశాటనము చేయుచుండును. అప్పుడప్పుడు వచ్చి యమ్మ నరసిపోవును. అన్నము పెట్టుమని యాతఁ డడుగఁడు. తినుమని యామెకోరదు. ఇట్లు మఱికొన్నినాళ్లు గతించినవి. శాంతమ్మ జీవితపు వత్తిలో తైలమంతయుఁ గుంజివేయఁబడినది. ఒకనాఁడు చుక్కరాలినట్లు భీమకవి వారము దినముల యనంతరము గృహమున కేతెంచెను. గుండెగుభేలుమనునట్లు జనయిత్రి స్మృతిదప్పి పడియున్నది. భీమకవికేమియు తోఁచక ప్రక్కనున్న నంబివైద్యుని పిల్చుకొనివచ్చెను. ఆతఁడు పేరాముదపుటాకులు తెప్పించి మాడునకుఁ గట్టవలయుననెను. భీమకవి తన యనుచరు నొకని నాపనికొఱకుఁ బంపెను. ఆతఁడొక బాపని పెరఁటిలో నాకులను జూచి కోసికొనుచుండగా నట తోటపనిచేయుచున్న పాలుఁడు పారతో నాతనిని దురాగ్రహముతో మోదెను. భూసురోన్మాద ఘాతుక కృత్యమును గాంచిన భీమన మానసము మిక్కిలి గాయపడినది. వెంటనే యాతఁడు రోషకషాయితనేత్రుఁడై

కం॥ "కూరడుగము కాయడుగము
నారయగా నుల్లి బచ్చలల్ల మదుగమా
పేరాముదపా కడిగినఁ
బారమ్మున నేసినట్టి బాపఁడుఁ ద్రెళ్లన్॥"

—అని శపించెను. ఈ శాపక్షరములు పూర్తియగునప్పటికి శాంతమ్మకుఁ దెలివివచ్చి కడపటి మాటలువిని యాకుల మనస్కయైలేచి, "బ్రాహ్మణో న హంతవ్యమ్మ"ను మాటలు వినవా నాయనా! ఎంత పాపుఁడయినను బ్రాహ్మణునట్లు శపించిన నీకుఁ బుణ్యలోకములుండవు. శాపము నుపసంహరించుకొనుమ"ని శాంతమ్మ తనయుని గోరినది. భీమన తన జనయిత్రికి స్మృతి వచ్చినందులకు సంతోషించెను. ప్రేమోద్వేగముతో నాతఁడామె పాదముల వ్రాలెను. శాపము నుపసంహరించుకొని బ్రాహ్మణోత్తముని ప్రాణములఁ గాపాడుమని శాంతమ్మ తిరిగి భీమన్నను గోరినది. భీమన్న తన వాక్యములమోఘములైనవనియు, భూసురుఁడద్దాని ననుభవింపక తప్పదనియు నీ పద్యము నాశువుగాఁ జెప్పెను:

ఉ॥ రామునమోఘ బాణమును, రాజశిఖామణి
కంటి మంటయున్
భీము గదా విజృంభణ, ముపేంద్రుని చక్రము
వజ్రి వజ్రముం,
దామర చూలి వ్రాఁతయును దారక విద్విషు
ఘోరశక్తియున్
వేములవాడ భీమకవి వేగము తిట్టిన
రిత్తవోవునే?

ఈ పద్యమునకు శాంతమ్మ హృదయము ద్విగుణీకృతముగా క్షోభ చెందినది. అప్పుడామెకు భారతమందలి శ్లోకమొకటి జ్ఞప్తికి వచ్చినది. ఆహారము కేశదుష్టమైనందుల కుదంకుఁడను బైలశిష్యుఁడు పౌష్యుఁడను రాజుపై నలగి యంధుడవు కమ్మనెను. అల్ప దోషమున కనల్పమైన శాప మిచ్చినందులకుఁ బౌష్యుఁ డుదంకు ననపత్యుఁడవు కమ్మని ప్రతిశాప మిచ్చెను. అందులకు భీతిల్లి యుదంకుఁడు నృపతిని తన శాపము నుపసంహరింపఁ బ్రార్థించెను. అప్పు డా భూపతి బ్రాహ్మణ క్షత్రియ స్వభావముల విశదీకరించుచునిట్లనెను:

శ్లో॥ యథా నవనీతం హృదయం బ్రాహ్మణస్య
వాచిక్షురో నిశిత స్తీక్ష్ణధారః
తదుభయమేత ద్విపరీతం క్షత్రియస్య
తదేవం గతేన శక్తోహం దీక్ష్ణహృదయ
త్వాత్తం శాప మన్యథా కర్తుం గమ్యతాం॥"

బ్రాహ్మణహృదయము నవనీతమువంటిది. వాక్కు వాడిపదునుకత్తి ధారవలె తీక్ష్ణమైనది. క్షత్రియుని స్వభావము తద్వ్యతిరిక్తము. కావున నీవు శాపమును గ్రమ్మరింప సమర్థుఁడవు.

బ్రాహ్మణ ధర్మము తన పుత్రునిలో లోపించినందులకు శాంతమ్మ తీరని కలఁత నందినది. తా నందులకు విచారించి ప్రయోజనము లేదనికూడ నామె గ్రహించినది. తన జీవితనాయకుఁ డగు భీమేశ్వరుఁడు త న్నాహ్వానించుచున్న ట్లామె యంతరంగము బోధించుచున్నది. భీమకవిని శాంతమ్మ సమీపమునకుఁ బిల్చినది. "నాయనా! కుమారా, నీ కవితాశక్తిని వృథ సేయకుము. ఏదేని యొక మహాకావ్య నిర్మాణమునకుఁ గడంగుము. జగద్ధిత మొనర్పుమ"ని శాంతమ్మ తన యంత్యసందేశమును దన ప్రియపుత్రునకు వినిపించి కన్నులు మూసినది. భీమకవి తన సర్వస్వమును గోల్పోయిన వానివలె రోదించెను. గ్రామ మంతయు భీమకవిని గూర్చిన ప్రసంగములతో నట్టుడికిపోయినది. భీమన కిక గృహముతో నిమిత్తములేదు. విశాల విశ్వ మంతయు నాతని విహారభూమియే. ఎక్కడ తిరుగుచున్నను నప్పుడప్పు డాతని హృదయగహ్వరమునఁ దన తల్లి యాదేశము మారుమ్రోఁగుచుండెను.

* * *

చాళుక్య భూపతి తన కులబ్రాహ్మణునితోను, కుందవాంబా కుమార సహితముగను రాజమహేంద్రవరమునకుఁ జేరెను. బాలకాలమునకు రాజరాజ కుమారరత్నమును గాంచుటచే నాబాలగోపాల ముల్లాసతరంగిత మాయెను. మేడాంబ మాత్రము లోలోన బాధపడుచుండెను. నన్నపార్యుని దర్శింపఁగనే బాలుఁడగు రాజరాజు భక్తితో నమస్కరించుచుండును. చిన్నతనముననే కుల బ్రాహ్మణునందు కుమారునకుఁ గుదిరిన యకుంఠిత భక్తిప్రపత్తులకుఁ గుందమాంబ హృదయకుముదము ప్రమోద మందెను. అట్టి దృశ్యములు మేడాంబకు కంటకింపుగా నుండెడివి.

రాజరాజు దినదినప్రవర్ధమాను డగుచుండెను. అతని కక్షరాభ్యాసము శుంభన్మూర్తి యగు నన్నపార్యునిచే జరిపించుటకు వీలుపడనందులకు కుందవాంబ మిక్కిలి విచారించినది. ఇప్పుడు నరేంద్రున కుపనయన సంస్కారోచిత మగు వయస్సు వచ్చినది.

ఉపనయనము సమస్తసంస్కారములం దత్యంత ప్రధానమైనది. దీనిచే మానవుఁడు జ్ఞానరూపమగు పునర్జన్మమును బొందుచున్నాఁడు. అయ్యది గురు సాన్నిధ్య సంప్రాపితము. ఉప = సమీపమునకు, నయనం = కొనిపోవుట. ఉపనయన మనగా గురుసాన్నిధ్యమునకుఁ గొనిపోవుట యని యర్థము. వైదికమత మగ్నిని, సూర్యుని ప్రత్యక్షదైవముగ నారాధించును. అందువలననే ఆచార్యవర్యుఁడు వటువున కాయుర్దాయము ననుగ్రహింపు మని యగ్నిని

ప్రార్థించును. మంత్రము లన్నియు శ్రవఃప్రేయముగఁ బఠించి, యర్థ వివరణము గావింపవలయునని కుందవాంబాభివాంఛితము.

వజ్రామాత్యునకు షష్టివర్షములు పూర్తి యగుచున్నవి. విమలాదిత్య ప్రభువునకు విశ్రాంతి గైకొనుచున్నతఱి నీ విషయ మెఱిఁగింపఁ బడెను. తగిన సన్మానములఁ గావింపుఁ డని చాళుక్యభూపతి యాజ్ఞ నిడెను. వజ్జియ ప్రెగ్గడ ప్రస్తావనము చాళుక్యేశ్వరుని కృతజ్ఞతాభార సంజనిత పులకాంకిత గాత్రుని గావించినది. ఎన్నితరములనుండియో యీ వంశ మట్టి స్వార్థరహిత సేవ గావించుచున్నది. తా నేదైన మహాగ్రహారమును ప్రెగ్గడకు దానమొనర్చి ఋణవిముక్తిఁ బొందవలయునని యాతఁడు యోజించెను.

ఆ మఱునాఁడు పంచప్రధానుల సభ జరిగినది. అందు చాళుక్యపతి, "పక్షము దినములలో వజ్రామాత్యులవారికి షష్ట్యబ్దములు సంపూర్ణమగుచున్నవి. షష్టిపూర్త్యుత్సవము తనకే కాక సమస్త వేంగీతలమునకును నొక ప్రశస్త పర్వ దినము. ఆ మహానుభావుని ఋణము నీ చాళుక్యవంశము తీర్చుకొనజాలదు. అట్లని చేతులు ముడుచుకొని మిన్నకుండుట భావ్యముకాదు. చంద్రున కొక నూలుపోగన్న ట్లా యమాత్యశేఖరుల కొక యగ్రహారము బహూకరింపఁ దలఁచితిమి. అందులకు శాసన కావ్యమును మా కులబ్రాహ్మణులు విరచింప వలయునని యాశించుచున్నామ"ని ప్రసంగించెను. సభలోనివారి వదనము లానందరేఖావిలసితము లైనవి. వజ్జియప్రెగ్గడ సూత్రము వినయ వినమిత వదనుఁడై తన విషయము కానట్లును, విననట్లును గూర్చుండెను. నన్నయ భట్టారకునిపై శాసన కావ్యనిర్మాణభారము మోపఁబడినది. ఆ భారమును వహించుట కాతని యాత్మ సంసిద్ధముగ లేదు. అందుల కనేక కారణము లున్నవి. ఆతని హృదయ మాంధ్రభాషా స్వభావ పరిశోధనా కార్యక్రమ క్రతుబద్ధ మైనది. అన్యవిషయము లాతని చెవి దూరుట లేదు. హృదయములేని పద్యముల కూర్పు నన్నయభట్టునకుఁ గిట్టదు. ఈ యభిప్రాయము నాతఁడు చాళుక్యపతి కెఱిఁగించుట కిష్టములేదు. వయసున వందఱికన్నఁ బెద్దయు, బహుశాసన కావ్యనిర్మాణచణుఁడు నగు భీమనభట్టుపై నా కార్యభారమును మోపు టుచిత మని నన్నయభట్టు సూచించెను. అందుల కెవ్వరి కెట్టియభ్యంతరమును లేక పోయెను. ఈ భారమును నెమ్మదిగాఁ దొలగించుకొని చిరంజీవి రాజరాజున కుపనయనోచిత మగు వయసు సంప్రాప్తించినదనియు, నా శుభకార్యము కూడ వైభవోపేతముగ నీ యానందసమయమున జరిపింపవలయుననియు, వజ్రామాత్యునిచే యువరాజునకు క్షాత్ర విద్యాభ్యాసము కూడ గావింపవలయు నను నూతనాంశములను రెండింటిని నన్నయభట్టారకుఁడు ప్రతిపాదించెను. ఈ ప్రతిపాదనలు వినగనే విమలాదిత్య ప్రభువుని యధరముపై మందహాసము మొలకెత్తినది. నన్నపార్యునకు యువరాజుపై గల యాసక్తి కాతఁడు విస్మయ

చకితుఁ డాయెను. అతఁడు మానసికముగ నాలోచింపకుండగనే యంగీకార సూచితముగా శిరమును బంకించెను. ప్రధాను లందఱు ప్రమోదాంతః కరణులైరి.

ఆ సమావేశానంతరము విమలాదిత్య రాజేంద్రుఁడు కుందవాంబా నికేతనమున కరిగెను. కులబ్రాహ్మణుని యభిప్రాయములను గుందవాంబకు ప్రభు వెలిఁగించెను. తన మనోవాంఛితములను, నన్నపార్యుని మనోభీష్టములను తు.చ. తప్పక వర్తించుటలోని దైవఘటన కామె లోలోన నుబ్బిపోయినది. రాజరాజనరేంద్ర కుమారు నాధారముగ ననిర్వచనీయములగు నాశాసౌధములను కులబ్రాహ్మణుఁడు నిర్మించుకొనుచున్నాఁ డని కుందవాంబ గ్రహించెను.

కుందవాంబ: సూర్యవంశమునకు వసిష్ఠమహర్షివలె, పాండవులకు ధౌమ్యునివలె. చాళుక్యులగు తమకు నన్నయభట్టారకు లట్టివారు. చిరంజీవికి వారిమూలముననే పవిత్ర గాయత్రీ మంత్రోపదేశము జరుగుట ముదావహము.

విమలాదిత్యుఁడు: ఆర్యమతముపట్ల ప్రజల కభిమానము సన్నగిలుచున్న ఈ దినములలో దానికంత ప్రాముఖ్య మేమో?

కుందవాంబ: ప్రజలకు తమ హితాహితము లెట్టివో తెలియవు. వారి హిత మెఱిఁగిన పృథ్వీపతులే వారికి ధర్మమార్గమును జూపవలయును.

విమలాదిత్యుఁడు: ఆ కాలము గాదిది. ప్రజల ననుసరించియే రాజు నడచుకొనవలయును.

ఈ మాటలు కుందవాంబను కుంఠిత మొనర్చినవి. చాళుక్యపతి ప్రసంగము పెంచక యచ్చోటు వీడెను. రాజేంద్రునిలో ఆర్యధర్మ తత్పరత క్షీణించుట కుందవాంబ స్పష్టముగా గుర్తించినది. ఆతని యభిప్రాయములను ఖండించుటకు కాని, యాతని మానసమును మరల్చుటకుగాని ఆమె ప్రయత్నింపలేదు. సంస్కారములను బట్టి బుద్ధులు ప్రవర్తించుచుండునని యామె నమ్మిక. సంస్కారములను మార్చుట కసాధారణ ప్రభావ ముండవలయును.

విమలాదిత్యుఁడు తన వ్యక్తిగతాభిప్రాయ మెట్లున్నను ననుస్యూతమగు సంప్రదాయములను కుందవాంబాభీష్టమును వ్యతిరేకించుట తగదను మర్యాద గలవాఁడు. అందుచే భావి కార్యక్రమములకుఁ గావలసిన విపుల సన్నాహము లన్నియు సోల్లాసముగాఁ బూర్తియగుటలో నాతని కభ్యంతరము లేదు. నన్నయ భట్టారకుఁడు నిత్యము సాయంతన సమయములం దేతెంచి వైదిక కలాపములకుఁ గావలసిన సామాగ్రినంతయు స్వయముగాఁ బరిశీలించుచుండెను. చతురాహ్నికముగా నుపనయన మహోత్సవము జరిపింపవలయు ననియు, ఆ నాల్గు దినములును బౌరాణికాగ్రేసరులచేఁ బురాణములు సెప్పింపవలయు ననియు, నైదవనాఁడుదయము వజ్రామాత్యునకు షష్టిపూర్త్యుత్సవము జరిపింపవలయు ననియు, మధ్యాహ్న సమయమున యువరాజునకు క్షాత్ర విద్యాభ్యాసము వజ్రా

మాత్యునిచే నొనర్పఁబడుననియుఁ గార్యప్రణాళిక నిర్ణయింపఁబడినది.

ఉపనయన ముహూర్త మాసన్నమైనది. వేంగిమండలము నాల్గు మూలల నుండియు 'వేదపండు'లగు భూసురోత్తములు పనసపండ్ల రాసులవలె పందిళ్లు నిండిరి. వేదవరేణ్యు లందఱకు రుచిరాగత మొసఁగి యుచిత ప్రదేశముల నలంకరించునట్లు నన్నయభట్టారకుఁడు స్వయముగఁ జూచుచుండెను. ఆ యా వేద పారంగతులైన పండిత సత్తములను వేఱువేఱుగా కూర్చుండబెట్టుట, చూచుటకు వేదరాశిని వ్యాసమహర్షి వింగడించినట్లుగా నున్నది. అంతఃపుర సౌధగవాక్షమునుండి యీ రమణీయ దృశ్యమును దిలకించుచుఁ గుందవాంబ వేదమూర్తి ప్రత్యక్షమైనట్లు మహానందమున నోలలాడుచుండెను. మేడాంబ తన మందిర గవాక్షమునుండి యీ దృశ్యమును సందర్శించుచు లోలోనఁ గుములుచుండెను. ఇందఱు జైన శ్రావకుల నేదో యొక రీతిని నొక్కచో నొనగూర్చి తన కనులకుఁ గళ్యాణమును జేకూర్చుకొను సమయ మెట్లు లభించునో యని మేడాంబ యారాటించెను. విప్రోత్తములు శిష్యులచే మంత్రములను చదివింపించుచుండిరి. ఆ యుదాత్తానుదాత్త స్వరగుంఫనలు తరంగ తరంగములుగ కుందవాంబా హృదయ విహాయస పథమున నావృత్తములై ఆమెను త్తేజపఱచుచుండెను.

ఇంతలో సుముహూర్తము సమీపించినది. రాజరాజనరేంద్ర కుమారుని జూచి యాబాలగోపాలము ముచ్చటపడుచున్నది. పూజ్యమూర్తులగు పురోహితులు ముక్తకంఠమున నుపనయన మంత్రములఁ బఠించుచుండిరి. వాని నన్నింటిని సమీకరించి నన్నయభట్టారకుఁడు సుమధురమగు తెలుగువాక్య విన్యాసమున వ్యాఖ్యానము గావించుచుండెను. కొంద ఱీ వ్యాఖ్యానమునకు విముఖులుగా నుండిరి. వైముఖ్యసూచకముగా వారి భ్రూకుటులు కుటిలమాయెను. సరసులగు కొందఱా యాంధ్ర వ్యాఖ్యానమును వీనులొగ్గి వినుచుండిరి. అది యాంధ్రమా? గీర్వాణమా? వేఱుపఱుపఁ జాలకుండిరి. ఆంధ్రభాష కింత మాధుర్యమున్న విషయము వారి కపరచితమై నన్నయ పవిత్ర ముఖమున పరిచితమగుట తమ భాగ్యమని సంభావించుచుండిరి. సనాతనార్య మతము దేశ భాషలలో నట్లు వ్యాఖ్యానితమై జీవిత నిర్మాణమున దాని మహత్వ పటుత్వ స్వరూపములను బ్రదర్శింపవలసిన యవసరమునుగూర్చి పలువురు సహృదయులు భావించిరి.

విద్యా సముపార్జనమునకు వలయు సాధనముల నన్నింటిని వటువు ఉపనయన సంస్కారమువలన సంపాదించుకొనుచున్నాఁడు. ఆయుర్దాయము, దేహపుష్టి, మేధాశక్తియను త్రివిధ శక్తులను వటువు సాధింపవలయును. ఆర్య మతము సూర్యుని, అగ్నిని మనకుఁ బ్రత్యక్ష దైవములుగాఁ బ్రసాదించినది. కావుననే యుపనయ నారంభమున ఆచార్యుఁడు వటువున కాయుర్దాయము ననుగ్ర

హింపుమని యగ్నిదేవుని బ్రార్థించును. అనంతర మాచార్యుఁడు శిష్యుని పోషణ భారమును దేవతలపై విడుచును. "అగ్నిష్టే హస్త మగ్రభీత్ .... సవితా తే హస్త మగ్రభీత్, సరస్వతీ తే హస్త మగ్రభీత్." "కుమారా! ఆయుర్దాయ కర్త యగు నగ్నిదేవుఁడు, పుష్టిసంధాయకుఁడగు సూర్యభగవానుఁడు, విద్యా ప్రదాయిని యగు సరస్వతీదేవియు నిదే నీ హస్తమును గ్రహించుచున్నా"రనుచు నా దేవతలకుఁ బ్రతినిధిగా ఆచార్యుఁడు శిష్యహస్తమును గ్రహించెను. ఇట ఆచార్యత్వమును వహించిన నన్నపాచార్యునకు నరేంద్రకుమారుని మృదుల హస్తస్పర్శ యతీంద్రియ సౌఖ్యప్రదమై పులకాంకితుని గావించెను.

అనంతరము బ్రహ్మోపదేశ ఘట్టము సర్వ నేత్రపర్వముగ నుండెను. "సు ప్రజాః ప్రజాయాభూయా స్సువీరో వీరైస్సువర్చా వర్చసా సుపోషః పోషై" యను మంత్ర పఠనానంతరము "కుమారా! నీవు వేదాధ్యయన మొనర్చి కర్మానుష్ఠాన మహిమచే సుపుత్రులఁ బడయుము. నీ యనుష్ఠానశక్తి నీ కుమారులయందేకాక నీ పౌత్రప్రపౌత్రులయందును బ్రవేశించి వీర్యవంతు లను గావించుఁగాక! వీరందఱును వృద్ధిపొంది, నీ యశస్సును వృద్ధిగావించి వేదమహిమను ప్రవర్ధమాన మొనర్చెదరుకాక" యని నన్నయభట్టారకుఁడు ప్రవచించుచుండగా నా భాషణములలోని యవ్యక్త మధురిమ నరేంద్రకుమారు నానంద పరవశుని గావించెను. ఈ దృశ్యమును దిలకించుచున్న కుందవాంబ కీ భౌతిక ప్రపంచమే తెలియదు. ఆమె యీ భూలోక భువర్లోక సువర్లోక తపో లోకముల నతిక్రమించి సత్యలోక సౌందర్య దీప్తులలో నిమగ్నయైనట్లుండెను.

విమలాదిత్యునకుఁగూడ నీ పవిత్ర కలాపము కొంత కనువిప్పు కలిగించి నది. వైదికమత ముదాత్త భావభరితమైనదనియు, దానిని నన్నపార్యునివంటి యుత్తమ వేదమూర్తులు సామాన్య లోకమునఁ బ్రచారమొనర్ప సమర్థులనియు నతఁడు భావించెను. కాని ప్రజలకట్టి యవకాశము లభింపక నిస్పృహతో జైన మతాది యవైదిక మతముల నాలింగన మొనర్చుచున్నా రనియు నాతఁడు సమాధానపడెను. నాల్గు దినముల యుపనయనానంతరము బ్రాహ్మణమాన్యు లందఱకును వారివారి యర్హతలకొలఁది కపిలగోవులు, హిరణ్యము, భూములు, దానము గావింపఁబడినవి. నన్నపార్యుఁ డెన్నఁడును దానమును బరిగ్రహించిన వాఁడు కాఁడు. కాని కుందవాంబా సంప్రార్థనమునఁజేసి యత్యుత్తమము, సవత్స యగు కపిలధేనువును స్వీకరించెను. అయ్యది యపర కామధేనువువోలె నొప్పారుచుండెను. నన్నపార్యునివెంట నడచుచున్న యా గోమాత వసిష్ఠ మహర్షి ననుసరించి వచ్చు నందినివలె నుండెను. ఈ యపూర్వ శుభ సంతోష సమయమునఁ దన సహాధ్యాయుఁడగు నారాయణభట్టు లేఁడే యని నన్నయ మానసము కొంచెము కించపడినది. వైదికమత సంస్థాపనమునకై తా నీ నాఁడు కావించిన యాంధ్ర వ్యాఖ్యానము ప్రజాభిమానము నా మతమువట్ల మఱలించుటకుఁ

గావించిన నాందీప్రస్తావనమని నన్నయ విశ్వసించెను. పండితమ్మన్యులు కొందఱిప్పట్లి వైముఖ్యము వహింతురని నన్నయ కెఱుకలేకపోలేదు. ఆ ప్రతిఘటన మెట్లుండునో చూత మనుకొనినాఁడు. ప్రజలకు వైదికమత సౌరభము నాఘ్రాణించుట కవకాశము లిట్టి సందర్భములలోఁ గల్గించినచో వా రన్యమతాసక్తులు కాలేరని నన్నపార్యుని యాలోచనము. అందుల కవకాశములు లభింపవలయును.

ఉపనయనానంతరము షష్టిపూర్త్యుత్సవ మారంభమైనది. సమస్త దుర్గాధ్యక్షులును, సైనిక సమూహములును, యశేష జన సంతానమును, పండిత బృందములు నా యుత్సవమును సందర్శించుట కేతెంచెను. నగర రక్షకులు వీరి నందఱను వారివారికి నిర్ణీతమైన ప్రదేశములకుఁ జేర్చునప్పటి కెంతో ప్రయాసయైనది. వజ్జియప్రెగ్గడ యన్న లోకమునకుఁగల యభిమానమున కాదృశ్యము ప్రత్యక్షదర్పణము. చాళుక్యసామ్రాజ్య సుస్థిరవైభవోన్నత సౌభాగ్యమునకుఁ గారణభూతుఁడా భూసుర వరేణ్యుఁడే యను వాక్యము జనసమూహమునం దే ప్రక్క విన్నను నేకవాక్యముగా వినిపించుచున్నది.

సుప్రభాత సుముహూర్తమున విమలాదిత్యభూపతియు, నాస్థాన కవీంద్రులును, ప్రధానులును, వివిధ దుర్గాధిపతులును, పౌర ముఖ్యులు కొందఱును వజ్జియప్రెగ్గడ గృహప్రాంగణమున సమావేశమైరి. మంగళవాద్యములు హృద్యముగా హృదయము నలరించుచున్నవి. మధ్యమధ్య కాహళాధ్వనులు గుండెలను జలదరింపఁ జేయుచున్నవి. ఈ నాద సముద్రమును ద్వీప ప్రదేశములట్లచ్చటచ్చట వైదికోత్తముల పవిత్రవేదవినాదము లావృత్తము లగుచున్నవి.

వజ్జియప్రెగ్గడ గృహప్రాంగణమునందు కీరపంజరములు కలవు. తమ యజమాని యాదేశమున ఆహూతజనముల కాపంజర కీరషట్కము స్వాగతవాక్యములఁ బల్కినవి. అతిథిజనము సముచితాసనములయం దాసీనమైనది. పిమ్మట నాశకుంతములు సుమధుర మంత్రశోభితమగు పనసల నుదాత్తానుదాత్త స్వరములు తప్పక పఠించినవి. వజ్రామాత్యుఁడే గురుత్వము వహించి వాని నిట్లు శిక్షణ నిచ్చెనని విని యందఱును విస్మయమందిరి. అప్పటికి బ్రహ్మముహూర్తమున మేల్కాంచి వజ్రామాత్యుఁ డవబృథస్నాతుఁడై తన నిత్యపూజా కలాపమునంతయుఁ బూర్తిగావించుకొని బయటికి వచ్చెను. అపర శంకరునివలె నర్తేతెంచిన వజ్జియప్రెగ్గడకు విమలాదిత్య నన్నయభట్టారకాద్యతిథిజన ముత్థితమై నమస్కరించినది. అ య్యభ్యాగత సముదాయము తన యందుఁ జూపిన గౌరవమునకు ప్రెగ్గడామాత్యుఁడు కృతజ్ఞతా సంభరితాంతఃకరణుఁడాయెను. నన్నయభట్టారకుఁడు ముందునకువచ్చి కార్యక్రమము నారంభించెను. సాలంకృతమగు నందలమంతలో సంసిద్ధమాయెను. వజ్జియప్రెగ్గడ యం దాసీనుఁడాయెను. అంతఃపుర పరిచారికలు మంగళహారతు లొసంగిరి.

చాళుక్యభూపుఁడు స్వయముగఁ బూలమాలతో నమాత్యశేఖరు నలంకరించెను. అనంతరము వివిధసేనాధిపతులు, పురప్రముఖులు. చిత్రవర్ణ శోభావిలసితమగుఁ గుసుమమాలలతోఁ దమకన్ని విధముల మార్గదర్శకుఁడగు మంత్రిసత్తముని సమ్మానించిరి.

చాళుక్యపతి దారిచూపగా, సమస్త రాజపరివారము సముచితముగ ముందు నడచినది. మందమందముగ నాందోళిక నడచినది. వెనుక రాజయోధులు రమణీయ విన్యాస భంగిమలతో నడచిరి. ఏ రాజ్యమునఁగాని, యే సచివోత్తమునకుఁగాని యింతటి యఖండ గౌరవము జరిగియుండదని యందఱు భావించిరి. రాజమహేంద్రపుర రాజమార్గమున నూరేగింపు చనెను. పౌరనారీలోకమంతయు సౌధోపరితలములనుండి యీ రమణీయ దృశ్యరాజము నాలోకించినవి. పైనుండి వజ్జియప్రెగ్గడపై పుష్పవృష్టిఁ గురియించినది.

నగరులో నిర్ణీతమగు వేదికపై ప్రత్యేకమగు నాసనముపై వజ్జియప్రెగ్గడ యాసీనుఁడాయెను. అతని శరీరచ్ఛాయ దబ్బపండును బోలియుండెను. ఆ యుత్సవమును బట్టి యాయన కఱువది వర్షములు నిండెనని తలంపవలసినదే కాని యాయన ముఖకాంతులింకను బరువమును దప్పినట్లు గానరావు. వజ్జియప్రెగ్గడకుఁ దక్షిణభాగమునఁ జాళుక్యపతియు, వామపార్శ్వమున నన్నయభట్టారకుఁడు నాసీనులైరి. విప్రాశీః ప్రవచనము పూర్తియైనది. షష్టిపూర్త్యుత్సవావసర మంత్రములను మఱికొందఱు భూసురులు పఠించిరి. అనంతరము చాళుక్యాధీశ్వరుఁడు నన్నయభట్టారకుని వైపునకుఁ దన యపాంగ వీక్షణమును బ్రసరింపఁజేసెను. నన్నయభట్టారకుఁ డుత్తిష్ఠుఁడై, "ఈనాఁడు సమస్త వేంగి మండలమునకుఁ బరమ పవిత్రమైనది. తన జీవిత సర్వస్వము నిస్స్వార్థముగా వేంగిదేశ సముద్ధరణమున కంకితము గావించిన పరమ బ్రహ్మణ్యమూర్తి, అవిరళజపహోమ తత్పరుఁడు నగు వజ్రామాత్యులవారి షష్టిపూర్త్యుత్సవ మీ దినమున జరుపుకొనుచున్నాము. సౌజన్యరత్నాకరులగు వజ్రామాత్యుల సేవానిరతికి కృతజ్ఞతాచిహ్నముగా 'రణస్థిపూండి' యగ్రహారమును సర్వకర పరిహారముగా దానము చేయుచున్నారము. ఏ తత్సంబంధమగు తామ్రశాసన కావ్యమును 'భీమనభట్టు' మహాకవీశ్వరులు వ్రాసియున్నారు. సమస్త సభాపక్షమున భీమనభట్టు కవీశ్వరులను దానిని గానము చేయవలసినదిగాఁ బ్రార్థించుచున్నా"నని యుపన్యసించెను.

భీమనభట్టు శాసనకావ్య పఠనార్థము వేదికను జేరెను. భీమనభట్టు పొట్టిగా, బొద్దుగా నుండును. పెద్దబొజ్జ, బుఱ్ఱమీసములతో నదియొక వింత రీతిగా నుండును. వయస్సున నతఁడాస్థానకవి మండలిలోఁ బెద్దవాఁడు. దంతములు స్ఖలన మగుటచే నక్కడక్కడ నాతనిమాట తొస్సిపోవును. దీనికి సాహాయ్యముగ కొంత నత్తికలదు. ఈ శాసనకావ్య రచనా పఠనా గౌరవములు

తనకుఁ దక్షిణలందులకు మహోత్సాహుఁడైనాఁడు భీమనకవి.

రణస్థిపూండి శాసనకావ్యము గద్యపద్యాత్మకముగాఁ గూర్చఁబడెను. అందు చంద్రవంశ చరిత్రము తొలుత నుద్ఘాటింపఁబడెను. పిమ్మట సత్యాశ్రయ జయసింహ వల్లభేంద్రుని భ్రాత కుబ్జవిష్ణువర్ధనునితో నారంభమైన చాళుక్య నృపాలుర పరిపాలనము ప్రశంసింపఁబడెను. తదనంతరము విమలాదిత్యుని పరిపాలనము, శౌర్యధైర్యము లనేకశ్లోకములలోఁ గొనియాడఁబడినవి. ఆపైని వజ్రామాత్యుని వంశాభివర్ణనము క్లుప్తముగ వర్ణించి భీమకవి "వేదశాస్త్రాణి యద్ధామ్ని పఠంతి శుకశారికాః" అను వాక్యమున నమాత్యశేఖరుని వేదాధ్యయన పరాయణత్వమును బ్రకటించెను. అప్పుడప్పుడు భీమనభట్టునకు నత్తిముంచుకొని వచ్చును. అందుచే మాటలు తడబడును. అది సభ్యులకు హాస్యజనకముగా నుండెను. తన్మూలమున సభ కొంత కళకళ లాడినది. కావ్యపఠనము పూర్తియగునప్పటికి

శ్లో॥ "భీమేశ్వర సమోదేవో
వేంగీశ్వర సమోనృపః
వజ్రామాత్య సమోఽమాత్యో
నభూతో నభవిష్యతి॥"

యను శ్లోక మావృత్తమంది నాతి కఠినమగుటచే నందఱి రసనాగ్రముల నర్తించినది.

భీమనభట్టుకవిని విమలాదిత్యప్రభువు వెయ్యినూటపదార్ల సువర్ణనాణెములతోను, సువర్ణ దుశ్శాలువలతోడను సత్కరించెను. శాసనలేఖకుఁడైన జొంతాచార్యుఁడు నూటపదారు సువర్ణనాణెములతో గౌరవింపఁబడెను. రాజ సమ్మానము కాక వజ్రామాత్యుఁడు ప్రత్యేకముగా నీ యిరువురను నూత్న పరిధానములతో సత్కరించెను. రాజ పురోహితు లేతెంచి స్వస్తివాచకములును, భూదాన గృహదానపూర్వక మంత్రములను పఠించిరి. రణస్థిపూండి గ్రామ సీమలు చదువఁబడినవి. నన్నయభట్టారకుఁడు విమలాదిత్యుని దక్షిణహస్తమున మంత్రోదకములను ధారవోయగా నాధార వజ్రామాత్యుని నిరంతరాసిధారణా కర్కశమగు హస్తమునఁ బడి చిద్రుపలైనది. ఇట్లు బ్రహ్మార్పణ మని మూడు సారులు రాజు నీరముల వదిలెను. అచట సమావేశమైన కతిపయ విప్ర సమూహము చాళుక్యప్రభువును, చాళుక్యామాత్యుని నాశీర్వదించుచు ముక్త కంఠమున మంత్రములు పఠించిరి. ఈ కార్యకలాప మంతయుఁ బూర్తియగు నప్పటికి పది ఘడియల ప్రొద్దువోయినది. రాజపరిచారికలు వజ్రామాత్యునకు మధురమంజుల గీతాలాపనలతో దివ్య నీరాజన మెత్తిరి. సభ ముగిసినది.

ఈ కార్యక్రమానంతరము వజ్రామాత్యుఁడు నన్నయభట్టాది కతిపయ మిత్ర పరివారముతో స్వగృహమున కేతెంచెను. అప్పటికి పురోహితు లనేకులు

వజ్జియప్రెగ్గడ రాక నిరీక్షించుచుండిరి. షష్ట్యబ్ద్యుత్సవ సంబంధమగు వైదిక కలాపమంతయు నిఁక నిర్వహింపవలసి యున్నది. వజ్జియప్రెగ్గడ బుధోత్తముల తలలోని నాలుక. అతఁడు తన జీవితము నంతయు వేదాధ్యయనమునకు వెచ్చింపక క్షుద్రమగు రాజకీయ లంపటమునఁ జిక్కినందులకు విచారించుచుండును. ఉత్తర జన్మమునవైనఁ దాను బరిపూర్ణ వేదమూర్తిగా జన్మింపవలయునని యాతని యభిమతము. ఈ విచారము నప్పుడప్పు డాతఁడు నన్నయభట్టారకునితో వెలిబుచ్చుచుండును. నన్నయ వజ్రామాత్యుని యభిప్రాయముతోఁ బరిపూర్ణముగ నేకీభవింపఁడు. వజ్రామాత్యునివంటి పవిత్రమూర్తు లుండఁబట్టియే రాజకీయము లింకను నధఃపతితము రాక సంరక్షింపఁ బడుచున్నవని నన్నయభట్టు సమాధాన పఱచుచుండును.

వజ్రామాత్యుఁడు ప్రత్యేకముగ నమర్పఁబడిన గుండములందు నవగ్రహములకు, నష్టదిక్పాలురకు శాంతి కల్గించి పాత్రులయిన బ్రాహ్మణోత్తములకు దానములు గావించెను. అనంతరము వజ్రామాత్యుఁడు ధర్మపత్నీ సహితముగ నఘమర్షణ స్నాన మాచరించెను. వివిధ పవిత్ర నదీనద తోయములతో నా స్నానము సమంత్రకముగ జరిగినది. పురాణ దంపతులవలె భాసించు నా దంపతులకుఁ బంచగవ్యము లొసఁగఁబడినవి. పిమ్మట వజ్రామాత్యుఁడు తులాభారము తూఁగినాఁడు. ఆ సమయమునకు సరిగా విమలాదిత్య ప్రభు వేతెంచెను. తనకు లబ్ధమైన వివిధాహవజయలబ్ధామూల్య లాంఛనములతో నాతఁడు తులతూఁగినాఁడు. అప్పటికి భారము సరిపోలదాయెను. అమాత్యుని యర్ధాంగి తన మెడలోని హాటక భూషణముల నన్నియు మూటగట్టి త్రాసునందుంచినది. ఇంకను నొకింత బరువు తగ్గినది. వృద్ధుఁడయ్యును నమాత్యుని శరీర సౌష్ఠవమున కందఱును విస్మయ మందిరి. అప్పు డొక్క క్షణము వజ్జియప్రెగ్గడ మానసమునఁ జీఁకట్లు క్రమ్మినవి. అంతలో నొక యాలోచనము తట్టినది. విమలాదిత్య ప్రభువు కూడ నేమి జరుగునో యని కౌతుక నిరీక్షణములఁ బ్రసరింపఁ జేయుచుండెను. "మా వంశమున పరంపరానుగతముగ వచ్చుచున్న బంగరపు టొర బరువైనది కలదు. దాని నీ పవిత్రావసరమున వినియోగింపుఁడ"ని వజ్రామాత్యుఁడు పలుకగనే యచ్చటి సభ్యు లాశ్చర్యమానసులైరి. అయ్యొరఁ దక్కెఁడయం దుంచగనే యావలివైపునకు ముల్లు వ్రాలినది. ఆ సొమ్మునంతయు సగము భూసురులకును మిగిలిన సగము బీదసాదలకును వినియోగ పడునట్లమాత్యుఁ డాజ్ఞాపించెను. వజ్రామాత్యుని త్యాగనిరతికి చాళుక్యప్రభు వంతరంగమున నానంద మందెను. అశేష బంధుమిత్రబుధ సపరివారమున కానాఁడు మంత్రివర్యుఁడు షడ్రసోపేతముగా విందుఁ జేకూర్చెను.

ఒకింత విశ్రాంతి గైకొనెనో లేదో సాయంతన కార్యక్రమమునకు

వేళ యయినదని పిలుపు వచ్చినది. ఆ పవిత్ర సాంధ్యసమయమున బహు సమరనిర్వహణ రక్షాదక్షుఁడగు వజ్రామాత్యుఁడు చాళుక్య యువరాజునకు మహాసి విద్యాభ్యాస మొనర్పవలయును. ఇందుల కొక బహిరంగ వేదిక యమర్పఁ బడినది. తమ యువరాజును సందర్శింపవలయునని పల్లెపట్టణముల నుంచి యశేష జన మేతెంచినది. వారి నందఱను సర్ది నిర్ణీతస్థలములయందు కూర్చుండఁబెట్టుటకు రాజభటు లత్యంత ప్రయాసపడుచుండిరి.

వజ్రామాత్యుఁడు, నన్నయభట్టారకులును వేవేగ వచ్చిరి. అప్పటి కన్ని యేర్పాటులును బూర్తియైనవి. విశాల వేదికాస్థలిపైఁ బంచప్రధానులు, నగరాధ్యక్షుఁడు నాసీనులైరి. విమలాదిత్య ప్రభువరేణ్యు లొకప్రక్క వజ్రామాత్యుని తోడను, వేఱొకప్రక్క నన్నయ కులబ్రాహ్మణుని తోడను సభావేదిక కరుదెంచెను. రాజాగమన సూచితముగ ఘంటానినాదము దిక్కుల పిక్కటిల్లెను. సభాసారు లందఱు గౌరవ సూచనగా లేచి నిలువఁబడిరి. కతిపయ నిమేషములకు రాజరాజనరేంద్ర యువరాజు సాలంకృతమగు పంచకళ్యాణి గుఱ్ఱముపై నధిష్ఠింపగా సభారంగమునకు తీసికొని రాఁబడెను. అపర మన్మథ కుమారుఁడగు నా రాకుమారుని సభ్యు లందఱు సహస్రనేత్రములతో సందర్శించినట్లు కరువుతీరఁ గాంచిరి. రాజరాజు వినయనిమీలిత రాజీవలోచనములతో వజ్రామాత్య నన్నయభట్టారకులకు నమస్కరించెను. పిమ్మట కుంకుమరేఖాసంజని తారుణిమతో సమ్మిశ్రమై, ధారాధవళ కాంతులతో ధగధగాయమానముగా నున్న యొక్క మహాసికి యువరాజు పూజ గావించెను. పూజానంతరము వజ్రామాత్యుఁ డాకత్తిని నరేంద్రుని చేతి కొసఁగి, తన కరవాలముతో నభ్యసన మారంభించెను. కత్తి చేపట్టు విధానమును జూపినంతనే యీడునకు మించిన రాజటీవితో చాళుక్య రాకుమారు డంతటి నిడుపైన వాలమును దన కరమున కొదుగునట్లు గావించెను. వెన్నతో నలవడిన యీ నైపుణ్యమును సమస్త సభయు విభ్రమదృష్టులతో నవలోకించినది. వజ్రామాత్యుఁడు కత్తితో కత్తి కలుపు విధానమును నేర్ప నారంభించెను. ఇది రెండు విధములు. క్షాత్రధర్మోపాసకుఁడగు బ్రాహ్మణుఁ డొకవిధముగను, క్షత్రియజాతుఁ డొకవిధముగను గావించును. క్షాత్రధర్మపరుఁడగు వజ్రామాత్యుఁడు బ్రాహ్మణోచిత విధానము నవలంబించుట దూరమునుండి యొక యశ్వారూఢుఁడు పరిశీలించెను. అందుల కాతఁడు సహింపఁజాలక జనసమ్మర్దమును మిక్కిలి కష్టముపై నతిక్రమించుచు వేదికను సమీపించెను. "అపుడాపుడు" అను మాటలు జలద గంభీరముగా నాతని ముఖ వినిర్గతము లైనవి. ఆతని తను యష్టిపటుత్వమును గోల్పోనిది. దృక్కులు మధ్యాహ్న భాస్కర ప్రచండకాండ మండితములై యున్నవి. విమలాదిత్యుఁడు జాగృత మనస్కుఁడై తదేక దృష్టితో నా యశ్వారూఢుని చూచుచుండెను. వెంటనే చాళుక్యయోధు లాతనిని బంధించుటకు

సన్నద్ధులైరి. ఆ యోధవరేణ్యుఁడు వారలను విదలించుకొని వేదికపై కుటికి "క్షత్రియులకు బ్రాహ్మణోచిత విధానమున విద్య నేర్పుట పాడియా ?" యని క్షత్రియ సముచిత మార్గమునఁ దన కరవాలమును ద్రిప్పెను. తన యపరాధమునకు వజ్రామాత్యుఁడు సిగ్గువడినాఁడు. నూతనాగత యోధునిలోఁగల సునిశిత పరిశీలనా జ్ఞానమునకు విమలాదిత్యుఁ డబ్బురపడి యభినందన పూర్వకముగా నాతనిని సందర్శించెను. కరవాల సంచాలనానంతర మా యోధవరేణ్యుఁడు వజ్రామాత్యునకు వందన మాచరించెను. విమలాదిత్యునకు కైమోడ్చెను. నన్నయభట్టారకుని సాదరమున నవలోకించెను. నిశిత పరిశీలనముపై నాతఁడు పరిచయమగు వ్యక్తివలెఁ గాన్పించెను. కాని పెరిగిన గడ్డములతో బహుక్లేశానుభవ సంజనిత యాతనా పరంపరా పరిమ్లానమగు వదనముతో నాతనిని గుర్తించుట క్లిష్టముగనే యుండెను. చిఱునగవు పెదవులపై చిందులాడగా "నేను నారాయణభట్టారకుఁడ"నని యాతఁడు తన్నుఁ బరిచయము గావించుకొనెను. నారాయణభట్టారక నామము శ్రవణేంద్రియములఁ జొచ్చినంతనే పెన్నిధిఁ గాంచిన పేదవడువున నన్నయభట్టారకుఁ డాతనిని కౌఁగిలించుకొని విడువలేదు. వజ్రామాత్య విమలాదిత్యు లాతనిని కరవాలనముచే నాదరించి నిజముగాఁ దమ కాదినము పర్వదినమని వక్కాణించిరి. నారాయణభట్టు నన్నయభట్టారకుని ప్రక్కన నధిష్ఠించెను. కార్య ప్రణాళికానుసారము ధనుర్విద్యాభ్యాసముకూడ నరేంద్రున కారంభమైనది. ఆ శుభసమయముననే వివిధ యోధాగ్రేసరులు తమ కదనపాండితిని బ్రదర్శించిరి. రాజేంద్రుఁడు వారిని సముచితముగ సత్కరించెను. సభ ముగిసినది. ప్రజలందఱు నూతనాగత యోధుని నిశిత విజ్ఞాన సంపత్తిని, రాకుమారుని సౌందర్య సౌకుమార్య సందీప్తిని వేనోళ్ళఁ బ్రశంసించుచు సంతృప్తమానసములతో గృహోన్ముఖులైరి.

౧౩

త్రికాలయోగి సిద్ధాంత దేవుఁ డాంధ్రావని నంతయు పర్యటించెను. ఆయన కెక్కడకుఁబోయినను నఖండమగు స్వాగతము లభించుచుండెను. అనేక ముఖ్య పట్టణములలో నాయన జిన విహారములను స్థాపించి స్థానిక ప్రజల సహకార సద్భావములతో నవి నిర్వహింపఁబడున ట్లేర్పాట్లు గావించెను.

ఆంధ్రప్రజల సహృదయ సంపత్తి జినయోగినెంతగనో యాకర్షించినది. ఆంధ్రుల నవనవోన్మేష విజ్ఞానప్రీతి సన్నిసభలయందును జినయోగి ప్రత్యేకముగఁ బ్రశంసించెను. ప్రజాహృదయములను జూరగొనుట కిదియొక చక్కని యుపాయము. ఆర్యమతమందలి సంఘ విభజనమునుగూడ జినయోగి విమర్శించెను. "సంఘధర్మములు పలువిధములు. అందఱును నన్నిపనులను గావింపలేరు. పరంపరానుగతముగ వచ్చు సాంఘిక ధర్మములను నిర్వహించు

టలో సౌలభ్యముకలదు. అంతమాత్రమున సంఘములో నొకజాతి మఱియొక జాతిపై నధికారము చలాయింపరాదు. సంఘసౌష్ఠవమునకు స్వధర్మ నిర్వహణము ప్రాణతుల్యము కావచ్చును. అది వర్ణదురహంకారమునకు దారితీయవచ్చును. 'స్వభావనియతం కర్మ' యనుమాట సహింపరానిదియని జినస్వామి యటనట ఉపదేశించుటచే నాతని బోధనలు ప్రజలకు మఱింత సన్నిహితములగుచుండెను.

ఇట్లనేక ప్రముఖప్రదేశములలో విహారవాటికల నిర్మాణమునకు వలయు వసతుల నన్నియు గావించి త్రికాల యోగి రాజమహేంద్రవరపట్టణమున కేతెంచెను. రాజమహేంద్రవరమున నొక కేంద్ర జైన విహారవాటికను నిర్మింపవలయునను వాంఛ యాయనకు గాఢమైనది. జినదేవులు రాజసందర్శనము గావించి చాలకాలమైనది. రాజు మనసున జైన మతాభిమానము దృఢపడినట్లు జినయోగి గ్రహించెను. కాని యార్యమతస్థులగు నన్నయభట్టారకుఁడుగాని, వజ్రామాత్యుఁడుగాని యాతని మనస్సును మరల్తురేమోయని జినయోగి యప్పుడప్పుడు విగతధైర్యుఁడగుచుండును. అట్టి తహతహతో రాజసందర్శనము నాయన యభిలషించెను. విమలాదిత్య ప్రభువులకు సిద్ధాంతయోగి మహాశయుల రాక సమ్మోద మొసర్చెను. ఉచితరీతిని అభ్యుత్థానము గావించెను. అర్ఘ్యపాద్యములతో పూజించెను. బహుకాలమునకు సంప్రాప్తించిన సందర్శనమునకు నృపాలుఁడు తన యానందమును ప్రదర్శించెను. జినయోగి యుచితరీతిని రాజేంద్రుని యోగక్షేమములను విచారించెను. మేడాంబాదేవి కుశలమును. విజయాదిత్యుని యభివృద్ధిని ఆదృతితోఁ బృచ్ఛించెను. జినయోగికి కుందవాంబాదేవితో పరిచయమేలేదు. పరిచయము గల్పించుకొను నిచ్ఛయుఁ బొడగట్టలేదు. ఆమె సనాతన ధర్మము కరుడుకట్టిన చోళవంశ సంజాత యని. పరమమూర్ఖ యని జినయోగి యభిప్రాయము. విమలాదిత్యుఁడు కుందవాంబా ప్రస్తావన మేమియు చేయలేదు. జినయోగి మనోరథముపై చాళుక్యపతి విజయాదిత్యుని పిలిపించెను. ఈ సమయమును బురస్కరించుకొని మేడాంబ జినయోగి సందర్శన సౌభాగ్యమును బడసినది. విజయాదిత్యునిలో రాజలక్షణములున్నవనియు, నభ్యుదయమును సాధించు పట్టుదల యాతని వీక్షణములలో వీక్షింపనగుచున్నదనియు జినయోగి వచించెను. ఈ వచనములకు రాజు గంభీరముగా నుండెను. మేడాంబ లోలోన నుబ్బినది. జినయోగి వాక్యము లమోఘములని యామె విశ్వాసము.

జినయోగి తాను యావదాంధ్రమునను సాధించిన విజయమును ప్రభువులకు నివేదించెను. తాను వివిధ ముఖ్యనగరములలో జిన విహారముల కేర్పాట్లు గావించితిననియు, నాంధ్రప్రజలు తన్నిర్మాణముపట్ల నచంచల భక్తి తాత్పర్యములు గలవారుగా నున్నారనియు నింకను ననేక విషయములను సందర్శ

పూర్వకముగా నుడివెను. కడకు సమస్త జినవిహారములకుఁ గేంద్రముగాఁ బవిత్ర గోదావరీ తీరమునఁ గేంద్ర విహార సంస్థను స్థాపింపవలయునని యుత్సహించుచున్నట్లును, నందులకుఁ బ్రభువుల సహాయ సంపత్తుల సర్వవిధముల తమకు లభింపఁగలవని నమ్ముచున్నట్లును జినయోగి పేర్కొనెను. విమలాదిత్యుఁడు గంభీరముగాఁదల పంకించెను. జినమతాభివృద్ధి యాతని మానసమును గలవరపఱుచుచున్నది. ఆంధ్రప్రజల కీ మతముపట్ల నింతటి భక్తి విశ్వాసములు ప్రవర్ధమానమగుచున్నవి. ప్రజల యభిరుచుల కనుకూలమగు నా ధర్మమును దాను దన జీవితమున ననుసరింపవలయునను వాంఛ రాజేంద్రునిలో నెక్కువగుచుండెను.

జినయోగి పెద్దప్రొద్దు విమలాదిత్యునితో సంభాషించెను. ఇంత చనువుతో నాతఁడు ఇతః పూర్వమెవ్వరితోడను మాటలాడలేదు. ఈ విషయము నగరులోని వారందఱకును విస్మయహేతువైనది. అందఱికన్న మిన్నగా కుందవాంబ అధికముగా నీ విషయమునుగూర్చి మథనపడినది. ఆమె యేమేమియో యూహములు కల్గెను. ఆమె యుదాత్త హృదయము దుర్బలమగుచున్నట్లనిపించినది. మఱుక్షణముననే గతించిన గాంభీర్యము నామె సంపాదించుకొన్నది. సమస్త విషయములు పూజ్యమూర్తియగు కులబ్రాహ్మణునితోడను. సమాత్యశేఖరులతోడను ముచ్చటింపవలయునని నిశ్చయించుకొనినది.

*  *  *

నన్నయభట్టారక వజ్రామాత్యుల కానాఁటి రాత్రి నారాయణభట్టారకుని కష్టగాథ వినుటతో సరిపోయినది. కర్ణాటభూపతి యమానుష కృత్యములు వారి కసహ్యము లనిపించినవి. తనరాజ్యమున నుండుటకు నారాయణభట్టు తిరస్కరించిన కారణముగా నాతనికి సర్వసౌఖ్యములు కల్పించుట మానివేయఁబడెను. అంతట నారాయణభట్టు నిరశనవ్రతదీక్షఁబూనెను. తండ్రిననుసరించి యాతని కొమార్తె కుపమాదేవియును నుపవసింప మొదలిడెను. కుంతలాంతఃపురములోని వారందఱకు నీ వార్త హృదయశల్యమైనది. సామాన్యభటునకుఁగూడ నీ విషయము సహింపరానిదైనది. నారాయణభట్టుపట్ల సర్వజనాదరణ మట్టిది. ఈ విషయమును గూర్చి రహస్యచర్య లెచ్చోటఁ బట్టినను వినిపించుచున్నవి. ఈ వార్త నగరమంతయు తెప్పపాటులో వ్యాపించెను. ఉపవాస దినములసంఖ్య యెక్కువగుచున్నకొలఁది ప్రజాందోళన మతిశయించుచున్నది. ఒక మహావిప్రుని ప్రాణములను ఘోషింపఁ జేసిన నది రాజ్యానర్థప్రదమని పండిత పామరు లేకకంఠమును నుద్ఘోషింపసాగిరి. అమాత్యులు కర్ణాటభూపతి కీ విషయమును గూర్చి పెక్కువిధముల నొక్కి వక్కాణించిరి. రాజు తన నిశ్చయమునుండి చలింపలేదు. నారాయణభట్టును చాళుక్యభూపతికిఁ దక్కింపకుండుటలోనే వారిపై తాను విజయమును సాధించినట్లని జయసింహవల్లభుఁడు

తృప్తిఁజెందెను. చాళుక్యరాజ్యమును వీడుమని నారాయణభట్టును కర్ణాటభూపతి యనేకవిధములఁ గోరెను. పదవులిత్తునని యాశగొల్పినాఁడు. నారాయణ భట్టునకా విధానమే నచ్చలేదు. అతఁడు దేనికి లొంగలేదు. కడకీ కడపటి మార్గమును జయసింహుఁ డనుసరించెను. ఇది గర్హనీయమైనదిగాఁ బరిగ ణించెను. లోక మట్టుడికిన ట్టుడికిపోవుచున్నను నీ విషయముపట్ల జయ సింహుఁడు మూకీభావము వహించెను. కాని యాతని యంతరంగము క్షోభించు చుండెను. రాత్రిసమయములం దతనికి నిద్రపట్టుటలేదు. బ్రాహ్మణశక్తి నిశిత దంష్ట్రాకరాళ వికృత రూపముతో తన్నుఁ జీల్చుచున్నట్లుగా జయసింహుఁడు కేకలు వైచుచుండెను.

రాజు భయభ్రాంతుఁడై మఱునాఁడు జ్యోతిష్కులను, మంత్రవేత్తలను రావించి శాంతి ప్రక్రియల నొనర్చినాఁడు. కాని యా శక్తి శాంతి వహింపలేదు. ఎప్పటియట్లు తన భీకరాకృతితో జయసింహుని బీభత్స మొనర్చుచునే యున్నది. జయసింహున కేమియును బాలు పోలేదు. తన కృత్యము తనకే యనర్థదాయక మైనది. నారాయణభట్టునకు యథాప్రకారముగా భోజనము పంపున ట్లాజ్ఞా పించెను. కాని పగగొన్న త్రాచుపామగు నారాయణభట్టు దానిని స్వీకరింపలేదు. తన నిరసన వ్రతమును సాగించుచునే యుండెను. కుసుమాదేవి యెండి వరు గైనది. ఇంతలో కుసుమాదేవి ముద్దుబిడ్డఁడు, అన్నివిధముల తండ్రి సౌందర్య శోభను పుణికిపుచ్చుకొన్నవాఁడు చాల దినములుగా నాహారము లేమికి మరణిం చెను. ఈ దురంత విషాదానలము, దావానల తీవ్రమై మాతృహృదయమును దహించెను.

జయసింహుఁడు భోజనము పంపుచున్నను అది నారాయణభట్టు స్వీకరింపకుండుటచే బ్రాహ్మణశక్తి యాతనిని పీడించుచునే యున్నది. స్వప్నమున కానిపించి "ఓరి జయసింహా! నారాయణభట్టు సామాన్య బ్రాహ్మణుఁడు కాఁడు. శ్రీదయితావతారుఁడగు వ్యాసమహర్ష్యంశమున నవత రించిన మహామనీషి. అవైదికమగు నీ కర్ణాటదేశమున నాత డుండఁజాలఁడు. నీ వాతనిని బంధించుటచే నెట్టి ప్రయోజనమును బొందజాలవు. కాక యిట్టి హింసాచరణముచే రౌరవాది నరకములు నీకు ప్రాప్తించును. నరాంశమున నవతరించిన నన్నయభట్టారకు నాతఁడు చేరి వేంగీజగత్కల్యాణము నొన గూర్పవలయును. అది భగవదిచ్ఛ. అందువలననే యాతఁ డీ కర్ణాటమును తనభూమి యని భావింపలేకున్నాఁడు. నారాయణభట్టును విముక్త మొనర్చు టలో నీ వేమాత్ర మాలసించినను నీ శిరము శతధా విచ్ఛిన్నమగున"ని దేవి వాక్రుచ్చినది.

ద్వాదశి దివసోపవాస ప్రాభాతముననే జయసింహుఁడు స్వయముగ కారా గృహమునకేతెంచి నారాయణభట్టును తన యజ్ఞానమునకు మన్నింపవలసినదిగా

క్షమాభిక్ష నర్థించి, విముక్తుని గావించి యథేచ్ఛగా నుండవచ్చు నని యనుమతించెను. ఈ కథ నంతయు నారాయణభట్టు నుడువగా వజ్రామాత్య నన్నయభట్టారకు లత్యంతాసక్తితో నాలించిరి. అప్పటికే చాల ప్రొద్దువోయినది. నన్నయభట్టు హృదయములో శక్తి వాక్యములు పదేపది వినిపింపఁ జొచ్చెను.

మఱునాఁ డుదయముననే కర్ణాటదేశమునుండి కుపమాదేవిని తెప్పించెడి యేర్పాట్లు గావింపఁబడెను. నారాయణభట్టు గౌరవపురస్సరముగా నాతని స్థానము నలంకరించుటకుఁ గావలసిన రాజాజ్ఞ వజ్రామాత్యుఁ డొనగూర్చెను. నన్నయ, నారాయణు లిరువురును సాహిత్యగోష్ఠులలో నిమగ్నులైరి. నన్నయభట్టారకుఁ డీ మధ్యకాలమున నాంధ్రభాషాసంస్కారార్థ మొక చిన్న వ్యాకరణమును సంస్కృతమున రచించెను. అదియే 'యాంధ్ర శబ్ద చింతామణి'. అది యార్యావృత్త శ్లోకములలో రచింపఁ బడినది. తొలి కారికలోఁ గల "విశ్వ శ్రేయః కావ్యమ్మ"ను దొలిసూక్తి నారాయణభట్టునకు దీర్ఘయోజన కల్పించినది. విశ్వశ్రేయ మనఁగా 'సర్వవిధములగు శ్రేయము' లను సామాన్యార్థ మట్లుంచి జగత్కల్యాణ మను నర్థమును స్ఫురించును. భారతీయాలంకారికు లెవ్వరును, గావ్యమున కీ విశ్వశ్రేయత్వమును జెప్పినవారు లేరు. కావ్యము రసానందము పరమావధిగాఁ గల్గినది. అయినను జగద్ధితము నొనగూర్పని కేవల రసానందము నిష్ప్రయోజన మని నన్నయ్య యభిప్రాయము కానోపు నని నారాయణభట్టూహించెను. ఆంధ్రస్థానీయులు స్వస్థాన వేషభాషా సుస్థిర సౌందర్య లబ్ధ సుమనస్కులై యున్నట్లు నన్నపార్యుఁడు గుర్తించినందులకు నారాయణభట్టు ప్రమోదాంతఃకరణుఁ డాయెను.

"సంస్కారార్థో నియమః", "ప్రవాహినీ దేశ్యా" మున్నగు కారికలు నన్నయ పరిణతభాషావైదుష్యమునకుఁ బ్రత్యక్షదర్పణములుగా నాతఁ డెంచెను. పరుషములు, సరళములు, స్థిరములు, కళాద్రుతప్రకృతికములు, ప్రాణులు, ప్రాణములు, స్త్రీసమములు, తద్ధర్మార్థకము, మహద్వాచకము, అమహద్వాచకము మున్నగు ననేక సంజ్ఞలు నన్నపార్యుని యుపజ్ఞతను జాటుచున్నవనియు నారాయణభట్టారకుఁడు సంతోషించెను. ఎన్నియో పర్యాయము లాతఁ డా వ్యాకృతి ననేక దృక్కోణములనుండి పరిశీలించి, పండిత సభలలో దాని యవసరమును, విశిష్టతను నొక్కి వక్కాణించెను. నన్నయ్యను 'విపుల శబ్ద శాసనుఁడు'గా నిరూపించెను.

పండితులు మత్సరగ్రస్తులు. నన్నయభట్టారకుఁడు కానరాని గడుసరి యనియు, ఈ వ్యాకృతి మూలమున తెనుఁగుభాష కాతఁడార్షత్వమును గల్గించి, క్రమముగా నా భాషకు మహోన్నత వైజ్ఞానిక స్థాయిని కల్పించుటకు పునాదులు వేయుచున్నాఁడనియు, తన్మూలమున దేవభాషా గౌరవమును తద్భాషావేత్తలగు పండితులకుఁ గల మన్ననలను ఆతఁడు న్యూన మ్మొనర్చు

చున్నాఁడనియు వా రుడికిపోవుచుండిరి. ఎటులైనను చింతామణిని ప్రచారము లోనికి రానీయకుండఁ జేయవలయుననియే పలువురు పండితుల కుటిలాలోచనములు.

౧౬

మాతృహీనుఁడైన భీమకవి స్వైరవిహార మడ్డు ఆఁక లేక సాగుచున్నది. అతఁడు వెడలని గ్రామము లేదు. ఢీకొనని పండితుఁడు లేఁడు. అతనితో వాదించుట దుష్కరము. అతని మేధ చాల సునిశితమైనది. ఎంతటి జటిల శ్లోకమునైన నాతఁడు సుళువుగా నన్వయింపఁ గలఁడు. ఆతని పేరు వినగనే జనము తండోపతండములుగా వచ్చి యాతనిని సందర్శించుచుండిరి. అతఁడు మెట్టిన గ్రామము ప్రయాగగను, నతని మాటలు మంత్రములుగను నుండెను. ఆతని శాపానుగ్రహ శక్తిసంపదలను దెలిసికొనవలయునని యందఱకు నుబలాటము.

ఒక సమయమున భీమకవి విజయనగరమునఁ బ్రవేశించెను. ఆనాఁడు పురప్రజ లందఱును సందడిగా నుండిరి. నగరులో కత్తియుద్ధపు పోటీలు తొమ్మిది దినములనుండి జరుగుచుండెను. అందఱ నోడించిన వీరుఁడు, కడకు విజయనగరాధిపతి యగు మైలమభీమనితో నానాఁడు పోరాడవలసియున్నది. మైలమభీముఁడు కత్తియుద్ధమున జెగజెట్టి. పోరాటము ప్రారంభమైనది. ఈమారు మైలమభీమునకుఁ దన పూర్వ సముపార్జితమగు కీర్తి యంతయు నశించునట్లున్నది. ప్రత్యర్థి కరవాలము ధాటి కాతని కరవాలము నిలుచుటలేదు. సరిగా నిట్టి క్లిష్టసమయముననే భీమకవి తన యనుచరులతో నగరు ప్రవేశము నభ్యర్థించెను. ద్వారపాలకుఁ డనుమతి నిరాకరించెను. నగరులో నిసుక వేసిన రాలనట్లు జన మున్నారనియు, పోరు చాల భీకరముగా సాగుచున్న దనియు, మీకు, మీ పరివారమునకు స్థలముచిక్కక, గందరగోళ మగుననియు ద్వారపాలకుఁడు వినయముతోఁ బల్కెను. భీమన యొక్కమారు నిమీలిత నేత్రుఁడై మైలమభీముని మానసికముగా భావించెను. అపజయ మనునది యెఱుఁగని మైలమ యానాఁటి కాల దుర్విపాకముచే నట్లు దుర్బలుఁ డగుచున్నాఁడు. తాను పోయి యాశీర్వాద ప్రశంస చేయవలయును. అట్లయిన నాతఁడు విజయము సాధించునని భీమకవి తలంచెను. ద్వారపాలకుల విషయము సూచించెను. వా రతని యోగదృష్టికి భయపడి మాఱాడలేను. జన సమ్మర్దమును నెట్టుకొనుచు భీమకవి రంగస్థలి కేగెను. మైలమభీమునిలో దుర్బల లక్షణములు పొడగట్టుటయు, శత్రుపక్షము లానందము చెందుటయు నాతఁడు గాంచెను. అప్పుడు భీమన గంభీరమగు తన యెలుంగునెత్తి

చ॥ "గరళపుముద్దలోహమవగాఢ మహాశని కోట్లు సమ్మెటల్
హరు నయనాగ్ని కొల్మి యురగాధిపు కోరలు పట్టుకార్లు ది
క్కరటి శరంబు, దాయలయకాలుఁడు కమ్మరి; వైరి వీర సం
హరణ గుణాభిరాముఁ డగు మైలమభీముని ఖడ్గసృష్టికిన్॥"

అను పద్యము నాశువుగా బఠించెను. మైలమ పక్షమువారంద ఱుల్లాససంభరితులై కరతాళ ధ్వనులు సేసిరి. ఈ ప్రశంసతో భీమన నూత్న జవమును జేకూర్చు కొనెను. అట్టి యోజస్సుతో నతఁడు తన కరవాలమును లాఘవముగా విసరెను. ఆ ధాటికి శత్రుకరవాలము నేలకూలెను. ఓటమి యంగీకరింపఁ బడెను. ఇది భీమన విజయముకన్న భీమకవి విజయమని ప్రజలు భావించిరి. ఆనాఁడు భీమ కవికి విజయనగరమున నఖండ గౌరవము కలిగినది. మైలమభీమన భీమకవిని తన యాస్థానముననే యుండిపొమ్మని యాహ్వానించెను. అతఁడా యాహ్వానము నకుఁ దాత్కాలికముగఁ దల యూచెను. కాని యిట్టి కట్టుపాట్లకు లొంగువాఁడు కాఁడు భీమకవి. అతఁడు నిరంకుశుఁడగు కవి. అతని ప్రవర్తన మతనికే దెలియదు. అంతలో నాగ్రహము, అంతలో ననుగ్రహము. తన్నాశ్రయించి, తన ఘనత నుద్ఘాటించువానికిఁ బ్రాణము లర్పించును. తన్ను బ్రశంసింపని వా రెంతటి ప్రతిభోపేతులైనను వారిని జూచుట కిచ్చగింపఁడు.

భీమకవి కఖండ సన్మానము జరుగు సమయమున త్రికాలయోగి సిద్ధాంత దేవుఁడు విజయనగరమున జినవిహార నిర్మాణ ప్రయత్నములలో నిమగ్నుఁడై యుండెను. జినస్వామి భీమకవిని సందర్శించెను. ఆయనను భీమకవి గుఱితింప లేదు. "నన్ను గుర్తించితివా? నాయనా!" యని సాదరముగా జినస్వామి పలుకరించెను. భీమకవి యోజనామగ్నుఁడాయెను. అప్పుడు జినయోగి దక్షా రామ సంఘటనను జ్ఞప్తి చేసెను. ఆనాఁటి విషమ పరిస్థితిని స్మరింపగనే భీమకవి నేత్రాంచలములు చెమ్మగిలినవి. "అవును. ఆనాఁడు నా మాతృదేవుని రక్షించిన మహానుభావులు మీరే" యని భీమకవి కృతజ్ఞతతో నభివందించెను. జినయోగి భీమకవిని జినవిహారమునకు రావలసినదిగా నాహ్వానించెను. భీమకవి కాదన లేకపోయెను.

జినయోగి భీమకవి నయస్కాంతమువలె నాకర్షించెను. అట్టి మూర్తి నాతఁ డంతకుమున్ను సందర్శింపలేదు. ఆ యరమోడ్పు కనుదోయిలో భూత దయ మురగట్టినవి. నాఁటి పండితుల కా మానవతా సంబంధమగు సద్గుణములు శూన్యము. ఆ మహాయోగి సందర్శనము తనకు తాపోపశమన హేతువని, యాతని యాజ్ఞ తన కనుల్లంఘనీయమనియు భీమకవి భావించెను.

భీమకవిని తొలిసారిగాఁ జూచినప్పుడే జినయోగి కేదోయొక యనిర్వచ నీయమగు నాశారేఖ పొడమెను. నేఁడిది సుస్పష్టముగా గోచరించెను. "భీమ కవి నాదరింపవలయును. అతఁడు హైందవదేవతా వరప్రసాదుఁడే యగుగాక!

...నులలో నామాత్రపు కవితాప్రాభవముగలవారు లేరు. అందఱును సామాన్యులు. పండితులను ధిక్కరించుటకు, పీలగుపట్లవారలను శపించుటకును విట్టి వాక్శూరుఁ డవసరమ"ని జినయోగి యేమేమియో ప్రశాంతముగా నాసీనుఁడై విచారించెను. అప్పు డాతని మానసవీధిని పరిశుద్ధ సాత్త్వికమూర్తిని, సనాతనార్ష మత పరాయణయునగు కుందవాంబయు, ప్రఫుల్ల సౌజన్య మూర్తియగు నన్నయభట్టారకుఁడు, నాతని సరసను విద్యాభ్యాస మొనర్చుచున్న యువరాజు రాజరాజ నరేంద్రుఁడును చిత్రాకృతియందువలె గోచరించిరి.

వారివెంటనే నిరంతర దీర్ఘాలోచనాకుల కుటిలకుంతల యగు మేడాంబా దేవియు, నామె యంకసీమ నలంకరించిన విజయాదిత్యుఁడును దైన్యమూర్తులుగాఁ గానుపించిరి.

భీమకవి యప్పుడేదో వచ్చెదనని పల్కెనేకాని మఱల యాతని కా యుద్దేశ్యము పుట్టలేదు. విజయనగరమునుండి కళింగగంగు నాస్థానమున కేఁగెను. కళింగగంగు, భీమకవికి దర్శనమీయ నిరాకరించెను.

క॥ "శాపానుగ్రహ పటువును
ఱాపాడెడి కవులనెత్తి జంపం బనఁగా
భూపాల సభలఁ బూజ్యుఁడు
నా పేరే భీముడంద్రు నరవర! వినుమా!"

అను పద్యమును వ్రాసి కళింగగంగునకు భీమకవి పంపెను. అప్పటికిని ఆతఁడు "మిక్కిలి సందడిగా నున్నది. తరువాతగాని దర్శనము దొరకదు పొమ్మ"ని భీమకవి నీసడించుచు సమాధాన మిచ్చెను. భీమకవికి కోపము కట్లు త్రెంచుకొని యురికినది. అప్పు డాతఁడు,

చ॥ "వేములవాడ భీమకవి వేగమె చూచి కళింగగంగు తా
సామము మాని కోపమున సందడి దీఱిన రమ్ము పొమ్మనన్;
మోమును జూడ దోషమిఁక, ముప్పదిరెండు దినంబు లావలన్
జామున కర్ధమందతని సంపద శత్రులఁ జేరుగావుతన్॥"

అను పద్యమును జెప్పి యతని మోమును జూడక మసలినాఁడు. తరువాత నాతఁ డా పరిసర దేశ మంతటను సంచరించి, పదునైదు రోజులకు విజయ నగరమును జేరెను. విజయనగరమున నానాఁడు మిక్కిలి సందడిగా నున్నది. ఆ పుర వైశ్య ప్రముఖుఁడైన రేచన యింటిలో జినమతస్థు లందఱు పెద్ద విందుఁ గుడుచుచుండిరి. జినస్వామియగు త్రికాలయోగి సిద్ధాంతదేవుని పర్యవేక్షణమున నా విందేర్పఱుపఁ బడినది. అదే సమయమున భీమకవి యా వీథిని బోవుచుండెను. అతఁ డసంస్కారుఁడుగా నుండెను. ఆ స్వేచ్ఛావిహారుఁడగు యువకునిఁ జూడగనే జినస్వామికి జాలిగల్గినది. వెంటనే భీమకవిని బిల్పించి స్నానపానాదుల గావింపఁజేసి మృష్టాన్నభోజనములు పెట్టించెను. భోజనానంత

రము పురప్రముఖులందఱు నిష్టగోష్ఠిగా సమావేశమైరి. జినయోగి భీమకవి నందఱకును బరిచయముచేసెను. జగమెఱిఁగిన బాపనికి జందెమేల? భీమకవి నెఱుఁగని వారు లేరచ్చట. భీమకవినేదైన నొకరచనకుఁ బ్రేరేపింపవలయునని బుద్ధిపొడమినది జినస్వామికి. వెంటనే రేచన్నను బిల్చెను. తన యాలోచన మాతని కెఱిఁగించెను. అంతకన్న కావలసిన దేమియని రేచన తాంబూల నూత్న పరిధానశోభితమగు పళ్లెరమును భీమకవి ముందుంచి, నూత్న రచన గావించి, తన కంకిత మొసంగుమని ప్రార్థించెను. "రేచనవేదో్కఁలు కాదన రానిది. అతని యీవి, యతనినెట్టి ఘనకార్యమునకైన నర్హుని గావించును. జిన విహార నిర్మాణమే యాతని కీర్తికి శాశ్వత చిహ్నము. తన్నిర్మాణము జరిగిన యచిరకాలముననే కృతి పతిత్వ మహాభాగ్యమబ్బుట యసాధారణ విషయమ"ని యొక పురప్రముఖుఁ డుపన్యసించెను. జినస్వామి యీ కార్య విధానము నాశీర్వదించెను. భీమకవి కిదంతయుఁ దొలుత బంధముగా తోఁచినది. కాని కాదనుట కాతని నోరాడలేదు. వెంటనే యాతఁ డప్రయత్నముగా నిట్లనినాఁడు:

కం॥ వేములవాడను వెలసిన
భీమేశ్వరు కరుణ గల్గు భీమ సుకవినేఁ
గోమటి రేచన మీఁదను
నీ మహిఁగవు లెన్న ఛంద మెలమి రచింతున్॥

—సభ్యులందఱు ప్రశంసానినాదములు గావించిరి. "ఆంధ్రభాషలో కవనమల్లఁ దలంచినవారికి ఛందో వివరణ కావ్యమత్యవసరము. అయ్యది రచింపుమని నా యంతరాత్మ ప్రబోధించుచున్నది. రేచన నామము శాశ్వతమగు నట్లుగ, భావికవులకు రాచబాట నేర్పింతున"ని భీమకవి వచించుచుండగా "పద్యములలోఁ జెప్పుడ"ని యెవరో చాటుగనుండి యరచిరి. వెంటనే భీమకవి,

కం॥ లచ్చన మెఱుఁగని కవులను
జిచ్చియని సుకవివరులు చేపట్టరుగా
మెచ్చరు వివేక నృపతులు
మెచ్చిన యవివేకి నృపులు మిడకరె రేచా॥

కం॥ రేచన సంతోషిల్లఁగ
భూచక్రములోన భీమ పురహరు కృపచే
ఏ ఛందము సుకవులెఱుఁదు
కే ఛందము తెరువు దాని నే రచియింతున్॥

అని యాశువుగా భీమకవి పద్యములు కొన్ని చెప్పెను. ఆనాఁటి సభయట్లుల్లాసముగా ముగిసినందులకు జినస్వామి మిక్కిలి సంతోషించెను. పండితు లెవ్వరానాఁటి సభకు హాజరు కాలేదు. రేచన భీమకవి నివాసమున కొక సౌధమును, నందు సమస్త వసతులను నేర్పాటు గావించెను. భీమకవి తన ఛందో గ్రంథ

రచన సాగించెను. తిరుగుడు బ్రతుకుపై నాతనికి వెనుకటి యాసక్తి కొంత సన్నగిలినది. జినస్వామి విజయనగరము నందున్నంతకాలము భీమకవి యోగ క్షేమముల నారయుచునే యుండెను.

౧౭

విమలాదిత్యుని మానసము క్రమక్రమముగా నైహిక విషయములందు విరక్తి వహించుచుండెను. రాజరాజనరేంద్రునిగాని, వీర విజయాదిత్యునిగాని యాతఁడు చేరబిలుచుటలేదు. వారెప్పుడైన నెదురైన సాధారణముగాఁ బల్కరించును. వారివారి విద్యాభ్యాసము లెట్లుజరుగుచున్నది తెలిసికొనుట కుత్సహింపఁడు. కుందవాంబా సౌధమునకుఁగాని, మేడాంబ మేడకుగాని యాతఁడు రాకపోకలను తగ్గించెను. ఎప్పుడు వేదాంతము నాలోచించును. రాజకీయ వ్యవహార నిర్వహణమంతయు పజ్జియప్రెగ్గడయే చూచుచుండెను. విమలాదిత్యుని ప్రవర్తన మందఱకును విపరీతముగనే తోఁచినది. కాని ఎవ్వరేమనఁగలరు?

నిత్యము ప్రభాతవేళల త్రికాలయోగి సిద్ధాంతిదేవు లంతఃపురమున కేతెంచి రాజ సందర్శనము గావించుచుండెను. మహావీరుని జీవిత చరిత్రను గొన్నినాళ్లును, కొన్నినాళ్లు జినపురాణములను జినస్వామితో విమలాదిత్యుఁడు పఠించెను. పరమ మాహేశ్వరుఁడగు నీ విష్ణువర్ధన కులాభివర్ధనుఁడిట్లు వైదిక మత విరక్తుఁడౌట కుందవాంబకు కడుపులో కోఁతకోయుచుండెను. అప్పుడప్పు డామె తన కడుపులోని మంటను పరమ బ్రహ్మణ్యుఁడగు కులబ్రాహ్మణునకుఁ జెప్పుకొనును. నన్నయభట్టారకుఁడు ప్రసన్నతాచిహ్నమగు మందస్మిత వదనముతో "నదియంతయుఁ బూర్వజన్మ సంస్కారము. దానినిగూర్చి విచారింపఁగూడదు. భావిశుభమునుగూర్చి యోజింపుఁడ"ని సౌజన్యముతో సమాధానమిడును.

జినస్వామి రాజమందిరమునకు వచ్చుచుండుట మేడాంబ కమేయామోదకముగ నుండెను. కుందవాంబ యింపులకు కుందుచుండుటయే యామె యుబ్బునకు హేతువు. అప్పుడప్పుడు మేడాంబ తన కుమారుఁడగు వీర విజయాదిత్యునితో నేతెంచి జినస్వామికి వందన మాచరించెను. తన్మూలమున విమలాదిత్యుని యభిమానమును జూఱగొనవచ్చునని యామె యాశ. కాని చాళుక్యపతి యిట్టి విషయముల కేమియుఁ బ్రాముఖ్య మిచ్చుటలేదు.

చాళుక్యపతి మందిరమంతయు తీర్థంకరుల చిత్రములతో నలంకృతమైనది. మహావీరుని పవిత్ర చరిత్ర శ్రవణము పూర్తిచేసిన దినమున, విమలాదిత్యునకు జినస్వామి శిల్పకళా లక్ష్మి మూర్తీభవించిన యొక మహావీర విగ్రహమును బహూకరించెను. ఆ విగ్రహమునందాతని కత్యంతానురాగ మేర్పడెను. నిద్రలేవగానే యా విగ్రహమును సందర్శించును. దానిని నవవికసిత కుసుమ

మాలా శోభితము గావించి యభివందించును. జైన తీర్థంకరుల పాదముల నొక యుత్ఫుల్ల పంకజముతో సవదరించును. జినపురాణములఁ బారాయణ మొన ర్చును. విమలాదిత్యుఁడు మాంసాహారమును సంపూర్ణముగాఁ బరిత్యజించెను. పచ్చని యాకుకూరల విసర్జించెను. అందేమైన సూక్ష్మజీవులుండునని యాతని భీతి. కొన్నాళ్లు వారమునకొక దినమంతయు నుపవాసముండును. మంచినీటిని గూడ వడబోయించుకొని త్రాగుచుండెను. సూర్యాస్తమయమునకు పూర్వమే లఘువుగా భోజనముచేసి శయనించుచుండెను. ఇట్లు నియమ పాలనమున నెన్నడు లేని యాసక్తిని భూపాలుఁడు ప్రదర్శించు చుండుటఁగాంచి యందఱును ముక్కున వ్రేలిడుకొనుచుండిరి. జినస్వామికూడ ప్రభువు వ్రతపాలనా దక్షతను ప్రశంసించుచుండెను

నన్నయభట్టారకుఁ డుదయముననె తన నిత్య పూజావిధానము కావించుకొని యంతఃపురమున కేగి రాజరాజ నరేంద్రునకు సంస్కృతమును బోధించు చుండెను. అప్పటికే రాజరాజు కుస్తీ, కవాతు మున్నగు శారీరక వ్యాయామములను, విలు విద్య, హయ శిక్షణము మున్నగు విద్యలను పూర్తి కావించి సంస్కృత భాషాభ్యసనమునకుఁ గడంగును. మాతృదేవి కుందవాంబ నన్నయభట్టారకుని మనోహరమగు దివ్యప్రబోధముల సత్యా సక్తితో వినుచుండును. పరమ పౌరాణికాగ్రేసరుఁడగు నన్నయభట్టు పద్యపఠనా విధానము రమణీయము. పఠన మాత్రమున పద్యమందలి రస భావములు శోభించును. రసానుకూలమగు నాతని పద్యపఠనా ఫణితి కట్టి దివ్యశక్తి గలదు. పద్యాంతమునందు భావ మావృత్తమగునట్లు చిన్న తిలుగు రాగమును దీయును. దాని కాతనికి కోటిమణు లీయవచ్చును.

రాజరాజ నరేంద్రుని కావ్యపఠనము, కుమారసంభవముతో నారంభ మైనది. ప్రసాద గుణభరితమగు నా రచనములోని మహత్తర భావమహిమ యువరాజు నాకర్షించెను. శ్రవ్యకావ్యమయ్యు దృశ్యకావ్యమందలి రససిద్ధి నా కావ్యము పుణికి పుచ్చుకొన్నది. పార్వతీదేవి, రతిదేవి, ఇంద్రుడు, మన్మథుఁడు, కపటవటువు మున్నగు పాత్రలు రాజరాజు నాకర్షించినవి. తొలుత మహాకవి పార్వతి భౌతికరూప సంపదనంతగా నభివర్ణించి, "నినన్దరూపం హృదయేన పార్వతీ" యను వాక్యముతో కవి దానిని తృణీకరించును. పార్వతి హావ భావా లీలా చాంచల్యములు క్రమ క్రమముగా నణఁగినవి. శివ శుశ్రూషయం దామెకొక పూజ్యభావ మలవడినది. కాని యహంకార మామెలో నతిశయించినది. అందుచే కామదహనమును, శివ నిష్క్రమణమును గవి గల్పించెను. పిమ్మట పార్వతి భౌతిక సౌందర్యాహంకార విరహితయై ఆత్మసౌందర్య సాక్షాత్కారమున కుపక్ర మించినది, తపస్సు దక్క నామె కన్య శరణ్యము లేదు. అయ్యది యొక

నాఁటితో సాధ్యమగునది కాదు. వృక్షలతాదుల యందును, కురంగ శాబకముల యందును గల సహజ సరళతా నైర్మల్యముల నామె సాధించినది. ఆత్మ ప్రదానముతో నది యారంభమై సహనశీల త్యాగములతో నది పచేలిమ మగును. బ్రహ్మచారి యను నికషోపములతోఁ గవి దానిని పరీక్షించినాఁడు. మమతా గంధములేని భోగము, ఇంద్రియ స్పర్శలేని శాంతరతి, భావావేశములేని మంగళము పార్వతీదేవియందు మూర్తీభవింపఁ జేసిన పిమ్మట కవి యామెను బరమేశ్వరుని యర్ధాంగలక్ష్మిని గావించినాఁడు. అట్టి పవిత్ర ప్రణయ సముద్భూతుఁడగు కుమారస్వామి, సర్వదేవతా కళ్యాణప్రదాత కాగలఁడు. ఈ మున్నగు ననేక విశేషాంశములతోఁ గూడిన కాళిదాసు కవితాహృదయమును నన్నయభట్టు ఆవిష్కరింపఁ జేయునపుడు రాజరాజ నరేంద్రుని వినిర్మల ధవళ నేత్రాంచలము లానందవారి పరిపూర్ణము లయ్యెడివి. అప్పటినుండి యాతనికి కుమారసంభవ మభిమాన కావ్యమైనది. ఆ పురాణ దంపతులయం దాతనికి భక్తిభావము ప్రఫుల్లమాయెను.

ఇట్లే శాకుంతల దృశ్యకావ్యరాజమునందు కాళిదాస కవిసార్వభౌముఁడు ప్రదర్శించిన భావసంయమనమునంతయుఁ బ్రతిభోజ్జ్వలముగా సారస్వతేయుఁడు నన్నయ రాజరాజునకు వివరించి యాతని హృదయ రాజీవము నున్మీలన మొనర్చెను. అనుతాపము మూలముననే స్వర్గప్రాప్తి సాధ్యము. తపోవనమున వికసించిన శకుంతలా పుష్పము, దుర్వాసుని శాపానలముచేత, దుష్యంతుని కర్కశహస్తముల వాడి, స్వర్గమున భరతునిగా ఫలించిన విధానమును రససిద్ధుఁడగు మహాకవి మధుర హస్తముల నెట్లు పరిపోషిత మైనదియు, మితహిత సత్యభాషియగు నన్నపార్యుఁడు బోధించుటయు, నిరంతరాధ్యయన తత్పరశీలుఁడగు రాజరాజు గ్రహించుటయు నా యిరువురకే దక్కినది. ఇట్లనేక శ్రవ్య దృశ్య కావ్యములు యువరాజు హృదయమును రస పరిప్లావిత మొనర్చినవి. రాజరాజునకు సమర విద్యలయందు కన్న సాహిత్యమునందే యభిమాన మపారము. అందుచే నప్పుడప్పు డాతఁ డా విద్యలయం దతిసత్వమును జూపుచుండెను. అందులకు కుందవాంబ సహించెడిది కాదు. అతనిలోగల క్షాత్రమును జాగృత మొనర్చెడిది. వెంటనే యాతఁడు యుద్ధ శిక్షణశాలకుఁ బరువులిడును. అందు ప్రవేశించువరకు మాత్రమే యాతని యలసత్వము. ప్రవేశించెనా దాని పారము ముట్టునిది పట్టు వదలెడువాఁడు కాఁడు. విలువిద్యయం దాతని లక్ష్య మమోఘమైనది. గంధ సింధూర హయ శిక్షణమున నాతఁ డందెవేసిన చేయిగా నెంచఁబడెను. అతని హస్తస్పర్శకు మచ్చికగాని మదేభముగాని, కశాస్ఫాలనమునకు లొంగని వారువముగాని లేదని వింతగాఁ జెప్పుకొనుటను చాటుగా నన్నయ, నారాయణభట్టాదులు విని యానందించెడివారు.

రాజరాజనరేంద్రుని, కుందవాంబాదేవి సామాన్యముగాఁ దండ్రి జెంతకుఁ బోయిరమ్మని కోరదు. అట్లు పొమ్మనుటకు రాజరాజ నరేంద్రుఁ డొక్క నిమేషమును విశ్రాంతిగ గనిపింపఁడు. ఎప్పుడైన జనకుఁ డెదురైనచో వినయముతో నభివందించును. విమలాదిత్యునకు నరేంద్రునిపై నత్యంతాభిమానము. కాని వెండుదనమునఁ దానిని వెలికి రానీయఁడు. అట్టి వెలితి వచ్చినచో మేడాంబ దానిని కొండంతలు సేయును. అట్లయిన అందఱును నాదర్శుఁడగు తాను నవ్వుపాటు పాలగుదునని చాళుక్యపతి యభిప్రాయము.

వీరవిజయాదిత్యునకు సాహిత్యాభిమానము శూన్యము. అందుచే భీమనభట్టునకు రాకపోకలతో సరిపోవుచున్నది. ఒకవేళ విజయాదిత్యుఁడు బుద్ధికుదిరి కూర్చుండినను, భీమనభట్టు మీసములు పీకుట, యజ్ఞోపవీతమును లాగుట, నత్తిమాటలను వెక్కిరించుటతోఁ గాలము గడుపునేగాని, పాఠమును జెప్పనీయఁడు. అప్పుడప్పుఁడు భీమనభట్టునకు విసుఁగు పుట్టును. కుమారుని చిలిపిచేష్టలు మేడాంబకుఁ దెల్పును. స్వాతిశయ యగు మేడాంబ కుమారుని చైదములనే సమర్థించును. తన కుమారునకు గురువుగాఁ దన్నెన్నుకొనుట యాతని యదృష్టమన్నట్లు మాటలాడును. భీమనకవి భయముతో మారుబల్కక చనును. విజయాదిత్యుఁడు సదా, వేళగాని వేళలందును, అశ్వశాలయందు దిరుగును. ఇతఁడు నరేంద్రునికన్న దృఢకాలి. ఇతని ఖడ్గధారణాశక్తి బలీయమైనదే కాని సూక్ష్మబుద్ధి నైపుణ్యముతోఁ గూడినది కాదు. అట్లే విలువిద్యయందును నతని శరవేగము ధాటియైనదే కాని లక్ష్యశుద్ధి శూన్యము. నరేంద్రుని యుపాయము, నాతని నిశిత లక్ష్యశుద్ధి ప్రశంస్యము. ఇతఁడన్ని విధముల నర్జునుని దలపించును. పాశుపత దివ్యాస్త్ర విద్యాసంపాదనా లక్ష్యప్రబోధిత మహాతపస్వి యగు కిరీటి కుందవాంబ గర్భవతిగా నుండగా స్వప్నముల గానిపించెడి వాఁడఁట! మేడాంబకు కుమారుని విద్యావంతుని గావింపవలయునను నాసక్తి లేదు. విద్యావంతుడైనంత మాత్రమున నొరిగిపడున దేమియని యామె ప్రశ్న. అదృష్టము కలసిరావలయును. మహా విద్వాంసులను, గవులను బోషించి, కీర్తి బొంద వచ్చునని యామె తలంపు. కుందవాంబ తద్భిన్నమగు నాశయము కలది. మేడాంబ తఱచుగా తన పుత్రుని విమలాదిత్యుని సన్నిధి కంపుచుండును. ఆయన యొడిలో గూర్చుండుమని యాదేశించును, ముద్దుముద్దుగ ముచ్చట్లనాడుమనును. విమలాదిత్యుఁడు కాదనఁజాలక వానిని సహించును. నరేంద్రునిపై విజయాదిత్యుఁడు కొండెములాడును. తన్ను బలుకరింపఁడు. తన వెంట రానీయఁడు. తనతోఁ విద్యాభ్యాసము చేయనీఁడని యాతఁ డేమేమియో వచించును. ఒక్క నిమిషము విని "కొండెములను జెప్పకుము. నీపని నీవు చూచుకొనుమ"ని చాళుక్యపతి యాదేశించును.

విజయాదిత్యునిలోనిట్టి చిలిపిచేష్టలు వయసుతోపాటు విపరీత చర్యలకుఁ దారితీయుచుండెను. నరేంద్రున కనిష్టములగు పనులను బాహాటముగా నాతఁడొనర్పసాగెను. పావురాళ్లను దెచ్చి నరేంద్రుని సమక్షమున గొంతు నులిమి హింసించును. నరేంద్రుఁడది చూడఁజాలకఁ గన్నులు మూసికొని యచ్చోటు వీడును. కుల బ్రాహ్మణుఁడు నన్నయభట్టారకు నధీతి కాలానంతరము వినయముతో గొంతదవ్వు సాగనంపుటకు నరేంద్రుఁ డొకనాఁ డరుగుచుండెను. అప్పుఁడు విజయాదిత్యుఁడు వారలు వినునట్లుగా నేమేమియో నిందావాక్యములను బల్కెను. జాతులని, మతములని పేరెత్తి దూషించెను. ఈ పరుష వాక్యములకు నరేంద్రుని భ్రుకుటి ముడివడినది. నేత్రాంచలము లరుణిమములైనవి. హట్టించి విజయాదిత్యుని మదమణంచుట కుద్యమించినాఁడు నరేంద్రుఁడు. నన్నయభట్టారకుఁ డాతనిని తన కనుసన్నల నివారించెను. "నాయనా! ఎవరో నీచులగువారి నతఁడు దూషించుచున్నాఁడు. అందులకు మనము రోషింపరాదు. పరజాతి మత దూషణ మెన్నటికిని రాణింపదు. అన్ని వర్ణములవారికి నుపాదేయము బ్రాహ్మణత్వము. నాటికి లోక మసత్యము నుండి సత్యమునకు నధిగమించును. అప్పుడే యీ మహీతలమునకు మహోదయ మగున"ని నన్నపార్యుఁ డుపదేశించెను. నరేంద్రుని యుద్రిక్తత చల్లారినది. ఇట్టి సంఘటనలు మఱికొన్ని జరగకపోలేదు.

నన్నయభట్టారకుఁడు సాయం సమయములలో పండిత పరిషత్తులకుఁ దప్పక హాజరగుచుండెను. విద్వాంసులలో నాంధ్రశబ్దచింతామణి వ్యాకృతి కలవరపాటు కల్గించెను. అందనేక సూత్రములనుగూర్చి చర్చలా సభలలో జరిగినవి. పండితులు రెండు పక్షములుగా నేర్పడి పూర్వపక్షములు గావించుకొనుచుండిరి. నన్నయ యంతయుఁ దిలకించి సమన్వయము గుదుర్చుచుండెను. అందును సంస్కృత పదజాలమును దెనుఁగు ప్రత్యయములతోఁ దెనుఁగు భాషలోనికిఁ జేర్చుకొను ప్రక్రియ నందఱు గౌరవించిరి. సంస్కృత వ్యాకరణములలో రూపావతారము దానికి విశేషముగా మార్గదర్శకమాయెను. కర్ణాట భాషాభివృద్ధి పద్ధతియుఁ దోడ్పడెను. నారాయణభట్టు విశేషముగఁ దన కారాగార నివాస కాలమున సంస్కృత భారతమును గూర్చి పరిశ్రమించెను. అనేక వ్యాస ఘట్టములకు నారాయణభట్టు సమన్వయములఁ గూర్చగల్గెను. వాని నన్నింటి నాతఁడు నన్నయభట్టుతో తీరిక చిక్కినపుడెల్ల చర్చించుచుండెను. నారాయణభట్టు విజ్ఞానమునకు నన్నయ విస్మయమంది యపర వ్యాసావతారమని లోలోన నభినందించుచుండెను. అనేక భారత ప్రతులను నారాయణభట్టు సూక్ష్మముగాఁ బరిశీలించి పర్వానుక్రమణికను సిద్ధమొనగూర్ప వలయునని తీవ్రముగా యోజించుచుండెను.

౧౭

రాజరాజనరేంద్రునకుఁ బదునాలు వర్షములు నిండినవి. అతఁడు గంగైకొండ చోళపురమునుండి వచ్చి పది సంవత్సరములైనది. తన సోదరిని మేనల్లునిఁ జూడవలయునని రాజేంద్రచోళుఁ డనేక లేఖలు వ్రాసెను. పరమ బ్రహ్మణ్యమూర్తియగు రాజరాజదేవుని నిర్యాణానంతరము కుందవాంబాదేవికి పుట్టినింటిపై వెనుకటి మమకారము తగ్గినది. రాజేంద్రచోళుఁడు కడ కనేక నిష్ఠురోక్తులతో జాబు వ్రాసి పంపెను. అది కుందవాంబలోఁ గొంత సంచలనము కల్గించినది. చోళరాజు కొమార్తె యమ్మంగదేవి పన్నెండు సంవత్సరముల కన్నెయైనది. ఆమెకు మేనత్తను జూడవలయునని యభిలాషము. తన్మూలమున బావనుగూడ చూడనగును. తన సోదరి కుందవాంబాదేవి శీవి, శాంత స్వభావము, భక్తిశ్రద్ధలు తన యాత్మజలో మూర్తీభవించినందులకు రాజేంద్రచోళుఁడు లోలోన మురిసికొనును.

అమ్మంగదేవికి సంగీత సాహిత్యాభినివేశ మెక్కువ. మహేశ్వరునిపై అనేక కీర్తనలను మనోహరముగఁ బాడఁగలదు. ఆమె గాత్రమతి మనోజ్ఞము. తన కళాకౌశలమును మేనత్త సమక్షమున బ్రదర్శింపవలయును. అందుచేతనే చోళపతి యిట్లొకకమ్మను వేంగీపురమునకు వ్రాసిపంపెను.

కుందవాంబాదేవి యా జాబు చూచుకొన్నది. తన కుమారుని వక్ష్యమాణ క్షేమముకొఱకైనఁ దాను చోళపురమున కేగవలసియున్నది. కాని ప్రభువుల చిత్తవృత్తి యామె గంభీర హృదయమును సైతము కలవరపఱుచుచుండెను. ప్రభువు లెవ్వరితోడను మాటాడుట లేదు. మౌనమును బాటించుచుండెను. ఎవ్వరిని కన్నెత్తి చూచుట లేదు. రాత్రి సమయముల నిట్రుపానము కావించుచుండెను. కొంతకాలము శ్రవణముతోడను, కొంతతడవు ధ్యానముతోడను నా మహనీయుఁడు ప్రొద్దుపుచ్చుచుండెను. ఇట్టి క్లిష్ట స్థితిలో పుట్టినింటి కేగుటకు కుందవాంబ డెందము కొందల మందుచుండెను. మేడాంబ పగగొన్న నాగుబాము. ఆమె యెంత నీచమునకైనఁ బాల్పడును. తా నంతఃపురమున లేకున్న మూడుపూవు లాఱుకాయలు కాయించును. అధికారమునుగూడ చేఁ జిక్కించుకొనవచ్చును.

ఇట్లు మథనపడుచున్న కుందవాంబ తన హృదయావేదనను కులబ్రాహ్మణునకు నివేదించినది. నన్నయ పరిస్థితుల నవగాహన గావించుకొన్నాఁడు. విమలాదిత్యుఁ దేపేశనైన జినశ్రావికుఁ డౌనని యాతఁడెఱింగెను. ఈ రహస్యమును బయలుపఱచలేదు. తానేమియుఁ దెలియనివానివలె నుండుటాతని ప్రకృతి. అప్పుడప్పు డతఁడు చాళుక్యపతిని సందర్శించును. విమలాదిత్యుఁ డాదరముతో నరేంద్రుని యధ్యయనమునుగూర్చి ప్రశ్నించును. నరేంద్రుఁడు విద్యాభ్యాసమున తీవ్రమతియని నన్నపార్యుఁడు సమాధాన మిడును.

నన్నపార్యుఁడు కుందవాంబను బుట్టింటి కేగిరమ్మని సలహా నిచ్చెను.
పదవికై యారాట పడకూడదని యాతని యభిప్రాయము. కుందవాంబ
స్వభావముకూడ నట్టిదే. చోళపుర నందనోద్యాన సీమలలో నమ్మంగదేవీ
నరేంద్రు లానంద డోలికలలో విహరించుటాతని దివ్యదృష్టికి గోచరించినది.
అది శుభప్రదము. వాంఛనీయము. పరస్పర ప్రణయాంకురమున కీ వయస్సు
తొలకరివంటి దని నన్నయ యభిప్రాయము. కుందవాంబ నరేంద్రుని తోడ్తోని
చోళపురమునకుఁ బోయి రావలసినదిగా నన్నపార్యుని గోరినది. కాని యాతఁ
డందుల కంగీకరింపక భారమంతయు విశ్వపతిపై విశ్రమింపఁజేసి యవశ్యము
చోళపురమునకుఁ బయనింపవలసినదిగా కోరెను. కుందవాంబ నరేంద్రునితో
విమలాదిత్యునికడ కేగి పుట్టింటి ప్రయాణమున కనుజ్ఞ కోరినది. ఆమె
ధవళాయత నేత్రము లశ్రుకలితములైనవి. నరేంద్రుఁడుకూడ కైమోడ్చి
యనుజ్ఞ వేడెను. విమలాదిత్యుఁడు పరిస్థితి నూహించెను. శుభముహూర్తమున
కుందవాంబా నరేంద్రులు దక్షిణమునకుఁ బయనమైరి.

రాజరాజనరేంద్రునకు రమణీయ ప్రకృతి సందర్శనమునందు ప్రత్యే
కాసక్తి. ఆ యాసక్తి సాహిత్యాధ్యయనముచే మఱింత ప్రోదియైనది. రాజ
మహేంద్రవరమున నిత్యము వాహ్యాళి వెడలెడువాఁడు. గోదావరీతీర సహకా
రోద్యానము లాతనికి వసంతకాల విహారభూములు. నారికేళపు తోఁట లాతని
గ్రీష్మకాలపు విశ్రాంతి ప్రదేశములు. గోదావరీ సికతాతలము లాతని శరత్కాల
వాహ్యాళి దేశములు. ప్రకృతి దృశ్యావలోకనముతో నరేంద్రుని ప్రయాణ
మేకచాటిని బెజవాడకు సాగినది. నరేంద్రుఁ డింద్రకీల పర్వతమును జూచి
నాఁడు. విజయుఁ డీ పర్వతాగ్రమున నిష్ఠాగరిష్ఠుఁడై తప మాచరించి పరమే
శ్వరుని ప్రత్యక్ష మొనర్చుకొని పాశుపతాస్త్రాదులను బడసెను. అర్జునునకును,
శివునకును జరిగిన మల్లయుద్ధ మిందు సంస్కృత భాషలో వర్ణింపఁబడిన
స్తంభ మొకటి కలదు. దానిని నరేంద్రుఁడు శ్రద్ధతోఁ బఠించెను. ఆ యుద్ధ
క్రమమును దెల్పు పెక్కు శిల్పములను సందర్శించెను. కుమారస్వామి
యాలయమున భక్తితోఁ బూజలు సల్పెను. యుద్ధమల్లుని శాసనమును బఠించి
రాజనల్కి భూవిభునకుఁ గల దేశభాషాభిమానమున కంజలించెను.

బెజవాడనుండి చాళుక్య యువరాజు జననితో నుండవల్లి గుహాలయముల
దర్శింప నేగెను. ఇవి విష్ణుకుండినుల కాలమున నిర్మింపఁబడినవి. నాలుఁ
గంతస్తులుగానున్న యీ గుహాలయములలోఁ గల అనంతశయన విఘ్నేశ్వర
త్రిమూర్త్యాది విగ్రహముల సౌందర్యము నరేంద్రుని హృదయము నాకర్షించి
నది. ఇందలి కొన్ని గుహాలయములనుండి శిల్పకళాలక్ష్మలను నాశనముచేసి
జైను లాక్రమించుకొనిరని విని నరేంద్రుఁడు విచారించెను. అవైదికమగు
జైనమత వ్యాప్తికి నరేంద్రుఁడు చింతించెను. ఉండవల్లి గుహాంత్య కక్ష్య

ప్రదేశమున నరేంద్రుఁడు నిల్చి, యాతతానంద కృష్ణవేణీతరంగ మాలికా డోలికల నుఱ్ఱూతలూఁగెను. సస్యలక్ష్మి తమ జీవన ప్రదాయిని యగు కృష్ణమ్మకు వినమ్రతతో నమస్కరించుచుండెను. తన తనయుని ప్రకృతి సౌందర్యాకృష్టమానసమునకుఁ గుందవాంబ ప్రమోదించుచుండెను.

బెజవాడనుండి నరేంద్రుని ప్రయాణము మనోజవమున సాగినది. మార్గమధ్యమున మహానదులలో స్నాన మాచరించి యాయా దేవాలయములను వారు సందర్శించుచుండిరి. రాకరాక వచ్చుచున్న మేనల్లున కఖండ స్వాగత మిచ్చుటకై సన్నాహము లన్నియుఁ బూర్తియైనవి. అమ్మంగదేవి శుకశారికములకు తన బావ రాక నెఱిఁగించినది. తాఁకరాజునకు నరేంద్రాగమనవార్త నుత్కంఠతోఁ దెల్పినది.

రానే వచ్చినాఁడు నరేంద్రుఁడు. అంతఃపుర రాజద్వారమున శకటము నిల్చినంతనే యానంద ఘంటికారావములు మ్రోఁగినవి. మంగళతూర్యరావములు మనోజ్ఞముగ వినిపించినవి. రాజేంద్రచోళుఁడు తన మువ్వురు పుత్రులతోడను, ఏకపుత్రి యమ్మంగదేవితోను, ప్రధానామాత్యాది పరివారముతోడను నరేంద్రునకు స్వాగత మొసఁగెను. నరేంద్రుని జూడగనే యమ్మంగదేవి వ్రీడాకళోద్వేగమున నిలువక పరువెత్తినది. నరేంద్రుఁడు మాతులునకు నమస్కరించి, బావలను సంభావించెను. కుందవాంబ యమ్మంగను దగ్గఱకుఁ దీసికొన్నది, బావపై నేమైన పద్యములఁ బాడమన్నది. బహుదూర ప్రయాణప్రయాసముచే నరేంద్రుని మోము తుషారావృతుఁడగు రేరాజురీతి నుండెను. ఆ సహజ సౌందర్యమే యమ్మంగ కాకర్షణీయ మైనది. మధుర మంజులముగ నమ్మంగ స్వాగతగీతము లాలాపించినది. తమ దేవి కంఠధ్వని వినిపింపఁగనే రాచిల్కలు ముద్దుముద్దుగ స్వాగతవచనములను బల్కినవి. క్రచ్చలఁ బారిజాతలత నవసుమ ప్రసరముల విరజిమ్మఁబడెను.

అమ్మంగదేవీ సౌందర్యము నరేంద్రునకు ముచ్చట గొల్పినది. ఆమె యాహార్యము, ఆమె నడత, ఆమె మాట నాజూకుదనము, ఆమె శుచిస్మితము, ఆమె కాంతహృదయము ప్రశంసింపఁ దగినవిగాఁ గానిపించినవి. వయసున తనకన్న చిన్నదయ్యు, కవితావ్యవసాయమును గూడ నామె గావించుట నరేంద్రున కాశ్చర్యమైనది. ఆమెకు సంస్కృతభాషా పరిచయము కల్గింపవలయునని నరేంద్రుఁ డాశించెను. తన కులబ్రాహ్మణుఁడు తనకుఁ గల్గించిన దేవభాషా సంస్కారబలముతో నరేంద్రు డమ్మంగదేవికి తద్భాషాభిమానమును గల్గించెను.

నరేంద్రుని సాధుశీలము రాజేంద్రచోళున కన్నివిధముల నచ్చినది. తన తాత రాజరాజు విగ్రహము నుదయముననే రాజరాజనరేంద్రుఁడు నవోదిత ప్రసూనములతో నలంకరించి నమస్కరించును. విశ్రాంతివేళలందు తమిళ సాహిత్యమును ప్రత్యేకాసక్తులతో నరేంద్రుఁడు పండితులతోఁ బఠించుచుండెను.

పెరుందేవనార్ భారత రచన నరేంద్రు నమితముగా నాకర్షించినది.

కుందవాంబ తన ప్రభుని విచిత్రచిత్తపరిణామమును సోదరున కమిత కష్టముతో సూచనామాత్రముగాఁ దెల్పెను. నాఁటినుండియు రాజేంద్రచోళుఁడు చాళుక్యరాజ్య మంతటను ముఖ్యముగా రాజమహేంద్రవరమున తన జాంఘికుల నధికముగ నియోగించి, వారి నప్రమత్తతతో మెలఁగుమ ట్లాజ్ఞాపించెను.

కుందవాంబ చోళపురమున కేఁగి సంవత్సరము కావచ్చినది. ఆమె చోళపురమున నుండెనే కాని, యామె మానస మంతయు రాజమహేంద్రవరమున నే యుండెను. ఆమె యారాటమునకుఁ దగినట్లే రాజమహేంద్రవరమున పరిస్థితులు క్రమక్రమముగ విషపరిణామములను దాల్చెను. విమలాదిత్యుఁడు రాత్రిసమయములయం దాహారము విసర్జించి, యేక భుక్తము నలవఱచుకొనెను. ఆ యేకభుక్తమైనను మిక్కిలి నీరసమగు నాహారము. శాకపాకము లేవియు దరి రానిచ్చుటలేదు. చాళుక్యపతి సూర్యోదయమునకుఁ బూర్వమే, గోదావరీ పవిత్రోదకముల స్నానమాడి, జినస్వామిని దర్శించి, గోష్ఠి సలుపుచుండెను. రాజమహేంద్రవరమునఁ గేంద్ర జనవసతి యత్యద్భుతముగ నిర్మింపఁబడినది. అందులకుఁ గావలసిన ధనసంపత్తి యధికభాగము విమలాదిత్యుఁడే యొసఁగెను. ప్రజ లైచ్ఛికముగఁ గొంత విరాళములఁ గూడ నొసంగిరి. ఇందొక సుందర మందిరము చాళుక్యపతికి ప్రత్యేకింపఁ బడినది. రాజమహేంద్రవరము ఘంటాపథమునఁ జాళుక్యపతి శకటారూఢుఁడై, జనవసతి నుండి వెడలు చుండగఁ బ్రజలందఱు నాతని జినమతాభిమానమును బ్రస్తుతించిరి. సనాతన మతాభిమాను లీ విపరిణామమునకుఁ జంచలించుచుండిరి. నన్నయ భట్టారకుఁడును, వజ్జియప్రెగ్గడయు మౌనముద్రతోఁ బరిస్థితులను బరికించు చుండిరి.

కుందవాంబ పుట్టింటి కేఁగిన యవకాశమును మేడాంబ సర్వవిధముల స్వార్థమునకు వినియోగించుకొనుచున్నది. తన కుమారుఁడే వేంగీ సింహాసన మధిష్ఠించునని యక్కడక్కడ బ్రకటించుచున్నది. కుందవాంబాభిమానులైన దాసదాసీజనమును జతుర్విధోపాయములఁ దనవైపునకు మరల్చుకొనుచున్నది. అప్పుడప్పుడు ప్రధాన సేనాధిపతినిఁ బిలిపించి రహస్య సంభాషణముల జరుపు చున్నది. తాను సర్వదా రాజునకు విశ్వాసపాత్రురాల నని నిరూపించుకొనుటకు విమలాదిత్యుని యనుజ్ఞతో జినవసతి కేగి జినస్వామిని సందర్శించుచున్నది. జినస్వామితోఁ బరమార్థవిషయ ప్రస్తావన తగ్గించి, రాజకీయ మంత్రాంగము నారంభించినది. విమలాదిత్యునిలోఁ దన దివ్యప్రభావముచే నచంచలమగు జినమత విశ్వాస మమోఘమగు వైరాగ్య ప్రభావమును బ్రబలములైన వనియు, నతఁ డచిరకాలముననే జినశ్రావకుఁడుగఁ బరివర్తించు నను రహస్యములను జినస్వామి మేడాంబకు విదితము గావించెను. కుందవాంబ దక్షిణదేశమున

ముండగనే సింహాసనత్యాగము జరిపింపవలసినదిగా మేడాంబ ప్రార్థించినది. తన సర్వశక్తులఁ బ్రయత్నింతునని జినస్వామి మాటిచ్చెను.

పంచ ప్రధానుల సభ జరిగి చాలకాలమైనది. వజ్జియప్రెగ్గడ సహస్రాక్షుఁడై పరిస్థితులను సమీక్షించుచుండెను. మేడాంబ నొక కంట కనిపెట్టియే యున్నాఁడు. కుందవాంబ పుట్టింటి కేఁగిననాటినుండి నన్నపార్యుఁ డంతఃపురమునకు వచ్చుటలేదు. దక్షారామ వరప్రసాదలబ్ధుఁడగు రాజరాజనరేంద్రుని సింహాసనారూఢుని గానీకుండ మేడాంబ యట్టి కుటిల స్వార్థపరాయణు లడ్డుపడ నేరరని నన్నయవిశ్వాసము. నారాయణభట్టారకునితో కూడి నన్నపార్యుఁడు వివిధ సంస్కృత భారత తాళపత్ర ప్రతులను బరిశోధించుచుండెను. వివిధోపాఖ్యానముల పౌర్వాపర్యముల నిర్వురు గలసి చర్చించుచుండిరి. ఇవి యవి యననేల? భారతగ్రంథ గ్రంథు లనేకములను వారిరువురు నిర్ధారణము సేసికొనుచుండిరి. అప్పుడప్పుడు వజ్జియప్రెగ్గడతోడను, ప్రధానులతోడను నన్నయభట్టు రాజకీయములు పరామర్శించుచునే యుండెను. చోళ ప్రణిధు లనేకులు వజ్జియప్రెగ్గడను, నన్నపార్యుని గలిసికొని తమ రాజాజ్ఞను రహస్యముగా వారికెఱిఁగించిరి.

కర్ణాటమున జగదేకమల్ల ఇమ్మడి జయసింహుఁడు మాళవదేశాధిపతి భోజునిపై ప్రతీకార మొనర్చుట కిది మంచి యదనని యుపక్రమించెను. భోజరాజునకుగూడ విమలాదిత్యుని పరిస్థితి యవగతమైనది. తాను సాహాయ్యమపేక్షించియు ప్రయోజనము శూన్యమని భావించెను. భోజరాజు సారస్వతేయుఁడు. మహాకవి. చంపూ రామాయణమును సంస్కృతమున మహాకవిత్వదీక్షతో రచించుచుండెను. ఇట్టి దీక్ష కాఘాతము కల్గుటాతనికిష్టము లేకపోయెను. అందుచే నతఁడు జయసింహవల్లభునితో సంధి గావించుకొనెను. అమూల్యాభరణములను, అవారణ వారణములను భోజుఁ డుపదగా కుంతలాధిపతికి సమర్పించెను. ఇఁకనుండి కుంతలాధిపతి చాళుక్యరాజుపై దండెత్తినచో నెట్టి సైనిక సాహాయ్యముకూడ చేయరాదను నియమమునుగూడ భోజాధిపతి కంగీకరింపక తప్పినదికాదు.

౧౯

అది వైశాఖ పూర్ణిమ. జైనులకది త్యాగదినము. అదియే వారికి మహాపర్వదినము. ఈ నాఁటికి దేశము నాల్గుమూలల జినవసతుల నిర్మాణము పూర్తియైనట్లు జినస్వామికి వర్తమానము వచ్చినది. దేశము పలుప్రాంతములనుండి జినశ్రావకులు, అనువ్రతులు, మహావ్రతులు రాజమహేంద్రవరమును జేరిరి. వారందఱును గోదావరీ పవిత్రజలముల స్నానమాడి రాజమహేంద్రపురవర

వీథులలో బారులుదీర్చి పోవుచుండగాఁ బ్రజ లత్యంతోత్సాహములతో సందర్శించు చుండిరి.

విజయనగరమునుండి రేచనయు నేతెంచెను. పూర్వము జినస్వామి ప్రేరణముచే రేచన కృతిపతియగుట కంగీకరించెను. భీమకవి ఛందోగ్రంథమును రచింతునని ప్రతిజ్ఞచేసెను. ఆ రచన మెన్నడో పూర్తియైనది. కృతి సమర్పణోత్సవము కాలేదు. అది విజయనగరమునఁ గావించుకొనుట రేచన కంత యిష్టముగాలేదు. రేచన కాపట్టణమున ననేకులు శత్రులు గలరు. వారేమైన యల్లరులు చేయుదురేమోయని యతని భీతి. ఉన్నయూరిలో నట్టి యుత్సవమునకు విలువ యుండదనికూడ నాతని యభిప్రాయము. జినస్వామి సన్నిధిలో యావదాంధ్ర జైనవ్రతు లలంకరించిన సభలో కృతి సమర్పణావిష్కరణము కేర్పాటు గావించుకొనిన బాగుండుననుభావము రేచన కీ పర్యటన విషయమైన వార్త యందినపుడే తోఁచినది. వెంటనే యతఁడు జినస్వామికి తన మనోరథ మెఱిఁగించెను. జినస్వామి యందులకు మిక్కిలి సుముఖతఁ జూపెను. ఈ కారణమున భీమకవిని రాజధానీ నగరమునకు రప్పించుట జినస్వామి వాంఛ. రేచన భీమకవిని బలవంతముగా నెట్లో యొప్పించి రాజమహేంద్రవరమునకుఁ దీసికొని వచ్చెను.

విమలాదిత్యప్రభు వానాఁడు ప్రాతఃకాలముననే గోదావరీ పవిత్రోదకముల స్నానమాడి జినవిహారమునకేగి తన సాధన నుపక్రమించెను. అప్పటి కైదుఘడియల ప్రొద్దయినది. అనంతర మాతఁడు శ్రావకుల మధ్యలోనున్న జినస్వామిని సందర్శించెను. ఈ దృశ్యమును జూడగనే విమలాదిత్యుని హృదయము ఝల్లుమన్నది. ఎందఱు సాధకులు !! ఎంద ఱనువ్రతులు ! ఎందఱు శ్రావకులు !! వీరినందఱిని తిరిగి తా నిన్నాళ్ళకుఁ జూడ గంటినికదా ! యని విమలాదిత్యుఁడు మహానంద బంధురుఁడాయెను. విమలాదిత్యునిలో వైరాగ్యము తీవ్రరూపము వహించుచుండెను. రాజసందర్శన మాత్రముననే జినలోకమంతయు వినమ్రభావమున లేచి నిలువఁబడినది. త్యాగమూర్తులగు వీరందఱు నిట్లు లేచి నిలువ బడుటాతనికి బాధగల్గించెను. తన రాజరికమువలన మాత్రమే తనకిట్టి గౌరవము ప్రాప్తించుచున్నదను భావ మాతనికి స్ఫురించెను. అంతకుమించిన విశిష్టత తనకులేదు. కావున తానట్టి గౌరవమున కనర్హుఁడనని భావించెను. సమావేశమునకుఁ బ్రతివందన మాచరించి జినస్వామి పార్శ్వతలమున బ్రభువుఁ గూర్చుండెను. జినయోగి కొకప్రక్కన భీమకవి యాసీనుఁడాయెను. భీమకవి మాత్రము రాజును చూచి లేచి నిలువఁబడలేదు. దుర్నిరీక్ష్యమగు నాతని తేజము విమలాదిత్యు నాకర్షించినది. "ఈ యువకుఁడెవడ"ని రాజు ప్రశ్నించెను. జినయోగి భీమకవిని రాజునకుఁ బరిచయముగావించెను. మనసులో విమలాదిత్యుఁడు తనకీ కవులతోఁ బని యేమి యని భావించెను. అంతటే

నా ప్రశంస మంతటితోఁ బూర్తియైనది. జినస్వామి కృతిసమర్పణోత్సవమున కిది మంచిసమయమని యాదేశించెను. భీమకవి తన "కవిజనాశ్రయము"ను రేచన కంకిత మొసఁగెను. చాళుక్యరమణుని సన్నిధిలో జరిగిన యీ కృతి సమర్పణోత్సవమునకు రేచన యపరిమితానంద నిమగ్నుఁడాయెను. రేచన భీమకవి ననేక విధముల సత్కరించెను.

కృతి సమర్పణానంతరము జినస్వామి యానాఁటి మహోత్సవ ప్రాముఖ్యమును మితహితోక్తుల నిట్లుపన్యసించెను. "త్యాగమే మానవధర్మములలో సత్యుత్తమమైనది. అహింసయే పరమోత్కృష్టమగు మతము. ఇంద్రియ నిగ్రహత్వముకన్న మానవ శ్రేయస్సు మఱియొకటి లేదు. మానవ సుఖదుఃఖములన్నియు మానవుని యాత్మ శక్తియందే యున్నవి. సమస్త సృష్టికిని తలమానికము మానవుఁడు. ఈతఁడు తన జ్ఞానబలముచే తానీ జీవకోటికి ధర్మకర్తగ భావింపవలయును. వాని బాధలను గమనించి, తన్నివారణమునకు వైద్యశాలలు నిర్మింపవలయును. భూతకోటికి కళ్యాణము చేకూర్చునట్టి కార్యక్రమముల నన్నింటియందు మనకు మహాప్రభువులు పెట్టనికోటవలె తోడ్పడుదురు."

ఆ నాటి సాయంకాలము బ్రహ్మాండమగు బహిరంగసభ జరిగినది. జినస్వామి తానాంధ్రదేశమున గావించిన జినమత వ్యాప్తిని గూర్చియు, ఆంధ్రులు తనకు తోడ్పడిన విధానమును గూర్చియు గంభీరముగ నుపన్యసించెను. "అట్టి ప్రజాదరణమును బొందిన మతముపట్ల నిజముగ ప్రజాప్రతినిధియైన విమలాదిత్యభూపతికూడ విశేషాదరమును జూపుట మన మత చరిత్రలో నొక సువర్ణాధ్యాయము. చాళుక్యపతి అనువ్రతుఁడుగా, సమస్తైశ్వర్యములఁ బరిత్యజించి యసిధారావ్రతము నాచరించుచున్నాఁడు. అత డింకను నా సాధన మార్గమున నభ్యుదయము పొందఁగలడు. ప్రభువు జీవితము ప్రజాకోటి కంతకును లక్ష్యము కావలయును. మీరందఱు జినమతము నాచరించి, స్వార్థపరులను, హింసాపరులను, పండితంమన్యులు నగు వారి మతమును నిరసింతురని యీ పుణ్యదినమున మిమ్మభిలషించుచున్నాఁడన"ని జినస్వామి తన యుపన్యాసమును ముగించెను. అమ్మహాసభలో విమలాదిత్యుఁడు కూడ నున్నాఁడు. సభానంతరము జరిగిన ప్రజాహర్షనినాదములు వ్యోమాంతరమున ప్రతిధ్వనించెను. ప్రజలలో బలిసిన జినమతాభిమానము చాళుక్యేశ్వరునకుఁ గనువిప్పు గల్గించెను.

జినస్వామినుండి సెలవు గైకొని విమలాదిత్యుఁడు తన నికేతనమున కేగెను. అప్పటికి నాల్గుజాములు ప్రొద్దుపోయినది. జ్యోత్స్నాప్రపంతులు వెల్లువలై లోకమును ముంచెత్తుచుండెను. ప్రభువులో నేదో యారాట మతిశయించుచుండెను. సభాగత జినశ్రావకు లందఱు నాతని మనోవీథిని మసలిరి. ఎట్టి మహత్తర త్యాగజీవనము వారిది! తానుగూడ నట్లేల కాఁగూడ దను ప్రశ్న

మాతనికి బలీయమై యెంత యణచుకొందమన్న నణఁగుటలేదు. తానీ స్థితిలో సింహాసనమును త్యజించిన యేమగునో యను భీతి పొడగటుచుండెను. ఈ రాజ్యము తనకు శాశ్వతమా ? ఆ మమత తనకేల ? అదియును గాక తాను సంతానవంతుఁడు. వారిఱువురిలో నెవరోయొకరు సింహాసన మధిష్ఠింతురు. రాజ్యాంగ మనునది యొక మహాయంత్రము. అందేయొక్క వ్యక్తికి నధిక ప్రాముఖ్య ముండదు. ఎవ్వరు లేకున్నను జరుగకపోదు. అందఱున్నను రాజ్యములు తల్లక్రిందులు కానున్న కాకమానవు. త్యాగశీలుఁడైన వ్యక్తి యట్టి సంకుచిత భావముతో మథన పడుచున్నచో, ఇంకను నతని త్యాగబుద్ధి పచేళిమము కాలేదని భావము, ఇట్లేమేమియో విమలాదిత్యుఁడు యోజించినాఁడు. అతని యాలోచన లొక తెన్ను పట్టలేదు. ఇట్టి యాందోళితమైన మానసిక స్థితిలో విమలాదిత్యుఁడు శయనమును జేరెను. ప్రభువునకు నిద్రపట్టుటలేదు. ఊరక అటునిటు మసలుచుండెను. కనులు మూసినప్పుడెల్ల నాతనికి జినశ్రావకుఁడు ప్రత్యక్షమగుచుండెను. తా నింకను పదవీవ్యామోహమును వదలలేనందులకు శ్రావకుఁడు తన్నుజూచి పరిహసించుచున్నట్లు ప్రభువు బాధపడఁజొచ్చెను. లేచి కూర్చుండి కొంతతడ వేమియో యోజించును. నలుదిక్కుల గాఢాంధకార మలముకొన్నట్లుండెను. కొంతసే పటునిటు పచారు చేసెను. అతని రక్త నాళము లన్నియుఁ బొంగెత్తినట్లాయెను. తనకీ రాచరికమున సుఖము లేనట్లు వృథపడినది. తా నణువ్రతుఁడుగను, మహావ్రతుఁడుగను గావించిన నియమ పాలన మాతనికి శాంత్యానందముల నొసఁగెను. తన యహింసావ్రత మాత్మ సంతృప్తి నొసంగినది. ఆమార్గమునే తానేల యనుసరింపరాదను ప్రశ్న విమలాదిత్యుని మానసమున నుద్భూతమై, ప్రతి నిమేష మాతనిని వేధింపఁ జొచ్చెను. అప్పటి కర్ధరాత్ర మైనట్లు రాచనగరులోని గంటలు సూచించినవి. విమలాదిత్యుఁడు సేవకునికొఱకై తన సమీపమందలి గంట మ్రోగించెను. "వజ్జియప్రెగ్గడను బిలిచిరమ్మ"ని రాజపురుషున కాతఁ డాజ్ఞాపించెను.

రాజు, జినమహాసభనుండి వచ్చినప్పటినుండియు పడు నాందోళనమును మేడాంబ గుర్తించుచునే యున్నది. చాటున దాఁగి యాతని యాకులపాటు నంతయుఁ బరిశీలించుచుండెను. అర్ధరాత్రమున వజ్జియప్రెగ్గడకు కబురంపు టామె కాశ్చర్యము కల్గించినది. సింహాసనము త్యజించునను శంక పొడమినది. వెంటనే యొక లేఖవ్రాసి తన ప్రణిధుని చేతికిచ్చి, యెటకో పంపినది.

సైనికుడు వజ్జియప్రెగ్గడ యింటి కేగెను. అతఁ డచ్చట లేఁడు. భోజనానంతరము నన్నయభట్టారకునితో మంతనమున కేఁగెను. వారిరువు రింకను రాజేంద్రుని విపరీత మానసిక పరిణామమును గూర్చియే విస్మయముగా చర్చించుకొనుచుండిరి. "చాళుక్యవంశమునకు విమలాదిత్యప్రభువు తీరని కళంకమును జేకూర్చెను. ఇది యంతయు నా జినస్వామి కావించెను. అతని

మాయలోఁబడి ప్రభు విశ్లైనాఁడు. రాచఱికమునకు గొప్ప భంగము తెచ్చినాఁడు. కులబ్రాహ్మణులగు మీరును రాజును మరల్చుటకు యత్నింపరైరి" యని పజ్జియ ప్రెగ్గడ కష్టముగాఁ బల్కెను. నన్నయభట్టారకుఁడు చిఱునగవుతో, "ఇది యంతయు కలిమాహాత్మ్యము. ఇందెవ్వరును బాధ్యులుకారు. జినస్వామి నిమిత్తమాత్రుఁడు. ప్రభువునకు మనమాటలు నచ్చుకాలము కాదిది. అందు చేతనే నేనట్టి ప్రయత్నమునకుఁ బూనుకొనలేదు. మన సర్వవాంఛల నీడేర్చు ప్రభువు పెరుగుచున్నాఁడు. ఈ యుద్రేకములు తాత్కాలికములు. ఈ కలికాలిజదోష తుషార సంహతి నీ యువరాజు తన యుదయప్రభావమున దవ్వులకుఁ బాపున"ని నన్నపార్యుఁ డనుచుండగనే సైనికుఁడు వచ్చెను. మఱుక్షణముననే పజ్జియప్రెగ్గడ నిర్విణ్ణుఁ డాయెను. ఈ తలవనితలంపుగా వచ్చిన పిలుపున కేమి యొనర్పవలయునో కూడ నాతనికి తోచలేదు. వెంటనే యువరాజు సమీపమున లేఁడని తోఁచి, తనకు నిత్యము కన్పించుచున్న చోళ జాంఘికుల నిద్దఱను రహస్యముగాఁ బిలిపించినాఁడు. వారికీ వర్తమానమును దెల్పి యేమాత్ర మాలసింపక యువరాజును గొనిరావలయు నని యాదేశించెను.

ఎప్పటి కప్పుడే విషమించగల వేంగీదేశ విపత్కర పరిస్థితుల నూహించి చోళదేశాధిపతి, యైదుయోజనముల కొక జాంఘికుని నిర్ణయించెను. అందుచే నర్ధరాత్రమున పజ్జియప్రెగ్గడ యందించిన వార్త మఱునాఁడు మధ్యాహ్నమునకు చోళపురమును జేరెను. ఆ సమయమున రాజేంద్రచోళుఁడు తన బలగముతో భోజన మారగించుచుండెను. కాని కుందవాంబ మాత్రము నిట్రుపాసము పూనినది. ఆమె వదనము శిశిరఋతు తుషారాక్రాంత పరిక్లాంత పంకజోపమై యున్నది. ఆమె హృదయము పాతాళమునకు క్రుంగుచుండెను. గత యామినీచతుర్థయామమున జినసన్యాసిగా విమలాదిత్య జీవితేశుఁ డామెకుఁ గనిపించెను. మేరుగంభీరుఁడగు నాతఁడు పెనుపేద చందమున నుండుటఁ జూచి, భయభ్రాంతయై కుందవాంబ యాక్రందనము చేసెను. నరేంద్రుఁడు తల్లిని సమీపించి పరిస్థితిని ప్రశ్నించెను గాని కుందవాంబ యేమియు పేర్కొనక, యేదో భయము వాడమునవని కప్పిపుచ్చి, కొమరుని నిద్రవుచ్చినది. వెంటనే శుచిస్నాతయై, శివసహస్రనామములను, లలితాసహస్ర నామములను పారాయణము గావించినది. ఇది యామెకు సహజమగు ఛాందసాచారముకదా యని సోదరుఁడు ప్రశ్నింపలేదు. భోజనసమయము రాజేంద్రచోళునకు మిక్కిలి యానందప్రదమైనది. కుమారు లొకపంక్తిని, వారి కెదురుగా దానును తన ముద్దులకూఁతు రమ్మంగదేవి యొకపంక్తిని గూర్చొని భుజింతురు. ఇప్పు డమ్మంగదేవి నరసను మేనల్లుఁ డుండుట, చోళాధిపతికి పట్టరాని యానంద హేతువైనది. అమ్మంగదేవీ నరేంద్రుల హృదయము లేకమైనవి. అమ్మంగదేవి

ముందుగా రుచిచూచి, "యా శాకము ముందు కలుపుకొనుము." "ఈ యపూపమును మధ్యమధ్య భుజింపుము"ని, బావ నాదేశించును. నరేంద్రుఁడు కూడ నామె మాటను గౌరవించును. ఇట్టి యాదర్శ భావి దంపతులనుజూచి చోళపతి ముసిముసి నవ్వులు నవ్వుకొనును. బావమఱఁదులు నరేంద్రుని సాధుత్వమును జూచి యసమర్థుఁడని హాస్యమాడుదురు. ఎట్టి హాస్యోక్తులనైన నాతఁ డానందింపఁగలఁడు. అప్పుడప్పుడాతఁడు "పురుషుఁడు నిమిత్త మాత్రుఁడు. ప్రకృతిలేని పురుషుఁడు నిస్సారుఁడు. ప్రకృతి దేవ్యాదేశము, పురుషున కనుల్లంఘనీయము." అని యేమేమియో వేదాంత విషయములను విసరును. ఆ వచనము లగమ్యములై బావమఱఁదులు మౌనము వహింతురు. తన యల్లుఁడు వాణీలీలాస్పదుఁడని మామ పరమానందభరితుఁ డగును.

భోజనానంతరము వజ్జియప్రెగ్గడ పంపిన వార్తను చోళరాజందుకొని, తీవ్రయోజనామగ్నుఁ డాయెను. ఇంతలో మఱియొక వృత్తాంత మింకొక వైపునుండి వినవచ్చెను. మేడాంబ రహస్యాలోచనా ప్రబోధితుఁడై, కుంతలాధిపతి జయసింహుఁడపార సేనానివహముతో వీరవిజయాదిత్యుని సింహాసనాధిష్ఠితునిఁ జేయుట కుపక్రమించుచున్నాఁడు. ఈ పరిపంథిని మార్గమధ్యముననే పరిబద్ధుని గావింపవలయును. వెంటనే రాజరాజనరేంద్రుని రాజమహేంద్రవరమునకుఁ బ్రయాణింపవలయును. తత్క్షణమే చోళాధిపతి తన సోదరిని సమీపించెను. ఆమె యఖండ శివదీక్షా దుర్నిరీక్ష్యయై యున్నది. రాజమహేంద్రవర వృత్తాంతము నాతఁడామె కెఱుకపఱచెను. కాని యంతయు నింతకు పూర్వమే యవగతమైనట్లుగా, "కర్తవ్యమును నిర్వహింపుము. రాజమహేంద్రవర ప్రయాణమునకు సన్నాహము సిద్ధము సేయుమ"ని కుందవాంబ తన యనుజు నాదేశించెను. ఇట్టి విషమ పరిస్థితియందును తన యగ్రజ ప్రదర్శించిన చిత్తస్థైర్య మాతని కబ్బురము కల్గించినది. జీవితములోని పరమార్థమును సాధించిన వారిట్లే యుందురు. ఆమెచే సెలవు తీసికొని చోళపతి అత్యవసర సమావేశమునకు గంటలు మ్రోగించెను. మంత్రులు, సేనాపతులు, దండనాథులు తత్క్షణమే రహస్య మందిరమును జేరిరి. చోళాధిపుఁడు వేంగీదేశపు విషమ పరిస్థితులను కుంతలాధిపతి విజయసింహుని కుట్రను విశదపఱచి మహామంత్రి దండనాథుల వంకఁ జూచెను. అందగ్రగణ్యుఁడు రాజరాజ బ్రహ్మమహారాజను బ్రాహ్మణ దండనాథుఁడు, అతఁడు శతాధికరణ కేళీవిలాసుఁడు, భుజంగ బాహుదండుఁడు, శత్రుల పాలిటి యపర కాలుఁడు, ప్రబలప్రచండ మహాసేనాధీశుఁడు. అతఁ డుత్తిష్ఠుఁడై "జయసింహుని నే నెదుర్కొనియెదను, ఆజ్ఞ యొసఁగుడ"నెను. ఈ మాట తదితర దండనాథులకు స్పర్థ కల్గించెను, ఉత్తమ 'శోడ చోడగోన'ను చమూపతి తా నొకదిక్కునుండి జయసింహు నెదుర్కొందు ననెను. అనంతర

ముత్తమచోడ 'మలాఁడుఁడయ్య'ను మఱియొక చమూపతి "నాకు చాలకాలము నుండి యుద్ధావకాశము లేకపోయినది, అనుజ్ఞ యిడిన, నేనొకవైపునుండి జయసింహుని సైన్యమును దునుమాడుదున"ని శౌర్యప్రతాపములు మెఱయఁ బల్కెను. వెంటనే జయభేరీ నినాదములు ప్రళయ సమయ పర్జన్యగర్జానురావము లట్లు మారుమ్రోఁగినవి. ప్రధాన సేనాధిపతి యరిందముఁడు రాజరాజనరేంద్రుని రాజమహేంద్రవరమునకు భద్రముగాఁ గొనిపోయి పట్టాభిషేకాదు లేర్పాటు గావింతునని ప్రతిన సేసెను.

నరేంద్రుఁడు చోళపురమునకు వచ్చినప్పటినుండియు తన మేనమామ పంచ కళ్యాణి గుఱ్ఱమునం దెక్కువ మక్కువతో స్వారీ చేయుచుండెను. అయ్యది గంట కెనుబది యోజనములఁ వేగమునఁ బోగల సామర్థ్యము కలది. అంతవేగమునను తన్నధిష్ఠించినవారి నావంతయు నలయనీయదు. మామ యీ యుత్త మాశ్వము నల్లునకు బహూకరించెను. నరేంద్రుఁ డనేక గంధ సింధుర హయ శిక్షారూఢ దక్షుఁడు. ఆ విషయము నరేంద్రుని కరస్ఫాలన మాత్రముననే పంచకళ్యాణి గ్రహించినది. తల్లికి, మామకు నమస్కరించి, నరేంద్రుఁడు పంచకళ్యాణి నధిష్ఠింపనున్న సమయంబున నమ్మంగదేవి నరేంద్రుని నొసట కుంకుమబొట్టు తీర్చిదిద్ది కర్పూర నీరాజన మెత్తినది.

౨౦

విమలాదిత్యుఁ డర్ధరాత్రమున సింహాసనమును త్యజించి జిన విహారమున కేఁగెను. రహస్యముగ జినస్వామిని లేపెను. ఆయన తత్తర పాటుతోలేచి వేంగి ప్రభువును దర్శించెను. "నామానస మీరాజ్యభోగములయందు పరాఙ్ముఖమైనది. నేఁటినుండి రాజపదవినికూడ త్యజించి జినశ్రావకుఁడుగా నుండవలయునను వాంఛ ప్రబలినది. రాజ్యమును వర్జియప్రెగ్గడ కప్పగించితిని. ఇంక నాకు దానితోఁ బనిలేదు. ఈ క్షణముననే నాకు శ్రావక దీక్ష నొసంగుఁడ"ని విమలాదిత్యుఁడు జినప్రభువు నర్థించెను. జినేంద్రున కిది యంతయుఁ గలయో! యనిపించినది. తా నాశించిన దానికన్న ముందుగనే వేంగీశునిలో వైరాగ్యము తీవ్రరూపము వహించినది. రాజు కోర్కె ననుసరించి జినస్వామి విమలా దిత్యున కొక కమండలువు, నెమలిపింఛము, కొన్ని పవిత్ర గ్రంథముల నొసఁగెను. విమలాదిత్యుఁడు త్యాగిశుఁడైనాఁడు.

విమలాదిత్యుఁ డంతఃపురమునుండి నిష్క్రమించిన పిమ్మట మేడాంబ వర్జియప్రెగ్గడను సమీపించినది. ఎట్లైనను తన పుత్రుని సింహాసనస్థుని గావింపు మని పరిపరి విధములఁ బ్రార్థించినది. తా నా యుపకృతి చేసిన భూరి

మహాగ్రహారములు తన వంశస్థు లనుభవింపన ట్లొప్పించెద నన్నది. ఏమేమియో యాశలు గల్పించినవి. అమాత్యుఁ డది ధర్మవిరుద్ధ మనినాఁడు. నిష్కళంక మగు తన వంశచరిత్ర కిట్టి మహాకళంకమును జేజేతుల గావింప ననెను. ప్రార్థనలు ఫలింపకపోవుటచే మేడాంబ బెదిరింపులకు దిగినది. కనీనికలు గ్రక్కుదలి మిణుమిట్లు గొలుపుచుండ, "మీ యాటలింక సాగవు. మొదటి నుండియు మీరు కుందవాంబా పక్షపాతులు. మీ కామె యొరిగించిన దేమి? నేఁ గావింపనిదేమి? కుందవాంబ సపుత్రకయుగ పట్టణమున లేదు. ఆమెకు పుట్టిల్లె తన సర్వస్వము. ప్రభువు మానసమట్లున్న క్లిష్టసమయముల యందామె పుట్టి మునుంచుకొని పోయినట్లు పుట్టింటి కేఁగినది. వేంగీ రాజ్యమునం దామెకు భక్తి విశ్వాసములు లేవు. అట్టి కుందవాంబ పుత్రుని పట్టాభిషిక్తుని గావించి, యాంధ్ర జాతీయాభిమానమునే కళంకిత మొనర్చుచున్నారు. చోళాధిపత్యమునకు మీరు తలొగ్గుచున్నారు. అట్లయిన తద్విధానమునకుఁ బ్రతివిధానము నాలోచింప లేని యబలను గానని గుర్తుంచుకొనుఁడు"—అని మేడాంబ తీవ్రముగాఁ బల్కినది. ఆమె కుటిల స్వభావము, దుష్టరాజనీతి యమాత్యుల కవగతమైనది. ఆమె యపర కేకయ రాజపుత్రికగా ప్రెగ్గడకు ప్రత్యక్షమైనది.

స్థిరచిత్తుఁడగు ప్రెగ్గడ యామె కేమియు సమాధానమీయఁ దలఁపలేదు. ఆ మాటలు విననట్లే తూష్ణీకుఁడాయెను, కాని ప్రతివాక్యము నిశితముగ విమర్శించుకొనెను. వెంటనే కుంతలాధిపతి జయసింహుఁ డాతని మనోవీథిని మసలెను. ఇతఃపూర్వము విమలాదిత్యుని వైరాగ్య భావము నూఁతగా గొని, కావించుకొనిన యొడంబడికకు విరుద్ధముగా నాతఁడు మాళవాధిపతిని వశపఱుచుకొన్నాఁడు. మేడాంబ పల్కులలోఁ దానెవరి సాహాయ్యమునో యపేక్షించినట్లు ధ్వనించెను. ఆమె పుట్టినింటివారందరు నడుగంటిరి. అయిన నీమె తన పట్టమహిషి మర్యాద నతిక్రమించి జయసింహునితో మంతనములు గావించి యుండునని యమాత్యుఁడు భావించు చుండగనే తొలి కూఁత వినిపించినది. ఆ క్షణముననే మేడాంబా ప్రేరిత గూఢచారులు కర్ణాట రాజ్యమునుండి చనినట్లు వజ్జామాత్యులకు వర్తమానము వచ్చెను. కర్ణాట ప్రభువు నెదుర్కొనవలయును. రాజ్యమును వీడి పోరాదు. ఏతజ్జటిల సమస్యా పరిష్కార మార్గాన్వేషణ జాగృత చిత్తుఁడై కూర్చొనియున్న యమాత్యశేఖరుని నేత్రాంభోజముల యరుణిమలతో నాడుకొనుటకు బాలాతప కిరణము లాకులమాటున యొదఁగి యొదఁగి మెసలినవి.

వజ్జియప్రెగ్గడ కులబ్రాహ్మణుని, ప్రధానసేనాధిపతిని, దండనాయకులను బిలిపించి యోజించెను. అందఱును సంప్రదాయానుకూలముగనే నడువ

వలయునని యభిప్రాయపడిరి. కుంతలాధిపతి యీసమయమును బురస్కరించుకొని, దండయాత్ర సలుప వచ్చుననియు, సింహభూపతిని ప్రతిఘటించుటకు సర్వసైన్యమును సిద్ధముగ నుంచ వలయుననియు నన్నపార్యుఁడు సేనాపతి దండనాథులను హెచ్చరించెను.

మేడాంబ రహస్యముగ జినస్వామి కొక వర్తమాన మంపినది. ఎట్లైనను తనకుమారుని సింహాసనస్థుని గావింపవలసినదిగా నామె ప్రార్థనము. అట్లయిన తమ మత మాకల్పాంతము వేంగీ తలమున వర్ధిల్లగలదను నాశాభావముగూడ నామె యందించినది. జినస్వామి కా యాలోచన లేకపోలేదు. కాని, తనకే ప్రమేయమున్నట్లు విమలాదిత్యుఁడు గుర్తింపరాదు. తానిట్టి క్షుద్ర రాజకీయాసక్తుఁడని రాజు విమలాదిత్యుఁ డెఱిగినచో తనయం దున్న గురుత్వమడుగంటును. అందుచే రహస్యముగఁ గొందఱు పుర ప్రముఖులను బిలిపించినాఁడు. వారందఱు జిన మతాభిమానులే. రాజరాజ నరేంద్రుఁడు రాజధానీ నగరమున లేనందున, నాతనికి వేంగీ తలమునందు కన్న చోళ రాజ్యముపట్ల మక్కువ యెక్కువగుటవలనను, సింహాసనము రాజులేక రిక్తగా నుండరాదుగనుకను సర్వ విధముల వీరవిజయాదిత్యుఁడే సింహాసనము నధిష్ఠింప నర్హుఁడని జినస్వామి వారికి ప్రబోధించెను. పుర ప్రముఖు లిందేదో దేశాభ్యుదయ మున్నదని విశ్వసించిరి. అప్పటికే పురమంతయు విమలాదిత్యుఁడు సింహాసనమును త్యజించినవార్త యట్టుడికిన ట్లుడుకుచుండెను. పురప్రముఖులు జనసమూహములను గలిసికొని, రిక్త సింహాసనముండుట ప్రజాక్షేమమున నష్టదాయకమని యుద్రేకపూరితముగా మాట్లాడుకొనుచుండిరి. జినశ్రావకులు, వనుప్రతులుగూడ నీ విషయమును బ్రచారమును చేసిరి. మొత్తముమీఁద ఏ ప్రక్కకుఁ బోయినను, నెవరినోటను విన్నను నీ మాటయే వినిపించుచుండెను. ప్రజలీ విషయమును వజ్జియప్రెగ్గడను బ్రశ్నింపవలయునని తలంచిరి. అంతట రాజమహేంద్ర పురజన సందోహము, రాజ ప్రాసాదపు దిశాముఖముగాఁ జనెను.

వజ్జియప్రెగ్గడను కలిసికొనునప్పటికి మధ్యాహ్నమైనది. ప్రజాశక్తి సూఁతగాగొని కొందఱు నాయకులు మహామంత్రితో రిక్త సింహాసనము రాజ్యారిష్టదాయక మనియు, దక్షిణదేశ మమకారముతో నున్న రాజరాజ నరేంద్రుని కొఱకు నిరీక్షించుట కన్న వీర విజయాదిత్యుని సింహాసన మెక్కించుట ప్రజాభీష్టమని వాదించిరి. ప్రజలలో నిట్టి యుద్రిక్తత కల్గునని ప్రెగ్గడ లేశమైన తలంపలేదు. ఇది యంతయు మేడాంబా జినస్వాముల మూలమునఁ గల్గిన విషమ ప్రచారమని మహామంత్రి గ్రహించెను. ఆమె

కుట్రనంతయు బయలుచేయ వలయునని ప్రెగ్గడ తలపోసెను. ఇంతలో కొందఱు గూఢచారులు రహస్య వర్తమానమును వినిపించుటకు నిలువఁబడిరి. వారు తెచ్చినవార్త మంత్రి యూహించెను. "చెప్పుడు! వీరందఱును మనవారే; రాచరికము బట్టబయలైనది. దీని కిక రహస్యము లేద"ని యమాత్యుఁడు గంభీరముగఁ బల్కెను. అంతట నొక ప్రణిధి "స్వామీ! మన యంతఃపుర ప్రణిధు లెవ్వరో కుంతలాధిపతి యగు జయసింహునకు ప్రభువులు సింహాసనమును త్యజించిన వార్త తెల్పిరి. జయసింహుఁడు మహాసైన్య నివహముతో మన రాజధాని వైపునకు తరలి వచ్చుచున్నాఁడ"ని నివేదించెను.

మహామంత్రి: ఆ యంతఃపుర ప్రణిధు లెవరని మీ యెఱుక?

ప్రణిధి: అందొకఁడు తిరిగి వచ్చుచుండగాఁ బట్టితిమి. మంత్రియాజ్ఞ నా బంధితుఁ డెదుట నిల్చెను. ప్రజలందఱు నీ విషయమును విస్మయ దృష్టులతో సందర్శించుచుండిరి. మేడాంబాప్రేరితుఁడై వేయిమాడలు గైకొని, జయసింహునకు వేంగీ సింహాసన పరిత్యాగవార్త నెఱిఁగించిన ట్లాతఁడు పేర్కొనెను. నిజము చెప్పినందులకు మహామంత్రి యాతనిని క్షమించి విడిచిపుచ్చెను. "చూచితిరా! యెంతటి యవమానకరమగు విషయమో! వేంగీ పట్టమహిషి స్వార్థపరాయణయై మన కాగర్భ శత్రువగు కుంతలాధిపతి సాహాయ్య మపేక్షించినది. ఇన్ని సంవత్సరములుగా నింతటి త్యాగముచేసి నిలువబెట్టుకొన్న వేంగీ ప్రతిష్ఠ, ఒక్క క్షణమున బూడిదపాలైనది. మీరైన నిఁక సింహాసనాధిష్ఠితు లెవరాయని యోజింపక, జయసింహుని మన ఊరి పొలిమేరలనుండియే పారద్రోలుట కుద్యమింపుఁడు! పొండు. ఐచ్ఛిక సేనానులుగాచేరి దేశభక్తిని ప్రకటింపుఁడు." అని వజ్జియప్రెగ్గడ ప్రజావాహినిని మరల్చెను. ప్రజ లొక్కక్షణము పరస్పర వక్త్ర విలోకనులైరి. మేడాంబ ప్రవర్తనమును ప్రజ లేకకంఠమున ఖండించిరి. సత్వర దేశ సంరక్షణా భిరతులై వెనుదిరిగిరి. మేడాంబ తన ప్రాసాద గవాక్షమునుండి యంతయు నాలించినది. అసమర్థుఁడగు గూఢచారివలన రహస్యభేదనము జరిగినందులకుఁ జింతిల్లినది. జినస్వామి యుపాయము పనిచేయనందులకు వగచినది.

ఆనాఁటి సాయంకాలము నన్నయభట్టు పండితపరిషత్తున కేఁగెను. కుందవాంబ వైదిక మతాచారదీక్ష వారికి తెలియనిది కాదు. రాజరాజ నరేంద్రుని సంస్కృత భాషాభిమానము, ఆచార్య ప్రియత్వము, వినయసౌజన్య విశిష్టత, పరిషత్తునకు సుపరిచిత మైనది. నన్నయభట్టారకునితో నాతఁడు గావించిన సంస్కృతాధ్యయనము వా రెఱిఁగినదే. అప్పుడప్పుడు నన్నయభట్టారకునితో నరేంద్రుఁడు పండితపరిషత్తునకు వచ్చెడివాఁడు. పండితగోష్ఠులను, వాక్యార్థ

విధానముల నాతఁ డత్యాసక్తితోఁ బరికించెడివాఁడు. వారి యుపాధ్యాయ ధారణా దార్ఢ్యమున కచ్చెరువందెడివాఁడు. అహోరాత్రముల ననుసంధానము గావించుట చేత వారట్టి యధికులైరని యాతఁడు గుర్తించెను. అట్టి నరేంద్రుఁడు వేంగి దేశమును పాలించిన సంస్కృతభాషాప్రాముఖ్యము నిల్చునని వాదనపడిరి. మేడాంబ కుటిలవిధానమును నిరసించిరి. అవైదికుఁడగు జినస్వామి కిందు పాలుగలదని భావించిరి. ఇంతలో నొక పండితుఁడు కవిజనాశ్రయప్రతి నొకదానిని తెచ్చెను. నన్నయభట్టారకుఁడు దానిని నాతురతతోఁ జూచెను. జైనమునాఁడు తాను జూచిన బాలుఁడు లక్షణవేత్త యైనందులకు సంతసించి నాఁడు. తెనుఁగు పద్దెములను జూచెడిదేమి యని కొందఱు నిరసించిరి. అది యనుకుఱిబొంత యని యొకపండితుఁ డీసడించెను. అది యపవిత్రుఁడగు బ్రాహ్మణుని రచన యని యొకఁ డేవగించెను. రచన ప్రశస్తముకాదని మఱియొకఁడు విమర్శించెను. నన్నయభట్టుమాత్రము ఆ విమర్శలను నొక చెవిని వినుచునే యంతమాత్రముగానైన తెనుఁగునం దొక ఛందోగ్రంథము వెలువడినందులకు నన్నపార్యుఁ డానందించెను. తాను వ్యాకరణమును సంస్కృతమున రచించెను. ఇది సంస్కృత పండితుల నాకర్షించి, తెనుఁగు భాషాభివృద్ధిని వారిమూలమున సాధింపవలయునను దలంపుతో గావించినది. తత్సమపద కల్పనాదుల విన్యాసము గావించి తెనుఁగు బాసను సంస్కృత భాషాస్థాయికిఁ గొంపోయి కావ్యసృష్టి గావింపవలయునని నన్నపార్యుని యాశయము. ఛందశ్శాస్త్ర మట్టిదిగాదు. ఇది సామాన్యుల కుపయుక్తము కావలయును. ఛందోలక్షణ మెఱిఁగి మాతృభాషాభిమానముతో పద్యము లల్లుట కుద్యమింపబడవలయును. సంస్కృతాంధ్రములకుఁగల యతి భేదము చక్కఁగా గుర్తింపఁబడినందులకు నన్నయ సంతోషించెను. ప్రాసనిర్బంధాదులు కూడ తెనుఁగుభాషా సహజ సౌందర్యమును స్పష్టపఱుచుచున్నవని నన్నయ మన్నించెను. తమిళమున యతి గలదు గాని ప్రాసనియతముకాదు. కన్నడమున ప్రాస నియతము గాని యతికాదు. తెనుఁగున రెండును నియతములైనవి. తెనుఁగు పద్యసౌందర్యస్థాయి యప్పటికే కొన్ని శాసనములందు పొడగట్టినది. కర్ణాటచ్ఛందోగ్రంథములకు కవిజనాశ్రయమునకును ననేక సందర్భములలో సామ్యము లున్నట్లును నన్నయ గ్రహించెను.

* * *

వజ్జియప్రెగ్గడ యాదేశానుసారము నారాయణభట్టు కొంత సేనకు నాయకత్వము వహించి ఉత్తరదిశ సరిహద్దును సంరక్షించుట కేగెను. మఱి కొందఱు దండనాథులు ప్రబలసేనావాహినీ సహితులై పశ్చిమదిశాభిముఖులైరి. వజ్జియప్రెగ్గడమాత్రము పురమును వదలిపోలేదు. పౌరులనేకులు స్వచ్ఛంద భటులుగాఁ జేరి నగరరక్షణ కార్యమున మునిఁగిరి. మేడాంబచర్య ప్రజలలో

ససహ్యాభావమును గల్గించెనని, స్వస్థానసంరక్షణాభిమతులగు ప్రజలు జయసింహు నెదుర్కొను విషయమున నిమగ్నులైరనియు దెలియఁజేసిరి. జినస్వామి ప్రజలలోఁ దేదలఁచిన విప్లవము నిష్ఫలమైనది. మేడాంబ జయసింహునియం దాశలుపెట్టుకొని నిరీక్షించుచున్నది. జయసింహుని ధ్వజినీ భారమును వేంగివధూధిని సహింపలేదని మేడాంబ ప్రత్యయము. వీరవిజయా దిత్యుఁడు తాను చక్రవర్తినని నే భావించి యంతఃపురాంగనలపై తన యధికారము చెలాయించుచుండెను.

రాజరాజనరేంద్రుఁడు రాజమహేంద్రపురమునకు రానేవచ్చెను. అతఁడు వెంబనే వజ్జియప్రెగ్గడను, పిమ్మట నన్నయభట్టారకుని గలిసికొనెను. తండ్రి వృత్తాంతము నెఱిఁగి జినవసతి కేఁగెను. జనకుని పాదపద్మములకు నమస్కరించెను. అప్పు డాతని రెండునేత్రములనుండి రెండు కన్నీటిబిందువులు రాలినవి. ఫలపుష్పాక్షతలు సమర్పించెను. జనకుల కచటగల వసతులనుగూర్చి ప్రశ్నించి తెలిసికొని పని వినెను. ప్రక్కనున్న వజ్జియప్రెగ్గడ యన్నివిషయములు యువరాజునకు నివేదించెను. అతని హృదయమున నెవరిపట్లను ద్వేషము జనింపలేదు. సమయము చూచి సవతితల్లికి నమస్కరింపవచ్చెను. నరేంద్రుని నడవడిలో ప్రెగ్గడ ధీరోదాత్తనాయక లక్షణములను స్పష్టముగా సంచర్శించి సంతృప్తుఁ డాయెను.

చోళ దండనాథులు మూఁడు దిక్కులనుండియు కుంతలసైన్యము నెదుర్కొని తరిమికొట్టుచుండిరి. ఈ దండనాథులకుఁ జిక్కకుండ తన సైన్యమును వేంగీ రాజధానివైపు మరలింపవలయునని జయసింహుఁ డనేక విధములఁ బ్రయత్నించి వ్యర్థుఁడాయెను. త్రిమూర్తి నిభులగు నీ చోళ వీర త్రయమును దప్పించుకొనుట దుస్సాధ్యమైనది. చోళ చమూపతులతో పోరాడుటకు కలిసింది రణరంగముగా నేర్పాటు గావింపఁబడెను. ఉభయపక్షములకు గల చతుర్విధసేనానివహమునకుఁ బ్రచండ సంగ్రామము జరిగినది. కొన్ని చోటుల ముష్టాముష్టిగను, మఱికొన్నిపట్ల కేశాకేశిగను, ఇంకకొన్ని ప్రదేశముల దణ్డాదణ్డిగను గాల్బలములు పోరాడెను. ధనుర్విద్యాపారగులు పరస్పర బాణవృష్టిపాతకౌశలపరాయణులైరి. ఖడ్గిఖడ్గ దృఢ ఘట్టనజాత విస్ఫులింగము లాదేశమున మెఱపులను భ్రాంతిగల్గించినవి. గజములతో గజములు; వారువములతో వారువము లవారణాహవ నిమగ్నములైనవి. అట్టి వీరభయంకర సంగ్రామమా మధ్యకాలమున జరుగలేదు. జయసింహుఁడీ దండనాథులను నిర్జింపకుండుటకన్న తన కపకీర్తి యింకొకటిలేదని భావించెను. తన సర్వశక్తులను సమాహిత మొనర్చుకొని నవనవోన్మేష దోర్దండ బలవిలాసముతో

ప్రవిదారణమును నిర్వహించెను. కలిదిండి రణమెఱిఁగి నారాయణభట్టారకుఁడు తన భటవాహినిని చోళ చమూసాగరమునఁ జేర్చెను. తత్కారణమునఁ జోళులు ద్విగుణీకృతోత్సాహులైరి. ఈ జటిల సంకుల సంగ్రామమున కంతము లేకుండెను. అప్పుడు నారాయణభట్టు తక్కుఁగల దండనాథత్రయమును త్వరితముగా సమావేశపఱచెను. జయసింహుని పరాక్రమప్రతిభ నాతఁ డుగ్గడించి, యందఱు సమష్టిగా నాతనిని జుట్టుముట్టి లొంగదీయుట కుపాయ మాలోచించిరి. జయసింహునిలోఁగల బలహీనత నొకదానిని నారాయణభట్టు పరిశీలించి గ్రహించెను. ఎడమవైపున నాతఁడు కరవాలమును లాఘవముగా నుపయోగింపఁజాలడు. కాని కుడిచేతి పట్టుతోడనే యాతఁడు బొంగరమువలె తిరుగుచు, తనపైఁ బరమాణువునుగూడ వ్రాలనీయని నేర్పుగలవాఁడు. అందుచే నెడమవైపునుండి ప్రబలమగు ప్రతిఘటనము జరుగవలయునని నారాయణభట్టు తెల్పగా చోళ దండనాథు లాతని నిశిత ఖడ్గయుద్ధ పాండిత్యమున కంజలించిరి.

నల్వురు దండనాథులు తమ మంతనమున కనుకూలముగా క్రమక్రమముగా జయసింహుని చుట్టుముట్టిరి. వామపార్శ్వముననున్న నారాయణభట్టును జూచినంతనే జయసింహునకు ముచ్చెమటలు పోసినవి. తానా బ్రాహ్మణ యోధునకుఁ గావించిన హింసాకాండ యాతని స్మృతిపథమున నర్తించెను. వెంటనే యాతనికి స్వప్నమున గానిపించిన భయంకర శక్తిస్వరూపిణి తిరిగి ప్రత్యక్షమైనది. అట్టి బీభత్సహృదయముతో జయసింహుఁడు వైరివీరులకు సరిగా సమాధానముఁ జెప్పలేకపోయెను. ఎడమప్రక్కనున్న నారాయణభట్టారకుని యసిఘృణి యాతని కశనిపాతమాయెను. తన యబలత్వముకన్న, తన యవివేకచర్యవలన దా నోఁడిపోక తప్పదని జయసింహుఁడు భావించెను. అప్పటికి నాల్గుదినములు సంకుల సంగ్రామము జరిగినది. నాల్గవనాఁటి యంతిమఘడియలలో జయసింహుఁడు తన యోటమిని ప్రకటించెను. చోళ దండనాయకులు తమ విజయమునకు నారాయణభట్టారకుఁడే కారణమని యాతనికి బ్రహ్మరథము పట్టిరి. జయసింహుఁడు రాజమహేంద్రవరమునకు రాయబారమును బంపుట కొడంబడెను. వేంగి విజయవార్త చోళరాజధానికిని, వేంగి రాజధానికిని కూడ వ్యాపించెను. బహువిధ సమర కర్కశులగు చోళ దండనాథులతో నారాయణభట్టు రాజమహేంద్రవరమునకుఁ బయనించెను.

అప్పటికి కుందవాంబ కూఁడ రాజమహేంద్రవరము చేరినది. తన కుమారుఁడు ప్రదర్శించుచున్న సహన మామె కెంతో తృప్తిని గల్గించినది. ఇంతటి సంయమన సద్భావములు ; వివేక మాతనిలో నిరంతర కావ్యగీతప్రీతి

చేతనే సనంవర్థితమైనవని యామె కుమారుని లోలోన నభినందించుకొనెను. కుందవాంబా నరేంద్రులు సింహాసనాతంక విహీనమతులు. వారు త్యాగిశుని సందర్శించుచు, ననుజ్ఞయైనంతతడవు నచ్చోటనే యుండి యాతని కుపచర్యలు చేయుచుండిరి. కుందవాంబ త్యాగిశుని పాదాంభోజములఁ బడి తన్ను తన యనుచరురాలుగా ననుగ్రహించి, నిరంతర సేవా సౌభాగ్యావకాశము కల్పింపుఁడని ప్రార్థించినది. కుందవాంబా పాతివ్రత్యము త్యాగిశుని హృదయమును గరగించినది. జినవసతులలో స్త్రీలు నివసింపరాదను కఠిన నియమము కలదు. అందుచే త్యాగిశుఁ డందుల కంగీకరింపలేము. ఇఁక తాను రాజధానీ నగరమున నుండుట భావ్యము కాదని యతఁడు తలంచెను. అతని మానసము రామతీర్థ పరిసర రమణీయ ప్రకృతి దృశ్యములకుఁ బరువెత్తినది. జినస్వామినిఁ గూడ అచటికి బ్రయాణము గమ్మని కోరినాఁడు. ఇంతలో కలిదిండి సంగ్రామ విజయ వార్త నివ్వన మహానగర మంతటను మాఱుమ్రోఁగినది. కుంతల ప్రళయ ఝంఝామారుతమును చోళమహానగ మెదుర్కొని వేంగిదేశమును రక్షించిన దని ప్రజ లానందోత్సాహభరితులైరి.

వజ్జియప్రెగ్గడ దండనాథులకు ఘనస్వాగతము నొసఁగినాఁడు. రాజరాజ నరేంద్రుఁ డుల్లాసముతో వారిని పుష్పమాలాలంకృతులను గావించెను. మహోత్సవ మూరేగింపులతోడను మేళతాళములతోడను నతిశయముగా జరిపింప వలయునని యాశించిరి. కాని యిందులకు నన్నపార్యుఁ డడ్డుచెప్పెను. "మేడాంబ మత్సరముతో నున్నది. ఎప్పుడును ప్రపంచము రెండువైపుల నుండును. అందుచే మన ప్రవర్తన ప్రతిపక్షమువారికిఁ గూడ నాదర్శముగ నున్నపు డది ప్రశాంత పరిణామమునకు వెల్గుబాటలను వెలార్చి మహోదయము నొనగూర్చున"ని నన్నయమతము. మహామంత్రి యొకింత యోజనాముగ్ధుఁడై యందలి మహత్తును గుర్తించెను.

* * *

జినస్వామి కిఁక నేమియు మార్గము తోఁచలేదు. తనవర్తనము బాహాటముగా నుండరాదు. అట్లున్న నాతనియందున్న గౌరవము నశించును. బాహాటము గావించియు, తాను సాధింపఁగల్గిన దేమియు నున్నట్లు తోఁపదు. అందుచే వ్రతము చెడినను ఫలితము దక్కదని జినయోగి నిశ్చయించుకొనెను. తాను రాజధానియందుండి రాజేంద్రుని హృదయమును బరివర్తింపఁగల్గెను. అదియొక శాశ్వతాఖండ విజయమని, తన ప్రతిభకుఁ బ్రత్యక్ష తార్కాణ మనియు నతఁడు భావించెను. ఇఁక రాజధానియందుండుటకన్న దూరముగా నుండియే తన శక్తిసామర్థ్యములను జూపి, వేంగివిషయమున, జైనమతమును జిరస్థాయి గావింపవలయునని యతఁ డాశించెను. త్యాగిశుని కోర్కెను బాటించి

రామతీర్థమునకు బ్రయాణ సన్నాహములు గావించెను. ఈవార్త శుద్ధాన్తమును జేరినది. జీవితస్వామి సందర్శనమునకుఁ గూడ తానిఁక నోఁచుకొనుటలేదను దుఃఖమునఁ గుందవాంబ కొందల మందుచుండెను. భగ్నాశయయగు మేడాంబ జినస్వామి తనకు దూరమగుచున్నాఁడని దురపిల్లినది.

త్యాగీశునకు వీడ్కోలొసంగుట కాబాలగోపాలము జినవసతిని గుమికూడినది. సకలరాజ పరివార నివహము సమావేశమయినది. కుందవాంబా నరేంద్రులు ఖిన్న విసన్నవదనులై యుండిరి. వారి మొగముల నెత్తురుచుక్క మచ్చునకైన గానవచ్చుటలేదు. కృశాంగుఁడై యవైదిక మతాభిలాషియై యట్లున్న తనతాతపాదులను సందర్శించినప్పటినుండియు తల్లి కొమరుల యుల్లములు తల్లడపడినవి. ఇంతకుమున్నె వజ్జియ ప్రెగ్గడ సన్నయభట్టారకులు నరేంద్రునితోడను కుందవాంబతోడను బట్టాభిషేక విషయమును బ్రస్తావించిరి. "ఈ విషాదసమయమున దానికేమి తొందర" యని యిరువురు నొకే ప్రత్యుత్తర మిచ్చిరి. త్యాగీశుని నిష్క్రమణ ముహూర్తమున నావిషాదము మత్యుత్కటమైనది. ఇఁక తాని పూజ్యపాదుని సందర్శించు టెన్నడో యని యాందోళన మందిరి. ఇట్టి వ్యాకులత తరతమ భేదములతో నందఱియందును గాననగును. ఏతదుత్కట సమయమున నొక యద్భుతభావము నిర్ధార్యుఁడగు నరేంద్రునకుఁ బొడగట్టినది. వెంటనే తన జనకుఁడు ధరించు హాటకమయమైన గొడుగుపావ లాతని పవిత్రనేత్రాంభోజములయందు మెఱసినవి. త్రుటి కాలమున వానిని దెప్పించినాఁడు. ఆ పావలను తన పితృదేవుని పవిత్ర పాదాంభోజ రజఃప్రసారితము గావించి, భద్రముగా వానిని తన కరతలమున నుంచుకొని, "పూజ్యమాతా! ఈ పరిత్యక్త సింహాసనము నధిష్ఠించు నీ పవిత్ర పాదుకలకు దక్క, నన్యుల కర్హత లేదు. అందులకు సుముహూర్తము నిశ్చయింపుఁడ"ని జలద గంభీరనిస్స్వనముతోఁ బల్కెను. ప్రజలందఱు విస్మయ సమ్మోహ సంభ్రమలోలురై, యా యమృత వాక్కుల నాలించిరి. భరతునివంటి భవ్యత్యాగప్రభావుఁడని అందఱును నరేంద్రు నభివర్ణించిరి. పామరప్రజలు లలాటదేశ సంస్థాపితాంజలి బద్ధులైరి. నారాయణభట్టు ధర్మవిశారదుఁడని ప్రస్తుతించెను. కలియుగ పవిత్రుఁడని నన్నపార్యుఁ డభిభాషించెను. త్యాగీశుఁ డందఱను సాదరముగఁ దిలకించి నిష్క్రమించెను. జినస్వామి యితఃపూర్వమెన్నడును బరిశీలనముగా నరేంద్రుని వీక్షింపలేదు. భావభవనిభగ సుభగుఁడు, సుందరనయ బంధురుఁడగు నా విమలాదిత్యాగ్ర తనూజుని సందర్శన మాయనను బులకాంకితునిఁ జేసినది. తాను నామకరణము గావించిన వీరవిజయాదిత్యునిలో నిట్టి దివ్యగుణసంపదలు దుర్లభ్యమని యాతఁడు గ్రహించెను. అయినను నాతని యభిమానము మేడాంబాపుత్రునియందే ములుసూపినది. అనురక్తదృష్టితో

నరేంద్రు నవలోకించుచు, జినస్వామికూడ రాజమహేంద్రవరమును వీడలేక వీడెను.

మఱునాఁడు శుభముహూర్తమున రాజరాజనరేంద్రుఁడు జనకుని పాదుకలను దక్షారామేశ్వరాలయమునకుఁ గొంపోయి భీమనాయకుని పాదపద్మముల సన్నిధినుంచి యఖండ పూజాకలాపములఁ బూజించెను. ఈ వార్త నెఱిఁగి వాడవాడలలోని భూసురబృందము లాలయ ప్రాంగణమున సమావిష్టమై వేదపారాయణము గావించినవి. పురారాతి పదాబ్జ పూజాసక్తతను ముగిసిన యనంతరము, నరేంద్రుఁడు మహాదాన తర్పితద్విజవరుఁడై పాదుకలను సహోదర సహితుఁడై రాజధానియందు సింహాపీఠమునఁ బ్రతిష్ఠించెను. ఆనాఁటి సాయంత్రమున రాజమహేంద్ర కవీంద్ర సమాజము సమావేశమై నరేంద్రుని పవిత్రచర్యను బ్రశంసించినది. కులబ్రాహ్మణుఁడగు నన్నయభట్టారకుఁడు పాదుకాపట్టాభిషేక మహోత్సవమును బురాణ ప్రవచనము గావించెను. సమస్తైశ్వర్యములఁ గాలఁదన్ని సోదరుని పవిత్ర పాదుకలకే అయోధ్యరాజ్యము నప్పగించి, ధర్మకర్తగ మాత్రమున్న భరతుని పవిత్ర మూర్తిని నన్నయ పౌరాణికుఁడు మనోజ్ఞముగా రాజరాజు మనఃఫలకమునఁ జిత్రించెను. ఆ సమయమున కీ జయసింహుఁడు వివిధోపాయనములతోఁ దన రాయబారి నంపెను. అందలి మూఁడు రత్నహారములను చోళ దండనాథత్రయమున కుపథగా నరేంద్రుని యాజ్ఞపై వజ్జియప్రెగ్గడ సమర్పించెను. కాని యా దండనాథులు యుద్ధవిజయమునకుఁ దమ ప్రతాప మేమాత్రము కారణము కాదని, నారాయణభట్టారకుని సమయజ్ఞతయే కారణమనియు యుద్ధరహస్యమును విశదీకరించిరి. వజ్జియప్రెగ్గడ నారాయణభట్టారకుని కౌఁగిలించుకొని యమూల్య రత్నహారము నాతనికి బహూకరించెను. రాజరాజనరేంద్రుఁడు గురుతుల్యుఁడగు భట్టారకునకుఁ గృతజ్ఞతతో నమస్కరింపరాగా, భట్టారకుఁ డంతటి చిన్నవయసుననే వివేక చతురాననుఁడుగాఁ బ్రవర్తించిన నరేంద్రు నానందముతోఁ గౌఁగిలించుకొని తనగ్రీవాహారముతో నాతని నలంకరించెను, కుందవాంబాదేవి శూద్రులకు, పేదసాదలకు తన పర్యవేక్షణముతో నన్నదానము గావించినది. రాజధానీపట్టణమే కాక, వేంగివిషయమున నేవైపు విన్నను ధర్మవిశారదుఁడగు రాజరాజనరేంద్రునిగూర్చిన ప్రశంసావచనములే మాఱుమ్రోఁగెను.

౨౧

విమలాదిత్యుఁడు వైరాగ్యభావమును బొందినప్పటినుండియు సామంత రాజులు సరిగా కప్పములు చెల్లించుట మానివేసినారు. నరేంద్రుఁ డితర కార్య కలాపముల నన్నియు నావలఁ ద్రోసి అంకయ్య యను యువక దండనాథుని

తోడు జేసికొని తన రాజ్యము నాల్గుమూలలు వీరవిహారము గావించెను. కొందఱు సామంతులు నరేంద్రునితోఁ దలపడిరి. వారి నందరను నాతఁడు నిర్దాక్షిణ్యముగా నణఁచివైచి, పరగండ భైరవునిగను, వైరిభయంకర శౌర్యునిగను కీర్తి నొందెను. ఇట్లు జైత్రయాత్రలలో సంపాదించిన యశేష ధన సంపత్తి నాయా ప్రాంతమునఁ బ్రజలు దనకు నివేదించిన కష్టముల నివారణమునకు నరేంద్రుఁడు వినియోగపఱచు నట్లేర్పాట్లు గావించెను. సామంతనృపాలురు భోగలాలసులై ప్రజావళిని పశువులకన్న హీనముగాఁ జూచుచుండుట నరేంద్రునకు హృదయదారక మాయెను. అందుచే వారినుండి కప్పముల గొనుటచేతనే నరేంద్రుఁడు సంతృప్తుఁడు కాలేదు. వారికి కొన్ని విధులను నియమించి యవి క్రమముగా సకాలములో నిర్వహింపఁబడునట్లు పరిపాలనావిధానమును నరేంద్రుఁడమలు జరుప నారంభించెను. అంతాతఁడు ముఖ్యముగ చాతుర్వర్ణ్య ధర్మ నిర్వహణములోఁగల సాంఘిక సౌష్ఠవమును సామంతులు గుర్తించి ప్రజల కాదరాభిమానముల కర్హత సంపాదింపవలయునని వక్కాణించెను. శమదమాది షట్క సంపత్తిగల బ్రాహ్మణుఁడు; శౌర్యధైర్య తేజోధృత్యౌదార్యములు గల క్షత్రియుఁడు: కృషి గోరక్ష వాణిజ్యాదుల నిర్వహించు వైశ్యుఁడు; పరిచర్యాత్మకుఁడగు శూద్రుఁడు, సంఘ శరీరమున క్రమముగా శీర్షవదనోదరపాదముల వంటివారను జ్ఞానమును బ్రజలకు గల్గించున ట్లాజ్ఞాపించెను. సప్తసంతానములు సర్వేసర్వత్ర యభివృద్ధిఁ జెందవలయుననియు, నందులకు ధనాభావముగల ప్రాంతమునకు రాజధాని ధనసాహాయ్యము నొసంగుననియు నాతఁడు వివరించెను. ప్రతివారమును బంచప్రధానుల సభ జరిపించుచుండెను. పౌరాణికులను బోషించుచుండెను. వారు గ్రామగ్రామములు సంచరించి ఆర్షధర్మప్రబోధ ప్రచారములు సలుపునట్లు కట్టుదిట్టములు గావించెను. గురుకులములను నడుపు విద్వాంసులకుఁ బారితోషికము లొసఁగుచుండెను. విశ్రాంతి లేకున్నను సంపాదించుకొని కావ్యగీతాలాపనము నేమరకుండెను. ఇట్టి సుస్థిర పరిపాలనా వ్యవస్థ యచిర కాలముననే యమలుజరిపి రాజరాజనరేంద్రుఁడు ధరిత్రీజనసుత చరిత్రుఁడై శతద్యుతి విశదయశః ప్రసరద్యోతిత సర్వలోకుఁ డాయెను.

మేడాంబ కిది యంతయు ప్రాణసంకటముగా నుండెను. నిరంతరాధ్యయనశీలుఁడగు నరేంద్రుఁడు, షడ్గుణైశ్వర్య విలసితుఁడని యామె కలయుండైనను దలంపలేదు. తలకుమించిన యాశలకుఁ బోయి, మొదలంట కూలిన భూజమువలె నామె దీనాకృతితో నిరంతర దుఃఖాక్రాంతయై యుండెను. వీర విజయాదిత్యుఁ డాతతాయిగా సంచరించుచుండెను. నరేంద్రునకుఁ దన సోదరుఁ డట్లు వ్యర్థుడై మెలఁగుట బాధాజనక మాయెను. అతఁడు మేడాంబను సమీపించి యెట్టి విచారమును లేక, తన్ను తన బిడ్డవలె ప్రేమింపవలసినదిగ నర్థించెను.

ఆమె విజయాదిత్యు నుద్ధరింపుమని కోరినది. ఉదారహృదయుఁడగు నరేంద్రుఁడు, వజ్జియామాత్యులతో వీరవిజయాదిత్యుని విషయము సంప్రదించెను. అతఁ డెప్పటికైన వేంగి ప్రతిష్ఠాభగ్న కారకుఁడే యని యమాత్యుఁ డభిప్రాయమును వెలిబుచ్చెను. తన పినతల్లి పదవీవ్యామోహచిత్తయై, దురంత దుఃఖైక జీవిగ నుండుట శుభప్రదము గాదని నరేంద్రుఁడు భావించెను. అందుచే నాతనిని కళింగమునకు సామంతునిగా నియోగించెను. మేడాంబ కొంత యూరడిల్లినది. విజయాదిత్యుఁడు సమాతృకముగ కళింగమున కేఁగెను. రాజాదరణమున కఱ్ఱులుసాచుచున్న యనేక బాంధవుల కాతఁ డుచితోద్యోగముల నొసఁగి, తృప్తిపఱచుచుండెను. బుధవరేణ్యులు నరేంద్రు నిందులకు 'బాంధవాంభోజవన ద్యుమణి' యని కీర్తించిరి.

* * *

వేంగిదేశమున నేర్పడిన విషమ పరిస్థితుల నన్నింటిని తన యల్లుఁ డింతటి సమర్థతతో నెదుర్కొనుటయే కాక సుస్థిర పరిపాలన వ్యవస్థా సంస్థాపకుఁడౌట రాజేంద్రచోళున కమిత సంతోషాశ్చర్యములు కల్గించినవి. కాని నరేంద్రుఁడు రాజలాంఛనములతో సింహాసన మధిష్ఠింపక, వయఃపరిమితి కననుకూలమగు నిష్ఠుర వ్రతనియమములతో జీవితమును గడుపుట చోళపతి మదికి నాందోళనకరమాయెను. అమ్మంగదేవి వివాహకార్యమును నిర్వహింప వలసిన బాధ్యత చోళపతిపై నుండెను. అమ్మంగదేవి నరేంద్రు నెడబాసినప్పటి నుండియు నది యొకవిధముగా నున్నది. మాతృహీనయగు తన కుమారి తన మనోవేదన నొరులకుఁ జెప్పుకొనుటకు లేక లోలోన దిగమ్రింగుచుండెను. కుందవాంబా నరేంద్రులు పాదుకలను సింహాసనాధిష్ఠితము కావించినప్పటి నుండియు, కటికినేలపైననే శయనించుచుండిరని విని, యమ్మంగదేవియు నేలపైననే శయనించుచున్నది. పూర్వమువలె కుసుమాలంకృత కాక, యేక వేణి యైనది. నరేంద్రుఁడు కుమారసంభవ కావ్యగత పార్వతీనైష్ఠిక సౌందర్యమును బదేపది ప్రశంసించెడివాఁడు. అప్పటినుండి యమ్మంగదేవి కారాధ్య దేవత, తపోనిష్ఠాగరిష్ఠయగు పార్వతి. ఇదియంతయు గాంచుచున్న చోళపతి కారాట మధికమయి అవధి దాటుచుండెను. కూఁతు నేమని వారింపవలయునో, యెట్లు వారింపవలయునో కూడ నృపతికి తెలియకుండెను. ఇట్టి పరిస్థితిలో నరేంద్రునకుఁ దమిళ సాహిత్యోపాధ్యాయుఁడుగ నున్న యానంద బ్రాహ్మణాచార్యుని చోళపతి రాజమహేంద్రవరమున కంపెను.

అమ్మంగదేవి యానందగురుదేవుని వేంగీదేశ ప్రయాణవార్త విని యాతని యింటి కేఁగినది. తన మేనత్తకు, బావకు నమస్కారములు జెప్పుఁడని కోరినది. తాను తమిళమున పార్వతీ తపోగాథను గేయములుగ రచించినది.

దీనిని తన మేనత్త కీయుమని కోరినది. ఆనందగురువు వాత్సల్య రసోల్లసిత మూర్తియై యా గేయములఁ జదువుకొని, యానందించి "ఇంత చక్కని గేయము లెప్పుడు కూర్చితివి తల్లీ! దీనిని తప్పక మీ బావకిత్తునులెమ్ము!! ఇది తపస్సని యా రసజ్ఞునకు వేఱుగాఁ జెప్పఁ బనిలేదు. నా భారమును జాల తగ్గించితివ"ని యానందు డమ్మంగదేవి నోదార్చి పంపెను.

* * *

ఆనంద బ్రాహ్మణుని నరేంద్రుఁ డమితముగ గౌరవించెను. అమ్మంగదేవి తనతోపాటు నియమపాలనఁ గావించుచున్నవార్త కరుణారస పూర్ణ హృదయుఁడగు నరేంద్రుని కలఁచివైచినది. ఆమె వ్రాసిన "పార్వతీ తపము"ను గేయకావ్యము నానందబ్రాహ్మణుఁడు సమర్పించెను. అయ్యది పఠించి తాను బోధించిన కాళిదాస కవీంద్రుని కవితామహిమ నమ్మంగదేవి చక్కగా గ్రహించి, మధురముగాఁ బ్రతిబింబించినందులకు నరేంద్రుఁడు సంతృప్తుఁ డాయెను. నరేంద్రు డమ్మంగదేవి ధారణాపాటవమును, కాంతా సహజమగు భావసౌకుమార్యమును బ్రశంసించెను. దానిని కుందవాంబకు జదివి వినిపించెను. ఆ సమయముననే నన్నపార్యుఁడుగూడ దాని నాలించెను. తనమామ యాశయముల నానందదేవుఁడు వివరింపగా నరేంద్రుఁడు గుర్తించినాఁడు. అతులిత బలధాముఁడగు మాతుల సాహాయ్య సంపదలచే గదా, తన రాజ్యము శత్రు దురాక్రాంతము గాకుండ నిల్చినదను విశ్వాసభావము ధర్మవిశారదుఁడగు నరేంద్రునిలోఁ బెల్లుబికినది. అయిన తానిప్పుడు చేయగల్గిన దేమి? తనకు తానుగా సింహాసన మధిష్ఠించుట తన శీల సంపదకు వ్యతిరేకమైనది. "దేనికైనను కాలము పక్వముకావలయున"ని మామగారితోఁ జెప్పుమన్నాఁడు నరేంద్రుఁడు. ఆనందబ్రాహ్మణుఁడు నన్నపార్యుని కలిసికొనెను. చోళభూపతి యావేదనమును, యమ్మంగదేవి కావ్యసందేశమును వివరించెను. నన్నపార్యుఁడు పరిస్థితు లవగాహన గావించుకొని, "దేనికైనను కాలము పచేళిమము కావలయున"న్నాఁడు. నన్నపార్య నరేంద్రుల హృదయగతు లొకేరీతి నుండుట యానందయార్యున కబ్బురమాయెను. నన్నపార్య నరేంద్రుల గురుశిష్య సంబంధ మాదర్శప్రాయమైనదని యాతఁడు గుర్తించెను. నన్నపార్యుని భావాదర్శములకుఁ బ్రత్యక్షరూపము నరేంద్రుఁడని యాతఁడు గ్రహించి స్వీయదేశమునకు బయనించెను.

* * *

త్యాగీశుఁడు రామతీర్థము జేరి రెండు వర్షములైనది. అచటి రమ్యమైన ప్రకృతి వాతావరణ మాతని కభీష్టమైనది. జైన వాఙ్మయ పఠనముతోడను, శ్రావక నియమ పాలనముతోడను నాతఁడు తన కాలమును జక్కగాఁ గడపు కొనుచుండెను. ఇదివఱ కాతనికి నియమపాలనమునం దాసక్తి లేదు. పరిమిత

భోగానుభవమునకు మించి మతములేదని భావించెడివాఁడు. మాంసాహారమును నిత్యము భుజించెడివాఁడు. బహువిధ సమరకర్కశుఁడగు నతని కట్టి శాకాహారము తొలుత బాధఁగల్గించెడిది. కాని క్రమముగా దాని కలవాటు పడెను. కాని యప్పుడప్పుడు శూలముతో బొడిచినట్లు కడుపునొప్పి చెలరేగును. అంతటి బాధను సంయమించుకొనెడివాఁడు. ఎట్టి వైద్యచికిత్సయు శ్రావకుఁడు గావించుకొనరాదు. శరీరమునం దతని కెట్టి యభిమానానురాగము లుండరాదు. ఈ బాధ నానాఁటి కతిశయించినది. తఱుచుగా రెండుదినముల కొకపర్యాయముగ నొప్పి వచ్చుచుండెను. తద్బాధానివారణార్థము కతినోపవాసములను గావించుచుండెను. జినస్వామి మతప్రచారార్థము దేశాటనము సలుపుచుండెను. కళింగాధిపతియైన వీరవిజయాదిత్యుఁడు, మేడాంబయు త్యాగీశుని సందర్శించిరి. త్యక్త సింహాసనమునందు పాదుకలను బ్రతిష్ఠించి, రాజరాజనరేంద్రుఁడు ప్రజలను మోసగించుచున్నాఁడు. చోళాధిపుని యండ యుండుటచే నతని యాటలు సాగినవనియు, లేనిచో వీరవిజయాదిత్యుఁడు వేంగీనృపాలుఁడై జినమతోద్ధారకుఁ డయ్యెడివాఁడనియు నేమియేమియో మంజువాచాలతఁ బ్రదర్శించుచు జినస్వామితో వారు సంభాషించిరి. ఎప్పటికైన నరేంద్రునిఁ గూలద్రోయు నాశయము విస్మరింపకుమనియు, మాండలికభీమునివంటి సచివుని సామర్థ్యమును వ్యర్థము గాసీయకుమనియు, వీరవిజయాదిత్యుని జినస్వామి ప్రబోధితునిఁ గావించెను.

గ్రామములలో గల్గుచున్న మార్పులకు జినస్వామి చలించెను. ఎక్కడఁ జూచినను, తటాకముల, దేవాలయముల నిర్మాణములు జరుగుచున్నవి. ఆరామములు పెంపొందుచున్నవి. పౌరాణికులు పురాణప్రవచనములు గావించి గ్రామస్థుల కాముష్మికమును బ్రసాదించుచుండిరి. వీరి కందఱకు రాజపోషణ మేర్పఱుపఁబడెను. బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్ర వ్యవహారిక గోరక్షక శిల్ప పంచాణ కుంభకార తంతువాయ క్షౌరక రజక వస్త్రచ్ఛేదక చర్మకార తిలఘాత లుక చండాల మాతంగాద్యష్టాదశ జాతులవారును తమతమ విధులయం దాసక్తి చూపుచుండిరి. ఇట్టి పరిణామము నింతటి యచిరకాలములోఁ దెగల్గిన నరేంద్రుని ప్రతిభకు లోలోన సంతసిల్లియు తన యాశయమును నెఱవేరనందులకు జినస్వామి మత్సరగ్రస్తుఁ డగుచుండెను.

జినస్వామి యెలమంచలి జినవిహారమున నుండగా జినవ్రతుఁ డొకఁడు నుఱుగులు గ్రక్కుకొనుచు వచ్చెను. త్యాగీశుఁ డుదయమున స్మృతిదప్పిపోయెనని యాతఁడు నివేదించెను. జినస్వామి యతి ప్రయాసతో సూర్యోదయమునకుఁ బూర్వమే రామతీర్థమును జేరుకొనెను. అప్పటికే త్యాగీశుఁడు విగతప్రాణుఁడాయెను. జినమత సంప్రదాయానుసార మచటనే యాతని కళేబరము సమాధి గావింపఁబడెను.

త్యాగీశుని మరణవార్త యశనిపాతమువలె రాజమహేంద్రవర శుద్ధాంతమును గలవఱపఱచెను. ఎంత గంభీరుఁడయ్యు నరేంద్రుఁడు పసిబాలుని వలె దుఃఖించెను. అతని యాత్మశాంతికి షోడశమహాదానములను గావించెను. అప్పటికే కుందవాంబ శల్యావశిష్టయైయున్నది. జీవితస్వామి వియోగమువలన నిఁక నామె కా శరీరముతో బ్రయోజనము గనిపించలేదు. చితి పేర్చుకొని యామె సహగమనము గావించినది. అప్పరమపావని చితాభస్మమును గోదావరీదేవి తనయందు విలీనము గావించుకొని మఱింత పవిత్రమైనట్లు భావించినది. పితృవియోగానల దహ్యమానుఁడగు నరేంద్రునకు, మాతృ సహగమనమాపాత వేదనాయత్తమైనది. నన్నయభట్టు, నారాయణభట్టు, రాజమహేంద్ర కవీంద్రసంఘము, నరేంద్రు ననేక విధముల నోదార్చిరి.

త్యాగీశుని పంచత్వము ప్రజలలోఁ బ్రబలమగు నాందోళనము కల్గించినది. రాజరాజనరేంద్రుఁ డింకను బాదుకలతో గఠోర నియమపాలనమును జేయుట పండిత పామరకోటికి భరింపరాని బాధయైనది. ప్రజలు తండోపతండములుగా వచ్చి తమ యావేదనను నివేదించుచుండిరి. వివిధ జానపద నాయకులు, అనేక గ్రామప్రముఖులు, వివిధ విపశ్చిద్వర్యులు నరేంద్రునకు సానుభూతి ప్రకటించిరి, సత్వర పట్టాభిషేకమహోత్సవ సందర్శనాభిలాషను బ్రకటించి పోవుచుండిరి, ఉద్రేకపూరితులగు మఱికొందఱు గ్రామీణులు రాజరాజనరేంద్రు లచిరకాలముననే పట్టాభిషిక్తులు గాకున్నచో తాము నిరశన వ్రతము నవలంబింతుమని విజ్ఞాపన పత్రములను బంపుచుండిరి. ఇట్లు వచ్చిన శతాధిక పత్రములను, ప్రజావాణి నాధారముగా గొని వజ్జియామాత్యుఁడు, కుల బ్రాహ్మణుఁడు నన్నయభట్టారకుఁడు రాజరాజనరేంద్రు నభిషిక్తుని గావలసినదిగా వాంఛించిరి. నరేంద్రుఁడు ప్రజానుశాసనము పండితమాన్యుల యాదేశమును శిరసావహించి పట్టాభిషేకమహోత్సవ ముహూర్తనిశ్చయమున కనుజ్ఞ యొసంగెను.

---

అది దుందుభి సంవత్సర అమాంత భాద్రపద విదియ గురువారము. యాప దాంధ్రదేశచరిత్ర కిదియొక యపూర్వ పర్వదినము! మహోదయము!! సువర్ణాక్షర లిఖితమగు నూతనాధ్యాయము. ఆ నాఁడు కమలాచలాగ్ర మార్కండేయ శివ శిరశ్శశిచంద్రికా ధౌత సౌధ వీథులతోడను, గోదావరీ పుణ్య కూలంకష జలార్ద్ర శ్రీరుద్రపాద యుగళితోడను, బలవదభ్యున్నత ప్రాకార పరివేష గండూషితాకాంశ మండలముతోడను, గంధ దంతావళ గ్రైవేయ ఘంటికా తంకార ముఖర ఘంటాపథమునై సాంద్రమహోజ్వల విభవాభిరామ యగు రాజమహేంద్రపుర లక్ష్మిని సందర్శించు చికీర్షతో నిండారఁబాఱు నఖండ

గోదావరియం దలల విరజిమ్ముచు ఘనదుఃఖానుబంధ కలికాలజ దోష తుషారమును నాశమొనర్చుచు భానూదయ మైనది. అప్పటికే కోటిలింగాంభః ప్రవాహమున సహస్రబ్రాహ్మణ మఘమర్షణ స్నాన మాచరించి, తత్పులినోత్సంగమున వాలుకాలింగములకు మంత్రాక్షత పూర్వకముగా నభివాదములు సల్పి, పంచబ్రహ్మ, పంచాక్షరీమంత్ర ప్రధానములు జపించుచుండెను. క్షత్రియ వీరు లశ్వారూఢులై, ధవళేశ్వర ప్రాంతమువఱకును వాహ్యాళి వెడలి, తిరిగి తమతమ విశ్రాంతిగృహములకుఁ జేరుచుండిరి. వైశ్యశ్రేష్ఠులు వివిధ దేశాగత కపిల గోసహస్రమును బరామర్శించుచుండిరి.

శిల్పులు రాజమందిరమున చంద్రికాసంకాశకాశేయ శత సహస్ర సంధానిత వితానోప శోభలను దిలకించి సవధరించుచుండిరి. కాలాగురు ధూప ధూమవాసన లప్పటికే చెలరేఁగుచున్నవి. కుసుమకోదండ సమ్మోహన కాంతి సదృశలగు రెండవవయసు తాంబూల కరండవాహినులు తమతమ నిర్ణీతప్రదేశములను నిశ్చయించుకొనుచుండిరి. పెద్దముత్తైదువులు కర్పూర రంగవల్లులను దీర్చి దిద్దుచుండిరి. అచ్చటచ్చట గల శశికాంత మణి శిలాకుట్టిమములకు మఱికొందఱు కుసుమలేపనముల గావించుచుండిరి. మంగళతూర్య రావములు శ్రవణేంద్రియ సంతర్పణ గావించుచుండెను. భట్రాజ సమూహములు రాజరాజనరేంద్రుని గూర్చిన సుందరోజ్జ్వల స్తుతివాక్యములను ముఖస్థము గావించుటకు సతమత మగుచుండిరి. క్రమక్రమముగా తపన కిరణ కాండములు సోమరులనుసైత ముత్తిష్ఠులను గావించుచుండెను.

వజ్జియప్రెగ్గడ, నన్నయభట్టారకుఁడు, నారాయణభట్టు ఒక్కపరి సర్వ సన్నాహములను సమీక్షించిరి. రాజరాజనరేంద్రుఁడు సాలంకృతుఁడై బంధువర్గము నందఱను బరామర్శించెను. మేడాంబా వీరవిజయాదిత్యుల యాగమనమును గూర్చి యతఁ డారాటపడెను. సనాతన ధర్మవిరుద్ధముగా మేడాంబ సహగమన ధర్మమును బాటింపలేదు. అయినను తనకు కుందవాంబ తరువాత నామెయే మాతృదేవి యని భావించినాఁడు నరేంద్రుఁడు. కనీసము వీరవిజయాదిత్యుఁడైన రావలసినది. సోదర ధర్మమును దిరస్కరించినను, సామంతత్వమును బురస్కరించుకొనియైన యాతని రాక యనివార్యమైనది. రాజేంద్ర చోళుఁడు సకుటుంబముగా నొక ప్రత్యేక సౌధమున విడిదిఁ జేసెను. అతనివెంట మహామాత్యుఁడు, ప్రముఖ దండనాథులు, గురువర్యులు నేతెంచిరి. అందఱు ముహూర్తమునకు సంసిద్ధు లగుచుండిరి. అది సరిగా ఏడు ఘడియల ఎనిమిది విఘడియల కాలము. తన చిత్రము నమ్మంగదేవి సితపుష్పదామముల నలంకరించు సమయమున నరేంద్రుఁడు మామగారిని సందర్శింపవచ్చెను. తద్దృశ్యావ

లోకన చకితుఁడై యొడలు పులకింప నానందమున నుప్పొంగెను. అమ్మంగ దేవి తనకుఁగూడ నాదర్శపతి యని, అట్టివనిత తన కర్ధాంగియగుట తన యదృష్టమని భావించెను. ఈ భావావేశమున నాతఁ డక్కడెక్కువతడ వుండ లేకపోయెను.

సుముహూర్తమునకు ముందే, వివిధదేశాగత నృపాలురు వారివారి ప్రతినిధులు వేంచేయుచుండిరి. వారి నందఱను రాజేంద్రచోళుఁడు స్వాగత పూర్వక ప్రియవచనములతో నాహ్వానించుచుండెను. వజ్జియామాత్యులు వారిని వృద్ధానుపూర్వకముగఁ గూర్చుండబెట్టుచుండెను. నన్నయ నారాయణభట్టా రకులు కవిపండిత పౌరాణికకోటిని సంభావనాపూర్వకముగ నుచితాసనముల నియమించుచుండిరి. జానపద నాయకులను సేనాధిపతులు ఆసీనులను జేయు చుండిరి. ఒక్క ఘడియలో మందిరమంతయు నిండినది.

తొలుత పితరుల చిత్రములకుఁ బూజ జరిగినది. పిమ్మట గురుపూజ గావింపఁబడెను. వివిధ నదీనద పవిత్రాంబువులతోఁ గిరీటాభిషేకమైనది. ఆయుధ సమర్చనము సమాప్తమైన యనంతరము విపులవిప్రాశీః కలాప విన్యా సము భూనభోంతర పరివ్యాప్తమైనది. కొన్ని తరములుగ మూఁగవోయిన వేదవాణి యొక్కమారు విజృంభించినట్లైనది. కాహళీధ్వనులు మిన్నులను జిల్లులువడఁజేసెను. పరిపుల్ల కలాపములతో కలాపిజాలములు నర్తించినవి. కలకంఠకంఠులు కమనీయ గీతాలాపనములతో దివ్యనీరాజనము లెత్తిరి. సర్వలోకాశ్రయ, శ్రీవిష్ణువర్ధన మహారాజాధిరాజ, రాజపరమేశ్వర, పరమ భట్టారక, పరమమహేశ్వర, పరమబ్రహ్మణ్యాది వంశ పరంపరానుగత బిరుదావళీవిభ్రాజమానుఁడై వేంగీత్యాగ సింహాసనమును రాజరాజనరేంద్రుఁ డధిష్ఠించెను. వందిమాగధ స్తోత్రానంతరము, కవిపండితాశీర్వాదములు జరిగినవి. అందఱును దేవభాషలోఁ దమతమ పాండితీప్రకర్షను బ్రకటించుచు నాశీర్వచన పద్యములఁ బఠించిరి. ఎచ్చటను విశిష్టభావన స్ఫురించదు. గతాను గతికమగు భావములే రూపాంతరితము లైనవి. కట్టకడకు నన్నపార్యుఁడు ఆశీర్వదింప నిలువఁబడెను. సభ్యు లాశాభావములతో శ్రద్ధాళులైరి.

ఉ. రాజకులైక భూషణుఁడు, రాజమనోహరుఁ డన్యరాజ తే
జోజయశాలి, శౌర్యుఁడు, విశుద్ధయశశ్శర దిందు చంద్రికా
రాజితసార్వభౌముఁ డపరాజిత భూరి భుజాకృపాణ ధా
రాజల శాంతశాత్రవ పరాగుఁడు, రాజ మహేంద్రుఁడున్నతిన్॥

చ. ఘనదురితానుబంధ కలికాలజ దోషతుషార సంహతిన్
తన యుదయ ప్రభావమున దవ్వుగఁ ద్రోపి, జగజ్జనాను రం
జనమగు రాజ్యసంతత వసంత నితాంత విభూతి నెంతయున్
దనరుత ! వేంగి మన్మథుఁడు ధర్మదయార్ద్రి నిబద్ధ బుద్ధియై॥

ఉ. ఆశ్రిత పోషణంబున, ననంత విలాసమునన్ మనీషి వి
ద్యాశ్రమ తత్త్వవిత్త్వమున, దానగుణాభిరతిన్, సమస్త వ
ర్ణాశ్రమ ధర్మరక్షణ మహామహిమన్ మహినొప్పు సర్వలో
కాశ్రయుఁ డాది రాజనిభుఁ డత్యకలంక చరిత్ర సంపదన్॥

కం. విమలాదిత్య తనూజుఁడు
విమల విచారుఁడు, కుమార విద్యాధరుఁడు
త్తమ చాళుక్యుఁడు, వివిధా
గమ విహితశ్రముఁడు, తుహినకరుఁ డురుకాంతిన్॥

సీ. నిజమహీమండల ప్రజఁ బ్రీతిఁ బెంచుచుఁ
బరమండలంబుల ధరణిపతుల
నడిమి కప్పంబుల ముదముతోఁ గొనుచును
బలిమిసీయని భూమివలయపతుల
నుక్కడఁగించుచు దిక్కులఁ దనయాజ్ఞ
వెలిగించుచును విప్రకులమునెల్లఁ
బ్రోచుచు, శరణన్నఁ గాచుచు భీతుల,
నగ్రజన్ములకు ననుగ్రహమునఁ

ఆ. జారుతర మహాగ్రహారంబు లిచ్చుచు
దేవభోగముల మహావిభూతిఁ
దనరఁజేయుగాత !! మను మార్గుఁడగు విష్ణు
వర్ధనుండు వంశ వర్ధనుండు.

—అని నన్నపార్యుఁడు సున్నితముగా సన్నాయి నొక్కినట్లు కంఠమాధుర్య మొలకించుచు పరిమిత రాగ విన్యాసముతోఁ బఠించెను. ఏమి యీ మధుర భారతి !! అది సంస్కృతము కాదు. కాకపోదు. అది తెనుఁగని పండితులు చిడిముడిపడిరి. ఇదియేమి తెనుఁగని కొందఱు లోలోన వితర్కించుకొనిరి. మాత్సర్య మలినమగు బుద్ధికాదన్నను, అక్షర రామణీయకము నాశించు సభ్యహృదయ మా వాణి కాకర్షితమైనది. ఆ పద్యము లాపాత

మధురములు. అంతేకాదు. ఆలోచనామృతములు కూడ. నారాయణభట్టారకుఁడు పరమానంద పరవశమున "ఓహో! ఏమి యీ కైవల్య కళ్యాణవాణి; మఱియొకపరి యావృత్తి గావింపుఁడ"ని ముక్తకంఠమునఁ గోరెను. రాజరాజ నరేంద్రుఁడు మందస్మితముతో నా కోర్కెను మన్నించినట్లు తలపంకించెను. మఱల నన్నపార్యుఁ డాపద్యముల నపూర్వ మాధురీ భంగిమావిన్యస్తము గావించెను. మఱుక్షణముననే సహృదయుల రసనాగ్రములయం దాపద్యములు లాస్యవిన్యాసములతో నర్తించినవి. మంచి పద్యమునకు సముచితమగు పరీక్ష యింతకుమించి యేముండును? పండితాశీర్వచన కలాపము రక్తి గట్టినది.

అనంతరము వివిధదేశాగత మహీపాలురు, వారి ప్రతినిధులు, బహువిధోపాయనములను రాజరాజునకు సమర్పించిరి. వార్ధక్యముచే రాజాలని మాలవ దేశాధిపతి భోజమహారాజు రత్నహారములనే కాక, యనర్ఘములగు సరస్వతీ కంఠాభరణ చంపూరామాయణ కావ్యరాజముల నుపాయనముగఁ బంపెను. నరేంద్రుఁ డుల్లాసముతో వానిని స్వీకరించి భోజరాజు సాహితీవ్రతమున కంజలి ఘటించెను. కుంతలదేశాధిపతి జయసింహుఁడు తన ప్రతినిధి మూలమున రత్నాలహారములను వారువములను బంపెను. చేది దేశాధిపతి కళింగాధిపతి, మేనమామ చోళదేశాధిపతి వివిధామూల్యవస్తునిచయములను, దాసదాసీ జనములను గానుకపెట్టిరి. వెలనాడు, పాకనాడు, పలనాడు, ములకనాడు, కొసలనాడు పాలకులు భూరి భూషణహార సంహతిని సమర్పించి కొలిచిరి. జానపదనాయకులు ఆటవికహారములను, పులి చర్మాంబరములను, శుభదాయకములగు వివిధమృగ శృంగములను, కపిల గోసమూహములను భక్తితో సమర్పించిరి.

వివిధాయుధ ప్రదర్శనానంతరము, షోడశమహాదానములు గావింపఁబడెను. ఉత్తమ బహువేద విప్రుల కమల సువర్ణశృంగ ఖురమగు కపిలంబగు గోశతమును రాజేంద్రుఁడు స్వహస్తములతో సమర్పించి సత్కరించెను. పండితులకు వారి వారి యర్హత ననుసరించి భూరిదక్షిణలతోడను, రత్నములతోడ నపూర్వరీతిని సత్కారములను నరేద్రుఁడు జరిపించెను. ఈ శుభసమయమును బురస్కరించుకొని, తిరుగఁబడిన సామంత నృపాలుర నణఁచుటలోను, జైత్రయాత్రా సందర్భములందును దనకు చేదోడయిన అంకయభట్టారకునకు కృజ్ఞతతో ముప్పదిపుట్లవడ్లు వచ్చు క్షేత్రము గల మందగ్రామమును రాజు ధారా పూర్వకముగ సమర్పించెను. అంకయ్యభట్టు ఆపస్తంబ సూత్రుఁడు, భారద్వాజగోత్రుఁడు నయిన శివకుమారభట్టు పౌత్రుఁడు. స్వధర్మానుష్ఠానపరుఁడైన రామదేవుని పుత్రుఁడు.

ఆనాఁడు చాతుర్వర్ణములవారికిని ప్రత్యేకముగ విందుగావింపఁబడెను. శాకపాకములలో నాంధ్ర తమిళ సంప్రదాయములు మేళగించినవి. బహువిధ రంభా ఫలశ్రేణులు, కపిలగోక్షీరములు, క్రొన్నేయి, పప్పు, మండెగలు, సాంబారులు, అప్పడములు, వివిధపాయసాపూపములు, షాడబ రసావళులు, కలమాన్నము, శరశ్చంద్ర చంద్రికాధవళ దధియు సర్వసమృద్ధమై, బ్రాహ్మణ జన సమ్మోద సంపత్సంపాదన లంపటమును, క్షత్రియజన సంతోషకారణమును, వైశ్యజన రసనాతపః ఫలమ్మును; శూద్రజన హర్షోత్కర్షావహము నైనది.

సాయంసమయమునఁ జీడమార్యుఁడు శాస్త్రార్థమును గావించెను. పండితు లందఱాతనిని జన్మప్రభృతి గీతవేదార్థ తత్త్వఁడనియు, సప్తతంతుకృత యూపస్తంభ శోభితుఁడనియు, పరమపురుషార్థ సంపాదన పటిష్ఠుఁడనియు నుతించిరి. ఎన్నోశాస్త్రములను బ్రమాణీకరింపఁగల ప్రతిభగలవాఁడు. సనాతన మత విశిష్టత నాతఁడానాఁడు శాస్త్రార్థము గావింపగా, రాజరాజ నరేంద్రుఁడాతనిని "సకలార్థశాస్త్ర పరినిశ్చిత వినోదుఁడ"ని ప్రశంసించి సత్కరించెను. పిమ్మట నన్నయభట్టు, భోజరాజు చంపూరామాయణమును బురాణప్రవచనము గావించెను. అట్టి వాణీ లీలాస్పదునకుఁ దాను సమకాలికుఁడౌట తన సుకృత విశేషమని నరేంద్రుఁడు భావించెను. చంపూ కావ్యపద్ధతి నాతఁడు గైకొనుటతో సంస్కృతమున నొక విశిష్ట వాఙ్మయ ప్రక్రియ ప్రారంభమైనది. అతఁడు గద్యమునకుఁ బద్యమాధుర్యమును, పద్యమునకు గద్యగాంభీర్యమును జేకూర్చెను. "గద్యాను బంధ రసమిశ్రిత పద్యసూక్తిః, హృద్యాహివాద్య కలయా కలితేవగీతి" యను శ్లోకభావము సభ్యుల నలరించినది. నారాయణభట్టు అష్టావధారణ చణత్వము నిమ్మట ప్రదర్శించెను. ఆతని మేధా సంపద సభ్యులనాశ్చర్యాంబుధిలో ముంచెత్తెను.

* * *

పట్టాభిషేకము జయప్రదముగ పూర్తియైనది. ప్రజలు తనపట్లచూపిన యాదరాభిమానములకు నరేంద్రుఁడు సంతోషభరితుఁడాయెను. రాజేంద్ర చోళుఁడు తనదేశమునకు తరలవలయును. అమ్మంగదేవి వివాహముకూడ పూర్తియైన, తనకెంతో బరువుతగ్గును. బంధుకోటికి మఱల వెంటనే రావలయు నన్న శ్రమ యగును. నన్నపార్యునితోఁ జోళపతి యాలోచించెను. రాజరాజునకుఁ దాను దల్లిదండ్రులు లేనివాఁడై పెండ్లియాడుట యసహ్యావేతనాయత మైనది. నన్నపార్యుని మాట దాటరానిదౌట సుముహూర్తము వెంటనే దశమికి నిర్ణయింపఁ బడినది.

ఈ శుభకార్యము పితృహీనుఁడగు నరేంద్రునకు, వేంగీ జనకుఁడగు

భీమనాయకుని సమక్షమున నిరాడంబరముగా జరుగవలయునని సన్నయ యాశించెను. భీమేశ్వర కృతనిత్య ప్రసాదుఁడగు నరేంద్రుని యభీష్టము నిదియే. ప్రతిశుక్రవార మా యజగౌఱలేని వేల్పును సందర్శించుటాతని జీవిత వ్రతము. స్వామి ప్రసాదమును స్వీకరింపనిదే నరేంద్రుఁడింకేమియు భుజింపఁడు. అయ్యాలయాభివృద్ధికిఁ గావలసిన వసతులన్నియుఁ జేకూర్పఁబడెను. బృహదారామమును విశేషవ్యయప్రయాసలతో నరేంద్రుఁడు స్వీయ పర్యవేక్షణ క్రింద పూర్తిగావించెను.

తన సోదరుఁడు వీర విజయాదిత్యుఁడు పట్టాభిషేకమునకు రానందులకు నరేంద్రుఁడు పరితపించెను. ఆత్మీయమగు నీ వివాహ పవిత్ర కార్యమునకైన ఆతఁడు వచ్చునో, రాఁడోయని ప్రత్యేకమగు దూతమూలమున శుభలేఖ నంపించెను. మేడాంబ దూతతో ప్రీతిపూర్వకముగ మాటలాడినది. తన సర్వస్వము నరేంద్రుఁడే యన్నది. విజయాదిత్యునకు కళింగము నీరు గిట్టలేదని, ఏమాత్రము స్వస్థత చేకూరినను దప్పక వచ్చుననియు స్త్రీ జనోచితమగు పగ లన్నియుఁ గుమ్మరించినది.

దూత యచటి పరిస్థితులనన్నియుఁ బరిశీలించెను. మాండలిక భీముడు మంత్రిపదవి నలంకరించి సర్వజ్ఞుఁడుగ సంచరించుచుండెను. భీముఁడు భీమాకృతి కలవాఁడు. పొట్టిగ, నల్లగ నుండును. ఆతని తేనె కన్నులలో కర్కశత్వము ప్రత్యక్షమౌను. నాగకులభూషణుఁడాతఁడు. మేఘగిరినాధుడు, మలయ భాస్కరుఁడను నన్వర్థ బిరుదము లాతనికిఁగలవు. ప్రబలమగు సేనను సమీకరించెను. కళింగులతోఁ జేయిగలిపెను. ఆటవిక యోధుల నాదరించెను. ఈ విశేషము లన్నియు దూత వజ్జియప్రెగ్గడకు నివేదించెను. సోదరునిపై నెట్టి చర్యకును నరేంద్రుఁ డంగీకరింపఁడని ప్రెగ్గడ మౌనము వహించెను. సోదరుని యనారోగ్యవార్త నరేంద్రుని బాధించినది.

సహజశోభా విరాజమానమగు దక్షారామాలయము వివాహాలంకరణము లతో ద్విగుణీకృత కళ్యాణవైభవ సందీప్తితో సర్వజనాకర్షణీయమైనది. వైవాహిక కలాపమునకుఁ బూర్వము నరేంద్రుఁడు భీమనాయక పూజా నిబద్ధ బుద్ధి యాయెను. తదాలయ సంబంధ గాథలన్నియు నప్పుడాతని మానసమున మసలినవి.

తనవంశీకుఁడు చాళుక్యభీమరాజు శిథిలాలయమును సముద్ధరించి కళా శోభఁ జేకూర్చెను. ఎన్నియుగములనాఁటి దీపవిత్రాలయము. మహావిష్ణువు

వీరభద్రునినుండి తన సుదర్శన చక్రమును సంపాదించుటకు భీమనాయకుని సహస్రాంభోజములతోఁ బూజించెను. ఆసమయమున కడపటి పద్మము కానుపింపక, కడకు తన కమలనేత్రమునే కానుకగా నర్పించెను. అనంతరము నారాయణాంశ సంభవుఁడగు వ్యాసుఁ డాతని జ్ఞప్తిఁ గెలయించెను. అశేష కైవల్య కళ్యాణ ఘంటాపథమగు కాశీనగరీలలామమునకు శాపమిచ్చి, పరమే శ్వరుని యాగ్రహమునకు గుఱియై, దైన్యముతో కాశీపట్టణపు పొలము వీడి వచ్చు నా దీనమూర్తిని తలఁచినంతనే నరేంద్రునిగుండె జలదరించెను. అట్టి విజ్ఞానవేత్త నావరించుటలో భీమనాయకుఁ డౌదార్యమును బ్రకటించెనని యానందించెను. ఇంతలో మాతృదేవి కుందవాంబ కనుపించినది. ఆమె తన శివరాత్రి దీక్షయు, జ్యోతిర్దర్శనమును, నరేంద్రుని గర్భప్రవేశము నొక సమయ మునవే యని జెప్పినది. అవి యన్నియు స్మరించి నరేంద్రుఁడు పులకితగాత్రుఁ డాయెను.

సకల బంధుజన పరివార సమక్షమున అమ్మంగదేవీ నరేంద్రుల వివా హము వైభవోపేతముగ జరిగినది. కుందవాంబ పరమాశ్చర్యమిట్లు ఆమె విశ్రమించిన సమయమున జరుగుటలోని విధివైచిత్ర్య మందఱకును విస్మయ మనిపించినది. వివాహము పూర్తియైనది. తన జన్మ సార్థకమైనట్లు దేవతాత్ముఁ డగు రాజేంద్రచోళుఁడు భావించెను. ఆ విప్రఘోష స్వర్గమందున్న కుంద వాంబకు కూడ వినిపించియుండును. చీడమార్యుఁడును విపులార్థవంతములగు వైవాహిక మంత్రములఁ బఠించి యర్థమును వివరించెను. భారతీయ ప్రణయ తత్త్వ రహస్యమును, లౌకికాలౌకిక మహాకవుల కావ్యముల నుదాహరించుచు నన్నపార్యుఁడు గంభీరోపన్యాస మొసఁగెను. ఆ వాగ్విపంచీనినదములకు ముగ్ధులు గానివారు లేరు. ఈ సమయమున తన నోటివెంట ఎప్పుడో వెలువడిన "శ్రీ వాణీ గిరిజాశ్చిరాయ దధతో" అను శ్లోకమును నన్నయభట్టారకుడు పఠించెను. వధూవరులు, స్త్రీ పుంసయోగమును బూని, పురుషోత్తమాంబుజభవ శ్రీ కంధరులవలె ఉత్తమ గృహస్థాశ్రమ ధర్మ నిర్వహణము కావింపవలయు నని; కర్మానుష్ఠానపరులు కావలయునని, నన్నయ భంగ్యంతరముగా అవైదిక మతములలో ప్రబలిన సన్యాస జీవిత విధానమును ఖండించెను. 'మీ సాహిత్యము నకు వేద పవిత్రత, ఉపనిషదర్థ గౌరవము గలద'ని సభాముఖమునఁ జీడమార్యుఁ డభినందించెను. 'నానారుచిరార్థ సూక్తినిధుఁడ'ని కొందఱు కొనియాడిరి.

అనాఁటి సాయంకాలమున నారాయణభట్టు భీమపురాణమును బ్రవచిం చెను. పౌరాణిక శ్లోక పఠనాకౌశలము నారాయణభట్టునకు లేదు. భీమన కవి

పుత్రుఁడు చేతనభట్టు శ్రుతిహితముగా పఠింప, నారాయణభట్టు గంభీరముగ వ్యాఖ్యానించెను. వ్యాస నిష్కాసన ఘట్ట మప్పటికి పురాణము మిక్కిలి రక్తిఁ గాంచినది. "పుణ్యము తమ కరతలామలకముగదా యను నహంకృతితోఁ గాశివాసులు భారతీయ విజ్ఞానాఖండమూర్తియగు వ్యాసభగవానుని యవమానించిరి. వ్యాస నిష్కాసన ఘట్టమున నొక పరమరహస్యము కలదు. ఔత్తరాహు లాతని నుపాసింప సమర్థులుకారు. మేధాసంపదకన్న, హృదయబలము వారి కధికము. ఆంధ్రులు మేధాహృదయముల మేటికలయిక కలవారు. వ్యాసుఁడు నట్టివాఁడే. అందువలననే యాతఁడు భారత భాగవతములు వ్రాయఁగల్గెను. అట్టి వ్యాసుని తత్త్వమును పూర్ణముగా నుపాసింపగల ధీమంతులాంధ్రులే. తద్రహస్యమెఱిఁగిన యమృతేందుమౌళి, యీ నెపముతో ఆతని నీ దక్షిణ కాశీపురమునకుఁ బంపియుండును. ఈ సప్తగోదావర మాతని నిత్యాఘమర్షణ స్నాన విధానమునఁ బూతమైనది. అవైదికమతానురక్త మగుచున్న యీ వేంగిభూమిని పునఃపూత మొనర్పవలయునన్న. తుల్యభాగ జలస్నాన పరిపూతుఁడే యర్హుఁడు. ఆ మహనీయుఁడే యీ వేంగిదేశమునకు మహోదయ మొనగూర్చును." ఇట్లుద్వేగుఁడై నారాయణభట్టనేక రహస్యములను వెలార్చెను. ఆతని వచనములలో దివ్యసందేశ సౌదామిని నరేంద్రుని నేత్రాంచలములను విస్ఫారిత మొనర్చినది. నారాయణభట్టారకున కీ వేంగితలముపైగల యభిమానమును నరేంద్రుఁ డర్థము చేసికొనెను. అతఁడు కారణజన్ముఁడని సంభావించెను. నారాయణభట్టు భావుకత నన్నపార్యునకుగూడ నుపాదేయము. కొంద ఱాతని వచనములలోని లక్ష్యార్థమునే గుర్తింపఁజాలకపోయిరి.

నవ దంపతులు పురాణశ్రవణానంతరము భీమేశ్వరస్వామిని సందర్శించిరి. శివుఁడు భీమరూపముతోఁ ద్రిపురాసురుని సంహరించి, వాఁడు పూజించు శివలింగము నైదు ముక్కలు గావించి, వానిని పంచారామములయందు ప్రతిష్ఠించెనని, అందీ ప్రతిష్ఠయొకటి యని నరేంద్రుఁడు అమ్మంగదేవి కెఱిఁగించెను. అట్టి యీ లింగాభిషేక నిమిత్తము గోదావరి సప్తవేణికలుగా నిటకుఁ బ్రవహింపఁజేయఁబడె ననియు నాతఁ డెఱిఁగించెను. తొమ్మిది యడుగుల యెత్తుగల యీ మహాజ్యోతిర్లింగమును జూచి యమ్మంగదేవి యబ్బురమందినది. గర్భాలయము చీఁకటిమయముగ గోచరించినను, ప్రదక్షిణము గావించునపుడు కుడ్యగత మణి మరీచికల వెల్గామెకు విభ్రమము గొల్పినది. ఆ మహాలింగమందొక యద్భుతము కలదు. దక్షిణభాగము పరుషముగను, వామభాగము మృదువుగను నుండును. ఇది యర్ధనారీశ్వరత్వ మని నరేంద్రుఁ డమ్మంగదేవికిఁ దెల్పెను.

అమ్మంగదేవి : పురుష హృదయము పరుషమైన, మీ హృదయ మతి మృదువుకదా !

నరేంద్రుఁడు : అవును. 'వజ్రాదపి కఠోరాణి, మృదూని కుసుమాదపి' యనినాఁడుగదా మా భవభూతి.

అమ్మంగదేవి : భవభూతి సంస్కృతమహాకవికదా ! అయిన మా భవభూతి యందురేమి ?

నరేంద్రుఁడు : ఇందులకు రెండు కారణములు కలవు. భవభూతి యీ పవిత్ర వేంగీదేశమునకుఁ జెందినవాఁడు. సంస్కృత కవులను మే ముపాసించి నట్లు మఱే జాతియు నుపాసింపదు. అందుచే మాకా స్వాతంత్ర్యము సహజ లబ్ధము.

అమ్మంగదేవి చిన్నగా నవ్వినది. సమీప శిలాస్తంభమునఁ గల వ్యాస విగ్రహమున కిరువురు తీర్థముపోసి బిల్వపత్రములను సమర్పించిరి. పెద్ద నందీశుని విగ్రహమును జూచి యమ్మంగదేవి ప్రదక్షిణించినది. వాయువ్యదిశ యందుగల ఉయ్యాల మంటపమును, దక్షిణమునందు కప్పుపైగల యింద్రసభ, యమ చిత్రగుప్తుల శిల్పములను దివిటీల వెల్గులో నా నవదంపతులు వీక్షించిరి.

ఆ రాత్రి యంతయు నరేంద్రునకు సరిగ కునుకుపట్టలేదు. తుల్యభాగాతీర బిల్వవనాంతరమునఁ బరాశరనందనుఁడు, జైన సుమంతాది శిష్యబృందముతో నాతనికిఁ గానుపించెను

౨౩

అమ్మంగదేవి శుద్ధాంతమునఁ బ్రవేశింపగా నపర కుందవాంబాదేవి ప్రవేశించినట్లుండెను. కుందవాంబాదేవి సద్గుణ పుంజము, నిష్ఠాగరిష్ఠత, యామెయందు రూపుదాల్చినవి. పరిచారిక లందఱు నమ్మంగదేవి సద్గుణౌఘమును నోరారఁ బ్రశంసించుకొని ముచ్చటపడుచుండిరి. ఆమె కచిరకాలముననే తెనుఁగుభాషయందు బరిచయ మేర్పడెను. రాజరాజనరేంద్రునితో తమిళము మాటలాడుట మానివేసినది. నరేంద్రుఁ డమ్మంగదేవిని తమిళమునఁ బ్రశ్నించును. కాని యామె తెనుఁగుననే సమాధాన మిడును.

నన్నయభట్టారకునితో నమ్మంగదేవికి చక్కని చను వేర్పడినది. భట్టారకున కామెతో సంభాషణ మొక రసవత్తర కావ్యపఠనమువలె నుండును.

ఆమె ముమ్మూర్తుల కుందవాంబాదేవి. అందుచే కుందవాంబతో మాటలాడు చున్నట్లే నన్నయభట్టు తృప్తిఁజెందును. ఆమెకు రాచఱికపు ఠీవికలదు, కాని నిక్కు లేదు. పరిచారికనుగూడ హృదయముతోఁ బలుకరించును. అమ్మంగదేవి నన్నపార్యునిలోనే కాక యాతని యర్ధాంగి యజ్ఞేశ్వరీదేవితోడను బరిచయ మొనర్చుకొన్నది. యజ్ఞేశ్వరీదేవి సాత్త్విక సౌందర్యమూర్తి కమ్మంగదేవి యంజలించుచుండెను. ఆమెను నిత్యము సందర్శింపవలయునని దేవి కౌతుకము. నన్నయభట్టారకుని యింటిలోనే యమ్మంగదేవి యొక దీనమూర్తిని గాంచినది. ఆమె గుండె ఝల్లుమన్నది. ఆమె నట్లు గావించిన విధాత దారుణ కృత్యమును దూషించినది. ఆమెతోఁ బరిచయము గావించుకొని క్రమముగా చెలిమి గావించుకొన్నది. ఆమెయే కుసుమాదేవి.

కుసుమాదేవి యంతఃపురమేగి యమ్మంగదేవితో బ్రొద్దుపుచ్చుచుండెను. అమ్మంగదేవి తాను తమిళమున వ్రాసిన గేయములను జదివి యర్థవివరణము గావించును. కుసుమాదేవి వివిధ కర్ణాటక కావ్యభావముల నమ్మంగదేవి కెఱిఁగించును. దేవీసౌజన్యము వలన నప్పుడప్పుడు యజ్ఞేశ్వరీదేవికూడ యంతఃపురమునకు బోక తప్పినదికాదు.

అదివఱకు రాజరాజనరేంద్రుఁడు వేంగిరాజ్యమున కొక ధర్మకర్తగ మాత్రమే యుండెను. అందుచే నాతనికి తానాశించినంతగాఁ గార్యములు నిర్వహించుటకు వెనుకంజవేసెడివాఁడు. వర్ణాశ్రమధర్మ వ్యవస్థను బునరుద్ధరించుటకు, సప్తసంతాన నిర్మాణమునకు, భూరిదానములకు తాను సామంత నృపాలురనుండి సంపాదించిన ధనమేగాక కోశములోని మూలధనములో నైదవవంతు వ్యయపఱచెను. ప్రజలు తనపట్ల జూపుచున్న భక్తిప్రపత్తులను బురస్కరించుకొని, తాను సర్వాధికారియైన పిమ్మట నరేంద్రుఁడు వివిధములగు సుంకములను విధించెను. అల్పానల్ప వ్యాపారములకు క్రీడారము, కిరుకులమను పన్నులను మోపెను. భూములను పట్టిపోయినవని, బీడులని, సాగుభూములని త్రివిధములుగ విభజించి సిద్ధాయము, అపేండము, అభినవమను పన్నులను విధించెను. కరణములు, మహాకరణములు, పడ్దీవ్యవహారి, భండారియను వివిధ గ్రామోద్యోగుల నేర్పాటు గావించెను. దక్షిణ రాజ్యములందువలె గ్రామ పంచాయతీలను, నగర మహాజన సంఘములను, జానపద సంఘములను సంస్థాపించెను. ఇతఃపూర్వము సామంతరాజ్య వ్యవహారములలో వేంగీపతులు జోక్యము కల్గించుకొనెడివారు కారు. అందుచే వారి పాలనములోని ప్రజలు మిగుల పీడింపఁబడుచుండిరి. నరేంద్రభూపతి యట్లుకాక, తా నాశించిన సుస్థిరపరిపాలన విధానమును దేశమందంతట నమలుజరిపెను.

అతివృష్టి, యనావృష్టి బాధానివారణమున కొక ప్రత్యేకనిధి నేర్పఱచెను. మార్గాయాస పిపాసువులకు ప్రపలను నిర్మింపఁజేసెను. సారవంతములగు ప్రదేశముల కసారములగు జనపదములకు మార్గములు వేయించెను. ఉచిత వైద్యశాలలు, ధర్మ సత్రములు, విద్యాలయములు నేర్పాటు గావించెను.

రాజరాజ నరేంద్రదేవుఁడు మహాపండితులగు నగ్రజన్ముల కనుగ్రహముతో చారుతర మహాగ్రహారములిచ్చుచు, వారిచే బురాణాది సత్కాలక్షేపములు, యజ్ఞయాగాది క్రతువులు వివిధ గ్రామములందు జరిపించుటకు దోహద మొసఁగెను. పండిత పరిషత్తులకుఁ దగు వసతుల నొనగూర్చెను. ప్రజలు వారివారి యభిరుచులను బట్టి యిష్టదేవతారాధనము గావించుకొననగును. 'గ్రామ ద్వాదశము' ను పద్ధతిని భూదాన క్రమమును నిర్ణయించెను. ఇందు పూర్వ మీమాంసా బోధకునకు, వేదాంతోపాధ్యాయునకు, యజుర్వేదోపాధ్యాయునకు, సామవేదోపాధ్యాయునకు, రూపావతార వ్యాకరణోపాధ్యాయునకు, పౌరాణికునకు, వైద్యునకు, మంగలికి, విషయవాదికి, జ్యోతిష్కునకు నొక్కొక్క భాగము వచ్చును. ఇట్టి సుస్థిర పరిపాలనము కారణముగా ప్రతిగ్రామము దివ్యసీమగ మారినది. ప్రజలు నూత్నమగు తేజస్సును, ఓజస్సును సముపార్జించుకొనిరి. జ్ఞానేశ్వరీవ్యాఖ్యాన సహితమగు యాజ్ఞవల్క్యస్మృతి సమస్త ధర్మ నిర్మాణమునకు నాధారమైనది.

వృద్ధుఁడగు వజ్జియప్రెగ్గడ కీ ధర్మసంస్థాపనము మహానందము కల్గించెను. ఇట్టి మహోదయమును తన జీవిత కాలముననే సందర్శింపఁ గల్గినందుల కాతఁడు నరేంద్రదేవు నభినందించెను. ఇది యొక మహోదయము కాదని, కేవల పునరుద్ధరణము మాత్రమే యనియు, ఆర్యధర్మమును దానింకను ప్రజా హృదయమునకు గొనిపోలేకుంటిననియు నవీనయుగప్రభువు ప్రత్యుత్తరమిడును. ఆ జవాబులో నొక యారాట మంతర్గతముగా ధ్వనించును. అది కేవలవినయము కాదు ఈ యావేదనము ప్రభువునందు నానాఁటి కధికమగు చుండెను. తానింతవఱకు సాధించిన విజయ మేమాత్రము లేదని యాతని యతఃకరణ ముద్బోధించుచుండెను. ఆంధ్ర జాతీయాభ్యుదయము నాతఁడు సాపేక్షముగా సమీక్షించుండును. కర్ణాటకులప్పటి కెంతగనో యభివృద్ధి సాధించిరి. నారాయణ భట్టారకుని నిత్యము మధ్యాహ్నవేళల తన సౌధమునకుఁ బిలిపించి పంప మహాశయుని 'విక్రమార్జున విజయము' ను సావధానముగా నాలకించెను. పంపనిపూనిక ప్రశంస్యమే కాని యది కృష్ణద్వైపాయనముని వృషభాభిహితము కానందులకు నరేంద్రుఁడు విచారించెను. కర్ణాటక సాహిత్యముపై జినమత ప్రభావ మపారముగ ప్రసరించినది. అందుచే నా గ్రంథమాతని కంతగా

హితముకాలేదు. నన్నయభట్టారకుఁడు తన పట్టాభిషేక మహోత్సవావసరమున వ్రాసిన పద్యముల యపూర్వరామణీయక మాతని హృదయమున హత్తుకొనినది. నిత్యము నొకమారైన నా పద్యములఁ బఠించుకొని సంస్కృత శ్లోకములకుఁ గూడ లేని యా మాధుర్యమునకు ఆ యక్షర రమ్యతకు రాజరాజ నరేంద్రుఁడు పులకించు చుండును. ఇట్టి యక్షరరమ్యత నాంధ్రజాతి యాచంద్రార్క మాస్వాదించునట్లుగా నొక మహాకావ్యరచనము నొనఁగూర్పవలయునని ప్రభువర్యుని యుత్కంఠ. తన్మూలమున నీ యాంధ్ర విషయము నావరించిన యవైదికాజ్ఞానాంధకారము పటాపంచలు కావలయునని యాతని యాశయము.

పట్టాభిషేక మహోత్సవమున నన్నయ నోట తెనుఁగు పద్యములు వినినప్పటినుండి రాజమహేంద్రకవీంద్ర సమాజ సభ్యులకనేకులకు నన్నయపై కన్నెఱ్ఱగా నుండెను. నన్నయభట్టు కపటుఁ డనియు, పయోముఖ విషకుంభ మనియు, గీర్వాణ భాషాద్వేషి యనియు నేమేమియో పరుష భాషణములతో విష ప్రచారము గావించుచుండిరి. ఇట్టి వ్యతిరేకత వచ్చునని నన్నపార్యుఁ డూహింపకపోలేదు. పరులమానసము నుద్వేగపఱుచుటాతని మతముకాదు. అట్లని యెంతకాలము మిన్నకుండుట ? తన యభీష్టము నప్పుడప్పు డాతడు తన సహాధ్యాయుఁడగు నారాయణభట్టున కెఱింగించెను. నన్నయభట్టారకుని యభిమతమును నారాయణభట్టు, "స్వస్థాన వేషభాషాభిమతాస్సంతో రసప్రలుబ్ధధియః, లోకే బహుమన్యన్తే ప్రాకృత కావ్యానిచ అన్యపసహాయ" యను చింతామణి కారికయందే గ్రహించెను. తెనుఁగుపద్యరచన గావించి తీరవలయును, తెనుఁగుభాష సరస సాహిత్యస్థాయి నందితీరవలయుననియే నారాయణభట్టు తీర్మానము

రాజరాజనరేంద్రదేవుని వివాహాన తరము నన్నయభట్టారకుఁడు సూరి సభాంతరములకు హాజరుకాలేదు. అంతఃపురమునందే యాతఁడెక్కువ కాలమును గడపుచుండెను. అమ్మంగదేవికి సంస్కృతమును బోధించుచు తీరిక లేనట్లే నటించుచుండెను. నన్నపార్యుని వెన్నవంటి యెడద నారాయణభట్టునకుఁ గ్రొత్తదిగాదు. ఒకనాఁటి సాయంకాల మాతఁడు నన్నయభట్టారకుని తనతో పండిత సభకుఁ గొంపోయెను. "నారాయణభట్టు నరేంద్రులకుఁగూడ కర్ణాట భాషాబోధనము గావించుచున్నాఁడట. ఆతని వలననే గీర్వాణ భాషా సుకవీశ్వరుఁడు నన్నపార్యుఁడు భ్రష్టుఁడై తెనుఁగు కైత సాగించుచుండెను. రాజులకు మేము గురువులముగదా ! మేమేమిచేసిన యవిచెల్లునను నహంభావ మీ మధ్యన నన్నయభట్టులో ముదిరిన"దని తీవ్రముగ సభ్యులు సంభాషించుకొను చుండిరి. ఈ మాటలు భట్టద్వయ మాలకించినది. నారాయణభట్టు నేత్రములు

చింతనిప్పులైనవి. భ్రుకుటి వికటమైనది. ఒడలుబికినది. నన్నయకీ యుద్రిక్తత కంపము గల్గించినది. అతడు ఊఁ గొట్టిన గీర్వాణ భాషాధిపుల బుట్టలు గిల్లుమనెడివే. కాని యది మాననీయ విధానముగాదు. ఏ కావ్యమునకైనను పండితామోద ముండవలయును. ప్రజలు సామాన్యులు. వారికి కళాదృష్టి తక్కువ. వారికి కావలసినది కథ మాత్రమే. అందువలననేగదా, "ఆపరితో షాత్ విదుషామ్, నసాధుమన్యే, ప్రయోగ విజ్ఞానమ"ని నాఁడు కవికుల గురువు; అని యొక్కని మేషము నన్నయభావించి నారాయణభట్టునకు నచ్చఁ జెప్పి, తన సదనమున కేఁగెను. పండితులు వీరువెనుక నున్నారని తరువాత దెలిసికొని చక్కఁగా పరాభవించితిమని సంతోషించిరి.

రాజరాజనరేంద్రుఁడు నన్నపార్యునకుఁ గల్గిన యీ పరాభవ విషయ మును విని చాల బాధపడెను. పండిత మానసములింత పరుషముగా నుండు టాతనికి విచిత్రముగఁ దోఁచినది. దేవభాషాపదజాలముతో సమృద్ధమగుచున్న దేశభాష లెట్లపవిత్రములైనవో నరేంద్రునకు బోధపడలేదు. వీరు దేశ కాల పాత్రములను గుర్తించరు. సాంఘిక ప్రయోజనముల గుర్తింపరు. వీరెల్లపుడు "పవిత్రము, పవిత్రమ"ను మాటలతో సాముజేయుదురనుకొని వేంగీపతి యావేదించెను. వీరి హృదయములలోఁ బరివర్తనమును దేవలయును. ప్రజా క్షేమము నందాసక్తి గల్గింపవలయును. అందులకై ముందుతాను ప్రజల యభి ప్రాయములను స్వయముగ పరిశీలింపవలయునని వేంగీశుఁడు చింతించెను. తాను ప్రవేశపెట్టిన పరిపాలనా విధానముపట్ల ప్రజల యుత్సాహమెట్లున్నదో; తానొక గోపాలుని వేషము ధరించి జనపదముల సంచరింపవలయునని సంక ల్పించెను. రహస్యోద్యోగిని బిలిపించి, గోపాలుని వేషమును ధరించెను. ఉద్యోగి నిష్క్రమించినాఁడు. ఆ సమయముననే యమ్మంగదేవి గదిలోనికి వచ్చినది. ఎవరో ప్రాకృత మానవుఁడంతిపురమునఁ బ్రవేశించెనని భీతచిత్తయై పరిచారికలను బిలువమన్న సమయమున నరేంద్రుఁడు పకపక నవ్వెను. స్వరమును బట్టి యమ్మంగదేవి గుర్తించి, ప్రచ్ఛన్నవేష సౌందర్యమునకు విస్మయమందినది. దాని యవసరమును గుర్తించి, యమ్మంగదేవి తానుగూడ నట్టివేషముతో రాజు ననుసరింతునని కోరినది. ఇరువురచ్ఛముగా గొల్లదంపతు లైనారు. కొన్ని కపిలగోవులను దోలుకొనుచు రాజదంపతులు గ్రామసీమల యందు సంచారముచేయ నారంభించిరి.

రాజదంపతులు జానపదజీవిత సహజ సౌందర్య సంపదనంతయు ననుభవించి యానందించిరి. పచ్చికబీడులలో నాలమందలను దోలి స్వేచ్ఛాంబ రముల క్రింద, హాయిగ గడ్డిగోయుచు, పాటలు పాడుకొనెడి తెనుఁగు

పడుచులను జూచి నరేంద్రుఁడు సమ్మోద భరితుఁడాయెను అమ్మంగదేవి వారిని బలుకరించి స్నేహము గావించుకొని, పాలకులను, గ్రామోద్యోగులను గూర్చియు, నమాయికముగ బ్రశ్నించెడిది. "నారయ్యగారంట! చల్లని పెబువులు!! కులగోత్రాలు లేకుండ తెల్లగుడ్డలు కట్టుకొన్నాళ్ళ యెంబడి పడిపోయే వాళ్లకందఱికి బువ్వపెట్టాడ"ని కొందఱు నరేంద్రుని పొగడుచున్నప్పు డమ్మంగదేవి తన జీవితేశుని జీవితము ధన్యమనుకొన్నది. గ్రామములలో బెక్కు రచ్చలలోఁ బ్రజల చర్చలను నరేంద్రుఁ డాలించెను. ప్రజలకు వర్ణాశ్రమ ధర్మనిర్వహణమునం దాసక్తి గలిగినట్లాతఁడు గుర్తించెను. అనేక స్థలములలో గ్రామీణులిట్లు ముచ్చటించుకొనుట విన్నాఁడు నరేంద్రుఁడు---

ఒకరు: ఇంకా మనకద్దంగాని జాసలో బాపనయ్యల పురాణాలేమిట్రా బాబూ!!

ఇంకొకరు: ఓరో! పెద్దపెద్ద కవులుంటారుకదరా! మన నారయ్య పెబువులకాడ, మన బాసలో రాయించకూడదంట్రా మన పెబువులు!!

మఱియొకరు: బాపనయ్యలు రాయద్దంటారా!! ఓరే! రాయిస్తాదులేరా! దమ్మరాజా; ఇప్పుడేగా దండం చేతికొచ్చింది? దానికొక్కాలంరావద్దంటరా!!

ఇంకొకరు: ఒరే! బాపనయ్యలు రాయనీరులేరా!! మన కద్దంగాకుండుటమే వాళ్లకు కావలసింది.

ఇట్లింకేమేమియో మాటలాడుకొనిరి. ఎట్టి కల్మషమును లేక ఈ రీతిని మాటలాడుకొనుచున్న ప్రజాసమూహమును నరేంద్రుఁడు శ్రద్ధగా నాలించెను. ప్రభువు ప్రజాళికిఁగల మాతృభాషాభిమానమునకుఁ బరమానంద భరితుఁడాయెను. వారి ముద్దు చెల్లించుట కెట్టి యిడుములనైన గుడుపవలయునని నరేంద్రుఁడు నిర్ణయించుకొనెను. నరేంద్రుఁడట్టి యభిప్రాయములనే పలుప్రాంతములందు వినెను.

నరేంద్రుఁడీ ప్రచ్ఛన్నరూపము తోడనే పౌరాణికుల పురాణప్రవచనములనేకము లాలించెను. అందు సంస్కృత శ్లోక భావములు సమగ్రముగ వివరింపఁ బడుటలేదు. శ్లోక పఠనకాలమంతయు ప్రజలకేమియు తోఁచదు. పౌరాణికులకు జగద్ధిత బుద్ధి యలవడలేదు. ధర్మప్రచారతత్పరత, తదుత్సాహము వారిలో శూన్యముగ నున్నది. అందువలననే యార్యమతము తుషారావృత శీతమయూఖుని వోలెనున్నదని నరేంద్రుఁడు చింతాభార వివశుఁడాయెను. పల్లె పల్లెను, వాడవాడను, సామాన్యప్రజలు దివిటీలు వెల్గించుకొని, పర్వత పదములు, వెన్నెలపదములు, గొబ్బిపదములు, నివాళిపదములు గానటబీసటగా పాడి వినిపించుకొనుచుండిరి. ఆ జానపద సాహిత్యమునందు జాతీయచైతన్య శక్తి వెల్లివిరియుచున్నది. ఈయుత్సాహము కేవలము తాత్కాలికమై. తుషార

ఫేనములట్లు నశించరాదు. లోకధర్మి, నాట్యధర్మి మిశ్రితములు కావలయును. దేశి మార్గ లేకము కావలయునని నరేంద్రుఁ డనేక దీర్ఘాలోచనములను గావించెడివాఁడు. దేవియు ప్రాకృత స్త్రీజనములందలి యభిప్రాయములను సేకరించినది. బ్రాహ్మణులు వేదమంత్రములను స్త్రీలు వినరాదని యూరకుగ తరుముచుండిరి. ఉత్తమ సంస్కారమును బొందవలయునని ప్రజలందఱకు నావేదనముగా నున్నది. అట్టి సంస్కారమును సనాతనమత మొసఁగకున్నచో, వారన్యమత ప్రచారములకు లోనుగాక తప్పదను నభిప్రాయము రాజదంపతు లిరువుర కేకముగా నేర్పడినది. వారముదినములిట్లీ రాచజంట, రాయంచజంటవలె జానపద కాసారములయందు స్వేచ్ఛగా విహరించినది. అంతఃపురములో నందఱు రాజదంపతులను గూర్చి గుసగుస లాడుకొనిరి. వా రెందేగినది యెవ్వరికిని దెలియకుండెను. వజ్జియప్రెగ్గడ, భట్టారక ద్వయము ప్రభు పర్యుని పద్ధతులు శుభోదర్కమని సంభావించిరి.

* * *

ఒకనాఁడు సుప్రభాతమున రాజరాజనరేంద్రుఁడు వేంగీదేశములోని శిల్పులనందఱ నాహ్వానించుచు చాటించెను. విద్యావిలాసగోష్ఠి కనుకూలమగు సుందర భవనరాజము నొకదానిని దివ్యకళాసంశోభితముగ నిర్మింపవలయునని నరేంద్రుని యాశయము. పండితసభకొక యందమగు మందిరము కావలసి యున్నది. విద్వాంసులు తుల్యభాగాతీరమున రమణీయారామములలో తమ గోష్ఠికలాపములను నిర్వహించుకొనుచుండిరి. వీరినందఱ నొకచో సమావేశ పఱచి వారి కృషిని జగద్ధితముగా సమకూర్చవలయును. వారితో నిత్యసన్నిహితత్వ మొనగూర్చుకొనవలయునని రాజరాజ నరేంద్రుఁడు సంకల్పించెను.

దేశములోని శిల్పులందఱు రాజమహేంద్రవరమున సమావేశమైరి. నరేంద్రుఁడు వారలను కలిసికొని మహాసభా భవన మెట్లుండవలయునో వివరించెను. సహస్రాధికముగ సభ్యులు గూర్చుండుటకు స్థలముండవలయును. ఒక కుడ్యమున చంద్రవంశమున నఖండ కీర్తిని సముపార్జించిన పాండవ పౌత్త్రముల చరిత్ర చిత్రింపఁ బడవలయును. మఱియొక భిత్తికపై చాళుక్యవంశ శిఖామణుల చిత్రము లుండవలయును. ఎదురు గోడపై హరవిలాస గాథ లిముడ్చఁ బడవలయును. భవన మత్యంత త్వరితముగఁ బూర్తిగావలయును. ఇంకను శిల్పులవసరమైన చోళరాజ్యమునుండి పిలిపించవచ్చునని నరేంద్రుఁడు శిల్పుల నాదేశించెను. సుముహూర్తమునందు నారాయణభట్టుచే భవన శంకు స్థాపనము గావింపఁబడెను.

౨౪

త్యాగీశానందుని నిర్యాణానంతరము త్రికాలయోగ సిద్ధాంతదేవుఁడు వీర

విజయాదిత్యుని మిక్కిలిసన్నిహిత మొనర్చుకొనెను. వేంగీదేశమున రాజరాజ నరేంద్రుని పరిపాలనములోని ప్రశాంత పరిణామములను జినస్వామి యెప్పటి కప్పుడు శ్రద్ధగా గ్రహించుచుండెను. నరేంద్రుని పరిపాలన దక్షత యాతనికి గనువిప్పు గల్గించినది. ఆంధ్రదేశ వాతావరణము నంతయు తాను క్షణములో మార్చకల్గినట్లాతఁడు భావించెను. విమలాదిత్యుఁడు సింహాసనమును త్యజించక, జినమతమును పోషించినచో, నఖిలాంధ్రమున జైనమతము స్వైరవిహారము సల్పెడిది. 'అర్హనంది' యను జినముని పూర్వము ఇమ్మడి అమ్మరాజు కాలమున సాధింపలేని ప్రాభవమును తాను సాధించెడివాఁడు. అట్టి మహా యోగము తల్లక్రిందులైనది. నరేంద్రుని దూరదృష్టి, లోకజ్ఞత, మూర్తిమత్వ మిందులకుఁ గారణము. ఎప్పటికైన నీతని యుద్యమమును భంగపఱుప వలయును. ఇందులకు మేడాంబా విజయాదిత్యులు దక్క జినస్వామికన్య లండదండ లేరు. విజయాదిత్యుని ఘనతను పెంపొందించుటకు జినస్వామి భీమకవి నాస్థానకవీశ్వరునిగా నియమింపవలయునని తలపోసెను.

శక్తిమంతుఁడగు భీమరాజు తన పదాతిబలమును బాగుగా సమీకరించెను. కుంతలములు, తోమరములు, బాణములు మున్నగు నానావిధాయుధము లసంఖ్యాకములుగ సిద్ధమొనర్చెను. మదవారణములను బట్టించెను. హస్తిబలము నభివృద్ధిగావించెను. ఏనుఁగులచే మద్యమును ద్రావించి, యుద్ధరంగమును గగ్గోలుగావించెడి నూత్నపద్ధతి నితఁడు శిక్షణమొనర్చెను. చాళుక్యపతికి కప్పము చెల్లించుట మాన్పించెను. రాజరాజనరేంద్రు నెదుర్చుటకుఁ గావలసిన శక్తిసామర్థ్యములను విజయాదిత్యునకు భీమరాజు సమకూర్చుచుండెను.

* * *

అమ్మంగదేవి వివాహానంతరము గంగైకొండ చోళ, రాజేంద్రచోళుఁడు యువరాజగు రాజాధిరాజునకు సమస్త రాజ్యభారము నప్పగించి, తాను వానప్రస్థాశ్రమమును స్వీకరించెను. రాజాధిరాజు, విజయరాజేంద్ర బిరుదముతో తాత తండ్రుల గౌరవమును ద్విగుణీకృత మొనర్చు సమర్థుఁడు. అతఁడు నిరంతరాహవ కేళీ తత్పరుఁడు. దక్షిణహిందూదేశము నంతయు తన యేకచ్ఛత్రాధిపత్యమునకుఁ దేవలయునను నాశయము గలవాఁడు. తద్వాంఛా సిద్ధికిగా నాతఁ డశ్వమేధయాగమును జేయదలపెట్టెను. ఒకపరి దక్షిణదిగ్విజయ యాత్రను గావించెను. పాండ్య, చేర దేశాధీశ్వరు లందఱును నాతనికి దాసోఽహమని, యమూల్యాభరణోపాయనముల నొసంగిరి. చోళేంద్రసంకల్పి తాశ్వమేధ వృత్తాంతమును జయసింహునికుమారుఁ డాహవమల్లును, గుంతల చక్రవర్తియు విని దానిని భగ్నమొనర్చుట కుపాయముల నాలోచించుచుండిరి. జయసింహుఁడు తన పరిపాలనాంత్యకాలమున సాపించిన కుంతల చాళుక్య

సంబంధముల నాహవమల్లుఁ డంతమొందించి, పూర్వవైరములను బున రుద్ధరించెను. ఇది శాంతికాముకుఁడగు రాజరాజనరేంద్రున కసహ్యమని పించినది. ఆర్యసంస్కృతి పునరుద్ధరణ దీక్షాదక్షుఁడగు నరేంద్రున కీ యాగర్భ శత్రుత్వమున కర్థ మవగతము కాలేదు. ఎవరిరాజ్యములు వారు పరిరక్షించు కొనుచు, సహజీవన భావములో, సంస్కృతి జీవనులై ప్రగతి నందవలయునని నరేంద్రుని యుదాత్తాశయము.

* * *

చోళపతి నిర్వహించెడి యశ్వమేధయాగమును భగ్నమొనర్చుట కాహవ మల్లుఁ డనేక కుటిల యత్నములను సల్పెను. క్రతు దీక్షితుఁడైన రాజాధి రాజునకు నరేంద్రుని సాహాయ్య మత్యవసరమైనది. బనవాసిలో నశ్వమును గుంతలపతి బంధింపఁజేసి, యాగమును విఘ్నమొనర్చుటకుఁ బన్నాగములను బన్నెను. నరేంద్రుఁడు కుంతలాధిపతి దుష్టచర్యలను ఖండింపఁబూని యాతనిపై దాడివెడలెను. ఇట్టి యదనెఱిఁగి వీరవిజయాదిత్యుఁడు హటాత్తుగ రాజమహేంద్రముపై దండెత్తెను. ఆశ్విక హస్తి పదాతి చమూనిచయమునకు భీమరాజు నాయకత్వము వహించెను. మేడాంబ జినస్వాములుకూడ నీ యాత్రలోఁ గలరు. చిరకాల వాంఛితమగు తమ మనోరథ మీడేరుచున్నందు లకు వారి యానందమునకు మేరలేదు.

రాజమహేంద్రవరమున యుద్ధవాతావరణమే లేదు. ప్రశాంత వైజ్ఞానిక వాతావరణ మప్పుడప్పుడే యేర్పడుచుండెను. సోదరుఁడు కప్పము చెల్లింప కున్నను నరేంద్రుఁడు మిన్నకుండెను. ఆ మంచితనమే యింతకుఁ గారణ మైనది.

వీరవిజయాదిత్యుని వాహిని రెండుయోజనముల దూరమునం దుండెనను వార్త వైద్యుతాగ్నివలె నగరమున వ్యాపించినది. వజ్జియప్రెగ్గడ నగరరక్షణము నకు సంసిద్ధుఁడాయెను. నారాయణభట్టు తానుగూడ నగరమును సంరక్షింతు నన్నాఁడు. కాని కుపమాదేవి యందుల కిచ్చగింపలేదు. నరేంద్రుఁడు లేని కారణముచే నేదైన యాపద సంభవింపఁ గలదని యామె భీతిల్లినది. అమ్మంగ దేవి నంతఃపురమునందు పరిరక్షింపుమని తండ్రిని ప్రబోధించినది. ఈ యాలో చనము నారాయణున కద్భుతమని తోఁచెను. కుపమను శుద్ధాంతమున కంపెను. అప్పుడే యేవో యశుభలక్షణములు పొడగట్టుటచే నమ్మంగ శివపూజకుఁ గడంగినది. కుపమ వచ్చుచున్న యాపదను నివేదించెను. అమ్మంగదేవి శీఘ్రముగ పూజ సంపూర్తి గావించి రక్షణోపాయము నన్వేషించినది. పూర్వము తాను గోపాలిక వేషము తాల్చినది. ఇప్పుడు నట్టివేష మేల వేయకూడ

దనుకొన్నది. తాను వేషము ధరించి, కుముదచే నట్లే ధరింపఁజేసినది. నారాయణభట్టును దదుచితమగు సాహాయ్యమును ధరించెను. ముువ్వురు నాల్గవ కంటి వారికిఁ దెలియకుండ నగరు వీడిరి.

*　　　*　　　*

రాజధాని పొలిమేరలో వజ్జియప్రెగ్గడ భీమరాజు నెదుర్కొనెను. వృద్ధుఁడగు వజ్జియలో వణకు ప్రవేశించెను. భీమరాజు నిండు జవ్వనమున నుండెను. మద్యపానమత్తములగు మదేభములు యుద్ధభూమిని కలయదిరుగుచు సైన్యమును వికీర్ణ మొనర్చుచుండెను. భీమరాజు పరాక్రమ మత్తతతో, కన్నుమిన్ను కానక, వజ్జియప్రెగ్గడను గతినోక్తు లాడెను. నిర్దాక్షిణ్యముగ నాతని నిశిత కరవాలముచేఁ దల యూడఁగొట్టెను. ఈ ఘోర హింసాకాండను వేంగీభట సందోహము చూచి సహింపలేకపోయినది. తన ప్రతి రక్తబిందువును వేంగీ రాజ్యప్రతిష్ఠా సంరక్షణమునకు ధారవోసిన ధీరుఁ డతఁడు. అవిరళ జపహోమ తత్పరుఁడు. నిరంతర నీలకంఠ స్తుతిపరాయణుఁడు. వజ్జియప్రెగ్గడ పవిత్ర దేహమును విప్రసైనికులు గొనిపోయి, ఉచితప్రదేశమున దహన మొనర్చిరి. యువక దండనాథులు, తమ యావచ్ఛక్తిని ధారవోసిరి. కాని ప్రయోజనము శూన్యము. విజయాదిత్యుని సేనానీకము నగరు ప్రవేశించినది. మంత్రిసర్వాధికారులను, పాత పరిచారకులను విజయాదిత్యుఁడు బందీకృతుల నొనర్చెను. తాను సింహాసన మాక్రమించెను. జినస్వామి, నానావనినాథ కిరీట మణివిరాజిత వేంగీ కిరీటము నాతని శిరమున నలంకరించెను. మేడాంబ తద్దృశ్యమును జూచి కనులకు కళ్యాణ మొనర్చుకొనెను. పూర్వము తనయం దపార భక్తి విశ్వాసములతో మెలఁగిన పురప్రముఖులను కలిసికొని విజయాదిత్యుని కన్ని విధముల తోడ్పడుడని కోరెను. వారేదో ముభావముగ నున్నట్లు జినస్వామి గ్రహించెను. రాజ్యతంత్రమునం దీయన కేల యింత యారాటమని నిరసించిన వారును గలరు. నన్నపార్యుఁడీ కాల విపర్యయము గల్గుటకు కొంతకాలము పూర్వమునుండి 'అగ్నిష్టోమము'ను యాగనిర్వహణమునం దుండెను. అతఁ డన్నింటి కా పరమేశ్వరేచ్ఛయే యని వచించును. ఆ ఆత్మస్థైర్య మట్టిది.

*　　　*　　　*

ఆహవ రంగమున నాహవమల్లు నమిత కష్టముతో నరేంద్రుఁ డెదుర్కొనుచుండెను. నరేంద్రుఁడు కేవల కావ్యగీతప్రియుఁడని మాత్రమే యాతని వినికిడి. నరేంద్రుని ధనుర్విద్యాకౌశలము పాండవమధ్యమునిఁ దలపించెను. ఆకర్ణాంతముగా నారి సారించి నారాచములు వదలుచుండ నవి యుద్ధభూమిని దారుణ మొనర్చుచుండెను. అంకయ్యభట్టు నరేంద్రుని బహిఃప్రాణము. ఇరువదియొక్క దివసము లవిచ్ఛిన్నముగ జరిగిన దీ ఘోరాజి. రాజధాని

నగరమునకు వాటిల్లిన యుపద్రవమును ప్రణిధులు నరేంద్రున కెఱిఁగింపవైరి. ఇరువదియవదినము మట్టమధ్యాహ్నమునకు రాజాధిరాజు తన యశ్వమేధ యాగమును బూర్తిగావించినట్లు వార్త వచ్చినది. ఉత్తర గోగ్రహణ రణ విజయధురీణుఁడగు విజయునివలె, వేంగి కోదండపార్థుఁడు రౌద్రోల్లసిత మూర్తియై, నానావిధ నిశిత విశిఖవ్రాతములను ప్రతిద్వంద్విని దుర్బలుని గావించెను. కర్ణాట సుభట సమూహము వెన్నిచ్చి పాఱిపోయెను. వెనువెత్తక నిల్చిన వారిని వేంగిసేనాధిపతులు నఱిఁగ నుఱుమాఁడి యంగకములను ఖండ ఖండములు గావించిరి. మఱునాఁడు తన ప్రయత్నము లన్నియుఁ జాళుక్యపతి వలన వ్యర్థమైనందులకుఁ జింతించి యాహవమల్లుఁ డన్యమార్గములేక యోటమి నంగీకరించి సంధి గావించుకొనెను.

ఇట్లు ఘోరాజి ముఖోపలబ్ధ విజయప్రమదాశ్రితుఁడైన నరేంద్రునకు తన సోదరుని దురాక్రమణ వార్త దుస్సహమగు నశనిపాతమువలె వినవచ్చెను. ఇంతకన్న వజ్జియప్రెగ్గడ మరణవార్త నరేంద్రుని మఱింత కలవర పఱచెను. భీమరాజు ఘాతుకకృత్యము నాతఁడు నిరసించెను. యువకుఁడు చూప వలసిన యాదర్శ మది కాదని తలంచెను. ఏకవింశద్దినసాహవ ప్రభూత ప్రయాస పరిక్లిన్నమగు సైన్యముతోఁ దిరిగి రాజమహేంద్ర వరమున యుద్ధ మొనర్చుట యసంభవము. అనుకొనుచున్నంతలో, అమ్మంగ దేవి శత్రువులపాలాయెనేమో యని రాజు కలవరపడెను. చాలని రాజులలో, నభిమానసహీనముగ భార్యపక్షమువారి సాహాయ్య మపేక్షింపరాదని నిశ్చయించు కొన్నాఁడు నరేంద్రుఁడు. ఆత్మగౌరవము రాజ్యపదవికంటె నరేంద్రుని దృష్టిలో నధికము. ఈ యసహాయస్థితిఁ జూడలేక దినమణి సైన్యమునఁ బశ్చిమాద్రిచాటున దాగెను.

౨౨

నారాయణభట్టారకుఁడు కుసుమా యమ్మంగదేవులతో బశ్చిమారణ్య సీమల కేఁగెను. ఆటవికు లాతని వాక్చమత్కారమునకు, తమపట్లఁ జూపు ప్రేమ గౌరవములకు సంతసిల్లి, దేవునివలె గొల్చుచుండిరి. నారాయణభట్టు వారలకు రామాయణ మహాభారత కథలేకాక, గుణాఢ్యుని బృహత్కథాంతర్గత కథలను ఆకర్షప్రకర్షలతోఁ జెప్పుచుండెను. బృహత్కథయందు వారెక్కువ మక్కువ చూపుచుండిరి. సాయంసమయములలో వారికి నూత్న యుద్ధకౌశలములందు శిక్షణ మొసఁగుచుండెను. వారి వినోదములతోఁ దానును వినోదించుచుండెను. అమ్మంగదేవిని కుసుమాదేవి కంటికి రెప్పవలె కాపాడుచున్నది. చోళమహారాజ పుత్రి, చాళుక్య పట్టమహిషి కిట్టి దురవస్థ వచ్చినందులకు కుసుమ లోలోనఁ

గుములుచుండును. అమ్మంగదేవి తన కేమియు విచారములేనట్లే యుండును. ఇది యొక నూతనానుభవమని, జీవితమునం దన్నిరుచులను జవిచూడ వలయునని యామె యభిప్రాయము. వాఙ్మయోపాసనముచే నిట్టి విస్తృత దృక్పథ మామె కేర్పడినది. నారాయణభట్టు తనకు తండ్రివంటివాఁడు. ఆయన సకల కళా హృదయము నవగత మొనర్చుకొనుట కిది మంచి యదనుగా నామె భావించును. ఆ కలుపుగోలుతనమును నారాయణభట్టు గొప్పగ ప్రశంసించును. అడవి నంతయు గాలించి, యమృతోపమానములగు ఫలములను గుపము సేకరించి యమ్మంగదేవి కిచ్చును. కుపమా యమ్మంగదేవు లిరువురు నాటవికులతో మెలఁగుచు, వారికి నాగరక జీవనమును నేర్పుచుండిరి.

రాజరాజ నరేంద్రుఁ డాహవమల్లుని జయించినట్లు నారాయణభట్టునకుఁ దెలిసి, యాతని పరాక్రమ మసదృశమైనదని భావించెను. వీరవిజయాదిత్యుఁడు రాజమహేంద్రము నాక్రమించిన విషయము నరేంద్రుఁడు తెలిసికొని, దీర్ఘ సమరమున దస్సి శేషించిన సైన్యముతోఁ జేయునదిలేక విచారించుచున్నట్లు కూడ నారాయణభట్టు వినెను. నరేంద్రుని విజయము అమ్మంగదేవికి శాంతి చేకూర్చినది. అచిరకాలమున చోళపతి సాహాయ్యమున తన పతి రాజధానిని సంపాదింపఁ గలఁడని యామె భావించెను. నారాయణభట్టారకుఁ డామె భావమును ఖండింపక యట్లే యనెను. కాని, కుపమతో నాతఁడు నరేంద్రుఁ డభిమానధనుఁడని, యీ పరిస్థితులలోఁ జోళుల నాతఁ డాశ్రయింపఁ డని పేర్కొనెను. కొంతకాలమట్లే కష్టముల ననుభవింపక తప్పదని వారు తలపోసిరి.

చోళ రాజాధిరాజు తన యశ్వమేధ యాగమును నిర్విఘ్నముగ పరిసమాప్తి గావించెను. విజయాదిత్యుని దౌష్ట్యము నాతఁడు గ్రహించెను. నరేంద్రుని వెంటనే చోళరాజధానికి రావలసినదిగ నాతఁ డాహ్వానించెను. ఆ దంపతుల వియోగమునకు దుఃఖించెను. తన సోదరిని గూర్చిన సమాచారము సేకరింపుఁడని యాదేశించెను.

నరేంద్రుఁడు చోళపతి యాహ్వానము నంగీకరింప లేదు. క్షుధార్తులైన సైనికుల నంకయ్యభట్టు చోళనగరమున కంపెను. తాను నరేంద్రునితో నడవులలో నుండుటకు సిద్ధపడెను, దండకారణ్యమున శ్రీరామచంద్రునిఁ గాపాడుచున్న లక్ష్మణునివలె, అంకయ్యభట్టు నరేంద్రుని కనిపెట్టుకొని యుండెను. నరేంద్రునకు రాజ్యహీనత యేమంత బాధాకరముగ లేదు. కృతక నాగరక జీవితముకన్న జానపద జీవిత మాధుర్య మాతఁ డాస్వాదించి, తనివి జెందుచుండెను. అట్టి యవకాశము మఱియొక్కమారు లభించినదని యతఁడు

సంతృప్తిఁ జెందెను. రాజ్యలక్ష్మి వియోగముకన్న నాతనిని బాధించున దాతని యర్ధాంగ లక్ష్మి వియోగము. ఏకాంతమునం దాతఁడా పవిత్ర చరిత్రను భావించి, యామె సాత్త్విక సౌందర్యమును ధ్యానించుచుండును. రమణీయప్రకృతి దృశ్యావలోకనము వలనను, రమణీ రమణీయ సంస్మరణము వలనను ఆతని లోని భావన యుప్పొంగగా నప్పుడప్పుడు పద్యము లల్లుటకు యత్నించును. తాను భోజరాజువలె మహాకావ్య నిర్మాత కాలేకపోయినందులకు వగచును. నన్నయభట్టారకుని స్మరించును. ఆతని పద్య రామణీయక మమోఘమైనదని పట్టాభిషేక పద్యములను లోలోనఁ జదువుకొనును. అట్టి పట్టాభిషేక మింతలో నిట్టి ఫలితమునకు దారితీసినందులకు ఖేదించును. నన్నపార్యునివంటి యాత్మ శక్తి సంపన్నుని యాశీర్వచనము వృథచనదని మఱల ప్రత్యయము వహించును.

అంకయభట్టారకుఁడు తన పరిసరములందుఁ గల యాటవిక నివాసముల కేఁగి, నరేంద్రుని గుణసంపత్తిని, సోదరుని దౌష్ట్యమును వివరించెను. వారందఱు నరేంద్రుని కెట్టి సాయమైన నొనర్తుమని ప్రతినఁ జేసిరి. అంకయ్య శౌర్యము వారి కాదర్శమైనది. ఒకనాఁడు నరేంద్రుఁడు కాంతారమునందు విహరించుచుండెను. ఒక సింహ మడవిపందిని చంపుటకు వెంబడించినది. వరాహమును నిస్పృహతో సింహము నెదిరించి పోరుచున్నది. ఆటవికు లబ్బురపాటుతో నీ భయానక దృశ్యమును దిలకించుచుండిరి. అంతలో నరేంద్రుఁ డొకేసారి రెండు నిశిత నారాచముల సారించి యవ్వరాహ మృగేంద్రములను విగత జీవులఁ గావించెను. ఆ శరసంధాన కౌశలమునకు వనవాసులు నరేంద్రునకు మ్రొక్కులిడిరి. నాఁటినుండి యనేక ధనుర్విద్యా రహస్యములను నరేంద్రుఁడు వారికి నేర్పెను. పద్మవ్యూహరచనమునందు వారిని సుశిక్షితులను గావించెను.

ఇంతలో శివరాత్రి పర్వదినము సమీపించెను. ఒక్క పక్షముదినములు మాత్రమే వ్యవధి కలదు. ఎక్కడెక్కడి యాటవికులు, జానపదులు, జాతరలు సేయుచు శ్రీశైలస్వామిని సందర్శించుట కుత్సాహపడుచుండిరి. శివపూజా ధురంధరుఁడగు నరేంద్రునకు శ్రీశైల యాత్రాభిలాష కల్గినది. తానును వనవాసులతో బయలుదేరెను. తదనుకూలమగు వేషము ధరించెను. వారిలో లీనమాయెను.

దేశము నాల్గు మూలలను తెనుఁగుప్రజ మహోత్సాహముతో నీ యుత్సవములందు పాల్గొనుచుండెను. ఏ మజలీయందు చూచినను జానపదు లానందముగ ప్రభాత పదములు, తుమ్మెద పదములు, పర్వత పదములు, వెన్నెలపదము

లానంద పదములు, వాగీశు పదములు, గొల్లసుద్దులు, చిత్రాతిచిత్రమగు తోగలతు కన్నెగ కంఠములతోఁ బాడుకొనుచుండిరి. నరేంద్రుఁ డమితమగు శ్రద్ధతో వీని నాలించుచుండెను. నరేంద్రుఁ డే జనపద క్షేత్రమునఁ గూర్చున్నను, ఒక యపరిచితుఁడగు వ్యక్తి తన ప్రక్కనే పరిచితునివోలె కూర్చొనుచుండెను. కాని పలుకరింపఁడు. నరేంద్రుఁడును నతనిని బలుకరింపక, చూడనట్లు మిన్నకుండెను.

పెద్ద మజిలిలలోఁ దోలుబొమ్మలాటలు జరుగుచుండెను. ఇవి తెల్లవారు జామునను. సముద్ర మథనము, అంధకాసుర సంహారము, త్రిపుర విజయము, దక్షాధ్వర ధ్వంసాది యాటలనాడ, ప్రజలుత్కంఠతో సందర్శించెడివారు. హాస్య ఘట్టములు వచ్చినపుడు ప్రజల హర్షోత్కర్షము పరిదలవలె నుప్పొంగెడిది. ప్రహ్లాద చరిత్ర ఉషాపరిణయాది వీధిభాగవతములను గూడ నరేంద్రుఁడు శ్రద్ధాళుఁడై తిలకించెను. ఇట్టి సత్వస్ఫూర్తి, సాహిత్యహృదయము గలజాతికి స్వకీయ భాషలో నొక మహాకావ్యము వెలువడకపోవుటకు నరేంద్రుఁడు బాధ నందెను.

శివరాత్రి పర్వదినము రానేవచ్చినది. యాత్రికు లందఱను నరేంద్రుఁడు కలియఁదిరుగుచు వివిధ మానవ స్వభావములను నిశితముగఁ బరిశీలించు చుండెను. అక్కడక్కడ తాను తొలుత చూచిన వ్యక్తి కనిపించుచునే యున్నాఁడు. ఆతనివెంట నిరువురు స్త్రీలు కలరు. వారు స్ఫురద్రూపులుగ స్థూలదృష్టికే గోచరించిరి. వారెవరో తెలిసికొనవలయు ననుకొన్నాఁడు. మలుల తనకేలయని శ్రీశైలము నధిరోహించెను.

ఏదిక్కున ఆలించినను "హరహర మహాదేవ శంభో !!" యను నాదము లాకసమును జిల్లులు వఱచు చున్నవి. శరత్కాలచంద్రికా ధవళ కాంతిచ్ఛటల వెలిగ్రక్కు విభూతిరేఖలు సర్వఫాలభాగముల విరాజిల్లుచుండెను. వృద్ధులు, పంగ్వంధులు, పరమభక్తితో నంతటి పర్వతమునెక్కిరి. మతమున్న ప్రజలకుఁగల యావేశమట్టిది ! ఆ యావేశమును గ్రమబద్ధ మొనర్పవలయును. ఇట్టి యమాయిక ప్రజలను జినస్వామి తన మతమునకుఁ ద్రిప్పుకొనవలయునని యత్నించెను. ఎంత యత్నించినను సనాతన మత సంస్కారబలము ప్రబలమైనదని నరేంద్రుఁడు భావించెను.

ప్రచ్ఛన్నమగు నరేంద్రుని దివ్యరూపమును బ్రజలు చూచి యనిమేషులగు చుండిరి. వెంటనే యాతనికి దారినిచ్చుచుండిరి. రాచఱికము లేకున్నను దనకట్టి గౌరవము ప్రాప్తించు చున్నందులకు నరేంద్రుఁడు చకితుఁ డగుచుండెను. మల్లికార్జునస్వామి నాతఁడు సందర్శించెను. ఆ మహాదేవునకు, ఆ సగుణ

నిర్గుణ పరబ్రహ్మమునకు, భక్తిప్రపుల్లుఁడై సాష్టాంగపడెను. హిమాచలము నందలి గౌరీశంకరుఁడు, కాశ్మీరమునందలి మహాదేవుఁడు, రామేశ్వరము నందలి రామలింగేశ్వరుఁడు, మధురలోని సుందరేశ్వరుఁడు, కాశీ విశ్వేశ్వరుఁడు, సౌరాష్ట్ర సోమనాథుఁడు, శ్రీశైల మల్లిఖారునుఁ డొకరి తరువాత నొకరాతని ధ్యానవీధిని పరిభ్రమించిరి. భ్రమరాంబను జూచినంతనే యమ్మంగ దేవి జ్ఞప్తికి వచ్చినది. ఇఁక చూడలేకపోయెను. జ్యోతిర్లింగము నర్ధనిమీలిత నేత్రములతో వీక్షించెను. ఆలయ శిల్ప నిర్మాణ దక్షతను బరిశీలించెను. అందలి రామాయణ మహాభారత గాథలను బఠించుచు నట నిలిచెను. భారత కథఁ జదువుచు, పార్శ్వమునకుఁ జూచినంతనే తాను బరిశీలించుచున్న వ్యక్తి ముఖ కనిపించెను. ఆతనివెంట నాయిరువురు స్త్రీలును గలరు. తన్నుఁ జూడనట్లే యాతఁ డామహిళలకు భారతకథ వినిపించుచు, "పాపము చళుక్య పతి యెచటనున్నాఁడో? మహాభారతమన్న వారికి మహాభిమాన"మ్మాఁడు. ఈ మాటలు నరేంద్రుని బులకింపఁ జేసినవి. కంఠస్వరమునుబట్టి యతఁడు నారాయణభట్టని తలంచెను. సైన్యభావమంతలో నాతని నావరించినది. అచటు వాపి పోపలయు నముకొన్నాఁడు. ఇంతలో నంకయ్యభట్టు, నారాయణభట్టి వ్యక్తియని పనౌకసులు సెప్పిన వృత్తాంతమునుబట్టి గుర్తించివచ్చి యాతనికి నమస్కరించెను. ప్రక్కనున్న నరేంద్రు నాతఁడు నారాయణభట్టునకుఁ జూపెను. నరేంద్రుని యాకర్ణాంతనేత్రము లశ్రుపూరితములైనవి. వినమ్రుఁడై భట్టారకులకు వందన మాచరించెను. అమ్మంగదేవిలో లజ్జయు, దుఃఖము బెల్లుబికినవి. నరేంద్రుఁ డామెను జెంతకుచేసికొని యోదార్చెను. అందఱు ఆనందోత్సాహములతో మఱల మల్లికార్జునుని దర్శించిరి. నారాయణభట్టు తన సైన్యసమీకరణమును దెల్పెను. ఆతని యాత్మశక్తి, దేశభక్తి, ప్రభుభక్తి యసదృశమైనవని నరేంద్రుఁడు కృతజ్ఞతఁ బ్రకటించెను. రాత్రియంతయు వివిధ వినోద దర్శనములతో వారు కాలక్షేపము గావించిరి. నరేంద్ర నారాయణభట్టారకులు దేశీయ వాఙ్మయవిశిష్టతను దమ తమ పరిశీలనాంశము లాధారముగ నుగ్గడించుకొనిరి. అంకయ్యభట్టు చోళదేశమునకుఁ బయనించెను. అటనున్న చళుక్యసైన్యమునుగైకొని బెజవాడకు వచ్చును. నరేంద్రనారాయణులు తమ తమ శిక్షణలోని జానపద సైన్యనివహముతో నచట కలిసికొందురు.

* * *

వీరవిజయాదిత్యుఁడు నారాయణభట్టారకు నన్వేషించుటకు వెరవరులైన గూఢచారులను నియోగించెను. నరేంద్రుని విజయవార్త కతఁడు భయావహుఁ డాయెను. అతఁడు చోళదేశమునకుఁ బోవ తిరస్కరించెననిగూడ విజయాదిత్యుఁడు విని, యీ విషాదసమయమున నాతఁడు విరక్తితో, ముక్తికిఁ బ్రాకులాడునని విశ్వసించెను. ఆతనిని బట్టించిన, ప్రజలలో ఆందోళనము

చెలరేగునేమోయని సంకోచించెను. నన్నయభట్టారకుని దన యాస్థానమునకు రప్పింపవలయునని విశ్వప్రయత్నము చేసినది మేడాంబ. అతని యగ్నిష్టోమ దీక్షను విని మిన్నకున్నది. ఆతఁ డాసమయమునం దట్లుండుటయే యామె కభీష్టము, లాభదాయకము. జినస్వామి భీమకవి నాస్థానకవిగా నియమింప వలయునని యెంచెను. మేడాంబ యందుల కామోదించెను. తమ శత్రువు లందఱు నశించున ట్లాతఁడొక పద్యము సెప్పిన బాగుండును గదా యనుకొన్నది. భీమకవి జాడ తెలియుట కష్టమైనది. జినస్వామి యుక్తితో గాలించి యాతనిని రప్పించెను. ఆస్థానకవీశ్వర కిరీటము నాతని శిరస్సునను నుంచెను. ఇట్టి కిరీటము లాతనికి ముండ్లపొదల వంటివి. అతఁడు స్వైర విహారి. జినస్వామి స్వార్థపరుఁడని యతఁడు యోజించి గ్రహించెను. కాని తన తల్లిని బ్రతికించిన మహానుభావుఁ డతఁడు. అందుచే నాతని మాటను గౌరవింపవలయును. లేనిచో కృతఘ్నతయౌనని యాతఁడెంచెను. ఆతఁ డాస్థానముననున్న నాల్గునాళ్లు ఆంధ్రశబ్దచింతామణి ప్రతుల నన్నింటిని తన పలుకుబడి నుపయోగించి తెప్పించెను.

పండితుల కానాఁడు దానిపట్ల నాసక్తి లేదు. అడిగినదే తడవుగా దానిని వారొసఁగి బాధ వదలినదని సంతోషించిరి.

* * *

బెజవాడవద్ద అంకయ్యభట్టారకుఁడును, నరేంద్రనారాయణభట్టారకులును గలిసికొనిరి. చోళభూపుఁడు తన యఖండ సేనావాహినినిగూడ తోడుచేసెను. ఏకధాటిని నాయకత్రయము రాజమహేంద్రవరపు పొలిమేరలకు వచ్చినది అర్ధ రాత్రముననే నదిని దాటునట్టి యేర్పాటులను నారాయభట్టు గావించెను, సరిగ నది నతిక్రమించునప్పటికి నరేంద్రుని దండయాత్ర వార్త విజయాదిత్యుని జేరినది. అంకయభట్టు హటాత్తుగ నగరు ముట్టడింతమనినాఁడు. కాని నరేంద్రుఁ డందుల కంగీకరింపలేదు.

పూర్వము విజయాదిత్యుని విజయమునకు కారణభూతమైన మదేభము లిపుడు సంసిద్ధముగ లేవు. మద్యపానమున కలవడిన యా మదేభము లన్య పదార్థములను భుజించుట లేదు. ఎంత మద్యమని పోయుట !? పోసిన వాని మదమునకుఁ దగినపని వాని కెట్లు కల్పించుట !? అందుచే నవి శుష్కించి పోయినవి. వానిని పరిసరారణ్యములలో మేపుటకు భీమరాజు పంపినాఁడు. యుద్ధమనివార్యము. భీమరాజు తృటికాలములో బలము నాయత్తపఱచెను.

విజయాదిత్యుని నరేంద్రుఁ డెదుర్కొనెను. అంకయభట్టు భీమరాజు

నెదుర్కొనెను. నారాయణభట్టునకు సరిజోడు లేకపోయెను. అందుచే రణరంగ పర్యవేక్షకుఁడుగ నుండెను. నరేంద్రుఁడు విజయాదిత్యునిపై నొక నిశిత బాణమైన విడువలేదు. అతనిని వ్యూహరచనమున బంధింపనెంచి సంజ్ఞఁ జేసెను. ఆటవిక ధనుర్ధారుల కీ విద్య యానందదాయకమైనది. వృత్తావృత్తిలోఁ గోదండపాణులై, వనవాసులు తన్ను సమీపించువఱకును విజయాదిత్యుఁ డెఱుఁగడు. అతఁడా వ్యూహ రచనమునకు నిశ్చేష్టుఁడాయెను. నరేంద్రుఁ డాతని ధనువును తుత్తునియలు గావించెను. నరేంద్రుఁడు సాదరముగ విజయాదిత్యుని చేయి పట్టుకొని, శిబిరమునకుఁ గొనిపోయెను.

భీమరాజు భీమపరాక్రమము, అంకయ్యభట్టారకుని యఖండ శౌర్యమెుక దినమెల్ల సాగెను. వజ్జియ ప్రెగ్గడవంటి పూజనీయుని నిర్దయతోఁ జంపిన భీమాధముని జంపి తీరవలయునని యంకయ్య నిశ్చయించుకొనెను. అంకయ్యభట్టు సవ్యసాచివలె రెండు చేతుల ఘోరాసిఁబట్టి త్రిప్పగల దిట్ట. భీమరాజునకా నైపుణ్యము లేదు ఒకచేత భీముని కత్తిని నొక్కిపట్టి, రెండవ చేతితో అంకయ్య యాతని శిరచ్ఛేదమును గావించెను. అంకయ్యభట్టారకుని యఖండా హవకేళి కాశ్చర్యపడని యోధుఁడు లేఁడు.

కుమారుని యపజయమునకు మేడాంబ నిలువున కూలినది. దుష్టబుద్ధితోఁ దాను గావించిన ద్రోహమున కామె నరేంద్రుని చూడలే ననుకొన్నది. తన కీ విశ్వమున నెవ్వరును దిక్కులేరు. నరేంద్రుఁడు సోదరుని తప్పులు మన్నింపఁ గలవాఁడని యామె కెఱుకయే. జినస్వామికిగూడ తానింక రాజమహేంద్రవరమునం దుండుట మర్యాద కాదని తోఁచినది. తన యాశాసౌధములెల్ల కూలినవి. మేడాంబ శ్వేతాంబరు నాశ్రయించినది. ఇరువురు నంతర్ధానమైరి. ఆ జన్మ విశేష మట్టిది!!

*　　*　　*

నరేంద్రునకు విజయము లభించునప్పటికి నన్నపార్యుని యాగము సమాప్తమైనది. త్వరత్వరగ శాంతి ప్రక్రియలు పూర్తి గావించుకొని, నన్నపార్యుఁడు నరేంద్రునకు రుచిరాగత మొసఁగ నేగెను. నన్నయ ముఖము రవినిభ తేజముతో నొప్పుచుండుట పరికించి, నారాయణభట్టారకుఁ డప్రయత్నముగ నన్నయభట్టున కంజలి ఘటించెను. నన్నయ, నారాయణభట్టారకులను ముమ్మొందుగ ఆలింగన మొనర్చుకొని నరేంద్రుని సందర్శించెను. నన్నయ కవితాత్మ యొక్కమారుగ నుప్పొంగెను. ఆకుకవితా విముఖుఁడగు నన్నపార్యుఁ డప్పు డపౌరుషముగ,

ఉ॥ రాజకులాగ్రగణ్య! మృగరాజ పరాక్రమ! రాజరాజ! వి
భ్రాజిత శుభ్రకీర్తి పరిపాండుర దివ్యదిగంతరాళ! ఘో
రాజి ముఖోపలబ్ధ విజయ ప్రమదాశ్రిత బాహుదండ! ని
స్తేజిత వైరివీర! కులదీప! మృడప్రియ! విష్ణువర్ధనా!!

'స్వాగతము, రుచిరాగతమ'ని మధురముగ గానము చేసెను. ఆ సంబోధనములకు నరేంద్రుఁ డుప్పొంగెను. అందఱును సద్యః పరనిర్వృతి నందిరి. వెంటనే యంతఃపుర ప్రవేశము జరిగినది. శిల్పులను, పరివార బృందములను నరేంద్రుఁడు విజయాదిత్యునిచేతనే విముక్త మొనర్చెను. తన యవివేకమున కాతఁడు పశ్చాత్తాపము నంది వారిని క్షమాభిక్ష నర్థించెను. అనంతరము నరేంద్రుఁడు సపరివారముగ భీమనాయకుని సందర్శించెను. తన యాత్ర వర్గముతో నన్నయ యా రాత్రియంతయు నచటనే యుండెను. "వేంగిదేశము సర్వవిధముల మీకు ఋణపడినది. మీ దేశభక్తి, మీ త్యాగనిరతి చరిత్ర కొక గుణపాఠ"మని నన్నయభట్టు నారాయణభట్టారకుని గొనియాడెను.

నారాయణభట్టు: మేము ప్రవృత్తి మార్గములోఁ జేయు సేవను నీవు నివృత్తిలోఁ గావించుచుంటివి. మా ప్రవృత్తికన్న నీ నివృత్తియే మా విజయమునకుఁ గారణము. భవిష్యత్కాల మంతయు శుభోదర్కమైనది. మహోదయ నాశకారణమగు పర్జన్యపటలి పటాపంచలైనది. ఇఁక నీ వేంగితలము అసత్యమునుండి సత్యమునకు, తమస్సునుండి జ్యోతికి, మృత్యువునుండి యమృతత్వమునకు వెలుఁగుబాటల వెలార్చుటకు తా ముద్యమింపవలయును.

నన్నయ: నారాయణాజ్ఞ యనుల్లంఘనీయము కదా!

ఇరువురు హృదయపూర్వకముగ నవ్వుకొనిరి. అంతలో నరేంద్రు డమ్మంగదేవితో నచటికి వచ్చెను.

నరేంద్రుఁడు: ఇతః పూర్వమొక నన్నపార్యులతోడనే యమ్మంగకు చనువధికము. ఇప్పుడట్టి చనువు నారాయణభట్టారకులతోడ నేర్పడుట మా యదృష్టము.

అమ్మంగదేవి: నా కిప్పుడు మువ్వురు తండ్రులు. కన్నతండ్రి; కుల గురువులు నన్నపార్యులు; భయత్రాత నారాయణభట్టారకులు. మీరు ముగ్గురు మామ లేర్పడి రన్నమాట! ఎంత సుకృతము!!

ఈ మధురవాక్యములకు మఱల నందఱు నవ్వుకొనిరి. ఆ హాసతరంగములకు దక్షారామాలయోత్తుంగ ధ్వజాలంకృత హేమఘంటికలు మెల్లగా మ్రోగినవి.

౨౬

అది యుగాది పర్వదినము. సంపదలు తొలఁగిన దాతవలె నొకవంకఁ దైన్యమున మునిఁగిన రసాలము, కాలపరిపాకముచే సమస్త ప్రకృతికిఁ బ్రతినిధిగ, శోభన దేవతయై సాక్షాత్కరించినది. పది మాసములు మూఁగనోము నోఁచిన కోకిలగాయని, నవచూత ప్రసవఖాదినియై మహోదయ నవ్యగీతాలాపము నారంభించెను. గాయనీ సహకారముగ నలికుల ఝంకారము తంబుఱ శ్రుతుల నింపుచున్నది. గాసట బీసటగానున్న చికురజాలమును సంస్కరించుకొని తెనుఁగు లేమ మల్లెపూదండలను సవరించుకొన్నది. జీవితము నవరస భరితమైనదని జ్ఞప్తియందుంచుటకై వేఁప పూఁత ప్రసాదము పంచిపెట్టఁబడెను. మాధ్యాహ్నిక ఫలాహారముగా పచేళిమ పనస ఫలముల తొనలు పళ్లెరముల యందాయత్తమైనవి. తన జీవనముచేఁ బరిపోషితమగు నారామ దివ్య సంపదలకు గర్వించుచు నఖండ గోదావరి నిండార ప్రవహించుచున్నది.

వీరవిజయాదిత్యుని నిరంతర శ్రమకు ఫలముగ పరిషద్భవన మల్ప వ్యవధిలోఁ బూర్తియైనది. దానికా పవిత్రదినమున ప్రారంభోత్సవము జరుగును. ఇది పండిత బృందమున కఖండామోదమైనది. అందఱును సుప్రభాత సముహూర్తముననే తమ దుశ్శాలువల జిగికాంతులచే బాలభానుని యరుణకాంతులఁ గ్రిందు పఱచుచు సభామందిరము నలంకరించిరి. రాజరాజనరేంద్రుఁడు సమాగత విపశ్చిద్వర్యులను వందన పూర్వక మాత్మ పరిధానములతో సత్కరించెను. అనంతరము చీడమార్యుఁడు పంచాంగ ప్రవచనము గావించెను. రాజాజ్ఞ ననుసరించి నన్నపార్యుఁడా సుందరభవనమునకు "సకల భువన లక్ష్మీవిలాసము"ని నామకరణము గావించెను. సభ్యులు హర్షధ్వానములు చేసిరి.

రాజరాజనరేంద్రుఁడు వజ్జియప్రెగ్గడ మృతికి తన గాఢ సంతాపమును దెల్పెను. తన కన్నివిధముల కుడిభుజమును, ఆత్మసమశూరుఁడు, శ్రుత వక్త్రుఁడు, జితేంద్రియుఁడు, కులీనుఁడునగు అంకయభట్టారకుని, వజ్జియప్రెగ్గడ స్థానమున నమాత్యునిగా నియోగించు నధికారపత్రమును నరేంద్రునాజ్ఞపై నన్నయభటారకుఁడు పఠించెను. పిమ్మట నన్ని నారాయణభట్టారకుని యఖండ త్యాగనిరతికి చిహ్నముగ నందమపూడి నామగ్రామమును ధారాపూర్వకముగ, సర్వకర పరిహారముగ నీ సంకల్పించినట్లు ప్రకటితమాయెను. నన్నయభట్టారకుఁడు దానశాసనమును రచించి చదివెను. అది గీర్వాణ భాషలో నుండుటచేఁ బండితాంగీకారమును బడసినది. ఏతచ్ఛాసన కావ్యమున నన్నపార్యుఁడు రాజరాజనరేంద్రుని ప్రతాప శౌర్యములను, పవిత్ర చరిత్రను బ్రసన్న కవితాత్మక

ముగాఁ బ్రస్ఫుటీకరించెను. నన్నినారాయణుని యష్టభాషా పాండిత్య వైభవములం దభివర్ణితములు. సూరివర్యులు నన్నపార్యుని ప్రసన్నకవితా మాధుర్యమును శ్రోత్రాంజలులతో నాస్వాదించిరి. నన్నపార్యుని పర్యవేక్షణమునఁ జెక్కఁబడిన యా శాసనమునందు గుండ్రకత్తుగానున్న అక్షర రమ్యతను సభ్యులు సాక్షాత్కరింపఁజేసికొని చక్షుః ప్రీతి ననుభవించిరి.

ఇట్టి రాజ్యకలాప సమాప్తానంతరము రాజరాజనరేంద్రుఁడు "సకల భువన లక్ష్మీ విలాస" నిర్మాణమెట్టి లక్ష్యములతో గావింపఁబడినది వివరించెను. సాహిత్య చర్చ యచ్చట ప్రధానముగా జరుగును. కవులు, పండితులు, పౌరాణికు లీ సభ నలఁకరించి విశ్వశ్రేయోదాయకమగు సాహిత్యసృష్టి జరుగవలసిన విధానములను నిర్ణయింపవలయునని యాదేశించెను. అట్టి కావ్యప్రణాళికలకుఁ గూడ నేఁడు ఆనాఁడే ప్రారంభోత్సవము గావించెను. అవైదికమత ప్రాబల్యమునకు లోనైన తెనుఁగుజాతి నుద్ధరింపఁగల మహాకావ్యము రామాయణమా? భారతమా? పండితులు చర్చించి తీర్మానింపవలయునని నరేంద్రుఁడు కోరెను. బహు క్లిష్టమగు సమస్య యిది యని విద్వాంసులు భావించిరి. నన్నపార్యుఁడు నారాయణభట్టారకుని వంక మందస్మిత వదనముతో చూచెను.

చీడమార్యుఁడు చర్చనుపక్రమించెను. సంస్కృత వాఙ్మయమున కంతకు నాదికావ్యము, రామాయణము. ఇది సకల వేదసారము. వైదిక వాఙ్మయ మహావృక్షమునుండి కవితాశాఖను వేఱుచేసి, వేరునాటినవాఁడు వాల్మీకి మహర్షి. ఇదియే యాదికావ్యము. ఇదియే యంత్యకావ్యము. తక్కిన కావ్యములన్నియు తచ్ఛాయలు మాత్రమే. యుగయుగములుగా నీ కావ్యరాజము హైందవ హృదయ క్షేత్రములందు సనాతన సస్యములను సమృద్ధముగఁ బండించినది. భాస కాళిదాస భవభూతి మురారి భోజాదిమహాకవులందఱు వాల్మీకి యంతేవాసులే. సకల కళ్యాణ నిధానమును, ముముక్షుపాథేయమును, ధర్మద్రుమ బీజమును నగు రామనామము నా మహాకవి మనకుఁ బ్రసాదించెను. పాత్రల భావోన్మీలనమునందును, ప్రకృతి వర్ణనకౌశలమునందును వాల్మీకి ఏకైక కవీశ్వరుఁడు. వాగధీశుఁడగు హనుమంతుని సాహసోపేత జీవితము చిత్రింపబడిన సుందరకాండ, బీజాక్షరసమన్వితమై పారాయణ మాత్రమున భీరునిగూడ ధీరుని గావింప సమర్థమైనది. లౌకిక దృష్టితో జూచిన నయోధ్యకాండ యందు మానవస్వభావ వైరుధ్యములు సుందరముగా జిత్రింప బడినవి. శ్రీరాముని యౌదార్యము, దశరథుని దౌర్బల్యము, కైకేయి ప్రకృతి సహజ స్వార్థపరాయణత్వము, కౌసల్యాతీవి, సీతమ్మ పతిభక్తి, సుమిత్ర విజ్ఞత, గుహుని స్నేహము,

లక్ష్మణుని యుద్రేకము, భరతుని త్యాగము, వాల్మీకి కవిపుంగవుని లోకజ్ఞతకుఁ బ్రత్యక్ష నిదర్శనములు. నేఁడు రాజరాజ నరేంద్రులు రామరాజ్యమును స్థాపింప వలయును. అందులకు రామాయణ కావ్యాదర్శములు, గ్రామగ్రామమున, వాడవాడలఁ బ్రచారము కావలయునని పీఠమార్యుఁడు పన్యసించెను. అందఱు నానందించిరి. అప్పటికే చాల ప్రొద్దుపోవుటచే రాజేంద్రుడు సభను ముగించెను.

మఱునాఁడు ప్రాభాతమునఁ బండితబృందము సమావేశమైనది. రాజరాజనరేంద్రుఁ డధ్యక్షత వహించెను. అందఱు నుల్లాసభరితులై యెప్పు డెప్పుడు తమ మంజువాచాలత కవకాశము లభించునో యని యఱ్ఱులు సాచుకొని యుండిరి. రామాయణ కావ్య ప్రచారము ననేకులు సమర్థించిరి. నారాయణభట్టారకున కవకాశము వచ్చినది. "రామాయణ మహాకావ్య ప్రాశస్త్యము నెఱుఁగని పండితుఁ డుండఁడు. ఈ ప్రాజ్ఞులు దేశకాల విధానముల గుర్తింపవలయును. ఆంధ్రజాతి స్వభావమును వీరు పరీక్షింపరు. అసలెట్టి విషమ పరిస్థితులలో వేదవ్యాసుఁడు పంచమవేదమును రచించెనో గుర్తించిరా? ఋగాది వేదములే కాక, తత్సంబంధములగు బ్రాహ్మణములు, ఆరణ్యకములు, ఉపనిషత్తులు, స్మృతులు మున్నగునవికూడ వేదార్థములనే యుద్బోధించును. ఈ యన్నింటిని సమష్టిగా వైదికవాఙ్మయమనియు, బ్రహ్మకోశమనియు వ్యవహరింతురు. వీనిలో స్మృతులుదక్క తక్కినవి శ్రుతులు. భారతము పంచమవేదమనినపుడు వేదశబ్దమునకుఁగల యీవ్యాప్తి నంగీకరింపవలయును. ఉపనిషత్తులు, వేద శీర్షములు, వేదములు కర్మపరము కాగా, ఉపనిషత్తులు జ్ఞాన ప్రధానములైనవి. ఇట్లనుటచే నీరెండింటికిని తేజస్తిమిర న్యాయమును బాటింపరాదు. వేదప్రతిపాదిత కర్మాచరణానంతర మూరకుండక, బ్రహ్మ జిజ్ఞాసను గల్గించుభాగములు కావున, నివి జ్ఞానపరములైనవి. కాని కర్మాచరణ వైముఖ్యమును గల్గించునవికావు. ఎందఱెందఱు ఋషులెన్నెన్ని యుపనిషత్తులు ప్రవచించినను, వాని కన్నింటి కాధారములు వేదములే.

మానవుఁడు వర్ణాశ్రమాచార విహితమైన ధర్మమును యథావిధిగ నిర్వహించుచు, నాముష్మికమునకు భంగములేని యైహిక సుఖములను, ఆత్మ శ్రేయముతోపాటు జగచ్ఛ్రేయమును సంపాదింపఁగల మార్గములను వైదిక వాఙ్మయము నిర్దేశించినది. మొత్తముపై నివి యేకార్థమును బ్రతిపాదించునవైనను వాని యాచరణమున విభిన్నత కవకాశము లేర్పడినవి. ఇట్టి వైవిధ్యము సంభావ్యమగుట చేతనే వేదమూలకమైన యార్షధర్మము శాఖోపశాఖలైనది. వీని కేకవాక్యత కూర్పవలసిన యవసరమేర్పడినది. అమ్మహాకార్యమును భారతేతిహాసము మూలమున వ్యాసమహర్షి సాధించెను. భారతీయ విజ్ఞాన

మహాతరంగిణిని హిమాలయోత్తుంగ శిఖరములనుండి దుమికించి సామాన్య మానవలోకమునఁ బ్రవహింపఁజేసి ధర్మానుభవ సస్యములఁ బండించినా డీ భగీరథుఁడు. అతని దృష్టిలో దేవతకును, దేవతకును నంతరములేదు. సాంఖ్యయోగములకుఁ బోరాటములేదు. భక్తి జ్ఞాన కర్మలకు న్యూనాధికతలు లేవు. ఇట్లనేకరీతుల భారతము సర్వమత సమన్వయమును, సర్వధర్మానుకూల్యమును, సాధించి సర్వులకుపాదేయమై పంచమవేదమను సార్థక నామమును బడసినది. "అహింసాపరమోధర్మః", "సత్యంవద, ధర్మంచర", యను విధివాక్యములు కేవల ధర్మములా! పరిమిత ధర్మములా! యను మీమాంస వచ్చినపుడు నిర్ణయము చేయఁదగినది భారతమేకాని, మఱియే ధర్మశాస్త్రము దానికి సమర్థముకాదు. తక్కిన పురాణముల కిట్టి శక్తిలేదా? యన్న లేదనలేముగాని, యట్టిశక్తి వానికి భారతమునుండి సంక్రమించినదే. "ఇదం భారత మనాశ్రిత్వా కదాభూమి నవిద్యతే। ధర్మేచ, అర్థేచ, కామేచ, మోక్షేచ పురుషర్షభ। యది హాస్తితదన్యత్ర, యన్నేహాస్తి నతత్క్వచిత్॥" అను వ్యాసునిప్రతిజ్ఞ కివియే యర్థము. చతుర్విధ పురుషార్థములలో నీ భారత గ్రంథమున లేని దేగ్రంథమునను లేదు. దీనియందున్నదే గ్రంథాంతరమునఁ గలదు. ఇదికాక, సర్వోపనిషత్సారమైన భగవద్గీత భారతమునకు హృదయ స్థానముగా నున్నది. కావుననే యిది సర్వశ్రుతి సమాహార స్వరూపము. 'వేదాన్ అధ్యాపయామాస మహాభారత పంచమాన్' అనికదా ప్రమాణము.

సనాతన ధర్మగ్లాని యేర్పడిన యిక్కాలమున మహాభారతమే సంపూర్ణ మానవ జీవిత వికాస ప్రదాయిని కాఁగలదు. రామాయణము దివ్యపవిత్ర కావ్యము. రామాయణము నందలి పాత్రలు ధర్మబద్ధములు, సాంప్రదాయికములు. భారతము మానవ సంబంధ కావ్యము. ఇందలి పాత్రలు కేవలము సాంప్రదాయికములుకావు. విప్లవాత్మకమైనవికూడ. ఆంధ్రజాతి వీరోచితమైన జాతి. భారతపాత్రలు గదలించునట్లు, రామాయణ పాత్రలు వారి హృదయములను కదలింపఁజాలవు. అట్టి సంస్కృత భారతమును దేశీయుల కవగతము కావింపవలయున"ని నారాయణభట్టారకుఁడు గంభీరోపన్యాస మొసఁగెను. రాజరాజనరేంద్రుని మానసము జాగృతమైనది. నన్నపార్యుఁడు ప్రమోద సంభరితుఁడైనాఁడు. పండితులాశ్చర్య భరితులైరి.

తమకున్న యవకాశము నేల జారవిడువవలయునని భీమనభట్టు కుమారుఁడు బేతనభట్టు మున్నగు కొందఱు భాగవత ప్రచారముచే దేశీయులలో భక్తిభావము పెంపొందుననియు, తన్మూలమున నవైదిక మతప్రాబల్యము నశించుననియుఁ దెల్పిరి. ఇఁక ప్రముఖ పండితులలో నుపన్యసింపక, మిగిలినది

నన్నపార్యుఁ డొక్కఁడే. పండిత దృగ్జాలము లాతనిపై ఏకధాటిని ప్రసరించినవి. నన్నయభట్టు నిశ్చలముగఁ గూర్చుండెను. "మా కులబ్రాహ్మణులగు నన్నపార్యుల యమూల్యాభిప్రాయములను విన పరిషత్సభ్యు లుత్సహించుచున్నార"ని రాజరాజనరేంద్రుఁడు కోరెను. నన్నయభట్టున కిఁకఁ దప్పనిసరియైనది. "మా సహాధ్యాయుఁడు నారాయణభట్టారకుని ప్రతి పదమును సత్యసమ్మతమైనది. అతఁడు వాఙ్మయ ధురంధరుడు. వాల్మీకి దుర్భరతపోవిభవాధికుఁడు. గురుపద్యవిద్యకాద్యుఁడు. కృష్ణద్వైపాయనుఁడు బ్రహ్మర్షి; చతుర్వేద సూత్రములఁ గావించి, వేదవ్యాసుఁ డైనాఁడు. నిజతపోమాహాత్మ్యమునఁ జేసి బ్రహ్మచేత ననుజ్ఞాతుఁడై, యష్టాదశ పురాణములను, చతుర్వర్గానుబంధ బంధుర కథేతిహాసములను, చతుర్యుగ మహర్షి రాజవంశ చరితములను, చతుర్వర్ణాశ్రమ ధర్మక్రమములను, చతుర్ముఖ ప్రముఖ నిఖిల సుర మునిగణ పూజితుఁడైన శ్రీకృష్ణుని మాహాత్మ్యమును, పాండవాది భారతవీరుల మహాగుణములను, దన విమలజ్ఞానమయమైన వాగ్దర్పణమునం దేర్పడ వెలుగొందచేసెను. గంగాప్రవాహ సదృశ వాగ్ధార నన్నయ ముఖవినిర్గత మగుచుండ, పరిషన్మందిరమున ఆహా నినాదములు వినిపించినవి. "ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రమనియు, అధ్యాత్మ విదులు వేదాంతమనియు, నీతి విచక్షణులు నీతిశాస్త్రమనియు, కవివృషభులు మహాకావ్యమనియు, లాక్షణికులు సర్వలక్ష్య సంగ్రహమనియు, నైతిహాసికు లితిహాసమనియు, పరమపౌరాణికులు బహుపురాణ సముచ్చయమనియు కొనియాడునట్లుగా విష్ణుసన్నిభుఁడు వివిధవేద తత్త్వవేదియైన వేదవ్యాసుఁడు విశ్వజనీనమైన యీ మహాభారతమును రచించెను. ఏతన్మహాగ్రంథ శ్రవణమాత్రమున ఆయురర్థులకు దీర్ఘాయురవాప్తియు, నర్థార్థులకు విపులార్థములును, ధర్మార్థులకు నిత్యధర్మ సంప్రాప్తియు, వినయార్థులకు మహావినయమతియు, పుత్రార్థులకు బహుపుత్ర సమృద్ధియు నొనగూడును. అమితాఖ్యానక శాఖలుగల్గి, వేదార్థామలచ్ఛాయతో, సుమహావర్గ చతుష్క పుష్పవితతితో శోభిల్లుచు, కృష్ణార్జునోత్తమ నానాగుణకీర్తనార్థఫలమై, ద్వైపాయనోద్యానజాత మహాభారత పారిజాతము ధాత్రీసుర ప్రార్థ్యమైనది. ఈ భారతీయ భారత్యమరాప గౌఘమున స్నానముచేసిన కపిల గోశతము నుత్తమ బహువేద విప్రులకు దానముచేసిన ఫలిత మన్నిజాతులకు. పేదసాదలకును సమకూరును. క్రతు యాగ జప బ్రహ్మచర్య వ్రతపాలనమువలన గల్గు పుణ్యము, మోక్షశాస్త్ర తత్త్వముల నెఱిఁగినంత జ్ఞానము దీనిమూలమున సమకూరును. నా సహాధ్యాయుఁడు వ్యాసమహాముని హృదయము నావిష్కరించుటలో నిష్ణాతుఁడు. ఉత్తర దక్షిణాది ప్రతులను సేకరించి పాఠ్యభేదములను విశేషపరిశ్రమజేసి గుర్తించెను. అనేక వ్యాసఘట్టముల కన్వయము చేయగల మహాజ్ఞాని. అట్టియూ మేధావిని జగద్ధితముగ నుపయోగించుకొనుట మన కర్తవ్యమని నా మనవి.

మహాభారతమును వాల్మీకి కవితా హృదయముతో రామణీయకముగ వెలార్చుటచే విశ్వశ్రేయ మొనగూడి వేంగీతలమునకు మహోదయ మగునని విన్నవించు చున్నాను" అని నన్నపార్యుఁడు ముగించెను.

నారాయణభట్టుచే జాగృతమైన నరేంద్రుని హృదయము నన్నపార్యుని రమణీయార్థశబ్దడోలికల నఃఙ్ఞాత లూగినది. సూర్యచంద్రులను బోలిన యీ భట్టారక ద్వయము తనకు మహాసుకృతఫలముచే సంప్రాప్తమైనదని యానంద పరవశమున యంజలి ఘటించెను. నన్నపార్యుని మధుర ఫణితికి, విషయ ప్రాశస్త్య వివరణకు వినయ సంపదకు విపశ్చిద్వర్యు లైదువది చేసిరి. తత్కాల పరిస్థితులను, ఆంధ్ర జాతీయతను బురస్కరించుకొని మహాభారతమే యాంధ్రుల పాలిటి శాశ్వత కల్పతరువై యాంధ్రావని నావరించిన తమస్సును పటాపంచ లొనర్చి మహోదయ మొనగూర్చును. ఆనాఁటి రసవత్తర సమావేశము హర్ష నినాదములమధ్య సమాప్తమైనది.

* * *

కొందఱు పండితులలో గుసగుస లేర్పడినవి. వారికి రాజరాజ నరేంద్రుఁడు ప్రతిపాదించిన సమస్యాస్వరూపమే యిప్పుడు సందిగ్ధ మనిపించినది. నారాయణ నన్నయభట్టారకులు వివరించిన రీతికిని, తక్కిన పండితులు భావించిన రీతికిని కొంత భేదమున్నది. నరేంద్రుఁ డా విషయమును స్పష్ట మొనర్పలేదు. అట్లొనర్పుఁడని యడుగుట వారి పాండిత్యమునకు న్యూన మనిపించినది.

రాజేంద్రుఁ డారాత్రియంతయు మథనపడెను. భట్టారక ద్వయ వాక్యము లాతని హృదయవీథిని ప్రతిధ్వనించినవి. ఏమి యా నారాయణభట్టారకుని మేధ! ఏమి యా నన్నయభట్టారకుని వాణి! యని యూరక విస్మయోత్ఫుల్ల నేత్రాంబుజుఁడై కర్తవ్యము నాలోచించుచుండెను. పండితులను దాను సందిగ్ధావస్థలో నుంచగల్గెను. వా రంతలో భ్రమ నొందుదురు. అట్లని యంగీకరింపరు. వారి యందు నాకుఁగల భక్తికి వా రానందపడిరి. వారి సాహాయ్య మత్యవసరము. పామరజనమునకు విజ్ఞానభిక్షను పెట్టవలసినవారు వారే! ఆంధ్రజాతి ఆనందాత్మకమైన జాతి. ఆంధ్రహృదయ ముత్సాహభరితమైనది. అని యాలోచించుచుండగనే శివరాత్రి మహోత్సవమున యాత్రికులు పాడిన వివిధ జానపద గీతము లాతని శ్రవణేంద్రియములందు రింగుమని మ్రోఁగినవి. ఆ తోలుబొమ్మలాటలు, ఆ వీథిభాగవతము లాతనికి తిరిగి ప్రత్యక్షమైనవి. వీరికొరకు మహాకావ్యమును బ్రసాదింపవలయును. ధర్మబుద్ధిని, రససిద్ధిని గల్గింపవలయునని తలంచు నంతలో కర్ణాట సరస్వతియు, తమిళ సరస్వతియు, తెనుఁగు సరస్వతిని

జూచి పరిహసించుచున్నట్లు నరేంద్రుఁడు వెతఁజెందెను. అసంస్కృతమైన తెనుఁగుతల్లిని సంస్కరింపవలయును. ఆ సకలప్రమోదదాయినిగా తీర్చి దిద్దవలయును. వానికన్న నున్నతపీఠమున నామె నధిష్ఠింపఁ జేయవలయును. అయిన నీ మహాకావ్య నిర్వహణమునకు సమర్థు లెవరు? నారాయణభట్టు అపర వ్యాసమూర్తివలె నున్నాఁడు. అతఁడొక వ్యక్తిమాత్రుఁడుగాఁడు. అతఁ డొక మహోద్యమము. అతఁడు కవీభ వజ్రాంకుశుఁడుగ నన్నపార్యుడంతవాని యభినందన మందెను. అతఁడు భీమేశ్వరాలయమున వ్యాసుఁడు దక్షిణాంధ్రమునకు వచ్చి, దక్షారామమున నివసించుటలోని పరమార్థము నపూర్వముగ తేటతెల్లము సేసెను. ఆంధ్రజాతిపట్ల నాతని యాదరాభిమానము లత్యంతములు. ఏతత్కారణముననే యాతఁడు కర్ణాటమున నిలువలేక, తన సర్వస్వము వేంగీతలముననే యున్న ట్లుద్విగ్నుఁడై మన యాస్థానము నలంకరించెను.

అతనినే భారతాంధ్రీకరణమునకుఁ గడంగుమని కోరినచో నెట్లుండును? కాని యాతని కవిత్వపాక మంత మృదువైనదా? పండిత పామరుల కది ప్రీతిదాయకము కాదేమో? అని యాలోచనపై నాలోచనము నరేంద్రు నాత్మ నాక్రమించినవి.

ఇంతలో నరేంద్రునకుఁ బట్టాభిషేకమహోత్సవ పద్యములు జ్ఞప్తి వచ్చినవి. ఆహా! ఏమి యా యక్షర రమ్యత! ఏమి యా సమాస విన్యాసము!! మహాకవికి కావలసిన క్రాంత దర్శనము, శాంతి దాంతులు, జగన్నేతృత్వము, వినయ సౌశీల్యములు నన్నపార్యునిలో మూర్తీభవించినవి. అతనినే మహాభారతాంధ్రీకరణమునకుఁ బ్రార్థింతునని చింతించుచు రాజరాజనరేంద్రుఁ డారాత్రి యట్లే విశ్రమించెను.

* * *

ఆనాఁటి నిశీథినీ సమయమున నారాయణభట్టారకునకును కునుకుపట్టక నన్నయభట్టారకుని యింటికేఁగెను. నన్నయభట్టారకుఁ డేకాంతమున జపమాలిక త్రిప్పుచుండెను. అతఁడు సమాధియందున్నట్లు నారాయణభట్టు గ్రహించెను. ఒక మహాజ్యోతి యా గదియందు వెలుఁగుచున్నట్లు కనులు మిఱుమిట్లు గొలిపినది. ఇఁక తానక్కడుండుట భావ్యముకాదని నారాయణభట్టు గృహోన్ముఖుఁడైనాఁడు. ఆ రాత్రియంతయు నన్నపార్యుఁడు తన యేకాంత గృహముననే యున్నాఁడు. రాజరాజు తనపై మహాభారమును మోపుచున్నట్లును. తాను దానిని భరింపలేనను భీతితో వణకుచున్నట్లును, నారాయణభట్టు ధైర్యము గొలుపుచున్నట్లును నొకమారాతనికి గోచరించును. మఱికొంత సేపటికి కురుక్షేత్ర సంగ్రామమునఁ దా నర్జునునివలె నారి సారించుచున్నట్లును, నారాయణభట్టు

కృష్ణపరమాత్మవలె సారథ్యము నెఱపుచున్నట్లును దృశ్యమగును. ఇంక కొంత తడవునకు తాను మహాభారతము నాంధ్రీకరించుచున్నట్లును, పౌరాణికులు గ్రామగ్రామమున తన కవిత్వమును గానము చేయుచున్నట్లును, ఆబాలగోపాలము మాతృభాషాభిమానమై, తద్గానామృతము నాగళపూరితముగ నాస్వాదించుచున్నట్లు నూహాచిత్రములను జిత్రించుకొనును, మఱుక్షణముననే తానొక మహోన్నత పీఠ మలంకరించినట్లును, తెనుఁగు నేలయందు పుట్టి కలముపట్టిన కవీశ్వరులందఱు బారులు తీర్చి నిలువఁబడి తన్నారాధించుచున్నట్లును స్ఫురించును. ఇంతలో నన్నయభట్టునకు బాహ్యజ్ఞానము కల్గినది. కోడికూత వినిపించినది. చెట్టుచెట్టున, కొమ్మకొమ్మన, శుకాది శకుంత సంతాన మధుర కూజితములు వినవచ్చినవి. నన్నపార్యునకు స్మృతి కల్గెను. నారాయణభట్టాతనికి మనోవీథిని సాక్షాత్కరించెను. తోడనే యాతని నికేతనమున కేగెను. అప్పటికే చీడమార్యుఁడు నారాయణభట్టు శీర్షభాగమునఁ గూర్చొని యున్నాఁడు. నన్నయభట్టు పోయి పాదతలమున గూర్చొనెను. పట్టక పట్టక నిద్రపట్టినది నారాయణభట్టునకు. కొంత తడవునకు మేల్కొని నన్నపార్యుని ముందుగాంచి పరామర్శించెను. నరేంద్రుఁడు తన్ను భారతాంధ్రీకరణమును గావింపుమని యెప్పుడైన సభాముఖమునఁ గోరినచో, ఆ మహాభారమును తాను మోయఁజాలనని భీతికల్గి నీ పద్దకు వచ్చితిననియు నన్నయ వాక్రుచ్చెను. నారాయణభట్టునకుఁ బట్టరాని ప్రమోదము కల్గినది. నన్నపార్యుని భుజములను దట్టి "ఆ శుభముహూర్తము సమీపించును. ఆ భారము నీవుదక్క నిర్వహింపఁగలవారు వేంగీతలమున లేరు. కలము పట్టి కాకపోయినను రచనాప్రణాళికాది సర్వసహాయ సంపత్తిని సమకూర్పఁ గలన"ని నారాయణభట్టారకుఁ డభయ మొసఁగినాఁడు. నన్నయభట్టు మాటాడలేక పని వినెను. నారాయణభట్టు వెనుదిరిగినంతనే చీడమార్యుఁడు కనిపించెను. "నరేంద్రుఁడు ప్రతిపాదించిన సమస్యాస్వరూపము మున్ముందు గోచరింప లేదు. ఏ కావ్యమునైన యాంధ్రీకరించిన దేవభాషా ప్రాముఖ్యము నశించును. పండితులకు గౌరవము క్షీణించును. తామీ విషయమునఁ దగురీతి పండితులకుఁ దోడ్పడవలసినదిగా వారిపక్షమునఁ బ్రార్థించుచున్నాన"ని చీడమార్యుఁడు పల్కెను.

నారాయణభట్టు : పండితులకుఁ గల ప్రాముఖ్య మెప్పటికిని క్షీణించునది కాదు. తెనుఁగుకావ్య మనఁగనే యంత తేటతెల్లముగ నుండునని భ్రమింపకుఁడు. శబ్దార్థములను, వ్యాఖ్యానములను వల్లించుటతోఁ దృప్తిజెందక, స్వకీయ ప్రతిభా వ్యుత్పత్తులతోఁ గావ్య రసాస్వాదనము గావించి విమర్శించుట మన పండితు లలవఱచుకొనవలయును. రాజాజ్ఞ యనుల్లంఘనీయము.

చిడుముడి వడిన మోముతో చీడమార్యుఁ డంత వడివడిగ జనెను. తూర్పురేకలు దశ దిశలు వ్యాపించినవి.

౨౭

చైత్ర శుద్ధ సప్తమి సోమవార ముదయమున సర్వలోకాశ్రయ శ్రీ విష్ణువర్ధన మహారాజాధిరాజ, రాజపరమేశ్వర, పరమ భట్టారక, పరమ బ్రహ్మణ్యులగు రాజరాజనరేంద్రదేవులు, సకలభువన లక్ష్మీవిలాస నివాసమయిన రమ్య హర్మ్య తలమున విద్యావిలాస గోష్ఠి గావింతురు. కావున పండిత పామరులందఱును బాల్గొనవలసినదిగాఁ జాటింపఁబడెను. అందుచే నానాఁబ్రాక చారిత్రకోజ్జ్వల పవిత్ర దినముగ రాజమహేంద్రవర నరనారీ పౌర సమూహము భావించి యాతురతతో, నుదయాద్రిత్రసరేణువులు సూర్యకిరణ స్పర్శకు పదలకుఁ జెలరేగక పూర్వమే సభామందిరమున సమావేశమాయెను. మంత్రి, పురోహిత, సేనాపతి, దండనాయక, దౌవారిక, మహాప్రధాన, సామంత విలాసినీ జనములు నిర్ణీతస్థలమున నాసీనులైరి. అపార శబ్దశాస్త్ర పారగులైన వైయాకరణ లోక మంకను, భారత రామాయణాద్యనేక పురాణ ప్రవీణులైన పౌరాణిక లోక ప్రక్కను, మృదుమధుర రస భావభాసుర నవార్థ వచన రచనా విశారదులైన మహాకవి లోక శ్రేణిని, వివిధ తర్క విగాహిత సమస్తశాస్త్ర గరీయః ప్రతిభులైన తార్కికు లోక వైపునను బరివేష్ఠించిరి.

రాజాగమన సూచితమగు విజయ ఘంటికలు మ్రోఁగినవి. క్రిక్కిరిసిన మహాసభ యంతయు నొక్కక్షణమున నిజమాకిడిన [illegible]ైనది. నరేంద్రుఁడు మందగమనమున సభామందిరమును బ్రవేశింపగనే వందిమాగధ స్తోత్రము సుందర కావ్యఫణితిలో నందగించినది.

రాజకులాగ్రగణ్య! రాజకులశేఖర! వ్యసన విస్మృత! [illegible] కృత నిత్య ప్రసాద! నృపపూజిత పాదాంభోజ! రాజసూరి సభాంతర ప్రాపిత సద్గుణ! మహాకావ్యరస ప్రయోజనా రూఢమతీ! నిత్య సత్యవచన! ధన్యదయాలాప చతురాస్య! బహుపరాక్ .... ....

సత్యాశ్రయ కులశేఖరా! మహాదాన తర్పిత ద్విజవర! అభిమాన మహార్ణవ! నానావని నాథ కిరీట మౌళి విరాజిత పదాంభోజ! సౌజన్య గుణాకర! నిత్యనిరంతర ధర్మమతీ! సరస్వతీవిలసన్ముఖాంభోజ! రాజమహేంద్ర కవీంద్ర సమాజ సురభూజ! కలియుగ పవిత్ర! [illegible] బంధుర! బహుపరాక్ .... ...

శ్రీమచ్చళుక్యవంశ శిఖామణీ! దక్షమఖారి [illegible] పవా! ఘోరారిమదకుంభికుంభ విదారణదారుణ కృపాణ దక్షిణహస్త! [illegible] నిరంతర ధర్మమతీ! విద్వదంభోజవన పయోజమిత్ర! భావభవ [illegible]! బాంధవాంభోజవనద్యుమణి కాంతి! బహుపరాక్ .... ....

ఇట్లావృత్తముగ వందిమాగధులు కావ్యశైలిలో నరేంద్రుని సద్గుణవాహిని కేతామెత్తిరి. రాజేంద్రుఁడు సభకు అభివందించి కూర్చొనెను. మఱుక్షణముననే మానవేంద్రుఁ డుత్థితుఁడై తన కులబ్రాహ్మణుని దిలకించెను. నన్నయభట్టారకుఁడు లేచి వినమ్రుఁడై మృదుమధుర మనోజ్ఞముగ

శ్లో॥ శ్రీవాణీ గిరిజాశ్చిరాయదధతో వక్షోముఖాఙ్గేషుయే
లోకానాం స్థితిమావహన్త్యవిహతాం స్త్రీపుంస యోగోద్భవామ్।
తేవేదత్రయ మూర్తయ స్త్రిపురుషా స్సమ్పూజితా వస్సురై
ర్భూయాసుః పురుషోత్తమామ్బుజ భవశ్రీ కన్ధరాశ్శ్రేయసే॥

యని మంగళాశీర్వాద శ్లోకము నాలాపించెను. ఇది వంశీనినాదమువలె సభ్యుల హృదయ బృందావనమును బులకింపఁజేసినది. అంతట రాజరాజనరేంద్రుఁడు గంభీరముగ "సభ్య మహాశయులారా! విపశ్చిద్వర్యులారా!........ ఇది మహా సుదినము. అఖండమగు పర్వదినము. నా యాహ్వానము నాదరించి యిందఱు మహనీయులిచ్చట సమావేశమైతిరి. వేంగిదేశ మింకనైన సాంస్కృతికముగ నభ్యుదయము పొందవలయునని నాయుత్కంఠ. ఆంధ్రావని కీనాఁటినుండి మహోదయ మవిచ్ఛిన్నముగఁ బ్రాపింపవలయునని నాయాకాంక్ష. సమర జీవితముకన్న సాహిత్య జీవితము నాకానంద ప్రదమైనది. అనేక పురాణములను విమలమతితో వినియున్నాను. అర్థ ధర్మశాస్త్రముల తెలిఁగెలింగితిని, ఈశ్వరాగమములయందు భక్తితో హృదయమును నిల్పితిని. ఉదాత్త రసాన్విత కావ్యనాటకక్రమములనేకములు సూచితిని. అయినను నా కనవరతము మహాభారతమునందలి యభిలాష యధికమైనది. హిమకరుని మొదలు పాండవేయుల వఱకుఁగల యీ మహేతిహాసము అస్మదీయ వంశీయుల చరిత్రమగుటయు తదభిలాషకు ముఖ్యకారణమే యగును. విమల సువర్ణ శృంగఖురమైన కపిల గోశతము నుత్తమ విప్రులకు దానముచేసిన ఫలము భారత కథాశ్రవణ ప్రవణముచే సంప్రాప్తించునని యార్యోక్తి. బహుభాషల, బహువిధముల, బహుజనములవలన వినుచు భారత బద్ధ స్పృహులగు వారికి బహుయాగములఫలము పరమార్థమగును. అట్టి యీ మహాభారతమును, మా కులబ్రాహ్మణుఁడును, ననురక్తుఁడును, నవిరళ జపహోమ తత్పరుఁడును, విపుల శబ్దశాసనుఁడును, సంహితాభ్యాసుఁడును, బ్రహ్మాండాది నానాపురాణ విజ్ఞాననిరతుఁడును, లోకజ్ఞుఁడును, నుభయభాషా కావ్యరచనాభిశోభిత సత్ప్రతిభాభియోగ్యుఁడును, నిత్యసత్య వచనుఁడును, మత్యమరాధిపాచార్యుఁడును, సుజనుఁడును నగు నన్నపాచార్యుని కృష్ణద్వైపాయన మునివృషభాభిహితబద్ధ నిరూపితార్థమేర్పడ తెనుఁగున రచియింపవలసినదిగా వినమ్రముగా సభాముఖమున వేడుకొనుచున్నాన"నెను.

వెంటనే చందనతాంబూల నూత్న పరిధానములు సిద్ధముకాగా నన్నపాచార్యున కొసఁగి, నరేంద్రుఁడు నమస్కరించి కూర్చుండెను.

ఇంతలో సభలోఁగొంత యలజడియైనది. పొట్టిగా, వ్రేలాడు జులపాల జుట్టుకల్గి, జారిపోవు నుత్తరీయముతో, తంబాకునములుచు, నొక వినూతన వ్యక్తి సపరివారముగ హుటాహుటిని సభలోనికిఁ బ్రవేశించి, రాజరాజనరేంద్రున కెదురు నిల్చెను. నరేంద్రుఁడు తామెవరని యాతనిని ప్రశ్నించెను. అప్పుడు —

మ॥ "ఘనుఁడన్ వేములవాడ వంశజుఁడ; దక్షారామ భీమేశనం
దనుఁడన్; దివ్యవిషామృత ప్రకటనానాకావ్యధుర్యుండ; భీ
మన నా పేరు వినంగఁ జెప్పితిఁ జళుక్యాధీశ! కస్తూరికా
ఘనసారాది సుగంధ వస్తువులు వేగందెచ్చి లాలింపుమా!!"

యను పద్యము ఖంగున మారుమ్రోఁగినది. దక్షారామ భీమేశనందనుఁడనను మాటకు నరేంద్రున కానందము కల్గినది. నరేంద్రుని యపాంగ వీక్షణ మాత్రమునే భీమకవికి కస్తూరికా ఘనసారాదులు వచ్చినవి. ఆసన మేర్పఱుపఁబడెను. భీమకవి యుత్తిష్ఠుఁడై "భారత రామాయణములను రెండు మహేతిహాసములు భారతీయునకు రెండు జ్ఞాననేత్రములు; భారతీయుని మేధాహృదయములు; భారతీయ విహాయసవీధిని వెలుగొందు సూర్య చంద్రులు. ఇచట పరివేష్ఠించిన విద్వన్నికరమునందు కొందఱు రామాయణ ప్రాశస్త్యమును, మఱికొందఱు భారత ప్రాశస్త్యము నుగ్గడించినట్లు వినియున్నాను. తాము భారత కథాశ్రవణ ప్రవణమతులనికూడ స్పష్టము. అది యుక్తమే యగుఁగాక! కాని శ్రీరామ చంద్రుని లోకోత్తర చరిత్రనుగూడ తాము ప్రజలకుఁ బ్రసాదింపవలయునని నా యభిలాష. 'ఏకక్రియా ద్వ్యర్థకరీ' యని గదా యార్యోక్తి. భీమేశ్వర వరప్రసాదలబ్ధ కవితాకళాధురీణుఁడగు నేను 'రాఘవ పాండవీయము'ను ద్వ్యర్థి కావ్యమును రచింతును. రెండర్థమ్ముల పద్యమొక్కటి నిర్మించుటకు తల ప్రాణము తోఁకకు వచ్చును. అట్టిచో కావ్యము నంతయును నిర్మించుటలోఁ గల క్లేశము ప్రభువు లూహింపలేనిదికాదు. నిష్పాక్షికముగా నన్నాదరించి ప్రభువులు తాంబూలమిప్పింపుడు. దక్షారామ భీమేశుని యక్షయ కృపాకటాక్ష వీక్షణ సంజనిత దక్షతతో నీ మహాకావ్యము నిర్మించి సమర్పింతును." అని ధీరతతో భీమకవి గంభీరముగఁ బల్కి కూర్చుండెను.

సభలో నలజడి బయలుదేరినది. రాజరాజ నరేంద్రున కేమియుఁ

తోఁచలేదు. తన యాశాసౌధమంతయు నొక్కమారు కూలినట్లు దిగాలుపడెను. కారుమేఘములు క్రమ్మినట్లైనది. ప్రభువు నారాయణభట్టారకుని వైపునకుఁ జూచెను.

నారాయణభట్టు సభనంతయు నొక్కమాఱు సమీక్షించెను. అతని చక్షువులు జేవురించినవి. మహోదయ భాస్కరుని ప్రళయకాళ జీమూతమండలి యడ్డగించినదని భావించెను. దానిని తన నిశిత వాగ్వైఖరీ ఝంఝామారుతముచేఁ బారద్రోలవలయునని సంకల్పించి నిలువఁబడి యి ట్లుద్ఘాటించెను. "రామాయణ మహాభారతముల ప్రాశస్త్యమును, వాని విభేదములను వివరింపఁబడినవి. ఆంధ్రజాతి వీరజాతి యనియు దానికి విప్లవాత్మకమగు భారతకథపై నున్నంత మక్కువ రామాయణముపట్ల లేదనియు పండితులు గ్రహించియుండకపోరు. ఆంధ్రజాతి కింతదనుక వాఙ్మయమేలేదు. గానట బీసటగా గాథల త్రవ్వుచున్న యిట్టి తరుణమునందు ద్వ్యర్థి కావ్యావతరణమున కవకాశములేదు. అది యుత్తమ శ్రేణికిఁ జెందునదికాదు. బ్రహ్మానంద సహోదరమగు రసానందము దానివలన ప్రాప్తించదు. ఆ శ్రేణి కావ్యములు ధీమంతుల మస్తిష్కములకు మాత్రము చక్కిలిగింతలు వెట్టును. ఇతిహాస కవన మట్టిది కాదు. రసానందముతోపాటు చతుర్వర్గ ఫలప్రాప్తిని గల్గించును. అల్ప ధీమంతులకును సుఖప్రాప్తి నొనఁగూర్చును.

వాఙ్మయమునకుఁగూడ నొక పరిణామ సిద్ధాంతము కలదని విమర్శకులు గుర్తింపవలయును. వాల్మీకి వ్యాసుల తరువాత నెన్ని శతాబ్దములకో కవికుల గురువగు కాళిదాసమహాకవి రససంవిధాన చక్రవర్తియగు భవభూత్యాది మహాకవు లుద్భూతమైరి. వారి పిమ్మటనే చమత్కార ప్రధానమైన కవిత యావిర్భవించినది. ఆ చమత్కారమే ప్రధానముగా ద్వ్యర్థికావ్యాదు లుత్పన్నములైనవి. సాహిత్యారంభము భావప్రధానముగను, పిమ్మట వస్తుప్రధానముగను, కడకు రచన ప్రధానముగను పరిఢవిల్ల వలయును. సంస్కృతసాహిత్య మీ రీతిగానే పరిణమించి కడకు రచనైక మాత్రమైనది. సంస్కృత సాహిత్య సృష్టిలోని పస యంతరించినది. సంస్కృతభాషా సంపద నుపయోగించుకొని దేశభాషలం దిప్పు డాసాహిత్యసంపదయే నూత్నరూపమును ధరింపవలయును. అందుచే సంస్కృత సాహిత్యాంతమునుండి తెనుఁగు రచన ప్రారంభము కారాదు. తెనుఁగు సాహిత్యమునకు శ్రీకారము చుట్టవలయును. పై మూఁడు దశల పరిణామము కొంతగా నంతర్భుక్తము గావించుకొన్నను తొలిదశలోనే తెనుఁగువాఙ్మ యారంభము కావలయును.

ఈ యువ కవీశ్వరుఁడకాల సంజనిత మహా మేధావి. అపక్వదాడిమీ ఫలము. ఈతని కోర్కె యీనాఁడీడేరుట జగద్ధితము కాదు. ఈతఁడు మఱికొన్ని శతాబ్దముల తరువాత, ఆంధ్రరసికత పరాకాష్ఠకెక్కిన తరువాతగాని యీతని లక్ష్యము సిద్ధించుట కవకాశము లేదు. ప్రభువులును, పండితులును ఈ వాఙ్మయ రహస్యమును గుర్తింపవలయును."

విద్వద్వరేణ్యుల కందఱకును వాఙ్మయరహస్యము లవగతమైనట్లు వారి ముఖారవిందములు వికసించినవి. నారాయణభట్టు వాఙ్మయ ధురంధరుఁడని యందఱు ప్రస్తుతించిరి. మహాకవి విప్రుడు, నియమవ్రతుఁడు, శుచిమంతుఁడు కావలయునని ఋగ్వేదము శాసించినది. భీమకవి భీమేశ్వరవరప్రసాదుఁడయ్యు నవైదికుఁడు. నైష్ఠిక సుందరుఁడు కాఁడు. కళింగదేశసంచారి. నన్నపార్యుఁడు మూర్తీభవించిన వైదికవాఙ్మయము. అకలంకామృత మయూఖుఁడు. అతఁడు ప్రసన్నమూర్తి. ప్రభువులు సెలవిచ్చి నట్లవిరళ జపహోమ తత్పరుఁడు. అతఁడు మహర్షి. మహర్షితక్క నన్యులీ భారతావనిలో మహాకావ్య నిర్మాతలు కాలేరు. "నానృషిః కురుతే కావ్యమ్మ"ను సూక్తి కాతఁడు సర్వవిధముల లక్ష్యభూతుఁడు. అట్టి కమనీయ, మహనీయమూర్తి రచించిన మహాకావ్యము తెనుఁగైనను దేవభాషాతుల్యమగును. ఇతఁడొక స్వైరవిహారి. కవివలన కావ్యము, కావ్యము వలన కవియు, నిరువురి వలన లోకము ధన్యము కావలయును. ఇతఁడిట్టి యాశయములు కలవాఁడుగా కానరాఁడు. మనస్సులో కవి నీచుఁడైన యాతని కావ్యములోని ప్రతిభ వ్యర్థమగును. త్రికరణ శుద్ధిగల వాక్కు ప్రపంచమునకు గళ్యాణ మొనగూర్చును. మహాప్రభువు మహాకావ్య రసప్రయోజనా రూఢమతి! ఇట్టి విద్యావిలాసపార్థుఁడితఃపూర్వ మీదేశము నేలలేదు. అతని ముద్దుచెల్లించుట మన ముఖ్యకర్తవ్యమని రసజ్ఞులు భావించిరి. అందఱు సౌమ్యదృష్టులతో నరేంద్రుని తిలకించి, చీదమార్యునిపై దృష్టి సారించిరి.

పండిత ప్రతినిధిగఁ జీదమార్యుఁడు "మహాభారతేతిహాసానువాదమే యాంధ్రజాతి జీవనామృతము, ఆంధ్రవిద్వన్నికర పారిజాతము. ప్రభువుల వాంఛ శిరోధార్యము. వాఙ్మయ ధురంధరుఁడగు నారాయణభట్టారకుని యభిమతమే సభ్యుల యభిమతమ"ని ముచ్చటగా మాటలాడెను. నరేంద్రుని ముఖారవిందము వికసించెను. నన్నపార్యునివంక నాతఁడు తిలకించెను. నన్నపార్యుఁడు తిరిగి "శ్రీవాణీ గిరిజాశ్చిరాయ"యను శ్లోకమును బఠించెను. అఖండ గోదావరీ తరంగములట్లున్న వా పంక్తులు.ఆర్షజీవితములోని గృహస్థాశ్ర మాధిక్యము నాశ్లోక ముగ్గడించును. పట్టాభిషేకమునాఁటి పద్యములను నన్నయ

యామ్రేడించెను. అవి నరేంద్రుని ఘనతను ప్రశంసించును. సభ్యులు హర్ష ధ్వానములు చేసిరి. సభానిర్ణయమును ప్రశంసించుచు నిట్లు నన్నయ యొక పద్యమును వినరెను.

చ. పరమ వివేక సౌరభ విభాసిత సద్గుణ పుంజ వారిజో
త్కర రుచిరంబులై, సకలగమ్య సుతీర్థములై, మహా మనో
హర సుచరిత్ర పావన పయః పరిపూర్ణములైన సత్సభాం
తరసరసీ వనంబుల ముదం బొనరం నుతియింతు వేడుకన్.

సభ్యులు, సభాపతియు ప్రమోదాంతః కరణ పరవశులై, మిన్నంటునట్లుగా కరతాళధ్వనులు గావించిరి. ఏమి యావినయము! ఏమి యాసభాగౌరవము! ఏమి యాభాష! ఏమి యాయలంకార సౌందర్యము! ఇది తెనుఁగెట్లగును!? ఇది సంస్కృతమే నూత్న రూపము ధరించినది!! అని యనేకవిధముల ముచ్చటించుకొనుచు సభ్యులు పరస్పరానంద విలోకన క్రియామగ్నులైరి. ప్రభువున కీదృశ్యము చూడ ముచ్చటగానుండెను. నారాయణభట్టు భీమకవి వంకనే దృష్టిని లగ్నమొనర్చెను.

సభయిట్లేకమై, తనమాటను, తనశక్తిని తృణీకరించినందుఁకు భీమకవి కాగ్రహము వచ్చెను. వెంటనే యాతఁడు నిలువఁబడెను. ఏవో పిడుగులు పడునని సభ్యులు భయపడఁజొచ్చిరి

రాఘవ పాండవేయుల పరాక్రమ వస్తువు
ద్వ్యర్థి కావ్యమున్
లాఘవమొప్ప వ్రాయఁగ విలక్షణ లక్షిత
బుద్ధినైన న
న్నేఘనుఁ దద్దగించి రచియించునొ భారత
మట్టిదానికిన్
మోఘములేని శాపమునఁ బుట్టు ననర్థము
తప్ప దెన్నడున్

అని యాశువుగా భీమన శపించి సభను వీడెను.

సభ్యులు, నరేంద్రుఁడు భీతచిత్తులైరి. వేదార్థవిదుఁడగు పెదమార్యుఁడు తీవ్రతతో లేచి, "యసంభవము. చాళుక్య ప్రభువుల సంకల్ప మప్రతిహతము. వారును భీమేశ్వర వరప్రసాదులే. ఈ శాపమిట ప్రసరింపదు. మహాతపస్వి

నన్నయ కిది యనువర్తింపదు. అని వచింపగా, సభ కొంత ధైర్యము వహించినది. "ఈతఁ డిప్పటికే దైవప్రసాదిత శక్తులను వ్యర్థము గావించుకొని భ్రష్టుఁడై సంచరించుచున్నాఁడు. నన్నయభట్టారకుని యుద్యమ మాగునది కాదు. మహోదయమైతీరును" అని నారాయణభట్టు ధీర గంభీరముగ వచించెను. రాజేంద్రుఁడు నన్నయ వదనము నవలోకించెను. నన్నయ ప్రసన్నముగ లేఁడు. వినమ్రుఁడై యుండెను. రాజరాజు పరిస్థితులు గ్రహించెను. అప్పటికే చాల ప్రొద్దుపోయినది. రేపు నన్నపార్యులు మా ప్రార్థనమున కుచితరీతిని సమాధాన మిడగలర"ని సభ ముగించి నరేంద్రుఁడు నిలువఁబడగాఁ బరిజారులు దారిచూపిరి.

నారాయణభట్టును, నన్నయభట్టును కలిసియే గృహోన్ముఖులైరి. పండితు లాఁకలిబాధతో త్వరితగతి నిండ్ల కేఁగిరి. మార్గమధ్యమున నారాయణభట్టు నన్నయభట్టు ననేక విధములఁ బ్రోత్సహించుచు మాటలాడెను. నన్నయ ఊఁకొట్టుచు వినెనేకాని ఏదో యనిర్వచనీయమగు సంకోచ మాతని యంతరాత్మలో నారాటపెట్టుచుండెను.

నన్నయ గృహమునకు పోయి ప్రక్షాళిత పాణిపద్ముఁడై పూజా మందిరమునకుఁ జొచ్చెను. జపమాలికను దీవ్రముగాఁ ద్రిప్పసాగెను. అట్లు చాలప్రొద్దు గడపి సంక్షిప్తముగా భుజించి విశ్రాంతి మందిరమునకుఁ జేరెను. అప్పటికే నారాయణభట్టారకుఁ డాసీనుఁడై యుండు టాతని కాశ్చర్యమైనది. "బావగారూ! భారతమును ప్రారంభింతును. కాని నేనే దానిని పూర్తిచేయఁగలనను బ్రత్యయము నాకు లేదు" అని యుత్సాహము, నీరసము సమ్మిళితమగునట్లు నన్నయ వక్కాణెను.

నారాయణభట్టు: ఈమాట నా కెప్పటిదో యెఱుక!

నన్నయ: ఇది యిప్పటి నా నిర్ణయముకదా! ఎప్పుడో యెట్లెఱుక పడినది?!

ఒక్క యిష్టదైవమునుగాక మూర్తిత్రయమును ప్రస్తావించితివి. నా కాశ్చర్యము గొల్పినది. బావా! ఆరంభ మంత యల్పకృత్యము గాదు. ఆరంభింపుము "మధునయ ఫణితీనామ్, మార్గదర్శీ మహర్షీ".

నన్నయ: ఆ మంగళ శ్లోకమునం దిట్టి ధ్వని యున్నదని నే నూహింపనే లేదు బావగారూ!! సమాప్తము చేయజాలని యారంభ మెందులకు? నాకు మీ భావుకత ఆశ్చర్యము గొల్పుచున్నది.

నా.భ. : అట్లనకుము. నీకుఁ దెలియనిదికాదు. భగవంతుఁ డెవ్వ డెవని కే కర్తవ్యమును మోపునో, దానిని కళాత్మకముగా నిర్వహించుటే జీవిత కళారహస్యముగదా! ఈ శాపముకూడ ఆంధ్ర కవితాభ్యుదయము కొరకే వచ్చెననుటలో సందియములేదు.

నన్నయ : ఎట్లెట్లు! దయచేసి ప్రవచింపుఁడు.

నా.భ. : ప్రస్తుతము పండితప్రీతికై నీ కవిత గీర్వాణాకృతి ధరింపక తప్పదు. తరువాత జన్మాంతరమున నీ నన్నయభట్టే నామాంతరముతో భారతమును ఆంధ్రావళి మోదమందునట్లుగా విరచించును. అప్పుడది జానుతెనుఁగు సొగసుందనముతో నలరారును. ఒకటి రమ్యాక్షర ప్రసన్న ఫణితి. మఱి యొక్కటి యర్థోన్మత్త సునిశితోక్తి. ఈ రెండు ఫణుతులతోఁ గూడిన తెనుఁగు భారతమే తెనుఁగువారికి సదా ఉపాదేయము.

నన్నయ : ఏమో! యిదియంతయు నా కయోమయముగానున్నది బావగారూ! మీ క్రాంతదర్శన మనేక జన్మల సంస్కారఫలము!!

నా.భ. : ఏమియులేదు. భారతావతారికను బూర్తి గావింపుము. మీ సమాధానము వినవలయునని రాజేంద్రుఁడు నాగేంద్రమువలె నొడలంతయు చెవులు చేసికొనియున్నాఁడు. మీ యక్షర రమ్యత యానందముతోఁ దల యూపింపఁజేయును.

నన్నయ : తమయాజ్ఞ యనుల్లంఘనీయముగదా!!

నారాయణభట్టు నన్నయ భుజముతట్టెను. అది "క్లైబ్యం మాస్మ గమః పార్థ!" అని తన్ను హెచ్చరించినట్లుగా నన్నయకు స్ఫురించెను.

మఱునాఁడు నన్నయభట్టారకుని సమాధానమును విను కుతూహలముతో, రాజమహేంద్రపర మంతయు సకలభువనలక్ష్మీవిలాస నివాసమునందును, తద్గవాక్షములందును గ్రిక్కిరిసినది. ఆనాఁ డా నామము దానికి సార్థకమైనది.

రాజరాజనరేంద్రుఁ డాసన మలంకరింపఁగనే కోలాహలము సద్దు మణిగినది. నన్నపార్యునకు, నారాయణభట్టునకు, సభకు నరేంద్రుఁడు నమస్కరించి యాసన మలంకరించి నన్నపాచార్యునివంక తన దృష్టిని మృదువుగా ప్రసరింపఁ జేసెను.

నన్నయ వినమ్రుఁడై సభ్యుల కంజలి ఘటించెను. మఱల మంగళ

శ్లోకము నావృత్త మొనర్చెను. నారాయణభట్టారకుని యపూర్వాన్వయ మాతని మనస్సున మసలినది. సభలోనివారి కంఠము కవి మంగళశ్లోకముగనే యున్నది. ఆదిరాజ నిభుఁడు అత్యకలంక చరిత్రుఁడు నగు రాజరాజనరేంద్రుని మనసార వర్ణించిన పద్యములను నన్నయ పఠించెను. 'విమల వివేకుఁడు', 'కుమార విద్యాధరుఁడు', 'మనుమార్గుఁ డి'త్యాది పదప్రయోగములు నిత్యనూతనములై సభ్యుల నాకర్షించినవి. తన్ను గూర్చిన విశేషణములను, ప్రథమపురుషక్రియలలో నన్వయించుటలోని విశేషమును, తన్మూలమున ప్రస్ఫుటమగు నన్నపార్యుని వినయ సంపదయు సభ్యులు గ్రహించి హర్షమందిరి. 'వరచళుక్యాన్వయా భరణుఁ డిట్టులనియె కరుణతోడ' అని చదివి నన్నయ రాజరాజనరేంద్రునకు రెండు పత్రము లొసఁగెను.

ముత్యాలను బురుడించు నన్నపార్యుని వ్రాలలోనున్న యా పత్రములను ఒక్కనిమేషముననే తిలకించిన నరేంద్రుఁ డుత్తిష్ఠుఁడై యొక్కొక్క పద్యము నావృత్త మొనర్చుచు, తానే వానిని వ్రాసెనా యనునంతటి చనువుతోఁ బఠించెను, ముఖము చూడక ప్రాంగణములో నున్నవారు నన్నయయే చదువు చున్నట్లుగా భ్రమించిరి.

జననుత కృష్ణ ద్వైపా
యనముని వృషభాభిహిత మహాభారత బ
ద్ధనిరూపితార్థ మేర్పడఁ
తెనుఁగున రచియింపు మధిక ధీయుక్తిమెయిన్ ॥

అను పద్యమును బఠించి రాజేంద్రుఁడు వ్యాఖ్యానింపుఁ డన్నట్లు నారాయణ భట్టారకుని మోమును దిలకించెను.

నారాయణభట్టు: "కన్నడభాషలో పంపచే రచింపఁబడిన 'విక్రమార్జున విజయము'నందు 'చలదోళ్ దుర్యోధనం, నన్నియోళ్ ఇనతనయం' గండినోళ్ భీమసేనం, బలదోళ్ మద్రేశం, అత్యున్నతియోళ్ అమర సింధూద్భవం, బాప విద్యాబలదోళ్ కుంభోద్భవమ్, సాహసద మహిమయోళ్ ఫల్గుణం, ధర్మదోళ్ నిర్మలచిత్తం ధర్మపుత్రం మిగిల్ ఇవర్గిణిం ఈ భారతం లోకపూజ్యమ"ని యుద్ఘాటింపఁబడెనే కాని శ్రీకృష్ణుని దివ్యనామము స్మరింపఁబడలేదు. ఇది భారతీయ సంస్కృతికే తీరని లోటు. ఇట్టి యనార్యవాతావరణ ప్రభావముచేతనే అస్మదాదుల కచట నిలువ నిచ్చ జనింపలేదు. తెనుఁగు భారత మట్లుకాదు. 'మనీషి విద్యాశ్రమ తత్త్వవిత్తముతో, సమస్త వర్ణాశ్రమ ధర్మరక్షణ మహా

మహిమన్ మహి నొప్పు సర్వలోకాశ్రయుఁ డగు రాజరాజనరేంద్రుని పవిత్రాశయము ననుసరించి, తెనుఁగు భారతము కృష్ణద్వైపాయన ముని వృషభాధిహితమై యలరారఁజలయును."

ప్రభువును, సభ్యులును కరతాళధ్వనులు గావించిరి. నరేంద్రుఁడు నన్నపార్యుని వంక దృష్టులు సారించెను. నన్నపార్యుఁడు లేచి వినమ్రుఁడై,

"అమలిన తారకా సముదయంబుల నెన్నను, సర్వవేద శా
స్త్రముల యశేషపారము ముదంబునఁ బొందను, బుద్ధి
బాహువిక్రమమున దుర్గమార్థ జలగౌరవ భారత భారతీ
సముద్రముఁ దరియంగ నీదను విధాతృనకైనను నేరఁబోలునే!

అయినను, దేవా! నీ యనుమతంబున, విద్వజ్జనంబుల యనుగ్రహంబునం జేసి నా నేర్చు విధంబున నిర్వర్త్యంబు రచియించెద" నని తన యంగీకారమును దెల్పెను. మూర్తీభవించిన వినయ సౌజన్య సుందరరూపుఁడగు నన్నపార్యుని సభ్యులు ప్రశంసించిరి; హర్షధ్వానములు గావించిరి.

నన్నపార్యుఁడు దేవతలతోఁ జేర్చి చెప్పఁ దపోనిధివ్యాసునిఁ, గురు పద్యవిద్యకు నాద్యుఁడు నైన ప్రచేతసపుత్రుని భక్తితోఁ దలంచెను. సూరిచేతో రుచిరాబ్జ బోధనరతుండగు దివ్యుఁ బరాశరాత్మజాంభోరుహ మిత్రు నొక ప్రత్యేక పద్యమునఁ గొల్చెను. సత్పథాంతర సంచారీనములను గొనియాడెను. నారాయణభట్టారకుని నారాయణునితోఁ బోల్చి సంస్తుతించెను. కడకు తన ప్రతిజ్ఞయా యనునట్లు సభ్యులాశ్చర్యపడు రీతిగా నీ పద్యమును బఠించి నన్నపార్యుఁడు సభకు నమస్కరించి యాసీనుఁడాయెను.

సారమతిం గవీంద్రులు ప్రసన్నకథా కలితార్థయుక్తిలో
నారసి మేలు నా నితరు లక్షరరమ్యత నాదరింప నా
నా రుచిరార్థసూక్తినిధి నన్నయభట్టు తెనుంగునన్ మహా
భారత సంహితా రచన బంధురుఁ డయ్యె జగద్ధితంబుగన్.

---

అది గ్రీష్మర్తువు. బాలభానుఁడు ప్రచండభానునివలె తన తీక్ష్ణకిరణ కాండములతో లోకమును దహింపఁ జేయుచుండెను. మహాకవిత్వ దీక్షావిధి నున్న తన ముద్దుకొమరునకుఁ దన జీవనమంతయు ధారవోసి, గౌతమి

జేసి గుర్తింపవలయును. మూలమునందలి నాల్గైదనుష్టుప్పుల భావము నొక్క వృత్తములో నిముడ్చవచ్చును. అనేక శ్లోకముల భావములను వచనమునందుఁ బొందుపఱుప వచ్చును. ఉదాహరణమున నుదంకుని నాగస్తుతి చూడుఁడు. రమణీయముగా నాలువృత్తములలో నాగస్తుతిని నన్నపార్యుఁడు ముగించెను. అప్రసిద్ధములగు నాగులను పేర్కొనలేదు. అనంతునకు, వాసుకికి, తక్షకునకు నధిక ప్రాముఖ్య మిచ్చెను. ప్రజ లేధృతరాష్ట్రుఁడని భ్రమింతురో యని, ధృతరాష్ట్రుఁడను నాగుని పేరెత్తలేదు. అందు ఛందోమాధుర్యమును మీ రాస్వాదించియే యుందురు. ఒకరిని ప్రస్తుతించుపట్ల, శార్దూల మత్తేభములను వాడు టుచితముకాదు. చంపకోత్పలములను జక్కని, చిక్కని పుష్పదామములను గూర్చినాఁడు. ఆ కవిత సంగీతస్థాయినందుకొని నాగులచే తలలూపించగల శక్తిగలదనుటలో నతిశయోక్తి లేదు. ఇట్టి కళాసిద్ధి మహాకవిమాత్ర ప్రాప్తము. ఇట్టి వనేకము లుద్ధరింపఁగలను.

కథా సంవిధానమునకు భంగము కల్గించు ననేక విషయములను నన్నపార్యుఁడు విసర్జించెను. ఉదంకునకుఁ బూర్వము ఆరుణి, పాంచాలుఁడు, ఉపమన్యుఁడనను ముగ్వురి చరిత్రములు మూలమునఁగలవు. వీరు ధౌమ్యుని శిష్యులు. వీరి కథకు భారతకథతో సంబంధమంతగలేదు. అందుచే నన్నయ వానిని స్వీకరింపలేదు. ఔచిత్యపోషణమున కనేకములగు మార్పుకూర్పులు గూర్చినాఁడా మహాకవి. చూడుఁడు. 'ప్రల్లదుఁడైన యొక్క కులపాంసును జేసినఁదాన' యను బద్యము మూలమున లేదు. ఇది యెంతటి కార్యకారణ సంబంధముతోఁ గూడినదో తర్కింపుఁడు. మూలమున శకుంతలోపాఖ్యానము తరువాత యయాతి వృత్తాంతము కలదు. అట్లుండరాదు. పౌర్వాపర్య క్రమమును బాటించియే యామార్పు గావించితిమి. పాండురాజు మరణ ఘట్టమున వసంత వర్ణనముచే నెట్టి యుద్దీపన విభావములు కల్గించెను; మాద్రీ పాండురాజుల సమాగమమున కవకాశమెట్లు కల్గినదో హేతుబద్ధము గావించినాఁడు నన్నయ. 'ఒక్కనాఁడు కుంతీదేవి బ్రాహ్మణ భోజనంబు సేయించుచుండి, మాద్రీ రక్షణమునం దేమఱి మఱచియున్న యవసరమున' ననివ్రాయుట నన్నయ లోకజ్ఞత యనక తప్పదు. ఇట్టివి సహస్రాధికములు." అని గంగాప్రవాహము సదృశముగ నన్నపార్యుని పద్యము లుద్ఘాటించుచు, నారాయణభట్టు నన్నపార్యుని కవితా మాహాత్మ్యము నుగ్గడించెను. సభ నన్నయ కవితాసౌందర్య శోభాకృష్ట మాయెను.

సభ ముగించుచు రాజరాజనరేంద్రుఁడు, "ఒక మహాకవిని, ఒక మహా వాఙ్మయ ధురంధరుని నేక కాలమున భగవానుఁడు మనకుఁ బ్రసాదించెను.

ఈ కావ్య జ్యోతిని చేఁబూని ప్రవిమల మానసములతో మీరు వాడవాడల, గ్రామగ్రామముల మహోదయము కావింపుఁడు. ఆంధ్రవిశ్వమునకు శ్రేయమును జేకూర్పుఁడ"ని ప్రార్థించెను. సభ్యులు హర్షామోదములను బ్రకటించిరి.

---

వర్షర్తువునందు సూరి జనసమూహము విశ్రాంతిగ తమతమ నికేతనములకు బద్ధమై నన్నపార్యుని సరసకవితా సమగ్ర సమీక్షను గావించుచుండెను. నారాయణభట్టారకుఁడు చూపిన మార్గమునందు వారు నన్నపార్యుని యఖండాత్మీయతను బ్రత్యక్ష మొనర్చుకొనుటకు సాహితీ తప మొనర్చుచుండిరి. ఋఙ్మంత్రములకుఁ గల స్వర ప్రభావ మాతని మాటలకుఁ గలదని గుర్తించిరి. సంస్కృత కారకము, బహువ్రీహి సమాస బాహుళ్యము, తాంత కర్మార్థకాది వివిధ ప్రయోగములు నన్నపార్యుని సంస్కృత భాషానిష్ఠకు నిద్దంపు నిదర్శనములని భావించిరి. నన్నపార్యుఁడు వైదిక నిష్ఠాగరిష్ఠతకు, తన కావ్యమునం దత్యంత ప్రాముఖ్య మొసఁగుటచే వారి యానందము పారము ముట్టెను. ఉత్తమ ద్విజత్వము నాతఁడు సందర్భములు లభించినపుడెల్ల మూలములందున్నను, లేకున్నను నుద్ఘాటించుటలోని యుదాత్తాశయములను వారవగత మొనర్చుకొనుచుండిరి. అర్జునుని తీర్థయాత్రా సందర్భమున మూలమున లేకున్నను, "దక్షిణ గంగనాఁ దద్దయు నొప్పిన గోదావరియు, జగదాదియైన భీమేశ్వరమును, బెడంగుగనున్న శ్రీ పర్వతమును, ననఘమై, శిష్టాగ్రహార భూయిష్ఠమై, ధరణీ సురోత్త మాధ్వర విధాన పుణ్య సమృద్ధమై, పొలుచు వేంగిదేశ విభవ" వర్ణన మాతని యపార దేశభక్తికి నిదర్శనమని సంతోష తరంగితాంతః కరణులైరి. దేవయాని, శర్మిష్ఠ, శకుంతల, ద్రౌపది మున్నగు స్త్రీ పాత్రల స్వభావమును సాత్వికోజ్జ్వలముగఁ జిత్రించినాఁడని ప్రశంసించిరి. ఆతని లోకజ్ఞత వివిధ ఘట్టములలోఁ బ్రదర్శితమౌట కభినందించిరి. ప్రకృతి వర్ణన చణత్వమునం దితఁడు మున్మూర్తుల వాల్మీకి శిష్యుఁ డనిరి. ధర్మోపదేశమున నీతఁడు వ్యాసుని యంతేవాసి యనిరి. గురు పద్య విద్యకేకాక, హృద్య గద్య విద్యకు నీతఁ డాద్యుఁడని తలంచిరి. ఏనోట విన్నను, ఏ ఘంటాపథమున నడచినను నన్నపార్యుని కవితా ప్రశంసయే। ఆతని రుచిరార సూక్తులను గూర్చిన ప్రసక్తులే ।।

అమ్మంగదేవి కుపమాదేవితో ఆది పర్వమునంతయుఁ బఠించినది. వారును నారాయణభట్టారకుని దివ్యోపన్యాసముల నాలించిరి. చీఁకటి కోణములలోఁ జిక్కియున్న తెనుఁగు రమణీలోకము నుద్ధరించుటకు కాంతాసమ్మిత మార్గమును నన్నయ ప్రసాదించెనని వారు సంతోషించిరి. కుపమాదేవి భారత

ప్రచారమునకుఁ బూనెను. తన జీవితము నా విధముగ ధన్యము గావింపఁ గోన వలయునని కుపమాదేవి యకుంఠిత నిర్ణయము గావించెను. అందులకు సర్వ విధముల చేదోడువాదోడుగా నుండుట కమ్మంగదేవి బద్ధకంకణయైనది.

హాయిగా విహాయస వీధిని ఱెక్కలార్చుకొని విహరించు రాయంచ రీతి, బాలాతప కిరణ సంస్పర్శమునకు వికసించిన శతపత్ర సుందరివలె, ప్రేమ ప్రఫుల్ల నేత్రములతో వ్రీడాకళా సంశోభితయై భర్తను సమీపించు భార్యవోలె శరత్కాల లక్ష్మి వేంగీ దివ్యదేశమున మహోదయ సందర్శన కుతూహలముతోఁ గాలూనినది.

నన్నపార్యుని కవితా గాంభీర్య గమనమును జూచి యంతరంగ రస భరితయై గౌతమీ నదీమతల్లి నడలు నేర్చుకొనుచున్నట్లు నటించుచున్నది. వేంగీ మహోదయ శిల్పికి వైడూర్య శకలములు కానుక లిచ్చుచున్నట్లు కేదారలక్ష్మి కంకె లీనినది. దేశసౌభాగ్య సూచకముగ నింటింట బంతిపూల తోరణము లరుణ కాంతుల నీనుచున్నవి. విజయుని వృత్తాంతమును స్మరించుకొనుచు వీరవరేణ్యులు గేయము లాలపించుచుండిరి.

సూరి నిధానుఁడగు రాజేంద్రుఁడు దసరా కానుకగా పండిత చేతో నిర్వృతిఁ జేకూర్చు రమ్యమగు సభా పర్వ ప్రతులను సహృదయులకుఁ బంపించెను.

శరత్కాల సమావేశ మీ పర్యాయము గోదావరీ సైకత ప్రదేశములందు సాయంసమయముల నేర్పఱుపఁబడెను. నారాయణభట్టు పండిత ముఖారవిందములలో నవోదయ కాంతిచ్ఛటలు ప్రస్ఫుట మగుటగాంచి యానందించెను: నా రహ మహమికతో నన్నపార్యుని పద్యములు పఠించుట విని యాంధ్ర జాతికి, భాషకు మహోదయ వైజ్ఞానిక స్థాయి శాశ్వతమైనదని భావించెను.

నన్నపార్యుని కవితా విశేషము లనేకము లాతఁడు వివరించెను. ఇంక నెన్నియో యుద్ఘాటింపవలయునని యాతని యాకాంక్ష. మహాకవి హృదయ మనుభవైక వేద్యమే కాని సంపూర్ణముగ నావిష్కరించులేము యని మున్న దందును. తన్నందినవారు తనంతవారు కావలయునని యాతని యాశయము. నన్నపార్యుని ప్రసన్న కథా కలితార్థయుక్తిని, శైలినిగూర్చి కొందఱాతనిని ప్రశ్నించిరి. దానిని సభాముఖమునఁ బ్రపంచింతు నన్నాఁడు. అట్టి సమయ మాసన్నమైనది.

ప్రసాదమాధుర్యములలోని సౌకుమార్యమును బరిహరించి నూత్న మార్గమును ద్రొక్కినాఁడీ మహాకవి. ఆతని స్వభావము వంటిదే ఆతని కవితాశైలి. నాదశ్రీమధుర మంజుల లాస్యలంగిమా విన్యాసమే నన్నపార్యుని కవిత్వము. రమణీయమగు సభాపర్వము మీ హస్తముల నలంకరించినదికదా! కవితామద మాతంగ తురంగముల నధివహించి రసజగత్తుల విహరింపుఁడు. మీ యానంద మును సోదర దేశీయులకుఁగూడ పంచిపెట్టుడు. అప్పుడే జగద్ధితము చేకూరును. దాని నాశించియే మన పూజ్య నృపాలుఁడీ మహోద్యమమునకుఁ గడంగెను. అందులకే నన్నయ కవితాతపస్వియైనాఁడు. ఈ కలియుగ పవిత్రుల యాశయములను నెఱవేర్చుట మన కర్తవ్యము. భగవానుఁడు దయచూచి నన్నయ కారోగ్యమును బ్రసాదించిన అచిరకాలముననే యారణ్యపర్వముకూడ మనకందఁగలదు.” ఈ రీతినేమేమియో పరవశతో నారాయణభట్టు వచించి తన గంభీరోపన్యాసమును ముగించెను. ఇంతలో షోడశ కళాప్రపూర్ణుఁడగు నమృత కిరణుఁడు ఆసకలప్రమోద దాయకుఁడై యుదయించెను. గోదావరీ జలజాత బిసతంతువును ముక్కునఁ గఱచుకొని యొక మహా రాజహంస విహాయస వీధికెగిరెను. ఆ గమనమునందు కోటి చంద్రులుదయించినంతకాంతి వెల్లువ లోకమును ముంచెత్తెను. పండితుల నేత్రములొక్కమాఱు జిగేలు మన్నవి. నారాయణభట్టు అప్రయత్నముగా నంజలించెను. సకల సూరి సమూహము బద్ధాంజలితో నిలువఁబడి యొక్కక్కరే యిట్లని మహాకవి నన్నపార్యు నభినందించెను—

అతఁడాంధ్ర కవిత్వవిశారదుఁడు. విద్యాదయితుఁడు.

నరేంద్రపూజోన్నయనోచితమగు భద్రగజమతఁడు.

గానట బీసటే చదివి గాథలుత్రవ్వ తెనుంగు జాతికి వ్యాసముని ప్రణీత పరమార్థము తెల్లముచేసిన యజ్ఞాసన కల్పుఁడు.

తెనుఁగు జాతిని కృతార్థముగావించిన పుణ్యమూర్తి.

తెనుఁగు కవితా పట్టాభిషిక్తుఁడు.

విద్యారమణీయుఁడగు నాంధ్రకవితా గురుఁడు,

భారత ఘటోల్లంఘన పటిష్ఠగాథా ప్రతిభుఁడు,

“ఋషివంటి నన్నయ రెండవ వాల్మీకి.”

అక్షర రమ్యత నెఱిఁగిన దక్షుఁడు.

అందఱును సమష్టిగ నీ క్రింది శ్లోకమును జీడమార్యుఁడు చదువగాఁ బఠించిరి—

శ్లో॥ వాచామాంధ్రమయినాం
యః ప్రవక్తా ప్రథమోఽ భవత్.
ఆచార్యం తం కవీంద్రాణాం
వందే వాగను శాసనమ్.